# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 19 సంచిక : 11 హైదరాబాద్ 240 నవంబర్ 2021 పేజీలు : 68 రు. 25

- లఖింపూర్ ఖేరీ హత్యాకాండ
- కశ్మీర్‌లో నెలకొన్న దుస్థితీ, రానున్న ప్రమాదమూ
- ప్రైవేటీకరణ దిశగా టిఎస్ ఆర్‌టిసి
- అమ్మకానికి ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు
- అత్యాచారాలు - తక్షణ శిక్షలు
- ప్రకంపనలు సృష్టిస్తున్న పాండోరా పత్రాలు
- చైనా లక్ష్యంగా ఆకస్ కూటమి



ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

నవంబర్ 2021
సంపుటి : 19
సంచిక : 11







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫోన్ : 7330795849
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : నవ్య ప్రింటర్స్
అంబర్‌పేట్, హైదరాబాద్.

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175 యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు UBIN0801399 నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన ఎస్. మోహన్‌రావు, అక్కుపల్లి శ్రీకాకుళం - రు. 2,000; వి. చెంచయ్య, కావలి - రు. 2,000; ప్రొ. కె. లక్ష్మీనారాయణ, హైదరాబాద్ - రు. 10,000; ఏలూరి సునీత, ఢిల్లీ- రు. 10,000; కె. రమేష్, విజయవాడ - రు. 1,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.

వీక్షణం పత్రిక నిలబడడానికి తమ వంతు సహకారంగా అక్టోబర్ నెలలో పత్రికకు చందాలను చేర్పించి తోడ్పడిన మిత్రులు సింహాద్రి - సూర్యపేట; ప్రభాకర్ - గద్వాల; వెంకటేశ్వర్లు - పశ్చిమ గోదావరి; చుంచు శ్రీశైలం - మహబూబాబాద్‌లకు చెందిన మిత్రులందరికి కృతజ్ఞతలు - సం.

వీక్షణం అక్టోబర్ 2021 సంచికలోని 'సంపాదకీయం'తో పాటు మిగతా వ్యాసాలు చాలా బాగున్నాయి. దీనిలో 'డా. రామనాథం ఓ హక్కుల నినాదం', రైతాంగ ఉద్యమం; విద్యారంగ సంక్షోభం; మొదలైన వ్యాసాలు ప్రజల జీవితాలకు సంబంధించి, అవగాహన చేసుకొనే అనేక విషయాలు ఉన్నాయి.

భారతదేశం ప్రజాస్వామ్య దేశం. ఒక్క నెత్తుటి చుక్క కూడా నేల రాలకుండా సమాజంలో అనేక విప్లవాత్మక మార్పులు తేగలిగే శక్తి ఒక్క ప్రజాస్వామ్య వ్యవస్థకు మాత్రమే ఉందంటారు మన రాజ్యాంగ నిర్మాత డా. బి.ఆర్. అంబేద్కర్. అది ఆయన ఆశయం, స్వప్నం కూడా. ఇలాంటి ప్రజాస్వామ్య దేశంలో జీవిస్తున్న ప్రజల కోసం రాజ్యాంగంలో అనేక రక్షణలను పొందుపరిచారు. దానిని ఈనాటి పాలకులు మన హక్కులను, స్వేచ్ఛను హరించి వేస్తూ, రాజ్యాంగం కల్పించిన అనేక రక్షణలను కాలరాస్తూ ప్రజలను ఇబ్బందులకు గురిచేస్తున్నారు. ఈ రోజు ప్రజలు ప్రజాస్వామ్య విలువలు కాపాడుకోవడం కోసం, రాజ్యాంగ హక్కులను రక్షించుకోవడం కోసం పోరాడవలసిన పరిస్థితి ఉంది.

ఇలాంటి సందర్భంలో గత రెండు దశాబ్దాల నుండి ప్రజల కోసం అనేక విషయాలలో, అనేక అంశాల పైన అవగాహన కల్పిస్తూ, ప్రజల పత్రికగా నడుస్తున్న 'వీక్షణం'ను కాపాడుకోవలసిన అవసరం, బాధ్యత ప్రజలకు ఉంది. సమాజంలో అభద్రత, అవినీతి, అన్యాయం, అక్రమాలు, అసమానతలు పారదోలే వరకు, ప్రజలను చలనంలో ఉంచడానికి పత్రిక అవసరం ఉంటుంది. 'వీక్షణం' పత్రిక మనుగడ కోసం నావంతు సహాయ, సహకారం అందిస్తానని మాట ఇస్తున్నాను.

- బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి
సిద్ధిపేట

వీక్షణం అక్టోబర్ సంచికలో వచ్చిన అన్ని వ్యాసాలు బాగున్నాయి. ముఖ్యంగా ఇప్పుడు ఢిల్లీలో రైతులు చేస్తున్న ఉద్యమాన్ని గురించిన ఎన్నో విషయాలను 'చారిత్రాత్మక రైతాంగ ఉద్యమం' వ్యాసంలో ఎ. నర్సింహారెడ్డి గారు చాలా లోతుగా విశ్లేషించి రాశారు. దేశానికి అన్నం పెట్టే రైతన్నలు ఇన్ని రోజుల నుండి రోడ్లపై ఉంటూ, ఎంతో నిజాయితీగా తమ నిరసన తెలియజేస్తుంటే వారి డిమాండ్లను పరిష్కరించక పోగా కేంద్ర ప్రభుత్వం వారి పట్ల ఎంతో దుర్మార్గంగా వ్యవహరిస్తున్నది. తమ రాజకీయ లబ్ధి కోసం, కార్పొరేట్లకు దేశ సంపదను అప్పనంగా అప్పగించడం కోసం కార్పొరేట్లకు అనుకూలంగా ఉంటూ, దేశానికే వెన్నెముకగా ఉన్న అన్నదాతల బాధలను ఏమాత్రం పట్టించుకోకపోవడమే కాకుండా, హత్యలు చేయడం చూస్తుంటే ఈ దేశంలోని ప్రభుత్వాల తీరు ఎంత అధ్వాన్నంగా ఉందో అర్థమవుతున్నది. అలాగే 'తెలంగాణలో వరి ధాన్యం ఉత్పత్తి, మార్కెటింగ్' వ్యాసంలో తెలంగాణలో జరుగుతున్న వరి ఉత్పత్తి గురించి, మార్కెట్‌లో ధాన్యం కొనుగోలుకు సంబంధించిన అన్ని విషయాలను కన్నెగంటి రవి, శేరుపల్లి రాజేష్ గార్లు ఎంతో వివరంగా రాశారు. ఇంకా విద్యా రంగంపై, అఫ్ఘనిస్తాన్ పరిణామాలపై, ఇంకా వివిధ విషయాలపై వచ్చిన అన్ని వ్యాసాలు బాగున్నాయి. ఎప్పటికప్పుడు ప్రతి నెలా మాకు తెలియని ఎన్నో విషయాలను వీక్షణం పత్రిక ద్వారా తెలుసుకోగలుగుతున్నాం. ఇంకా అనేక విషయాలను ఇలాగే ప్రతి నెలా అనేక వివరమైన వ్యాసాలు తీసుకువస్తారని కోరుతున్నాను. వీక్షణం ఆర్థిక పరిస్థితి గురించి ప్రతి నెలా చూస్తున్నాను. అందుకు నా వంతు సహాయం ఎప్పటికీ చేస్తాను. వీక్షణం ఆర్థిక పరిస్థితి బాగ లేకున్నా కరెక్ట్ టైంకి పత్రిక తీసుకొస్తున్న వీక్షణం కలెక్టివ్ వారికి ధన్యవాదాలు.

- కృష్ణహరి
మహబూబ్‌నగర్

వీక్షణంలో వచ్చే వ్యాసాలు దాదాపుగా ప్రస్తుతం జరుగుతున్న పరిణామాలపై ఆసక్తిని కలిగించేలా ఉంటున్నాయి. ఆంధ్రప్రదేశ్ గురించిన వ్యాసాలు ప్రతి నెల ఒక్కటి మాత్రమే ఉంటుంది. అక్కడి ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు కూడా వ్యాసాలుగా వస్తే తెలుగు ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు పత్రిక ద్వారా తెలుసుకునే వీలుంటుంది కాబట్టి అక్కడి పరిణామాలను ప్రచురించగలరని మనవి. గత సంచికలో నేరానికి మరో శిక్ష 'ఆత్మహత్య' అనే వ్యాసం రాజకీయ నాయకులు, అధికారులు ప్రజల్ని ఎలా తప్పుదోవ పట్టిస్తూ తప్పుడు భావాలను ఎలా వ్యాపింప చేస్తున్నారో రచయిత చక్కగా వివరించారు. నేడు దేశం తీవ్ర ఆర్థిక సంక్షోభంలో కూరుకుపోయి ఆ సమస్యల నుండి ప్రజల దృష్టి మరల్చేందుకు కొత్త విషయాలను ముందుకు తెస్తోంది. దేశ భక్తి పేరుతో చలామని అవుతున్న రాజకీయ శక్తులు నేడు దేశ సంపదను అంగట్లో సరుగా మార్చి అమ్ముతున్నారు. ఈ విధానం ఇలాగే కొనసాగితే భవిష్యత్ తరాలు కొనుక్కుందామన్నా ఏమి మిగలకుండా పోయే ప్రమాదం పొంచివుంది. దీన్ని విద్యార్థి, మేధావులు, ప్రజలు గమనించి మెల్లాని దేశ సంపదను కాపాడుకోవడానికి మరో స్వతంత్ర ఉద్యమం చేయాల్సిన అవసరం ఉంది.

- సురేందర్
మంచిర్యాల

కోవిడ్ వల్ల పత్రికలలో సాధారణ వార్తలు రావడం లేదు గనుక అసహజ మరణాల సూచి సమగ్రంగా తయారు చేయడం సాధ్యం కావడం లేదు. కొద్దికాలంగా అసహజ మరణాల సూచి వేయలేకపోతున్నందుకు చింతిస్తున్నాం. సం.

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ - ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

# నిర్లిప్త సమాజంలో విద్వేష రాజకీయాలు, హంతక వాహనాలు

లఖింపూర్ ఖేరీలో అధికార మదోన్మత్త హింసలో ప్రాణాలు కోల్పోయిన నలుగురు రైతులు, ఒక జర్నలిస్టు మన ముందు అనేక ప్రశ్నలు లేవనెత్తుతున్నారు. ఇటువంటి మరణం మాకు ఎందుకు వచ్చింది, మేం చేసిన ఏ నేరం వల్ల మాకు ఈ మరణశిక్షలు విధించారు, వ్యవస్థలో సాగుతున్న అస్తవ్యస్తతను సరి చేయమని అడగడమే మేం చేసిన నేరమా, న్యాయం చేయమని అడగడమే నేరమా, అన్యాయం వద్దని ఎలుగెత్తడమే నేరమా, అడగడం, మాట్లాడడం మరణశిక్ష విధించవలసిన నేరాలుగా ఈ దేశంలో ఎప్పటినుంచి పరిగణిస్తున్నారు, మావి దుర్మరణాలనుకున్నా, హత్యలు అనుకున్నా, అందులో మీ పాత్ర ఏమిటి, మీరు హంతకులా, కుట్రదారులా, మౌన సాక్షులా, సమర్ధకులా, అవేవీ కాకపోతే, ఈ హత్యల పట్ల మీ నిరసన గళం ఎందుకు పెల్లుబకలేదు? ఈ దేశంలో మనిషి ప్రాణం ఇంత విలువలేనిదైపోయిందా? ప్రశ్నించే కంఠాన్ని తెగనరుకుతుంటే మీరు మౌనంగా చూస్తూ కూచున్నారంటే రేపు మీరూ మీ పిల్లలూ కూడ ప్రశ్నించే హక్కును కోల్పోతున్నారని మీకు కనీస స్పృహకూడ కలగడం లేదా? ఈ ప్రశ్నలన్నీ మంత్రి కొడుకు కార్ల కింద నలిగిపోయిన రైతులూ జర్నలిస్టూ వేస్తున్నవి మాత్రమే కాదు, ప్రతిహింసలో మరణించిన ఇద్దరు భారతీయ జనతా పార్టీ కార్యకర్తలు, ఒక డ్రైవర్ కూడా అవే ప్రశ్నలు సంధించవచ్చు. హంతక వాహనాలు నడిపినది మేం కాదు, మాలో ఒకరు డ్రైవరే అయినప్పటికీ, పక్కన కూచున్న రాజకీయనాయకుడి ఆదేశాన్ని పాటించినవాడే. మమ్మల్ని ఈ హంతక ప్రవృత్తిలోకి నెట్టిన రాజకీయ నాయకులు బారాఖూన్ మాఫ్‌గా తిరుగుతుండగా, వారి సేవకులుగా పనిచేసిన నేరానికి ప్రాణాలు పోగొట్టుకోవలసిన స్థితి ఈ సమాజంలో ఎందుకు ఎట్లా వచ్చింది అనే అదనపు ప్రశ్న కూడ వాళ్లు అడుగుతున్నారు. ఇవి మన సమాజం, చరిత్ర తక్షణమే జవాబు చెప్పవలసిన ప్రశ్నలు. భారత సమాజ ప్రస్తుత దశ గురించీ, ప్రస్తుతం సాగుతున్న గమనం గురించీ, ఈ గమనం ఎటువైపు సాగుతున్నదనే దిశ గురించీ అత్యవసరమైన ప్రశ్నలు ఇవి. ఇప్పటికైతే సమాజం. ముఖ్యంగా బుద్ధిజీవులు ఈ ప్రశ్నలు లేనట్టో, ఉన్నా తమకు కానట్టో, జవాబు వెతకవలసిన బాధ్యత తమ మీద లేనట్టో నటిస్తూ నిర్లిప్త ఏకాంత దంత ప్రాకారాలలో గుడుగుడు గుంచం జీవితాలు గడుపుతున్నారు.

ఒక అర్థంలో ఈ ప్రశ్నలు కొత్తవేమీ కావు. సులభంగా చెప్పాలంటే అవి న్యాయాన్యాయాల ప్రశ్నలు. యథాస్థితికీ మార్పుకూ సంబంధించిన ప్రశ్నలు. వాస్తవపు కఠోరత్వానికీ మానవ సహజమైన మంచి బతుకు స్వప్నానికీ మధ్య ప్రశ్నలు. మనిషి జీవితాన్ని అశాంతిమయంగా, ఘర్షణామయంగా మార్చిన వ్యవస్థ మీద ఎక్కుపెట్టిన ప్రశ్నలు. బహుశా ఈ సమాజం అంతరాల సమాజంగా మారిననాటి నుంచీ ఉన్నవే. వలసవాదం ప్రవేశించి ఈ ఉపఖండ జనజీవన దిశను ఒక మలుపు తిప్పినప్పటినుంచీ ఉన్నవే. లేదా ఆ వలసవాదాన్ని మొట్టమొదటిసారి ప్రతిఘటించి ఆ నాటి పరిమితుల లోపల ఒక ప్రత్యామ్నాయం కోసం అన్వేషించిన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం నాటి నుంచి ఉన్నవే. లేదా ఈ దేశంలో కొనసాగడం కన్న వదిలివెళ్లడమే ప్రయోజనకరమని లెక్కలు వేసుకుని వలసవాదం తన చెప్పుచేతల్లో ఉండే దళారీ వర్గాలకు, తైనాతీ వర్గాలకు అధికారం అప్పగించాకా, ఆ తర్వాతా విస్తరించినవే. పాలకుల జెండాల రంగులూ నినాదాలూ ఎంత మారినా సమాజ జీవనం మారలేదు గనుక, ఇంకా దుస్థితికి దిగజారింది గనుక ఆ ప్రశ్నలూ మారలేదు. ఆ అర్థంలో అవి పాత ప్రశ్నలే. తమను తాము ప్రగతిశీల, వామపక్ష వాదులమని అనుకుంటున్న చాల మంది భ్రమ పడుతున్నట్టు ఆ ప్రశ్నలు ఏడు సంవత్సరాల కింద మాత్రమే, సంఘ్ పరివార్ – నరేంద్ర మోడీ పాలనతో మాత్రమే ప్రారంభం కాలేదు. అంతకు ముందు నుంచీ సాగుతున్న ఆ ప్రశ్నలకు సంఘ్ పరివార్ కొత్త కోణాలు అద్దింది. ఆ అర్థంలో మాత్రమే అవి కొత్త ప్రశ్నలు.

ఈ ఏడు సంవత్సరాల్లో సమాజాన్ని, రాజకీయార్థిక వ్యవస్థలను, పాలనా, న్యాయ వ్యవస్థలను కనీస ప్రజాస్వామిక, చర్చా, సమన్వయ సంప్రదాయాల నుంచి దూరం చేసి, అధికార మదోన్మాద, మతోన్మాద, కులాహంకార నిరంకుశత్వం లోకి నెట్టడానికి పెద్ద ఎత్తున ప్రయత్నాలు జరిగినందువల్ల ఆ ప్రశ్నలు పెచ్చరిల్లుతున్నాయి. మనువాదం ద్వారా, ఆధిపత్య మతోన్మాదం ద్వారా, విషవిద్వేష రాజకీయాల ద్వారా భూస్వామ్య విలువల, సామ్రాజ్యవాద దళారీ రాజకీయార్థిక ప్రయోజనాల వ్యవస్థను నిర్మించడమే సంఘ్ పరివార్ లక్ష్యం. పెద్దనోట్ల రద్దు, వస్తు సేవల పన్ను, ప్రభుత్వ రంగ సంస్థల అమ్మకం, పౌరసత్వ సవరణ చట్టం, రైతు చట్టాలు, కార్మిక చట్టాలు, నూతన విద్యావిధానం, కశ్మీర్ పై దాడి, అధికరణం 370 రద్దు, అయోధ్య ఆలయం, ఆహార అలవాట్లపై, ఆహార్య అలవాట్లపై అసహనపూర్వక దాడులు, దేశపు సమాఖ్య స్వభావానికి తూట్లు, భిన్న స్వరాల మీద చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం ప్రయోగం, దేశద్రోహం, రాజద్రోహం, చట్టవ్యతిరేకత వంటి విశేషణాల విచ్చలవిడి ప్రయోగం, ప్రచార మాధ్యమాలను, న్యాయవ్యవస్థను అధీనంలోకి తీసుకోవడం వంటి అసంఖ్యాక అప్రజాస్వామిక, నిరంకుశ చర్యలతో ఈ ఏడు సంవత్సరాలలో భారత సమాజం ముందున్న సవాళ్లు మరింత జటిలంగా, మరింత ఎక్కువగా తక్షణ పరిష్కారం అవసరమైన దిశగా సాగాయి. లఖింపూర్ ఖేరీ మారణకాండను ఈ క్రమంలో భాగంగానే చూడాలి. మనిషి పట్ల గౌరవం, మనిషి ప్రాణం పట్ల విలువ లేకపోవడం అనే సంఘ్ పరివార్ స్వభావానికి సహజమైన కొనసాగింపుగానే ఆ హంతక వాహనాలు దూసుకొచ్చాయి.

ఈ నేపథ్యంలో సమాజం ఎట్లా ప్రతిస్పందిస్తున్నదనేది, ఎట్లా ప్రతిఘటిస్తున్నదనేది, ఈ హంతకవాహనాల దూకుడును అడ్డుకోవడానికి ఏం చేయనున్నదనేది ఇవాళ కీలక ప్రశ్న. ఎన్ని గంభీర ప్రవచనాలు చేసినా పాలకవర్గ ముఠాలు ఇవాళ్టి కర్తవ్యాన్ని చేపట్టజాలవు. ఆ పని చేయవలసిన సమాజ చోదక శక్తులు పాలక హింసలో, పీడనలో ఊపిరి సలపని స్థితిలో ఉన్నాయి. ఆ చోదకశక్తులకు ఊపిరినందించవలసిన, సమాజంలో ప్రశ్నా సంస్కృతిని, పోరాట చైతన్యాన్ని సజీవంగా, కొడిగట్టిపోకుండా కాపాడవలసిన పౌరసమాజం, బుద్ధిజీవుల సమూహం మీద బాధ్యతలు పెరుగుతున్నాయి. నిర్లిప్తతను, నిర్లక్ష్యాన్ని వదిలి, ఒకరు పదిమంది పెట్టుగా పనిచేయవలసిందిగా బుద్ధిజీవులను సమాజం కోరుతున్నది, చరిత్ర ఆదేశిస్తున్నది. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# ప్రగతి అంటే ఆత్మస్తుతి! సంక్షేమం అంటే పరనింద!!

తెలంగాణ రాష్ట్ర సమితి పుట్టి ఇరవై ఏళ్లు గడిచిన సందర్భంగా, ఇప్పుడది అధికారపార్టీగా కూడ ఉన్నది గనుక, చాల ఆర్భాటంగా, అట్టహాసంగా ఉత్సవాలు జరుపుకున్నది. ఆరువేల మంది ప్రతినిధులతో ప్లీనరీ జరుపుకోదలిస్తే, అంతకు రెట్టింపు సంఖ్యలో ప్రతినిధులు హాజరయ్యారని పత్రికలు రాస్తున్నాయి. నిజంగానే ఏ రాజకీయ పక్షానికైనా ఇరవై ఏళ్లు నిండడమనేది ఒక కీలకమైన సందర్భమే. అయితే ఆ సందర్భాన్ని కేవలం సంబరాలకూ, స్వోత్కర్షకూ, ప్రగల్భాలకూ వాడుకుంటారా, గడిచివచ్చిన జీవితం మీద విమర్శనాత్మక దృష్టి ప్రసరించి చేసిన తప్పుల గురించీ, చేయని ఒప్పుల గురించీ సమ్యగ్ దృక్పథపు సమీక్ష చేసుకుని పారదర్శకంగా ప్రజల ముందు పెడతారా అనేది ఆ రాజకీయపక్షపు విజ్ఞతకు సంబంధించిన అంశం. ఒక సుదీర్ఘకాలపు ప్రజా ఆకాంక్ష పునాదిగా, విస్తృతమైన ప్రజా ఉద్యమం ద్వారా అభివృద్ధి చెందిన పార్టీ తన గతాన్ని నిర్మమకారంగా సమీక్షించుకోవడం, జరిగిన పొరపాట్లను అంగీకరించడం, భవిష్యత్తుకు మార్గనిర్దేశనం చేసుకోవడం ఈ సందర్భంలో జరగవలసిన పనులు. కాని తెలంగాణ రాష్ట్ర సమితి పుట్టిననాటి నుంచే తాను ఏ అవిభక్త ఆంధ్రప్రదేశ్ పాలక విధానాలను విమర్శించిందో, ఆ విధానాలను కొనసాగించే దిశగా, ఆ తానులోని ముక్కగా రుజువు చేసుకుంటూ వస్తున్నది. ప్రజా ఆకాంక్షలను తన మనుగడకూ పురోగమనానికీ ఇంధనంగానే తప్ప తన ఆంతరంగిక విలువలకు గీటురాయిగా ఆ పార్టీ ఎన్నడూ చూడలేదు. తెలంగాణను కేవలం భావోద్వేగంగా మార్చి, అది ఒక జనసమీకరణ వ్యూహమే తప్ప, వాస్తవ లక్ష్యం అని ఎన్నడూ అనుకోలేదు. అధికారం అవినీతికి దారితీస్తుంది అని సామెత చెప్పినట్టు తెలంగాణ రాష్ట్ర సమితి అధికార ప్రస్థానంలో సమీక్షించవలసిన అంశాలెన్నో ఉన్నాయి. ఇరవై ఏళ్ల జీవితంలో మూడింట రెండు వంతులు ఉద్యమ పార్టీగా, ఒక వంతు అధికారపార్టీగా ఉన్న రాజకీయపక్షం ఏమాత్రం సమగ్ర దృష్టి ఉన్నా ఆ సమీక్ష చేసి ఉండేది. కాని ప్లీనరీ సందర్భంగా భారీగా ప్రచురించిన అరవై నాలుగు పేజీల 'సంక్షేమ జెండా ప్రగతి ఎజెండా' అనే ప్రచారపత్రంలో గాని, ప్రారంభ సమావేశంలో అధినేత ఉపన్యాసంలో గాని అటువంటు లోచూపు, సమీక్ష, సవరణా ప్రయత్నాలు ఏ మాత్రం లేవు. సంక్షేమం-ప్రగతి అనే జోడెద్దుల నడక అని తమ గురించి తాము చెప్పుకుంటున్నారు గాని నిజానికి ఆత్మస్తుతి-పరనింద అనే జోడెద్దులు మాత్రం ఉత్సవాలలో అడుగడుగునా కనబడుతున్నాయి. అన్ని రంగాల్లోనూ అన్ని విజయాలూ సాధించినట్టుగా, ఇంక సాధించవలసినది ఏమీ లేదన్నట్టుగా, తెలంగాణలో పాలూ తేనే ప్రవహిస్తున్నాయన్నట్టుగా అసత్యాలూ అర్ధసత్యాలూ ఒకవైపు. పాలనను ఉద్యమ ఆకాంక్షలతో పోల్చి చూడడం, అసమగ్రతల గురించి, పక్కదారుల గురించి, రాజకీయ, ఆర్థిక అవినీతి గురించి ప్రశ్నించడం తెలంగాణ ద్రోహమన్నట్టు ఇతరుల మీద నింద వేయడం మరొకవైపు. ఈ వైఖరి కొంతకాలమైనా ఉద్యమ పార్టీగా ఉన్న పార్టీకి ఉచితమైనది కాదు. ఆత్మస్తుతి-పరనింద పాలకుల ఆత్మసంతృప్తికి పనికి వస్తాయి గాని, సమస్యల మయమైన ప్రజలను సంతృప్తి పరచజాలవు. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# భావప్రకటనా స్వేచ్ఛకు పాలకవర్గ నిర్వచనాలు

పాలకపక్షమూ ప్రధాన ప్రతిపక్షమూ కూడ అసహన సంస్కృతిని, దూకుడు సంస్కృతిని పెంచి పోషిస్తుండడంతో ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు విస్ఫోటకంగా మారాయి. అవతలి పక్షం నుంచి వచ్చే చిన్న మాట కూడ ఇవతలి పక్షం విరుచుకుపడడానికి కారణమవుతున్నది. ప్రస్తుత పాలకవర్గాల నుంచి ప్రజాస్వామిక చర్చా సంప్రదాయాలను ఆశించడం అత్యాశే గాని, సాధారణంగా రాజకీయ రంగంలో ఉండే మర్యాదలు, నాగరిక విలువలు, ఇచ్చిపుచ్చుకునే ధోరణులు కూడ పూర్తిగా లోపించిన కొత్త తరహా రాజకీయాలు ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో రాజ్యమేలుతున్నాయి. రెండువైపులా విధ్వంసమే లక్ష్యంగా విమర్శలు, ప్రతివిమర్శలు జరుగుతున్నప్పుడు ఎవరో ఒకరిది తప్పని చెప్పే అవకాశం కూడ లేదు. దొందూ దొందే అన్న చందంగా విభజనానంతర ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు నడుస్తున్నాయి. ఈ స్థితిలో అక్టోబర్ మూడో వారంలో ఇరు పక్షాల ఘర్షణలు మాటల దశ దాటి చేతల దశకు చేరాయి. బొగ్గు కొరత వల్ల విద్యుదుత్పాదన క్షీణిస్తుండడంతో, ఆ సమస్యను పరిష్కరించడంలో అధికారపార్టీ అసమర్థంగా ఉన్నదని ప్రతిపక్షం ఆరోపించింది. అలాగే ఇటీవలి కాలంలో ఇతర రాష్ట్రాలలో దొరికిన మాదకద్రవ్యాలు ఏదో ఒకరకంగా ఆంధ్రప్రదేశ్ తో సంబంధంలో ఉండడం, తూర్పు కనుమల్లో విస్తృతంగా గంజాయి సాగు వంటి సమస్యలను కూడ ప్రతిపక్షం లేవనెత్తింది. రాష్ట్ర పాలనకు సంబంధించిన ఇటువంటి సమస్యలను లేవనెత్తి, ప్రజల దృష్టికి తెచ్చి, పరిష్కరించమని ప్రభుత్వాన్ని కోరడం ప్రతిపక్షాల బాధ్యతే. కాని తెలుగుదేశం పార్టీ ఒక ప్రజాస్వామిక ప్రతిపక్షం ఏమీ కాదు, అధికారం కోల్పోయిన ఉక్రోషంతో, మళ్లీ అధికారం చేపట్టడానికి ఏ కుయుక్తులకైనా దిగడానికి ఆత్రుతతో ఉన్న పార్టీ. అందువల్ల నిజమైన ప్రజా సమస్యలను కూడ సంచలనాత్మకం చేయడం, తన అధికార క్రీడలో భాగం చేయడం దానికి అలవాటు. ఆ క్రమంలోనే ఆ పార్టీ నాయకులు దురుసు వ్యాఖ్యలకు, వ్యక్తిగత వ్యాఖ్యలకు పాల్పడ్డారు. ఉదాత్తమైన ప్రజాస్వామిక సంప్రదాయాలు ఉంటే, అసలు రాజకీయ పక్షాలకు ప్రజాస్వామ్యం అనేది తెలిసి ఉంటే, ప్రతిపక్షం మితిమీరి మాట్లాడినప్పటికీ, అధికారపక్షం తన అధికారం వల్ల బాధ్యతగా ప్రవర్తించవలసి ఉంటుంది. వచ్చిన ప్రశ్నలకు సక్రమంగా జవాబు చెప్పి, ప్రతిపక్షపు దురుసు ప్రవర్తనను ప్రజల దృష్టికి తీసుకురావలసి ఉంటుంది. కాని, ఇవాళ ఆంధ్రప్రదేశ్‌ను పాలిస్తున్న పాలకవర్గ ముఠాకు ప్రజాస్వామ్యం అంటే వనరుల దోపిడీ చేసి అర్థబలం పెంచుకోవడానికి వీలుగా ఎక్కువమంది సభ్యులు తమ వెనుక ఉండడం, ప్రశ్నించినవారి నోరు మూయడానికి తగినంత అంగబలం ఉండడం. అధికార వైఎస్ ఆర్‌సిపికి ఈ అర్థబలమూ అంగబలమూ ఉన్నాయి. ఆ అంగబలంతోనే న్యాయాన్యాయాలు, నిజానిజాలు నిర్ధారించగలమనే అహంకారం ఉంది. అందువల్లనే తమకు నచ్చని వ్యాఖ్యలు చేసిన ప్రతిపక్ష అధికార ప్రతినిధి ఇంటి మీద, ప్రతిపక్ష కార్యాలయాల మీద భౌతిక దాడులకు, ఆస్తి విధ్వంసానికి పాల్పడ్డారు. ఈ దాడుల కారణంగా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి రాష్ట్రపతి పాలన విధించాలని ప్రతిపక్ష నాయకుడు కోరాడు. ఇరు పక్షాలూ ఒక్క లాంటివే గనుక ఇందులో ప్రజలు పట్టించుకోవలసినదేమీ లేదు గాని, ఈ ఘర్షణలో ప్రజాస్వామిక సంప్రదాయాలు దెబ్బతింటున్నాయి గనుక, ప్రభుత్వ విధానాలను ప్రశ్నిస్తే దాడులు చేస్తాము అనే సందేశం ఉంది గనుక ప్రజలు, పౌరసమాజం బైటికి వచ్చి రెండు అరాచక పక్షాలకూ బుద్ధి చెప్పవలసి ఉంది. వీ

# జర్మనీలో ఛాన్సలర్ ఏంజెలా మెర్కెల్ శకం ముగియనుందా?

- ఎ. నర్సింహారెడ్డి

జర్మన్ బుండెస్టాగ్(పార్లమెంటు)కు సెప్టెంబర్ 26న జరిగిన ఎన్నికల్లో ఛాన్సలర్ ఏంజెలా మెర్కెల్‌కు చెందిన సెంటర్ రైట్ క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీ (సిడియు) ఆధిక్యత కోల్పోయింది. ఆమె పార్టీకి 24.1 శాతం ఓట్లు లభించగా, ప్రత్యర్థి సోషల్ డెమోక్రటిక్ పార్టీ(ఎస్‌పిడి)కి 25.7 శాతం ఓట్లు పోలైనాయి. 2005 నుండి ఛాన్సలర్ (ప్రధాని)గా పనిచేస్తున్న మెర్కెల్‌కు అత్యంత జనామోదం ఉన్నప్పటికీ ఆమె రాజకీయ బాధ్యతల నుండి వైదొలుగుతున్న సందర్భంలో కొత్తనాయకుడు ఆర్మిన్ లాస్చెట్‌కు ఇది ఎదురుదెబ్బ. గత ఎన్నికల్లో కూడా ఏ పార్టీకి కనీస మెజారిటీ లభించకపోవటంతో మెర్కెల్ నాయకత్వంలో సిడియు, ఎస్‌పిడి జాతీయ సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు చేశాయి. ఎస్‌పిడి నాయకుడు స్కోల్జ్ ఆమె మంత్రివర్గంలో ఆర్థికమంత్రి. ఈ పర్యాయం గ్రీన్స్, లిబరల్ ఫ్రీ డెమోక్రాట్స్‌తో కలిసి తానే క్రిస్మస్ నాటికి సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు చేస్తానంటున్నాడు స్కోల్జ్. జర్మనీలో దీర్ఘకాలంగా సంకీర్ణ ప్రభుత్వాలే పనిచేస్తున్నాయని, అందువల్ల సుస్థిరతకు భంగం వాటిల్లదని ఆయన యూరప్ దేశాలకు భరోసా ఇచ్చారు. లభించిన పాపులర్ ఓటును బట్టి 709 సీట్లు గల బుండెస్టాగ్‌లో వివిధ పార్టీల సభ్యుల సంఖ్య- ఎస్‌పిడి 206, సిడియు 196, ఎఫ్‌డిపి 92, గ్రీన్స్ 118, పచ్చి మితవాద ఎఎఫ్‌డి 83, వామపక్ష పార్టీ డి లింకె 39. గత ఎన్నికలతో పోల్చితే పచ్చి మితవాద ఎఎఫ్‌డి ఓటు 12.6 నుండి 10.3 శాతానికి, డి లింకె ఓటు 9.2 నుండి 4.9 శాతానికి తగ్గటం గమనించదగింది. సిడియు/సిఎస్‌యు ఓటు 33 నుండి 24.1 శాతానికి తగ్గగా, ఎస్‌పిడి ఓటు 20.5 నుండి 25.7 శాతానికి పెరిగింది. అలాగే గ్రీన్స్ ఓటు 8.9 నుండి 14.8 శాతానికి, ఎఫ్‌డిపి ఓటు 10.7 నుండి 11.5 శాతానికి పెరిగింది.

ఏ పార్టీకి పూర్తి మెజారిటీ రానందున సంకీర్ణ ప్రభుత్వమే ఏర్పడాలి. సంకీర్ణాలు జర్మనీలో కొత్తేమి కాదు. పార్లమెంట్ మొదలు ప్రాథమిక స్థాయి వరకు జరిగే ఎన్నికల్లో ఆయా స్థల, కాల పరిస్థితులను బట్టి వేరు వేరు సంకీర్ణాలు గత ఏడు దశాబ్దాలుగా ఏర్పడుతూ వస్తున్నాయి. గత ఏడున్నర దశాబ్దాల కాలంలో క్రిస్టియన్ డెమోక్రాటిక్ పార్టీకి ఇంత తక్కువ ఓట్లు ఏ ఎన్నికల్లో రాలేదు. ఈసారి జర్మన్ ప్రజాభిప్రాయం సెంటర్ రైట్ నుండి సెంటర్ లెఫ్ట్‌కు మలుపు తిరిగినట్లు స్పష్టమైంది. సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తామని చెబుతున్న సిడిపి-ఎస్‌డిపిల మధ్య ఆర్థిక రాజకీయ విధానాల్లో తేడా లేదు. అయినా ఈ ఎన్నికల తీర్పులో రెండు మౌలిక అంశాలు వ్యక్తం అవుతున్నాయి. మొదటిది తూర్పు జర్మనీ ప్రాంతంలో వామపక్షానికి ఓటు బ్యాంక్ పెరిగింది. రెండవది 2017 నాటి ఎన్నికల్లో దేశవ్యాప్తంగా 16 రాష్ట్రాల్లో అత్యధిక స్థానాలు సంపాదించి సిడియు తాజా ఎన్నికల్లో రెండు రాష్ట్రాల్లో మాత్రమే ఆధిపత్య పార్టీగా నిలిచింది. 16 సంవత్సరాలు చాన్సలర్(ప్రధాని)గా పనిచేసిన ఏంజెలా మెర్కెల్ జర్మనీ ప్రజల జీవన ప్రమాణాలను సాపేక్షంగా పెంచడంలో విఫలమ్కెంది. ఏంజెలా మెర్కెల్ తన ఆధిపత్యాన్ని నిలుపుకోవడానికి ప్రజల మధ్య మత వైరుద్యాలు సృష్టించింది. ఫలితంగా ప్రజల మధ్య శాంతి సామరస్యాలు దెబ్బతిన్నాయి. ఈ పరిస్థితి ప్రజల్లో అభద్రతా భావాన్ని పెంచింది. అమెరికా విధానాలను తు.చ. తప్పకుండా అనుసరించింది. అదే సమయంలో రష్యా, చైనా, భారత్‌లతో వాణిజ్య సంబంధాలు మెరుగుపర్చుకుంది. కొద్ది రోజుల్లో ఏర్పడబోయే సంకీర్ణ ప్రభుత్వం మితవాద శక్తులకు ప్రాతినిధ్యం లేకుండా ఏర్పడితే జర్మనీ ప్రజల రాజకీయ ఆకాంక్షలు ఎంతో కొంతైనా నేరవేరే అవకాశం ఉంటుంది. ❖



## డా. ఎం వి. రమణారెడ్డి స్మృతి

రచయిత, అనువాదకుడు, కార్మిక నాయకుడు డా. ఎం వి రమణారెడ్డి(77) మరణించారు. గతకొంత కాలంగా శ్వాసకోశ వ్యాధితో బాధపడుతున్న ఆయన కర్నూలులోని మెడిక్యూర్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ సెప్టెంబర్ 29న మరణించారు. ఆయన 1944లో కమలాపురం మండలం చదిపిరాళ్లలో జన్మించారు. గుంటూరులో వైద్యవిద్యను అభ్యసించారు. ఆ రోజుల్లోనే సాహిత్యం పట్ల ఆసక్తి పెంచుకున్నారు. నక్సలైట్ ఉద్యమాన్ని బూటకపు ఎన్‌కౌంటర్‌ల పేరుతో అణచివేయడాన్ని నిరసిస్తూ 1969లోనే జలగం వెంగళరావును ఉరితీయాలని తాను నడుపుతున్న 'ప్రభంజనం' పత్రికలో సంపాదకీయం రాశారు. 1970లో ఖమ్మంలో జరిగిన విరసం మొదటి మహాసభలో పాల్గొని విరసంలో సభ్యుడిగా చేరి 1974 వరకు కొనసాగారు. ఆ తరువాత తరిమెల నాగిరెడ్డితో కలిసి పనిచేశారు. ప్రొద్దుటూరులో వైద్యుడిగా సేవలందించారు. 1983లో టిడిపిలో చేరి ప్రొద్దుటూరు ఎంఎల్‌ఏగా గెలుపొందారు. అప్పటి ముఖ్యమంత్రి ఎన్‌టిఆర్ రాయలసీమకు తెలుగుగంగ వరప్రదాయిని అని అంటే... ఆ పథకాన్ని మద్రాసుకు నీళ్లు ఇవ్వడం కోసమే పెట్టారని బహిరంగంగానే విమర్శించి 1984లో ఎంఎల్‌ఏ పదవికి రాజీనామా చేశారు. టిడిపి నుండి బయటకి వచ్చి రాయలసీమ విమోచన సమితి ద్వారా రాయలసీమకు జరిగిన అన్యాయానికి వ్యతిరేకంగా ఉద్యమించారు. రాయలసీమ ప్రత్యేక రాష్ట్రం కావాలని ఉద్యమించారు. 1971లో ఆయన్ను ప్రొద్దుటూరులో అరెస్టుచేసి జైలుకు పంపారు. కొంతకాలం కార్మికోద్యమంలో పనిచేశారు. ఆయన కథలు, నవల, విమర్శ, చరిత్ర, అనువాదాలు.. ఇలా అనేక ప్రక్రియల్లో రచనలు చేశారు. పరిష్కారం అనే కథల సంపుటి, తెలుగు సినిమా స్వర్ణయుగం, మహాభారత స్రవంతిలో తెలుగింటికొచ్చిన ద్రౌపది, టూకీగా ప్రపంచ చరిత్ర, ఆయుధం పట్టని యోధుడు(మార్టిన్ లూథర్ కింగ్ జీవిత చరిత్ర) మొదలైనవి రాశారు. మాక్సింగోర్కీ నవల 'మదర్'ను 'కడుపుతీపి' పేరుతో అనువదించి పుస్తకంగా ప్రచురించారు. ఆయన రాసిన కరపత్ర సాహిత్యం చాలా విలువైనది. అట్లాగే నాలుగు సంపుటాల ప్రపంచ చరిత్ర, రాయలసీమ కన్నీటి గాథ, తెలుగింటి వ్యాకరణం మొదలైనవి ఉన్నాయి.

## మావోయిస్టు నాయకుడు రామకృష్ణ స్మృతి

భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) నాయకుడు, ప్రభుత్వంతో 2004లో జరిగిన చర్చల ప్రతినిధిగా సుప్రసిద్ధుడు అక్కిరాజు హరగోపాల్ (శ్రీనివాస్, రామకృష్ణ, సాకేత్) (63) అక్టోబర్ 14న అనారోగ్యంతో మరణించారని ఆ పార్టీ ఒక పత్రికా ప్రకటన విడుదల చేసింది. హఠాత్తుగా కిడ్నీల సమస్య తలెత్తిందని, డయాలసిస్ చికిత్స ప్రారంభించినప్పటికీ ఇతర ఆరోగ్య సమస్యలు కూడా తీవ్రమై తుది శ్వాస విడిచారని తెలుస్తున్నది. గుంటూరు జిల్లా తుమ్మకోటలో ప్రాథమిక విద్యాభ్యాసం చేసిన హరగోపాల్ 1970ల చివరి రోజుల్లో మాచెర్లలో డిగ్రీ చదువుతున్నప్పుడు రాడికల్ విద్యార్థి సంఘంలో చేరారు. 1980లో అప్పటి పీపుల్స్‌వార్ సభ్యుడిగా చేరి, 1982 నుంచి పూర్తి కాలం కార్యకర్తగా ఉన్నారు. గుంటూరు జిల్లాలో, దక్షిణ తెలంగాణలో విప్లవోద్యమ నిర్మాణంలో పాలుపంచుకుని 2000లో రాష్ట్ర కమిటీ కార్యదర్శి అయ్యారు. 2001లో కేంద్ర కమిటీ సభ్యుడుగా ఎన్నికయ్యారు. 2004లో విప్లవోద్యమానికీ ప్రభుత్వానికీ మధ్య జరిగిన చర్చలలో పీపుల్స్‌వార్ ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించారు. ఆ సందర్భంగా హైదరాబాద్ మంజీరా గెస్ట్ హౌస్‌లో ఉన్న పది రోజులలో అనేక సామాజిక వర్గాలతో సంభాషణ జరపడంలో, చర్చలు నిర్వహించడంలో, విప్లవోద్యమ ప్రతిష్ఠను సమున్నతంగా ఎత్తిపట్టారు. చర్చల తరువాత ఆంధ్ర-ఒరిస్సా సరిహద్దు కమిటీకి నాయకత్వం వహించారు. కేంద్ర కమిటీ, పొలిట్ బ్యూరో సభ్యుడిగా దేశ వ్యాప్త ఉద్యమానికి మార్గదర్శకత్వం వహించారు. ఆయన కొడుకు పృథ్వి (మున్నా) కూడా విప్లవోద్యమంలో పాల్గొని 2016 రామగూడ బూటకపు ఎన్‌కౌంటర్‌లో మరణించారు. రామకృష్ణ మరణం తరువాత రెండు తెలుగు రాష్ట్రాలలోనూ విపరీతమైన స్పందన వెలువడింది. విప్లవోద్యమం పట్ల సానుభూతి, విప్లవోద్యమ అమరుల స్ఫూర్తి చెరగలేదని రుజువు చేసింది. అక్టోబర్ 24న ప్రకాశం జిల్లా ఆలకూర పాడులో మున్నా సంస్మరణ సందర్భంగా, రామకృష్ణను, ఆ గ్రామానికి చెందిన ఇతర అమర వీరులను స్మరిస్తూ జరిపిన సభకు పోలీసులు ఎన్ని అవరోధాలు కల్పించినప్పటికీ విజయవంతంగా జరిగింది.

## కొల్లు వరప్రసాదరావు స్మృతి

తెలంగాణ సాయుధ పోరాట యోధుడు, సాహితీవేత్త కొల్లు వరప్రసాదరావు (95) కన్నుమూశారు. ఆరోగ్య సమస్యలతో బాధపడుతున్న ఆయన అక్టోబర్ 20న మరణించారు. సూర్యాపేట జిల్లా, గాల మండలం, జగన్నాధపురం వాస్తవ్యుడు. చివరి వరకూ కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాలను పాటించారు. కుల వ్యవస్థ నిర్మూలనలో భాగంగా మూడు దశాబ్దాల క్రితమే దళితుల పాడె మోశారు. ఇంట్లో పనిచేసే పాలేర్లకు వస్త్రాలు పెట్టి వారి కాళ్లకు దండం పెట్టారు. తన శరీరాన్ని మెడికల్ కళాశాలకు అప్పగించాలని వరప్రసాదరావు 20 ఏళ్ల కిందటే వీలునామా రాశారు. అంతేకాకుండా భార్య బొట్టు, పసుపు, కుంకుమలు తీయకుండా కర్మకాండలు చేయకుండా, నేటి సమాజానికి ఆదర్శంగా నిలవాలని తన వీలునామాలో పేర్కొన్నట్లు కుటుంబ సభ్యులు తెలిపారు. ఆయన కోరుకున్న విధంగా వరప్రసాదరావు మృతదేహాన్ని మమత మెడికల్ ఆస్పత్రికి అప్పగించారు.

# లఖింపూర్ ఖేరీ మారణకాండ చెపుతున్నదేమిటి?

*నిరసన తెల్పుతున్న రైతుల మీదికి నేరుగా కార్లు నడిపి రైతులను బలిగొన్న భాజపా దుర్మార్గం గురించి, ఇంతటి మహా విషాదం పట్ల కూడ పెద్దగా కదలిక లేని సామాజిక నిర్లిప్తత గురించి చర్చిస్తున్నారు* **ఎన్ వేణుగోపాల్**

ఉత్తరప్రదేశ్ మధ్య భాగంలోని లఖింపూర్ ఖేరీ జిల్లాలో, రాజధాని లక్నోకు 210 కిమీ, జిల్లా కేంద్రం లఖింపూర్ కు 77 కిమీ దూరంలో, నేపాల్ సరిహద్దుకు పది కిమీ లోపు దూరంలో ఉన్న తికునియా అక్టోబర్ 3న హఠాత్తుగా వార్తలకు ఎక్కింది. కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన మూడు రైతు చట్టాలకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శన చేస్తున్న రైతుల పైకి ఒక కేంద్ర మంత్రి కొడుకు నేరుగా కార్లు నడిపి నలుగురు రైతులను బలిగొనడం, ఆ దురంతాన్ని తన కెమెరాలో చిత్రిస్తున్న జర్నలిస్టును కాల్చి చంపడం, అందుకు ప్రతిగా కోపోద్రిక్తులైన రైతులు భారతీయ జనతా పార్టీ కార్యకర్తల మీద, మంత్రి కొడుకు వాహనశ్రేణి మీద దాడి చేసి ముగ్గురిని చంపడం, కొన్ని వాహనాలు తగులబెట్టడం కేవలం ఉత్తరప్రదేశ్ రాజకీయాల్లోనే కాక, దేశవ్యాప్తంగా సంచలనాత్మక వార్తలయ్యాయి. ఆ దుర్ఘటన పట్ల రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల వైఖరి, విభిన్న రాజకీయ పార్టీల వైఖరులు, న్యాయవ్యవస్థ స్పందన కూడ చర్చనీయాంశాలయ్యాయి.

చెరకు ప్రధానపంటగా వాణిజ్య వ్యవసాయంతో ఆర్థిక వ్యవస్థ మార్పులకు గురైనప్పటికీ, సామాజికంగా, రాజకీయంగా వెనుకబాటుతనం వదలని లఖింపూర్ ఖేరీ జిల్లా రాజకీయాల్లో అజయ్ మిశ్రా తేని అనే నేరచరిత్ర గల రాజకీయ నాయకుడి ఆధిపత్యం నడుస్తున్నది. బ్రాహ్మణ కులబలంతో, ఎన్నో ఏళ్లుగా మాఫియా కార్యకలాపాల హింసా కార్యకలాపాలతో, భారతీయ జనతా పార్టీ రాజకీయాధికారంతో అజయ్ మిశ్రాకు అక్కడ ఎదురు లేకుండా ఉన్నది. ఇటీవల నరేంద్ర మోడీ - అమిత్ షా ఆయనను ఏరికోరి కేంద్ర ప్రభుత్వ హోం శాఖ సహాయ మంత్రిగా నియమించడంతో ఆ అధికారానికి మరిన్ని కోరలు వచ్చాయి.

అక్టోబర్ 3న ఉత్తరప్రదేశ్ ఉప ముఖ్యమంత్రి కేశవప్రసాద్ మౌర్య తికునియా సమీపంలోని బనబీర్ పూర్ పర్యటనకు రానుండడంతో ఆ ప్రాంత రైతులు ఆయన ఎదుట తమ నిరసన తెల్పాలనుకున్నారు. ఆ నిరసన ప్రదర్శనకు వెళుతున్న రైతుల వెనుకనుంచి వచ్చి నడిరోడ్డు మీద తన మూడు కార్ల వాహనశ్రేణితో ఢీకొట్టాడు అజయ్ మిశ్రా కొడుకు అశిష్ మిశ్రా. ఈ ఉద్దేశపూర్వక దాడిలో దల్జిత్ సింగ్, నచత్తర్ సింగ్, గుర్వేందర్ సింగ్, లవ్ ప్రీత్ సింగ్ అనే నలుగురు రైతులు ప్రాణాలు కోల్పోయారు. ఇందులో ఇద్దరు అక్కడికక్కడే చనిపోగా, ఇద్దరు తీవ్రమైన గాయాలతో ఆస్పత్రిలో మరణించారు. ఇంకా ఎంతో మంది తీవ్రంగా గాయపడ్డారు. మొదటి కారు ఢీకొని పడిపోయినవారిని తొక్కుకుంటూ మరి రెండుకార్లు సాగిపోయాయి. అలా కార్లు ఉద్దేశపూర్వకంగా మనుషుల మీదికి ఎక్కుతున్న దృశ్యాన్ని తన కెమెరాలో బంధిస్తున్న స్థానిక టివి జర్నలిస్టు రమణ్ కశ్యప్ ఆ వాహనాల్లోంచి వచ్చిన తుపాకి గుండు వల్లనో, లేదా ఒక కారు పడదోసి మీది నుంచి పోవడం వల్లనో చనిపోయాడు. ఈ మూడు కార్లలో రెండు అజయ్ మిశ్రాకు చెందినవే. ఒక కారు మంత్రి కుటుంబానికి సన్నిహితుడూ భారతీయ జనతా పార్టీ నాయకుడూ లక్నోకు చెందిన కాంట్రాక్టర్ అంకిత్ దాస్ దని తెలుస్తున్నది. ఈ ఘోరకలికి కోపోద్రిక్తులైన నిరసనకారులు అక్కడికక్కడ భాజపా కార్యకర్తల మీద, ఆ వాహన శ్రేణి మీద దాడిచేసి రెండు కార్లు తగులబెట్టారు. ఆ దాడిలో ఒక కారు డ్రైవర్, ఇద్దరు భారతీయ జనతా పార్టీ కార్యకర్తలు చనిపోయారు.

తికునియా రైతుల ఆందోళనకు రైతు చట్టాల పట్ల దేశవ్యాప్తంగా వ్యక్తమవుతున్న నిరసనతో పాటు స్థానికంగా బలవత్తరమైన కారణాలు కూడ ఉన్నాయి. లఖింపూర్ ఖేరి జిల్లా చెరకు పంటకు మాత్రమే కాదు, ఆసియాలో అతి పెద్దవైన మూడు పంచదార మిల్లులకు కూడ ప్రసిద్ధి. జిల్లాలో గోలా గోకర్ణనాథ్ లో, పలియా కలన్ లో బజాజ్ హిందుస్తాన్ షుగర్ మిల్లులు, కుంభి లో బలరాంపూర్ చీనీ మిల్స్ అనే భారీ చక్కెర కర్మాగారాలున్నాయి. వాటితో పాటు ఈ రెండు కంపెనీలకు చెందిన చిన్న మిల్లులు, డిసిఎం శ్రీరామ్, గోబింద్ షుగర్ మిల్స్, కిసాన్ సహకారి చీనీ మిల్స్, సరయూ సహకారి చీనీ మిల్స్ వంటి మిల్లులు దాదాపు పది దాకా ఉన్నాయి. జిల్లాలో మొత్తం ఐదు లక్షల మంది రైతులు చెరకు పండించి ఈ మిల్లులకు సరఫరా చేస్తున్నారని అంచనా. చట్టప్రకారం వారు తోలిన చెరకుకు పద్నాలుగు రోజుల లోపల మిల్లు యాజమాన్యాలు డబ్బు చెల్లించవలసి ఉంటుంది. కాని దాదాపుగా అన్ని మిల్లులు రైతులకు ఎప్పటికప్పుడు డబ్బు చెల్లించడం లేదు. మిల్లుల నుంచి రైతులకు రావలసిన బకాయిలు పేరుకుపోతున్నాయి. వ్యవసాయ చట్టాల పట్ల వ్యతిరేకతతో పాటు, మిల్లులు తమకు బకాయిలు చెల్లించడం లేదనే ఆగ్రహం కూడ రైతుల్లో పెద్ద ఎత్తునే ఉంది. రైతులకు మిల్లులు బకాయి పడిన సొమ్ము రాష్ట్ర వ్యాప్తంగా దాదాపు ఐదున్నర వేల కోట్ల రూపాయలు ఉండగా, ఈ ఒక్క జిల్లాలోనే వెయ్యి కోట్ల రూపాయలు ఉందని స్వయంగా చెరకు వ్యవహారాలు చూసే రాష్ట్ర ప్రభుత్వాధికారులే చెపుతున్నారు.

బకాయిల సమస్యతో పాటు, తమ చెరకుకు తగినంత ధర రాకపోవడం, ప్రభుత్వం వైపు నుంచి సహకారం అందకపోవడం కూడ రైతుల ఆగ్రహానికి కారణంగా ఉంది. చెరకు కొనుగోలుకు ప్రభుత్వం ప్రకటించే రాష్ట్ర సూచిత ధర (స్టేట్ అడ్వైజరీ ప్రైస్) పెరుగుదల మాయావతి ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో క్వింటాల్ కు రు. 115, అఖిలేష్ యాదవ్ ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో రు. 65 ఉండిందని, కాని యోగి ఆదిత్యనాథ్ గత నాలుగు సంవత్సరాలుగా పైస కూడ పెంచక పోగా, ఇటీవలనే కేవలం రు. 25 పెంపుదల మాత్రమే ప్రకటించాడని రైతులు ఆగ్రహంతో ఉన్నారు.

ఈ ఆగ్రహాన్ని ప్రదర్శించడానికి, తమ నిరసనను ప్రభుత్వానికి

తెలియజేయడానికి ఈ రైతుల దగ్గర, అసలు మొత్తంగానే దేశ ప్రజల దగ్గర ఉన్న సాధనాలు అతి కొద్ది. వారు నిరసన ప్రకటించడానికి జిల్లా కేంద్రం దాకా వెళ్లడమే కష్టం, రాష్ట్ర రాజధానికి వెళ్లడం మరింత కష్టం. వ్యవసాయ పనులు వదులుకుని అంత దూరం వెళ్లినా సమస్యలు వినే, పరిష్కరించే ప్రభుత్వం లేదని కూడ వారికి తెలుసు. అందుకే రాష్ట్ర ఉపముఖ్యమంత్రి, జిల్లాకే చెందిన కేంద్ర మంత్రి తమ ప్రాంతానికి వస్తున్నారని తెలిసి అక్కడే నిరసన ప్రదర్శన నిర్వహించాలనుకున్నారు.

కాని, భారతీయ జనతా పార్టీ, సంఘ్ పరివార్ మూకలు మొత్తంగానే రైతుల ఆందోళన పట్ల పగబట్టి ఉన్నాయి. ఎన్ని కుట్రలు, కుహకాలు చేసినా ఢిల్లీ సరిహద్దుల్లో రైతుల ఆందోళనను అణచివేయలేకపోతున్నామనే కోపం ప్రధాని నుంచి కింది స్థాయి సంఘ్ పరివార్ కార్యకర్తల వరకు బుసలు కొడుతూనే ఉన్నది. స్వయంగా ఈ జిల్లాకు చెందిన, కేంద్ర ప్రభుత్వంలో హోం శాఖలో సహాయ మంత్రిత్వం వెలగబెడుతున్న అమిత్ షా అనుచరుడు అజయ్ మిశ్రా కొద్దిరోజుల ముందే జిల్లాలోనే జరిగిన ఒక సభలో రైతు ఆందోళనకారులను “అల్లరిమూకలు” అని పిలిచి, వారు తమ ఆందోళన విరమించకపోతే తీవ్రపరిణామాలు ఎదుర్కోవలసి వస్తుందని, తాను తలచుకుంటే రెండు నిమిషాల్లో వారి పని పట్టగలనని హెచ్చరించాడు. దాదాపు అదే సమయంలో హర్యానా ముఖ్యమంత్రి మనోహర్ లాల్ ఖట్టర్ దెబ్బకు దెబ్బ తీయాలని, ఆందోళన చేస్తున్న రైతులను లాఠీలతో బాదమని, ఏమీ జరగకుండా తాను చూసుకుంటానని పార్టీ శ్రేణులకు పిలుపు ఇచ్చాడు. “ఐదు వందలు, ఏడు వందలు, వెయ్యి మందితో గుంపు కట్టండి. ప్రతి చోటా దెబ్బకు దెబ్బ తీయండి... ఏమీ గాభరా పడకండి. నెలో, మూడు నెలలో, ఆరు నెలలో జైలుకు వెళ్లి వస్తారు. అంతే. అప్పుడిక మీరు మరింత పెద్ద నాయకులవుతారు. మీ పేరు చరిత్రకెక్కుతుంది” అని రెచ్చగొట్టాడు.

ఈ నేపథ్యంలో, తమ నేర సామ్రాజ్యం లోపలే నిరసనకు పూనుకున్న రైతులకు తన తండ్రి ఆదేశించినట్టు పాఠం చెప్పాలని అజయ్ మిశ్రా కొడుకు ఆశిష్ మిశ్రా తలపెట్టాడు. జిల్లాలో రాజ్యం తమదే గనుక, రాష్ట్ర పాలన తమది గనుక, జిల్లా పాలనా యంత్రాంగమూ రాష్ట్ర పాలనా యంత్రాంగమూ తమ చెప్పుచేతల్లో ఉంటారు గనుక, తన తండ్రి అమిత్ షా కు సహాయకుడుగా కేంద్ర మంత్రిగా ఉన్నాడు గనుక ఏమి చేసినా చెల్లుతుందనుకున్నాడు. మనుషుల ప్రాణాలకు, అందులోనూ భిన్నాభిప్రాయాలు ప్రకటించే, ప్రశ్నించే వారి ప్రాణాలకు విలువ లేదనేది రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ సిద్ధాంతం. ఆ హంతక, విద్వేష ప్రవృత్తిని వంటబట్టించుకున్న సంఘ్ పరివార్ సభ్యుడిగా ఆశిష్ మిశ్రా మనుషుల మీదికి వాహనం నడిపాడు.

సహజంగానే జిల్లా పోలీసు యంత్రాంగం, రాష్ట్ర పాలనా యంత్రాంగం ఇంతటి మారణకాండ పట్ల స్పందించవలసిన పద్ధతిలో స్పందించలేదు. ఉద్దేశపూర్వకంగా, పథకం ప్రకారం మనుషుల మీదికి వాహనం ఎక్కించి, వారిని చంపడం హత్యానేరం అవుతుంది. ప్రత్యక్ష సాక్షి కథనాల ప్రకారం గాని, ఒకటి రెండు రోజుల తర్వాత బైటపడిన వీడియో ప్రకారం గాని ఆశిష్ మిశ్రా డ్రైవింగ్ సీటులో ఉన్నాడని స్పష్టంగా కనబడుతున్నప్పటికీ, అసలు ఆశిష్ మిశ్రా అక్కడ లేనే లేడని, మరెక్కడో కుస్తీ పోటీల దగ్గర ఉన్నాడని, అనారోగ్యంతో ఉన్నాడని అబద్ధాలు ప్రచారం చేశారు. ఒక హత్యాకాండ కేసులో ప్రధాన నిందితుడని అన్ని అనుమానాలూ ఆధారాలూ ఉన్నప్పటికీ పోలీసులు అతణ్ని అరెస్టు చేయడానికి ఆరు రోజులు తాత్సారం చేసి, చివరికి సుప్రీంకోర్టు జోక్యం చేసుకున్న తర్వాత గాని ఆ పని చేయలేదు. తన కొడుకు ఉద్దేశపూర్వకంగా నలుగురు మనుషులను హత్య చేశాడంటే నైతిక బాధ్యత వహించి తన పదవికి రాజీనామా చేయవలసిన కేంద్ర హోంశాఖ సహాయ మంత్రి దర్జాగా తన పదవిలో కొనసాగుతూనే ఉన్నాడు. అటువంటి వ్యక్తిని కేంద్ర మంత్రివర్గ సభ్యుడుగా ఉంచుకోవడం తమకు నైతిక అపఖ్యాతి తెస్తుందని, కనీసం నామమాత్రంగానైనా అతణ్ని పక్కకు పెట్టాలని ప్రధానమంత్రి గాని, హోం మంత్రి గాని అనుకోలేదు.

రాష్ట్ర ప్రభుత్వ అధికారులు ఈ కేసును సక్రమంగా దర్యాప్తు చేసే అవకాశం లేదని, అందువల్ల ఉన్నత స్థాయి దర్యాప్తు, న్యాయవిచారణ జరగాలని ఆదేశించాలని కోరుతూ ఇద్దరు ఉత్తరప్రదేశ్ న్యాయవాదులు నేరుగా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తికి చేసిన విన్నపం ఆధారంగా వారం రోజుల తర్వాత సుప్రీంకోర్టు జోక్యం మొదలయింది. అప్పటివరకూ రాష్ట్రప్రభుత్వ అధికారులు చేసిన జాప్యం పట్ల, తీసుకున్న అరకొర చర్యల పట్ల సుప్రీంకోర్టు అసంతృప్తి వ్యక్తం చేసింది. మంత్రి కొడుకును ఇంకా ఎందుకు అరెస్టు చేయలేదని నిలదీసింది. రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని కూడ సుప్రీం కోర్టు తప్పు పట్టింది. ఈ సుప్రీంకోర్టు జోక్యంతో ఆశిష్ మిశ్రా తో సహా కొందరి అరెస్టులు జరిగాయి గాని ఇప్పటికీ కేసు దర్యాప్తు, నిందితుల అరెస్టు, పకడ్బందీ సాక్ష్యాధారాల సేకరణ వంటి చర్యలన్నీ నత్తనడకలు నడుస్తున్నాయి.

ఈ దురంతానికి సంబంధించి అధికార, న్యాయవ్యవస్థల పనితీరు ఇలా ఉండగా, రాజకీయ రంగంలో భిన్న స్వరాలు వినిపిస్తున్నాయి. అధికారపక్షం ప్రధానంగా మౌనం వహించింది. లేదా పరోక్షంగా సమర్థించింది. కార్లు దూసుకుపోయిన తర్వాత రైతులు ప్రదర్శించిన ఆగ్రహాన్ని మాత్రమే తప్పు పట్టింది. ఇంత దుర్మార్గంగా జరిగిన ఘటనపై, దాని తర్వాతి పర్యవసానాలపై ప్రధానమంత్రి పెదవి విప్పలేదు. ఈ దుర్ఘటన జరిగిన తర్వాత రాష్ట్రాన్ని పర్యటించినప్పటికీ మరణాల పట్ల విచారం కూడ వ్యక్తం చేయలేదు. తన సహాయమంత్రి కొడుకు ఇంతటి నేరం జరిపితే, తండ్రికి కూడా ఈ కుట్రలో భాగం ఉందని బైటపడుతుంటే హోం మంత్రి నోరు తెరవలేదు. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం మృతుల కుటుంబాలకు నష్టపరిహారాన్ని ప్రకటించిందే గాని, ఘటనను ఖండించలేదు. అపరాధులను వెంటనే నిర్బంధించి కేసు నడుపుతామని అనలేదు. ఈ కేసు దర్యాప్తు ఇటువంటి మిగిలిన కేసుల దర్యాప్తు లాగ జరగడం లేదని స్వయంగా సుప్రీంకోర్టే వ్యాఖ్యానించింది. దేశవ్యాప్తమైన ఒత్తిడి, సుప్రీంకోర్టు అభిశంసనల తర్వాత మాత్రమే ఆశిష్ మిశ్రా మీద హత్యా నేరం, అజయ్ మిశ్రా మీద కుట్ర నేరం నమోదు చేసి, ఆశిష్ మిశ్రాను అరెస్టు చేశారు. ప్రజా ఆగ్రహం చల్లారిన తర్వాత కేసును ఎట్లా తప్పుదోవ పట్టించి, మాసిపూసి మారేడుకాయ చేస్తారో తెలియదు.

అసలు ఇప్పుడు ఈ కేసులో కుట్ర నేరం మాత్రమే కాదు, అజయ్ మిశ్రా ఎన్నో సంవత్సరాలుగా అనేక నేరాలతో సంబంధం ఉన్నవాడని ఇప్పుడు బైటపడుతున్నది. సరిగ్గా అటువంటి నేరచరిత్రే ఉన్న హోమ్ మంత్రి అమిత్ షా ఏరికోరి అజయ్ మిశ్రాను తన శాఖలో సహాయ మంత్రిగా నియమించుకున్నాడు. ఇప్పుడు నలుగురు రైతుల హత్య కేసులో కుట్ర ఆరోపణను ఎదుర్కొంటున్నప్పటికీ, కేంద్ర హోమ్ శాఖలో మంత్రిగా కొనసాగిస్తున్నాడు. ఈ దేశానికి, సమాజానికి,

ప్రగల్భాలు పలుకుతున్న ప్రజాస్వామ్యానికి, చట్టబద్ధ పాలనకు సిగ్గు ఉందా అని ప్రతి ఒక్కరూ ఆలోచించవలసిన సందర్భం ఇది.

మరొకవంక భారతీయ జనతా పార్టీకే చెందిన పార్లమెంటు సభ్యుడు వరుణ్ గాంధీ మాత్రం నిరసనకారులపైకి కార్లు దూసుకువెళు న్న దృశ్యం వీడియోను ప్రచారంలోకి పెట్టి ఆ సంఘటనను ఖండించాడు. న్యాయం జరగాలని డిమాండ్ చేశాడు.

పదినెలలుగా సాగుతున్న తమ ఆందోళనను చెదరగొట్టడానికి భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం చేసిన కుట్రలో భాగంగానే ఈ "తీవ్రవాద చర్య" జరిగిందని రైతు సంఘాలు ఆరోపించాయి. ఈ మారణకాండ సరిగ్గా వలస పాలనలో జరిగిన జలియన్ వాలా బాగ్ తో మాత్రమే పోల్చదగినదని రైతులు సంఘాలు అన్నాయి. రైతు సంఘాలు, రైతు సంఘాల సమాఖ్య అయిన సంయుక్త కిసాన్ మోర్చా దేశవ్యాప్తంగా నిరసనలకు పిలుపునిచ్చాయి. ఈ మారణకాండకు బాధ్యులైన తండ్రిని మంత్రివర్గం నుంచి తొలగించి, తండ్రీ కొడుకులను అరెస్టు చేయాలని డిమాండ్ చేశాయి.

కాంగ్రెస్ తో సహా రాష్ట్రంలోని, ఇతర రాష్ట్రాలలోని ప్రతిపక్ష రాజకీయ పార్టీలన్నీ కూడా ఈ మారణ కాండను ఖండించి, దేశవ్యాప్త నిరసన ప్రదర్శనల్లో భాగమయ్యాయి. ఉన్నతస్థాయి న్యాయవిచారణ జరిపించాలని, హోం శాఖ సహాయ మంత్రిని పదవి నుంచి తప్పించాలని, ప్రధాన నిందితుడిని అరెస్టు చేయాలని, బాధిత కుటుంబాలకు నష్టపరిహారం ఇవ్వాలని డిమాండ్ చేశాయి. ఇంతటి మారణకాండకు నిరసన తెల్పకుండా మౌనంగా ఉండి, రెండు తెలుగు రాష్ట్రాల అధికారపక్షాలు చరిత్ర సృష్టించాయి. అయితే మిగిలిన ప్రతిపక్షాల నిరసన కూడ తాత్కాలిక మొక్కుబడి ఆవేశంగానే తప్ప ఉండవలసినంత తీవ్రతతో, చిత్తశుద్ధితో, దీర్ఘకాలిక పట్టుదలతో లేదు. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం మాత్రం ఆ పాటి నిరసనను కూడా అనుమతించే రాజ్యాంగ బద్ధతను, నాగరికతను ప్రదర్శించలేదు. మృతుల కుటుంబాలను పరామర్శించడానికి వెళ్లిన కాంగ్రెస్ నాయకురాలు ప్రియాంకా గాంధీని, సమాజ్ వాది పార్టీ నాయకుడు అఖిలేష్ యాదవ్ ను ఉత్తరప్రదేశ్ పోలీసులు అరెస్టు చేశారు. మృతుల కుటుంబాలను కలవడానికి వెళ్లేవారిపై ఆంక్షలు విధించారు. పరామర్శకు వెళ్లిన ఛత్తీస్ గఢ్ ముఖ్యమంత్రి భూపేష్ భాగేల్ హెలికాప్టర్ దిగడానికి అనుమతించలేదు.

ఈ మొత్తం వ్యవహారంలో సుప్రీం కోర్టు కొంత అభినందనీయ వైఖరిని ప్రదర్శించింది. ఇద్దరు న్యాయవాదుల లేఖతో ఈ వ్యవహారంలో జోక్యం కలిగించుకోవడంతో పాటు ఇది రాస్తున్న సమయానికి జరిగిన మూడు వాయిదాలలోనూ ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాన్ని గట్టిగానే చీవాట్లు పెట్టింది. దర్యాప్తు సక్రమంగా జరగడం లేదని, మామూలుగా హత్య కేసుల దర్యాప్తులో తీసుకునే చర్యలు కూడ తీసుకోవడం లేదని, తాత్సారం చేస్తున్నారని, అడిగిన నివేదికలను సమయంలోపల, సమగ్రంగా ఇవ్వలేదని, 164 మంది సాక్షులలో 46 మందిని మాత్రమే విచారించడం ఏమిటని, దర్యాప్తును అంతులేని కథగా కొనసాగించగూడదని తీవ్రమైన వ్యాఖ్యలు చేసింది. అయితే ఈ వ్యాఖ్యల్లో కనబడిన స్ఫూర్తి చివరిదాకా ఉంటుందా, తీర్పులో వ్యక్తమవుతుందా అనే ప్రశ్నలకు కాలమే జవాబు చెపుతుంది.

ఇంతటి మారణకాండ పట్ల అధికార వ్యవస్థ, రాజకీయ వ్యవస్థ, న్యాయ వ్యవస్థల ప్రతిస్పందనలు అలా ఉండడం ఆశ్చర్యకరమేమీ కాదు. కాని పౌరసమాజపు నిర్లిప్తత, కొందరు మేధావుల స్పందనలలో కనిపించిన అమానుషత్వం మన సమాజం ఎంతగా, సంస్కరించడానికి వీలు లేనంతగా కుళ్లిపోయిందో, పుచ్చిపోయిందో చూపి భయం కలిగిస్తున్నాయి. ఒక కేంద్ర మంత్రి కొడుకు తెలిసితెలిసీ, తన ముందు రోడ్డు మీద నడుచుకుంటూ పోతున్న మనుషుల మీది నుంచి తన కారు నడిపించుకుపోయాడంటే మనుషుల ప్రాణాల పట్ల లెక్కలేనితనం, అధికార అహంకారం, నిష్పూచీతనం రాజకీయ నాయకులలో, వారి పిల్లల్లో ఎంత పెద్ద ఎత్తున వ్యాపించి ఉన్నాయో చూపుతున్నది. అటువంటి వైఖరి అధికార వర్గాలలో, వారి కుటుంబ సభ్యులలో, ఆశ్రితులలో ఇంత పెద్ద ఎత్తున వ్యక్తమవుతున్నప్పుడు సమాజం ఒక్కుమ్మడిగా లేచి నిలవలసింది, ప్రశ్నించవలసింది, నిలదీయవలసింది, ప్రతిఘటించవలసింది. కాని సామాజిక స్పందనలు రావలసినంతగా రాలేదు. సమాజం, ముఖ్యంగా బుద్ధిజీవులు, పౌరసమాజం, గొంతు ఉన్నవారు మౌనంగా, తమకేమీ పట్టనట్టుగా ఉండిపోయారు. ఎన్నో చిన్నా చితకా విషయాలకు, తమ సొంత ప్రయోజనాల కొరకు గగ్గోలు పెట్టే సమూహాలు, ఇంతటి అధికార మదోన్మత్త ఉద్దేశపూర్వక హత్యాకాండకు స్పందించకుండా ఉండిపోయారు. ఇది మన సామాజిక అనారోగ్యానికి, పక్షవాతానికి సూచిక. మన సమాజం లోలోపల కుళ్లి, చివికి పోయిందనడానికి సూచిక. ఈ సమాజానికి అత్యవసరంగా శస్త్రచికిత్స చేయవలసి ఉన్నదనే ప్రమాద సూచిక.

ఈ సామాజిక అనారోగ్యానికి మరొక నిదర్శనం, వ్యవస్థా సమర్థకులైన మేధావులు ఈ హింసాకాండలో సగం హింసను ఆమోదిస్తూ, మిగిలిన సగం మీద కఠినమైన చర్యలు తీసుకోవాలని ప్రభుత్వానికి సూచనలు ఇస్తూ ఉండడం. ఈ దేశంలో ప్రపంచీకరణ కార్యక్రమం సామ్రాజ్యవాదులు ఆశించినదానికన్న ఎక్కువ వేగంతో జరగాలని నిరంతరం రాస్తూ ఉండే అర్థశాస్త్రవేత్త, రాజును మించిన రాజభక్తుడు, స్వామినాథన్ అంక్లేసరియా అయ్యర్, ఈ హింసాకాండ మీద ఎకనమిక్ టైమ్స్ లో వ్యాసం రాస్తూ, ఆశిష్ మిశ్రా చేసినది ఉద్దేశపూర్వక హత్య కాదని, అది ఎక్కువలో ఎక్కువ నిర్లక్ష్యపు, వేగపు ప్రమాదం అని, కాని ఆ తర్వాత రైతులు ఆగ్రహంతో చేసిన పనులు, వాహనాల ధ్వంసం గాని, ఇద్దరు భాజపా కార్యకర్తలను, ఒక డ్రైవర్ ను చంపడం గాని ఉద్దేశపూర్వక హత్యలు అని వాదించాడు. అధికారిక హింసను ఖండిస్తున్న ఉదారవాద మేధావులను విమర్శించాడు. ఆశిష్ మిశ్రా చేసిన దురంతాన్ని మాటవరుసకు ఖండిస్తూనే, రైతు ఆందోళనకారులు చేసినది అంతకన్న పెద్ద నేరం అని, వారిని కఠినంగా శిక్షించాలని ప్రభుత్వానికి సలహా ఇచ్చాడు.

ఇంత ఉద్దేశపూర్వకంగా, దుర్మార్గంగా, నిష్పూచీగా మనుషుల ప్రాణాలు, అందులోనూ తమ న్యాయమైన హక్కుల కోసం శాంతియుతంగా నిరసన తెల్పడానికి వెళ్తున్న రైతుల ప్రాణాలు తీసిన నేరం ఒకానొక వ్యక్తిది మాత్రమే కాదు, అది ఒక వ్యవస్థది, ఒక భావజాలానిది, ఒక అధికార అహంకారానిది, జవాబుదారీతనం లేని హంతక ప్రవృత్తిది. ఆ వ్యక్తిని, అతనికి సహకరించినవారిని శిక్షించడంతో పాటు, ఆ వ్యవస్థను, ఆ భావజాలాన్ని, ఆ అధికార అహంకారాన్ని, ఆ హంతక ప్రవృత్తిని రద్దు చేసే విశాల కృషి మాత్రమే మన సమాజానికి భవిష్యత్తును వాగ్దానం చేస్తుంది. ఆ కృషిలో ప్రతి ఒక్కరూ భాగమై, దాన్ని మరింత బలోపేతం చేయకపోతే మన సమాజానికి భవిష్యత్తు లేదు.

ఈ సందర్భంలో ఇదే లఖింపూర్ ఖేరీ ఐదు దశాబ్దాల కింద ప్రదర్శించిన పోరాట స్ఫూర్తిని మననం చేసుకోవడం అవసరం. 1967

# నేర గణాంకాలు - నేర నియంత్రణ చర్యలు

*మహిళలపై జరుగుతున్న లైంగిక అత్యాచారాల మూలాలు వ్యవస్థీకృత అసమానతల్లో, ఆధిపత్యాలలో ఉన్నాయని వాటిని రద్దుచేస్తూ, సామాజిక చైతన్యాన్ని పెంపొందించాలని అంటున్నారు* **కె. సజయ**

'నేరాల గణాంకాలను మదింపు చేసి ప్రకటించడం, నేరాల నియంత్రణలో చట్టపరమైన అమలులో సంబంధిత అధికారులకు సహాయపడటానికి ఒక సాధనంగా ఉపయోగపడేలా చేయటం. నేరాలకు కారణమవుతున్న సామాజిక అంశాల మీద దృష్టి సారించి వాటి నియంత్రణకు అవసరమైన చర్యలను రూపొందించేలా సహాయపడటం. నేర నిరూపణలో, చట్టబద్ధమైన న్యాయాన్ని మెరుగుపరచడానికి సమర్ధవంతమైన కార్యక్రమాల అభివృద్ధి, అమలు ఎంతో ముఖ్యం". ప్రతీ సంవత్సరం విడుదల చేసే ఎన్‌సిఆర్‌బి (భారత హోం శాఖ ఆధ్వర్యంలో పనిచేస్తుంది) నివేదిక లక్ష్యాల గురించి తమ ముందుమాటలో ఆ శాఖ డైరెక్టర్ పై విధంగా ప్రకటించారు.

ఈ శాఖ పని దేశంలోని అన్ని పోలీసు స్టేషన్లలో నమోదయ్యే వివిధ రకాల నేరాల్ని, చట్టబద్ధ పరిష్కారం దిశగా న్యాయస్థానం వరకూ ఎన్ని వెళ్లాయి అనే లెక్కలను ప్రతీ సంవత్సరం క్రోడీకరించి వెల్లడించడం. ఈ వివరాలన్నీ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్రపాలిత ప్రాంతాలలోని సంబంధిత శాఖలు అందించినవాటి ప్రకారమే గణాంకాల గణన వుంటుంది. గత సంవత్సరాలతో పోల్చి నేరాల సంఖ్య పెరిగిందా లేదా అని కూడా వివరిస్తారు. ప్రతీ సంవత్సరం లానే 2020 నేర గణాంకాలను ఈ సంవత్సరం సెప్టెంబర్ లో విడుదల చేశారు. దేశం మొత్తం మీద అన్ని రకాల నేరాల సంఖ్య 12.5 శాతం పెరిగిందని ఈ గణాంకాలు తెలియజేస్తున్నాయి. అయితే, 2019 కంటే 2020లో స్త్రీల మీద జరిగిన నేరాలు కొంత తగ్గినట్లుగా గణాంకాలు చూపిస్తున్నాయి. దీనికి ఏ కారణాలు దోహదం చేసివుంటాయనే విశ్లేషణ మాత్రం లేదు. బహుశా కోవిడ్ లాక్ డౌన్ వల్ల నేరాల నమోదు కొన్నిచోట్ల జరిగి వుండకపోవచ్చనేది ఒక ఊహ. క్షేత్రస్థాయిలో పరిశోధన చేయవలసిన అంశం. 2020లో కోవిడ్ లాక్ డౌన్ సమయంలో దేశం మొత్తం మీద 3,71,503 నేరాలు స్త్రీల మీద జరిగాయి. 2019 లో ఈ సంఖ్య 4,05,326 (62.3 శాతం). 2020 లో ప్రతి లక్ష మంది స్త్రీల జనాభాకు 56.5 రేటు నమోదైంది. ఇవి ఇండియన్ పీనల్ కోడ్ (ఐపిసి) కింద నమోదయినవి. అత్యధిక కేసులు భర్త/అతని బంధువులు' చేసిన కుటుంబ హింస 'క్రూరత్వం' కేసులు (30.0 శాతం), అవమానించాలనే ఉద్దేశ్యంతో స్త్రీలపై చేసిన దాడి (23.0 శాతం), స్త్రీలను అపహరించడం' (16.8 శాతం), అత్యాచారం (రేప్) (7.5 శాతం)గా నమోదు అయ్యాయి. ఇవి నిజంగా తగ్గాయా లేక నమోదులోనే వాటిని వేరే రకంగా చూపిస్తున్నారా అనేది వాటి మీద కూలంకషంగా పరిశోధన చేస్తే గానీ అర్థం కాదు. నేరాల సంఖ్య పెరిగితే ఏఏ కారణాల వల్ల పెరిగాయనేది ఎంత ముఖ్యమో, నేరాల సంఖ్య తగ్గినప్పుడు ఏ విధానాల అమలు, నేర నియంత్రణకు తీసుకున్న కార్యాచరణ ప్రణాళిక కూడా అత్యంత ముఖ్యమైనది. అలా కాకుండా, కేవలం నేరాల సంఖ్యను వాస్తవంలో కాకుండా గణాంకాలలో మాత్రమే తగ్గించి చూపించే విధానాల వల్ల ఉపయోగం లేకపోగా మరింత ప్రమాదకర పరిస్థితులు తలెత్తే అవకాశం వుంటుంది. వీటిల్లో ఉత్తరప్రదేశ్ 49,385 కేసులతో మొదటి స్థానాన్ని ఆక్రమించింది. తర్వాత వెస్ట్‌బెంగాల్ 36, 439; రాజస్థాన్ 34, 535; మహారాష్ట్ర 31,954; మధ్యప్రదేశ్ 25,640 కేసులతో వరుస స్థానాన్ని ఆక్రమించాయి.

ఇక దక్షిణ భారతదేశం పరిస్థితి చూస్తే స్త్రీల మీద జరిగిన నేరాల్లో తెలంగాణ రాష్ట్రం 17,791లతో మొదటి స్థానంలో, తర్వాత ఆంధ్రప్రదేశ్ 17,089; కర్ణాటక 12,680; కేరళ 10,139; తమిళనాడు 6,630 కేసులతో వున్నాయి. షెడ్యూల్డ్ కులాలు (ఎస్‌సి) మీద జరిగిన నేరాల సంఖ్య గత సంవత్సరాలలో పోలిస్తే పెరిగింది. 2018లో 1507; 2019లో 1690, 2020లో 1959 కేసులు నమోదు అయ్యాయి. షెడ్యూల్డ్ తరగతుల మీద కూడా నేరాల సంఖ్య పెరిగినట్లు కనపడుతోంది. ఇవి 2018లో 419; 2019లో 530, 2020లో 573 కేసులు నమోదు అయ్యాయి.

ఇవి మామూలుగా చూస్తే కేవలం కొన్ని సంఖ్యలుగానే కనిపించవచ్చు. అన్ని సంఖ్యలూ, సంఘటనలూ మీడియా ప్రాధాన్యతలకి నోచుకోవు. బాధితులు పోలీస్ స్టేషన్ వరకూ అయితే వెళ్ళగలుగుతున్నారు కానీ ఆ తర్వాత వాటిని న్యాయస్థానాల వరకూ చట్టబద్ధమైన ప్రక్రియల వరకి తీసుకెళ్లలేకపోతున్నారు. ఆయా సంఘటనలకి మీడియా, సమాజం ఇచ్చే ప్రాధాన్యతలను బట్టి వ్యవస్థల పనితీరు కూడా ప్రభావితమవటం మనకి కనిపించే వాస్తవం.

ఉదాహరణకి హైదరాబాద్ నగరంలో జరిగిన 'దిశ' సంఘటన.

---

మేలో నక్సల్బరీ ప్రజ్వలనం ప్రారంభం కాగానే ప్రతిస్పందించిన తొలి ప్రాంతాల్లో ఒకటి లఖింపూర్ ఖేరీ. ఆ రోజుల్లో నక్సల్బరీ, శ్రీకాకుళాలతో పాటు, బీర్భూం, గోపీ వల్లభపూర్‌ల సరసన లఖిపూర్ ఖేరీ పేరు కూడ వినిపించేది. నక్సల్బరీ ప్రేరణతో ఈ ప్రాంత రైతు కూలీలు 1968 జనవరి-ఫిబ్రవరిల్లోనే పెద్ద ఎత్తున పంటల స్వాధీనం, భూఆక్రమణ పోరాటాలు ప్రారంభించారు. ఆ పోరాటాల మీద భూస్వాములు, పోలీసులు చేసిన దాడులను ప్రతిఘటిస్తూ, మే-జూన్ వరకూ కూడ హోరాహోరీ ఘర్షణలు సాగాయి. భయంకరమైన నిర్బంధం వల్ల 1969 ఏప్రిల్ నాటికి ఈ ప్రాంతంలో రైతాంగ పోరాటాలు వెనుకంజ వేశాయి. ఆనాడు మిగిలిపోయిన బూడిదకుప్పల్లో నిప్పురవ్వ మిగిలే ఉందని, సమయం వచ్చినప్పుడు అది రగుల్కొంటుందని యాభై సంవత్సరాల తర్వాత పరిణామాలు రుజువు చేస్తున్నాయి.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

కూతురు ప్రమాదంలో వుందని పోలీస్ స్టేషన్‌కి పరిగెత్తిన తల్లికి పోలీస్ స్టేషన్‌లో 'ఎక్కడికో లేచిపోయివుంటుంది' అనే అవమానకరమైన శల్య పరీక్ష ఎదురవ్వటమే కాక, తమ స్టేషన్ పరిధిలోకి రాదంటూ చేసిన ఆలస్యం వల్ల ఆమె నిర్జీవంగా మారటమే కాదు, ఆనవాళ్లు కూడా లేకుండా కాలిపోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. పోలీసు వ్యవస్థ వైఫల్యం, ప్రభుత్వాధినేతల తొందరపాటు మాటలు, మీడియా ప్రచారం ప్రజల్లో ప్రభుత్వం మీద పెద్ద ఎత్తునే ఆగ్రహాన్ని రేకెత్తించాయి. పరిస్థితికి తమకు వ్యతిరేకంగా మారుతుందని అనిపించిన వెంటనే అనుమానితులుగా పేర్కొనబడిన నలుగురు యువకులు, పోలీసులు ఎప్పుడూ చెప్పే 'ఆత్మరక్షణ' అనే అవు వ్యాసం పేరుతో 'ఎన్కౌంటర్' అయ్యారు. ఇప్పుడు ఆ 'ఆత్మ రక్షణ' కథనాన్ని నిరూపించుకోలేక సుప్రీమ్ కోర్ట్ నియమించిన ఎంక్వయిరీ కమిటీ ముందు పొంతన లేని సమాధానాలు ఇచ్చుకుంటూ తల్లకిందులవుతున్నారు. (ఈ కమిషన్ ఎంక్వయిరీ గురించి మరోసారి చర్చించుకుందాం.)

మరో సంఘటన, హైదరాబాద్ కి కూతవేటు దూరంలో బొమ్మలరామారం అనే గ్రామంలో బడికి పక్కవూరు వెళ్ళిన పదమూడేళ్ల కూతురు సమయానికి ఇంటికి రాకపోతే భయపడి పోలీసు స్టేషన్ ఫిర్యాదు చేయటానికి వెళ్లిన తల్లిదండ్రుల భయానికి సరైన ప్రాధాన్యం ఇవ్వకపోవటం వల్ల మరికొన్ని పసి ప్రాణాలు బలైపోయాయి. నిన్న కాక మొన్న సైదాబాద్ సింగరేణి కాలనీలో ఆరేళ్ల చిన్నారి విషయంలోనూ ఈ రకమైన తాత్సారమే పాపని విగతజీవిగా మార్చింది. సమయానికి తల్లిదండ్రులు చెబుతున్న దానిని పట్టించుకుంటే పాప బతికివుండే అవకాశం ఉండేదని ఎవరికైనా అర్థమవుతుంది. ఈ మూడు విషయాల్లోనూ సరైన సమయానికి స్పందించని పోలీసు వ్యవస్థ కనిపిస్తుంది. 'దిశ' సంఘటనలో కానీ, సింగరేణి కాలని పాప విషయంలో గానీ తమ వైఫల్యాన్ని కప్పిపుచ్చుకోవటం కోసం నిందితులను ఎన్కౌంటర్ పేరుతో, ఆత్మహత్య పేరుతో చనిపోయేలా చేసి ప్రజల ఆగ్రహాన్ని చల్లార్చాలని, ఆ కేసుల్ని మూసి వేయాలని అనుకున్నారు.

ఇప్పుడు మళ్లీ ఈ నేర గణాంకాల దగ్గరికి వద్దాం. ఇందులో అనేక రూపాల్లో స్త్రీలు, ఆడపిల్లల మీద జరిగే వివిధ హింసా నేరాలు వున్నాయి. కుటుంబ హింస, అత్యాచారాలు, కిడ్నాప్‌లు, మానవ అక్రమ రవాణా, ఆసిడ్ దాడులు ఇంకా అనేకం కనిపిస్తాయి. అత్యాచారం అనే అంశం తీసుకుంటే వీటికి పాల్పడుతున్నది ప్రధానంగా తెలిసినవారే అన్నది అనేక సంవత్సరాలుగా ఈ గణాంకాలలో తేలుతున్న అంశం. వీటికి దోహదం చేస్తున్న, దారితీస్తున్న సామాజిక అంశాలు అన్నిటి పట్ల అప్రమత్తతతో వుండాల్సిందే, వాటిని నిరోధించే వైపుగా చర్యలు చేపట్టాల్సిందే. ఎన్‌సిఆర్‌బి శాఖ డైరెక్టర్ వివరించినట్లు ఈ గణాంకాల ప్రయోజనం నేర సమస్యల తీవ్రతను అర్థం చేసుకుని భవిష్యత్తులో ఆయా నేరాల నియంత్రణకు దారి తీయాలి. అంతే కాకుండా నేరాలకు మూల కారణాలైన సామాజిక అంశాల మీద దృష్టి సారించి వాటి నియంత్రణకు అవసరమైన విధాన చర్యలను రూపొందేలా చేయటం ప్రభుత్వాల బాధ్యత. నేర నిరూపణలో వేగవంతమైన నిష్పక్షపాతమైన విచారణ, నేరస్తులను చట్టం ముందు నిలబెట్టి సత్వర, చట్టబద్ధమైన న్యాయాన్ని అందించడానికి వ్యవస్థ లని ఆధునికీకరించుకోవాలి. స్త్రీల మీద హింస నిత్య సత్యమవుతున్నవేళ దానికి మూలాలు సామాజిక అసమానతల్లో, ఆధిపత్యంలో ఉన్నాయనే అవగాహనను వివిధ రూపాల్లో కల్పించవలసిన బాధ్యత ప్రధానంగా ప్రభుత్వాలదే.

జెండర్ సమానత్వాన్ని పెంపొందించే కార్యక్రమాల అభివృద్ధి, సమర్థవంతమైన అమలు నేర నియంత్రణలో ముఖ్య భాగస్వామ్యం వహిస్తాయి. జెండర్ సమానత్వం రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కుల్లో ముఖ్యమైనది. అయితే ఇవన్నీ జరుగుతున్నాయా? లేకపోతే కేవలం ఎన్నికల నినాదాలుగానే మిగిలిపోతున్నాయా? తెలంగాణ రాష్ట్రంలో స్త్రీల మీద జరిగే నేరాల సంఖ్య పెరగటానికి దారితీస్తున్న అంశాలేమిటి? వాటి నియంత్రణకి ప్రభుత్వం తీసుకుంటున్న విధానాలేమిటి? ఈ క్రమంలో ఎదురవుతున్న సమస్యలేమిటి? షీ టీములు, భరోసా, సఖి సెంటర్ల నిర్వహణలో మెరుగు పడవలసిన అంశాలేమిటి? కోర్టుల్లో జరుగుతున్న జాప్యానికి తీసుకోవాల్సిన చర్యలేమిటి? ఇవి కదా ఆలోచించవలసిన, డిమాండ్ చేయవలసిన అంశాలు.

వీటన్నిటి గురించి క్షేత్రస్థాయిలో పనిచేస్తున్న స్త్రీల సంఘాలతో మాట్లాడితే వివిధ సమస్యలను పరిష్కరించటంలో అనేక సూచనలు అందించగలుగుతారు. కానీ, ఈ ప్రభుత్వానికి నోరే తప్పించి కళ్ళు, చెవులు లేవనేది పదే పదే స్పష్టమవుతోంది. పోరగా పోరగా హైకోర్ట్ అక్షింతలతో మహిళా కమిషన్‌ని రాష్ట్రం ఏర్పడిన ఆరేళ్ల తర్వాత పునరుద్ధరించారు. మహిళా కమిషన్ కాబినెట్ అధికారాలతో స్వతంత్రంగా పనిచేయాల్సిన వ్యవస్థ. పూర్తి సమయాన్ని కేటాయించగలిగిన వ్యక్తులకే వాటి నిర్వహణా భారాన్ని అప్పజెప్పాలి. అయితే, ఇప్పటికే శాసన సభ్యులుగా ఉన్నవాళ్ళకి అదనపు బాధ్యతగా ఈ పనిని అప్పగిస్తే ఆ పని విధానం కూడా అంతే స్థాయిలో వాడి దుడుకులతో నడుస్తుంది. సమస్యల్ని చెప్పుకోవటానికి వచ్చే బాధితులతో మాట్లాడటానికి, వాటిని రికార్డు చేయటానికి తగినంత నైపుణ్యం గల సిబ్బంది లేరు. ఎంతో దూరాల నుంచీ తమ సమస్యలను వివరించుకుందామని వస్తున్న బాధితులు తమ గోడు వినిపించుకునే వ్యక్తులు అందుబాటులో లేక నిరాశతోనే వెనుదిరుగుతున్నారు. ప్రస్తుతం జరుగుతున్నది ఇదే.

చివరగా, నేర నియంత్రణలో ముఖ్యంగా స్త్రీల మీద జరిగే హింస, అణిచివేతలను నిరోధించగలిగేది సామాజిక చైతన్యమే. మహిళ కమిషన్ లాంటి వ్యవస్థల పనిలో ఈ అవగాహనా కార్యక్రమాలు ప్రధాన భాగం. పాఠశాల నుంచీ ఉన్నత విద్యాలయాల వరకూ కూడా జెండర్ సమానత్వం గురించి క్రమపద్ధతిలో అవగాహన కల్పించేలా కార్యక్రమాల రూపకల్పన జరగాలి. ఇదంతా ఒక్కరోజులో జరిగే పనికాదు. అమలు చేయటానికి రాజకీయ చిత్తశుద్ధి వుండాలి. ప్రభుత్వ వ్యవస్థల మధ్య అనుసంధానం వుండాలి. అలానే నేరనిరూపణలో ప్రధాన భాగస్వామ్యం వహించే పోలీసులకు కింది స్థాయి నుంచి పై స్థాయి వరకూ కూడా తప్పనిసరిగా జెండర్ సెన్సిటైజేషన్ కార్యక్రమాలు నిరంతరం నిర్వహించేలా ప్రణాళిక ఏర్పరచాలి. జెండర్ అంశాలను ముఖ్యమైన రాజకీయపరమైన అంశాలుగా, స్త్రీల ప్రాతినిధ్యాన్ని మొక్కుబడిగా కాకుండా సమాజ పురోభివృద్ధిలో తప్పనిసరైన అంశంగా గుర్తించినప్పుడు మాత్రమే నేరాల నియంత్రణ వైపు అడుగులు వేయగలుగుతారు. 'తక్షణన్యాయం' పేరుతో జరిగేది ఏదీ కూడా వ్యవస్థీకృత నేరాలను ఆపకపోగా సమాజాన్ని మరింత హింసాత్మకం వైపుగా నడిపిస్తుంది.

*(రచయిత్రి సామాజిక పరిశోధకులు, స్వతంత్ర జర్నలిస్ట్)* వీ

# ప్రకంపనలు సృష్టిస్తున్న పాండోరా పత్రాలు

*అవినీతి అక్రమార్జనలు పెరుగుతున్న నేపథ్యంలో ప్రపంచ వ్యాప్తంగా పన్ను ఎగవేతదార్ల వివరాలను బయటపెట్టిన పాండోరా పత్రాల గురించి వివరిస్తున్నారు* **డా. ఎ. పున్నయ్య**

విశ్వవ్యాప్త అవినీతి సామ్రాజ్యం గత కొన్ని దశాబ్దాలుగా క్రమంగా విస్తరిస్తుంది. దీర్ఘకాల అధికార దాహానికి తెగబడిన ఆయా దేశాల ప్రభుత్వాలు, కార్పొరేట్ల అనుకూల చట్టాల సృష్టికి ఏమాత్రం వెనుకాడడం లేదు. అవినీతికి పాల్పడుతూ దుష్ట పాలనను కొనసాగించడం వల్ల ప్రపంచ వ్యాప్తంగా ఆర్థికవ్యవస్థ బలహీనపడి తీవ్ర అసమానతలకు దారితీస్తుంది. ఈ నేపథ్యంలో ప్రపంచ వ్యాప్తంగా పన్నులపై కఠిన నిబంధనలు లేని లేదా తక్కువ పన్నులున్న దేశాల్లోకి అక్రమ పెట్టుబడులను మళ్లించిన దేశాధినేతలు, వాణిజ్య వేత్తలు, వివిధ రంగాల సెలబ్రిటీలు, డ్రగ్ డీలర్లు వివిధ కంపెనీలు, ట్రస్టులు ద్వారా అవినీతి ఆస్తులు కూడబెట్టుకోవడం, మనీలాండరింగ్‌కు పాల్పడటం సంవత్సరాలుగా జరుగుతుంది. అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్) అధికారిక లెక్కల ప్రకారమే ప్రతియేటా ప్రపంచ వ్యాప్తంగా సంపన్నులు పన్ను ఎగ్గొట్టటం ద్వారా 2 ట్రిలియన్ డాలర్ల డబ్బును ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కోల్పోతుందని ప్రకటించింది. ప్రకటించిన గణాంకాల ఆధారంగా ప్రపంచ జిడిపిలో ఇది రెండు శాతమే అయివుండొచ్చు. నిజానికి అప్రకటిత అవినీతి సుమారుగా 10 శాతానికి పైనే ఉంటుందని పలు అంతర్జాతీయ ఆర్థిక విశ్లేషణ సంస్థలు అభిప్రాయపడుతున్నాయి. ఆర్థిక పారదర్శకతను పెంచి ప్రపంచంలోని అవినీతిని అంతం చేయడం కోసం ఐక్యరాజ్యసమితి, ప్రతి ఏటా డిసెంబర్ 9న అంతర్జాతీయ అవినీతి నిరోధక దినోత్సవాన్ని జరుపుతునే ఉంది. ఇటీవల ఫ్రెంచ్ ఆర్థికవేత్త థామస్ పికెటీ, బ్రిటిష్ అమెరికన్ ఆర్థికవేత్త ఆంగస్ స్టెవార్ట్ డీటన్ వంటి ఆర్థిక వేత్తలు ప్రపంచ ఆర్థిక వ్యవస్థలపై అవినీతి, నల్లధన కేంద్రాలు చూపిస్తున్న ప్రభావం గురించి ఆందోళన వ్యక్తం చేశారు.

సంపదను పెంచుకున్నవాళ్లే పన్నులు ఎగ్గొట్టుటకు ఇతర దేశాల్లో పెట్టుబడులు పెడుతున్నారు. అక్రమార్జన చేసేవాడు అక్రమంగా దాచుకునేవాడు ఒక్కడేనని నివేదికలు పరిశీలిస్తే వెల్లడవుతోంది. ఆక్స్‌ఫామ్, హురున్, ఫోర్బ్స్ నివేదికలు బయటకు పొక్కిన తర్వాత ఎన్నో దేశాల ప్రభుత్వాలు కంపించాయి. అనేక దేశాల్లో దేశాధ్యక్షులు, ప్రధాన మంత్రుల, మంత్రుల, అధికారుల, వ్యాపారుల, సినిమా ప్రముఖుల లావాదేవీలపై విచారణ జరిగింది. ఐస్ లాండ్ ప్రధానమంత్రి, స్పెయిన్ పరిశ్రమల మంత్రి రాజీనామా చేశారు. న్యూజిలాండ్ పార్లమెంట్‌లో పనామా పత్రాలపై వాడి వేడి చర్చలు జరిగినప్పుడు స్పీకర్ ఆదేశాలను పాటించనందుకు ప్రధానమంత్రినే బయటకు పంపారు. మాజీ బ్రిటిష్ ప్రధానమంత్రి డెవిడ్ కెమరాన్ తన ఆర్థిక వనరుల మూలాల గురించి వెల్లడించి తన పార్టీ పదవిని వదులుకోక తప్పలేదు. పాకిస్థాన్‌లో సుదీర్ఘకాలం ప్రధానమంత్రిగా ఉన్న నవాజ్ షరీఫ్ పై, పదేళ్ల పాటు ఎలాంటి పదవీ స్వీకరించకుండా ఆదేశ సుప్రీంకోర్టు 2017లో నిషేధం విధించింది. ఆ తర్వాత ఆయన ప్రభుత్వం పడిపోయింది.

**ప్రభుత్వ-అవినీతి ప్రోత్సహక విధానాలు:**

గడిచిన మూడు దశాబ్దాలుగా ప్రభుత్వం ఆర్థిక సంస్కరణల పేరుతో ప్రజా వ్యతిరేక కార్పొరేట్ దోపిడీ శక్తుల అనుకూల సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మార్కెట్ విధానాల విస్తరణ కొరకు, అన్నిరంగాల్లో అనేక చట్ట సవరణలు, కొత్త చట్టాల రూపకల్పన చేసింది. వీటి ప్రధాన లక్ష్యం, శ్రామికులచే సృష్టించబడిన సంపదంతా కుబేరులకు, బిలియనీర్లకు, బలమైన కార్పొరేట్ శక్తులకు బదిలీ చేయడమేనని ఫోర్బ్స్ (అత్యంత ఐశ్వర్య వంతుల) జాబితా, (ఐఐఎఫ్) ఎల్వెల్త్ హురున్ ఇండియా రిచ్ లిస్టు స్పష్టం చేశాయి. ప్రభుత్వం కొద్దిమంది ఆశ్రితుల చేతిలో సంపద కేంద్రీకరింప చేయడానికి అటు ప్రత్యక్ష ఇటు పరోక్ష విధానాలను అవలంబిస్తుంది. అందుకోసం సరళీకరించబడిన పారిశ్రామిక విధానాలు, పన్ను రాయితీలు, ప్రోత్సాహకాలు, పన్ను మినహాయింపులను అందిస్తుంది. ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణకు వెనుకాడటంలేదు. దీనికి తోడు కార్పొరేట్ శక్తులకు సులువుగా పరపతి అందటం కోసం విత్తరంగ సంస్కరణలు, కార్పొరేట్ శక్తులు బకాయిపడిన లక్షల కోట్ల రూపాయల బ్యాంకు రుణమాఫీ మొదలైన అనేకానేక చర్యలకు పాల్పడుతుంది. దీని వల్ల మన పారిశ్రామిక రంగం, సేవలు, మౌలిక వసతులతో కూడిన తృతీయ రంగం మీద శక్తివంతమైన కార్పొరేట్ల ఆధిపత్యం బలపడింది. ఫలితంగా అసమానతలు పెరిగి మెజారిటీ ప్రజలు దుర్భర దారిద్ర్య పరిస్థితుల్లోకి నెట్టబడ్డారు. స్థూలంగా ఈ ప్రక్రియ కార్పొరేట్ ద్రవ్య పెట్టుబడిదారీ విషకలయికగా ఆర్థికవేత్తలు హేతుబద్ధంగా విశ్లేషించినారు. ప్రపంచ వ్యాప్తంగా ఆయాదేశాల ప్రభుత్వ విధానాలతో పాటు భారతదేశ పాలనా విదానాలన్నీ కాకులను కొట్టి గద్దలకు వేసినట్టు సామాన్య ప్రజల కడుపుకొట్టి ఆశ్రితుల సంపదలు పెంచడం కోసమేనని ఫోర్బ్స్, హురున్ నివేదికల వివరాలు రుజువు చేశాయి.

**భారత రాజకీయాలకు అవినీతే అర్హత:**

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల నుంచి భారత దళారీ బడా బూర్జువా, బడా భూస్వామ్య పాలక వర్గాలకు అధికార మార్పిడి జరిగి ఏడున్నర దశాబ్దాలు కావస్తోంది. నాటినుండి పాలకులు అవలంబిస్తున్న సామ్రాజ్యవాద అనుకూల, అవినీతి, అప్రజాస్వామిక, ప్రజావ్యతిరేక విధానాలు, ఫాసిస్టు అణచివేత ధోరణులే నేటికీ కొనసాగుతున్నాయి. ఫలితంగా పాలకులు ప్రామాణికంగా భావించే రాజ్యాంగంలోని ఉపోద్ఘాతం, ఆదేశిక సూత్రాలు, ప్రాథమిక హక్కులు కనీసంగా

అమల్లోకి రాలేదు. ఇప్పటికి సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సమానత్వం, స్వేచ్ఛ అందని ద్రాక్షగానే మిగిలాయి. దీనితో అన్ని రంగాలలో అసమానతలు, వివక్షలు కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి. నేడు భారతదేశంలో అధికారానికి అవినీతి అనేది అర్హతగా మారింది. ఇప్పుడు అవినీతి గురించి మాట్లాడడమంత హాస్యాస్పద వ్యవహారం మరొకటి లేదు. రాజ్యాంగ సంస్థలు అన్నీ నిర్వీర్యంగా ప్రభుత్వ జేబు సంస్థలుగా మారి వాటి స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయిన క్రమంలో అధికారంలో ఉన్న ప్రభుత్వాలు ఆరోపణలకు తగిన, నామమాత్రపు శిక్షలకైనా పూనుకోకపోవడంతో ప్రజల్లో అవినీతిపట్ల నిర్లిప్తత నెలకొంది.

**ఆసియా – పసిఫిక్ ప్రాంతంలో అవినీతి దేశం భారత్:**

భారతదేశం ప్రపంచ దేశాలతో పోటీపడి ఆర్థికాభివృద్ధిలో ముందడుగు వేయలేకపోయినా అవినీతి వృద్ధిలో ముందడుగు వేసింది. ఇటీవల బెర్లిన్ కేంద్రంగా పనిచేస్తున్న ఒక ఎన్జీఓ చేసిన అధ్యయనంలో భారత్ ప్రపంచం ముందు సిగ్గుపడేలా "ఆసియా – పసిఫిక్" ప్రాంతంలో అత్యంత అవినీతి దేశంగా తేల్చింది. అవినీతికి వ్యతిరేకంగా పనిచేస్తున్న "ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్" అనే మరో ఎన్జీఓ ఇటీవల జరిపిన అధ్యయనం ప్రకారం భారతదేశంలో 10 మందిలో ఏడుగురు ప్రజా సేవలను పొందడానికి ప్రభుత్వ ఆఫీసుల్లో లంచం చెల్లించాల్సి వస్తోందని పేర్కొంది. అవినీతి, నల్లధనం వంటి భూతాలను అరికట్టడానికి అనేక సంవత్సరాలుగా వివిధ రాజకీయ పార్టీలు, సామాజిక ఉద్యమకారులు పోరాడుతున్నా అవి క్షేత్ర స్థాయిలో ఆశించిన ఫలితాలను ఇవ్వడం లేదు. ఇక 2014లో మోదీ తొలి కేబినెట్ సమావేశంలో తీసుకున్న నిర్ణయం ఆధారంగా విదేశాల్లో నల్లధనంపై సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ ఎంబి షా నేతృత్వంలో నియమించిన కమిటీ కూడా ఏడు నివేదికలు సమర్పించింది. ఈ నివేదికల ఆధారంగా కూడా ఎవరిపైనా చర్యలు తీసుకున్న దాఖలాలు కూడా లేవు. ఇటీవల భారతదేశాన్ని అవినీతి రహితంగా మార్చాలనే నినాదంతో కేంద్ర ప్రభుత్వం తీసుకున్న "వస్తు సేవల పన్ను" మరియు "డీమోనిటైజేషన్" తో సహా వివిధ కార్యక్రమాలతో క్షేత్ర స్థాయిలో ఎలాంటి ప్రయోజనం చేకూరకపోగా ఆశ్చర్యంగా నల్లధనం మాత్రం చట్టబద్ధమైంది.

**పెరిగిన ఆర్థిక అసమానతలు:**

ప్రభుత్వ గణాంకాల ఆధారంగా భారతదేశంలోని 10 శాతం సంపన్న కుటుంబాల చేతిలో దేశ భౌతిక, ద్రవ్య ఆస్తులు 74 శాతం పైగా ఉన్నాయి. రూపాయల లెక్కల్లో చూస్తే పట్టణ ప్రాంతాల్లో నివసిస్తున్న ప్రజల మొత్తం ఆస్తి విలువ రు.274.6 లక్షల కోట్లు. అందులో 10 శాతం అతి సంపన్నుల వాటా రు.139.6 లక్షల కోట్లు. కాగా గ్రామీణ భారత్‌లో ఆస్తుల మొత్తం విలువ రు.238.1 లక్షల కోట్లు. అందులో ఆ 10 శాతం వాటా రు. 132.5 లక్షల కోట్లు. ఇక దిగువ 50 శాతం సంగతి చూస్తే వారి చేతిలోని ఆస్తుల విలువ గ్రామీణ ప్రాంతంలోని ఆస్తుల్లో 10.2 శాతం, పట్టణ ప్రాంత ఆస్తుల్లో 6.2 శాతం, 130 కోట్ల దేశ జనాభాలో 10 శాతం అంటే 13 కోట్ల మంది 70 శాతం పైగా ఆస్తులు కలిగి ఉన్నారు. 75 సంవత్సరాల స్వదేశీ పాలన తదుపరి ఇదీ పరిస్థితి. పేదరిక నిర్మూలనకు అనేక కార్యక్రమాలను అమలు జరిపినప్పటికీ లక్ష్యం కనీసంగానైనా నెరవేరలేదనేది ప్రభుత్వ గణంకాలే బహిర్గతం చేస్తున్నాయి. ఇవి అధికార బదిలీ జరిగిన నాటినుండి పాలక వర్గాలు అనుసరిస్తున్న పెట్టుబడిదారీ విధాన దుష్ఫలితమేనని రుజువైంది.

**ఆర్థిక కుంభకోణాలను బయటపెట్టిన రహస్యపత్రాలు:**

గతంలో ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక నేరాలు జరిగిన వివిధ దేశాల బండారాన్ని ఫిన్సెన్ ఫైల్స్, ప్యారడైజ్ పేపర్స్, పనామా పేపర్స్, లక్సీక్స్ వంటి పేర్లతో అనేక రహస్యపత్రాలు వేలకోట్ల రూపాయల కుంభకోణాలను బహిర్గతం చేసాయి. ఇటీవలనే పనామా పేపర్స్ పేరిట బయటపడిన పత్రాల్లో పనామా కేంద్ర కార్యాలయంగా ఉన్న మొస్సాక్ ఫోన్సెకా అనే లా కంపెనీ కార్యకలాపాలు అంతర్జాతీయ స్థాయిలో సంచలనం సృష్టించాయి. ఈ కంపెనీ సాయంతో ప్రపంచంలోని సంపన్నులు, అధికారంలో ఉన్న దేశాధినేతలు, మాజీ దేశాధి నేతలు తాము కొల్లగొట్టిన డబ్బును ఏ విధంగా విదేశీ ఖాతాల్లో జమ చేసుకున్నారో ఈ పత్రాలు బయటపెట్టాయి. ఒక జర్మన్ వార్తాపత్రికతో కలిసి అంతర్జాతీయ పరిశోధక జర్నలిస్టుల కన్సార్టియమ్ చేసిన పరిశోధన దాదాపు కోటి పన్నెండు డాక్యుమెంట్లను, 2 లక్షల 14వేల కంపెనీల బండారాన్ని వెల్లడించాయి. దీనివల్ల ప్రపంచ వ్యాప్తంగా పన్ను ఎగవేత గురించి మాత్రమే కాదు, ప్రపంచంలో సంపన్నులకూ, పేదలకు మధ్య ఆర్థిక వ్యత్యాసాలు ఏ విధంగా పెరిగిపోయాయో ఈ పత్రాలు తెలియజేశాయి.

**భారత దేశంలో పెరిగిన కుబేరుల జాబితా:**

ఈ నేపథ్యంలో ఓవైపు కరోనాతో ప్రపంచమంతా విలవిల్లాడుతుంటే భారతదేశంలో కుబేరులు మాత్రం భారీగా సంపద పోగేసుకున్నట్లు ఈ తాజా రిచ్ లిస్ట్ స్పష్టం చేస్తోంది. భారతదేశంలో 119 నగరాల్లో 1,000 కోట్ల రూపాయల నికర విలువ కలిగిన 1,000 మంది వ్యక్తులను కలిగి ఉన్న మైలు రాయిని సాధించిందని వెల్త్ హురున్ ఇండియా రిచ్ లిస్ట్ 2021 ని విడుదల చేసింది. వీరి సంచిత సంపద 51 శాతం పెరిగిందని, సగటు సంపద 25 శాతం పెరిగిందని నివేదిక పేర్కొంది. అంతేకాకుండా, 894 మంది వ్యక్తులు తమ సంపద పెరుగుదలను చూపారని లేదా అదే విధంగా ఉండాలని చూపించారు. ఇందులో 229 మంది కొత్త ముఖాలుకాగా, 113 మంది సంపద పడిపోయింది, 51 మంది డ్రాపౌట్లు ఉన్నారు. ప్రస్తుతం, భారతదేశంలో 237 మంది బిలియనీర్లు ఉన్నారు, గత సంవత్సరంతో పోలిస్తే 58 మంది పెరిగారు."కెమికల్స్ 'మరియు' సాఫ్ట్వేర్ 'సెక్టార్లు అత్యధిక సంఖ్యలో కొత్త ఎంట్రీలను జాబితాలో చేర్చినప్పటికీ, ఫార్మా ఇప్పటికీ నంబర్ వన్ స్థానంలో ఉంది మరియు ఈ జాబితాలో 130 మంది ఎంట్రీలను అందించింది.

**భారత దేశంలో మరో 58 మంది బిలియనీర్లు:**

ప్రపంచవ్యాప్తంగా ఉన్న ధనికుల గురించి సమాచారం అందించే మ్యాగజైన్ ఫోర్బ్స్ భారత్‌కు చెందినా 2021 సంవత్సరపు ధనవంతుల జాబితాను విడుదల చేసింది. ఈ జాబితాలో రిలయన్స్ ఎంటర్‌ప్రైజెస్ అధినేత ముఖేష్ అంబానీ మొదటి స్థానంలో ఉన్నారు. వరుసగా 14వ సంవత్సరం కూడా భారతదేశపు ధనవంతుడిగా నిలిచారు. ముఖేష్ 2008 నుండి అత్యంత ధనవంతుల జాబితాలో అగ్ర స్థానంలో

కొనసాగుతున్నారు. ముఖేష్ అంబానీ రోజువారీ సంపాదన రు.169 కోట్లతో ఆయన మొత్తం సంపద ఈ సంవత్సరం 9 శాతం పెరిగి రు.7.18 లక్షల కోట్ల సంపదతో భారతదేశంలో అత్యంత ధనవంతుడిగా కొనసాగుతున్నారని ఫోర్బ్స్ జాబితా సూచించింది. గౌతమ్ అదానీ, ఆయన కుటుంబం ఒక్క ఏడాదిలోనే తమ సంపదను నాలుగు రెట్లు పెంచుకొని దేశంలో రెండో స్థానంలో నిలిచారు. ఇతను ఏషియా రిచెస్ట్ లిస్టోనూ చైనాకు చెందిన ఝూంగ్ షాన్షాన్ను వెనక్కి నెట్టి రెండోస్థానానికి చేరినట్లు ఐఐఎఫ్ఎల్ వెల్త్ హురూన్ ఇండియా రిచ్ లిస్ట్ 2021 వెల్లడించింది. హెచ్‌సిఎల్ అధినేత శివ్ నాడార్ కుటుంబ సందప కూడా గతేడాది ఏకంగా 67 శాతం పెరిగి రు.2.36 లక్షల కోట్లకు చేరడం విశేషం. గతేడాది ఆయన ప్రతి రోజూ రు.260 కోట్లు సంపాదించారు. అటు లక్ష్మీ మిట్టల్ కుటుంబం గతేడాది రోజుకు రు.312 కోట్ల సంపదను పోగేసుకున్నట్లు ఈ లిస్ట్ వెల్లడించింది. వ్యాక్సిన్ తయారీదారు సైరస్ పూనావాలా, ఆయన కుటుంబం గతేడాది ఏడాదికి రు.190 కోట్లు సంపాదించింది. భారత దేశంలో గతేడాది కొత్తగా 58 మంది బిలియనీర్లు చేరడం విశేషం. దీంతో దేశంలో 2020-21లో మొత్తం బిలియనీర్ల సంఖ్య 258కి చేరింది. ఇక ఇండియాలో యంగెస్ట్ బిలియనీర్‌గా భారత్ పేమెంట్స్ యాప్ కోఫౌండర్ శాశ్వత్ నక్రానీ నిలిచారు. ఈ లిస్ట్ పై హురూన్ ఇండియా ఎండీ, చీఫ్ రీసెర్చర్ అనస్ రెహమాన్ జునైద్ మాట్లాడుతూ పదేళ్ల కిందట మా లిస్ట్‌లో కేవలం 100 మంది ఉండగా ఇప్పుడు వారి సంఖ్యపది రెట్లు పెరిగి 1007కు చేరిందని ఇదే వేగంతో వచ్చే ఐదేళ్లలో ఈ లిస్ట్‌లో 3 వేల మంది చేరొచ్చు అనే అభిప్రాయాన్ని వ్యక్తం చేయడమంటే సంపన్నుల వృద్ధి ఏ విధంగా దూసుకుపోతుందో తెలుస్తుంది.

**భారతదేశంలో ప్రభావం చూపని పనామా పత్రాలు :**

ఇటీవల పనామా పత్రాల్లో 500 మంది భారతీయుల పేర్లు బయటపడ్డాయి. ఆరోపణలు వచ్చిన వారిలో ప్రధానంగా అమితాబ్ బచ్చన్ నుంచి డిఎల్ఎఫ్ అధినేత కెపిసింగ్, గౌతమ్ అదానీ సోదరుడు వినోద్ అదానీ వరకు సినీనటులు, ప్రముఖ న్యాయవాదులు, అధికార పార్టీ ఎంపిలు కూడా ఉన్నారు. గత అయిదు సంవత్సరాల్లో ఇందుకు సంబంధించి ఎటువంటి విచారణ జరిగిన దాఖలాలు లేవు. పలు ఏజెన్సీలతో కలిసి కమిటీ వేసి విచారణ జరిపిస్తానని ప్రభుత్వం స్వయంగా ప్రకటించింది. ప్రభుత్వం నియమించిన సిబిడిటి, ఇడి, ఫైనాన్షియల్ ఇంటెలిజెన్స్ యూనిట్, రిజర్వు బ్యాంకు తదితర సంస్థలతో కలిసి బహుళ ఏజెన్సీ కమిటీ నివేదికలను ప్రస్తావించారు కాని ఈ నివేదికల ఆధారంగా తీసుకున్న కనీస చర్యలు నామమాత్రంగానైనా లేకపోవడం విచారకరం.

**ప్రపంచాన్ని కుదిపేస్తున్న పాండోరా పత్రాలు:**

ప్రపంచ వ్యాప్తంగా అవినీతి అక్రమార్జన పెరుగుతున్న నేపథ్యంలో పరిశోధనాత్మక జర్నలిస్టులతో కూడిన ఇంటర్నేషనల్ కన్సార్షియం ఆఫ్ ఇన్వెస్టిగేటివ్ జర్నలిస్ట్స్ (ఐసీఐజే) మరింత భారీ సమాచారంతో పాండోరా పత్రాల ద్వారా ప్రపంచ వ్యాప్తంగా పన్ను ఎగవేతదార్ల గుట్టురట్టు చేసింది.ఇందులో 14 లీగల్, ఆర్థిక సేవా సంస్థల నుంచి సేకరించిన 1.2 కోట్ల రహస్య పత్రాలు ఉన్నాయి. ఇవి 29వేల ఆఫ్షోర్ కంపెనీలు, ట్రస్టుల వివరాలను బట్టబయలు చేశాయి. నిజానికి ఇప్పుడు ఈ పత్రాలు ప్రపంచాన్ని కుదిపేస్తు ప్రకంపనలు సృష్టిస్తున్నాయి. ఈ పత్రాల్లో 3 వందల మందికిపైగా భారతీయులు ఉండటం చర్చనీయాంశమైంది. అనిల్ అంబానీ, కిరణ్ మజుందార్ షా భర్త జాన్, సచిన్ తెండుల్కర్, నీరా రాడియా, వినోద్ అదానీ, జాకీ ష్రాఫ్, కెప్టెన్ సతీశ్ శర్మ వంటి ప్రముఖుల పేర్లు వెలుగులోకి వచ్చాయి. ప్రపంచ వ్యాపతంగా ప్రకటించిన రిచ్ లిస్ట్ లో కూడా వీళ్ల పేర్లు చోటుచేసుకోవడం తీవ్రంగా పరిగణించాల్సి ఉంది.

**గతంలో నల్లధనమంతా నేడు తెల్లధనమైందా!:**

గతంలో అనుభవాల ఆధారంగా పండోర పత్రాల కుదుపు తాత్కాలికమే అయినప్పటికీ, ఈ అక్రమలావాదేవీలు, రహస్య స్థావరాలు, పన్ను ఎగవేతలకు సంబంధించి అప్పుడప్పుడైనా ఇలా రచ్చజరుగుతున్నందువల్లనే ఇటీవల 130 దేశాలు కనీస కార్పొరేట్ టాక్స్‌ను 15శాతం చేయాలని సంకల్పించాయి. బహుళజాతి కంపెనీలు పన్ను ఎగవేతకు వీలుగా తమ లాభాలను తరలించకుండా అడ్డుకొనే చర్యలకూ కనీసంగా నైనా పునాది పడింది. పనామా పత్రాలపై ప్రకటనలకే పరిమితమై వాటిలో పేర్లు ఉన్న వ్యక్తులపై చర్యలు తీసుకోని ప్రభుత్వం ఇప్పుడు తాజాగా ఇదే అంతర్జాతీయ పరిశోధక జర్నలిస్టుల కన్సార్టియమ్ వెల్లడించిన మరిన్ని సంచలనాత్మక కథనాలపై చర్యలు తీసుకుంటుందని ఊహించలేం. పనామా పేపర్లు కేవలం ఒక లా కంపెనీ ద్వారా లీక్ అయిన పత్రాల ఆధారంగా బయటపడితే, ఇప్పుడు ప్రపంచవ్యాప్తంగా తమ క్లయింట్లకు సేవలందించే 14 గ్లోబల్ కార్పొరేట్ కంపెనీల పత్రాల ఆధారంగా పాండోరా పేపర్ల పేరుతో మరిన్ని రహస్యాలు బయటపడ్డాయి. ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 29 వేలమంది వ్యక్తులు పన్ను ఎగవేతకు స్వర్గధామాలుగా మారిన దేశాల్లో ట్రస్టులు లేదా కంపెనీలు ఏర్పరిచారు. వాటిపని నల్లధనాన్ని తెల్లధనంగా మార్చడమే. వీరిలో భారతీయ సంతతికి చెందిన 380 మంది వ్యక్తులు ఉండగా, వారిలో 60 మంది అత్యంత ప్రముఖులు. ప్రముఖ పారిశ్రామిక వేత్త అనిల్ అంబానీతో పాటు అనేకమంది వ్యాపారులు కూడా వారిలో ఉన్నారు. అనిల్ అంబానీకి పలు దేశాల్లో పదివేల కోట్ల మేరకు పెట్టుబడులు ఉన్నాయని పాండోరా పత్రాలు వెల్లడించాయి.మరి తాజా పత్రాల వెల్లడి తర్వాత ప్రభుత్వం ఏం చేస్తుందో చూడాలి. ఎప్పటిలాగా మరో బహుళ ఏజెన్సీల కమిటీ వేస్తామని ప్రభుత్వం ప్రకటించగా, తాజా ఆరోపణలను తీవ్రంగా విచారిస్తామని నల్లధనంపై విచారిస్తున్న సుప్రీంకోర్టు కమిటీ ప్రకటించింది కానీ సంపాదిత అక్రమార్జన అంత సక్రమార్జనగా మారుటకు ప్రభుత్వమే పరోక్షంగా సహకరిస్తున్న నేపథ్యంలో అత్యున్నత న్యాయస్థానం ఆశించిన మేర విచారిస్తుందని విశ్వసించడం అత్యాశే అవుతుంది.

**ఆర్థిక నేరస్తుల పై చర్యలు లేవు:**

గత ఏడేళ్లుగా మన దేశంలో పన్నులు ఎగవేసిన వారు, బ్యాంకులకు వేలకోట్ల రుణాలు ఎగవేసిన వారు విదేశాలకు తమ డబ్బులు

# నక్సల్ ప్రభావిత రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశం

*మావోయిస్టు ఉద్యమాన్ని నిర్మూలించే ఉద్దేశంతో అమిత్ షా ఏర్పాటు చేసిన 'నక్సల్స్ ప్రభావిత రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశం' ప్రజల మౌలిక సమస్యలకు పరిష్కారం కాదని అంటున్నారు* **బి.ఎస్. రాజు**

**2021** సెప్టెంబర్ 26న కేంద్ర హోం మంత్రి అమిత్ షా నక్సల్ ప్రభావిత రాష్ట్ర ముఖ్యమంత్రులతో సమావేశమయ్యారు. ఈ సమావేశానికి తెలంగాణ, ఝార్ఖండ్, బీహార్, ఒడిశా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర ముఖ్యమంత్రులు హాజరయ్యారు. ఆంధ్రా, ఛత్తీస్‌గఢ్ ముఖ్యమంత్రులు హాజరు కాలేదు. ఆ యా రాష్ట్రాల పోలీసు, ప్రభుత్వ ఉన్నతాధికారులు, కొంత మంది కేంద్ర మంత్రులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. ఈ సమావేశపు ముఖ్య ఉద్దేశ్యం: వామపక్ష తీవ్రవాద అణచివేత, తుడిచివేత చర్యల తీరుతెన్నులను సమీక్షించుకుని ఓ కొత్త ప్రణాళికను ప్రతిపాదించడం, దిశా నిర్దేశం చేయడం. ఈ సారి జాతీయ భద్రతా సలహాదారు లేకుండానే, అమిత్ షా తానే స్వయంగా ఈ సమావేశాన్ని నిర్వహించడం గమనార్హం.

ఈ సమావేశంలో ప్రధానంగా ఆయన మూడు అంశాలపై దృష్టి కేంద్రీకరించి మాట్లాడారు:

1. వేగవంతమైన అభివృద్ధితో వామపక్ష తీవ్రవాదానికి అడ్డుకట్ట వేయడం.
2. నక్సల్స్ ఏరివేత కార్యక్రమాలను ముమ్మరం చేయడం.
3. నక్సల్స్ ఆర్థిక మూలాలపై ఉక్కుపాదం మోపడం.

ఈ మూడు అంశాలు నొక్కి చెబుతూ రాష్ట్ర ముఖ్యమంత్రులు ఓ ఏడాది పాటు వీటిపై దృష్టి కేంద్రీకరించి పనిచేస్తే నక్సలిజాన్ని తుడిచిపెట్టొచ్చని అన్నారు. దీని సాధనకు కేంద్రం, రాష్ట్ర ముఖ్యమంత్రులు కలిసికట్టుగా పనిచేయాలని, రాష్ట్ర పోలీసు, కేంద్ర ఇంటెలిజెన్స్ యంత్రాంగాలు మరింత సమన్వయంతో, బుద్ధికుశలతతో, దీటైన తుడిచివేత కార్యక్రమంతో ముందుకెళ్లాలని, ఈ రకంగా చేస్తే, ఓ సంవత్సర కాలంలో వామపక్ష తీవ్రవాదం అంతుచూడొచ్చని ఆయన అభిప్రాయపడ్డాడు.

50 ఏళ్లుగా కొనసాగుతున్న నక్సలిజం సమస్యవల్ల 16000

---

తరలిస్తూనే ఉన్నారని పాండోరా పత్రాలు వెల్లడించాయి. ఇప్పటికే వారు దోచుకున్నది చాలదన్నట్లు కార్పొరేట్లకు అన్నీ కట్టబెట్టేందుకు, ప్రభుత్వ ఆస్తులను సైతం కూడా ధారాదత్తం చేసే ప్రభుత్వ హయాంలో కట్టలు కట్టలు ఛార్జిషీట్లు నమోదు చేయడం తప్ప సిబిఐ, ఇడి లాంటి ఏజెన్సీలు ఏమీ చేయగల స్థితిలో లేవు. ఏళ్ల తరబడి కేసులు కోర్టుల్లో నడుస్తూనే ఉంటాయి. నేరస్థులు విదేశాలకు పారిపోయే లేదా స్వదేశంలో అధికార పక్షంతో మిలాఖత్ అయి అధికారాన్ని అనుభవిస్తూ తప్పించుకుంటూనే ఉంటారు. జైలుకు తాత్కాలికంగా వెళ్లినా విలాసవంతమైన జీవితం అనుభవిస్తూ ఉంటారు. సంపద సృష్టించేవారిని గౌరవించాలని ధర్మసూత్రాలు చెప్పే ప్రభుత్వానికి, సంపదను కొల్లగొట్టి విదేశాలకు తరలించేవారిని నెత్తికెక్కించు కుంటున్నామన్న స్పృహ లేదు. మనదేశంలో కొల్లగొట్టిన మొత్తాన్నే విదేశాలకు మళ్లించి సూట్‌కేస్ కంపెనీల ద్వారా మళ్లీ తమ కంపెనీలకే తరలించిన వారు కళ్లముందు కనపడుతున్నా చర్యలు తీసుకునేందుకు ప్రభుత్వం తొందరపడదు. ప్రభుత్వానికి అధికారం ప్రధానం. ఆ అధికారాన్ని నిలబెట్టేందుకు దోహదం చేసే శక్తులు పనామా పేపర్లలో కనపడ్డా, పాండోరా పేపర్లలో కనపడ్డా తేడా ఏముండదు.

**ముగింపు:**

ఈ దేశంలో బ్రిటిష్ పాలనానంతరం ప్రజాస్వామ్య పాలనా పేర వచ్చిన ప్రభూత్వాలన్నీ అనుసరించిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు కార్పొరేట్ల లాభాలు పెంచడానికి తోడ్పడ్డాయి. ప్రజల జీవితాలను బాగుపర్చడానికి ఏనాడు దోహదపడలేదు. ఆర్థిక సంస్కరణల లక్ష్యం ప్రజల బతుకులు బాగుచేయడానికి కాదని మూడు దశాబ్దాల అనుభవాలు, ఆర్థిక అసమానతలు తేటతెల్లం జేస్తోంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు, అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ఆధిపత్యాన్ని ప్రపంచంపై నెలకొల్పే లక్ష్యంతో రూపొందించిన సిద్ధాంతంలో భాగమే.అదేవిధంగా మన దేశంలో అమలు జరుగుతున్న ఆర్థిక సంస్కరణలు ఆ సిద్ధాంతంలో అంతర్భాగమే. అందువల్లనే ప్రభుత్వ ఆర్థిక విధానాలు కార్పొరేట్లు గరిష్ఠంగా లాభాలు సంపాదించడమనే ఏకైక లక్ష్యంతో అమలు జరిగాయి. అందుకోసం ప్రభుత్వాలు దేశీయ సహజ వనరులను దోచిపెట్టారు. ప్రజలను బలి చేశారు. ఈ కాలంలో ప్రజల్లో పేదరికం, యువతలో నిరుద్యోగం, ప్రజల మధ్య ఆర్థిక అంతరాలు ఊహించని రీతిలో పెరిగాయి. ప్రజల ఆదాయాలు తగ్గి కొనుగోలు శక్తి క్షీణించింది. ఫలితంగా ఆర్థిక వ్యవస్థ మందగించింది. దీనికి తోడు కరోనా విపత్తు ప్రజల జీవితాల మీద వినాశకర ప్రభావాన్ని మరింత పెంచింది. ఇంకా దాని విధ్వంసం కొనసాగుతోంది. దీని నివారణకు పెద్దఎత్తున ప్రజా ప్రతిఘటన ఉద్యమాల నిర్మాణం ద్వారానే ప్రత్యామ్నాయం ఆవిర్భవిస్తుంది. ప్రజల రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక విముక్తి లక్ష్యాలుగా క్రియాశీల ఉద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్లాల్సిన చారిత్రక అవసరం లౌకిక, ప్రజాతంత్ర, ప్రగతిశీల శక్తులపై ఉంది. ఈ లక్ష్య సాధనకు గతంకంటే ప్రజా ఉద్యమాలను మరింత వ్యూహాత్మకంగా నిర్మించాల్సిన అవసరముంది. ప్రగతిశీల ప్రజా సమూహాలను ఏకంచేసి దేశ ఆర్థికవ్యవస్థను దిగజారుస్తున్న అక్రమార్కులపై అవినీతిపరులపై అధికార దురహంకారులపై పిడికిలెత్తాల్సిన అనివార్యత ఎంతైనా అవసరం.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

మంది ప్రాణాలు కోల్పోయారని, ఇప్పుడు నక్సలిజమే అంతమయ్యే స్థితికి చేరిందని ఆయన ధీమాగా చెప్పారు. ప్రధాని మోడీ హయాంలో నక్సల్ ఘటనలు 23 శాతానికి, మరణాలు 21 శాతానికి తగ్గాయని, మరణాల సంఖ్య 200 కంటే తక్కువగా ఉందని లెక్కలు ఉదహరించాడు. నక్సల్స్ ఆయుధాలు అప్పగించి ప్రభుత్వానికి లొంగిపోతే సాదరంగా ఆహ్వానిస్తామని అలాకాక ప్రజలపై, పోలీసులపై సాయుధ దాడులకు దిగుతూ ఉంటే నిర్దాక్షిణ్యంగా అణచి వేస్తామని మరో మారు తీవ్రంగా హెచ్చరించాడు.

ఈ సమావేశంలోనూ, సమావేశానంతరం అమిత్ షా, తెలంగాణ ముఖ్యమంత్రికి, తెలంగాణ పోలీసు ఉన్నతాధికారులకు ఇచ్చిన ప్రాముఖ్యత, కేటాయించిన సమయం గురించి కూడా చర్చించాల్సి ఉంది. అలానే వామపక్ష తీవ్రవాద సమూహాల్లో అతి పెద్ద సమూహంగా ఉన్న భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) లేక మావోయిస్టు పార్టీ ఈ సమీక్షా సమావేశంపై ఏమి మాట్లాడిందో కూడా చర్చించాలి.

ఇదివరకటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగానీ, ఇప్పటి తెలంగాణ, ఆంధ్రా విడివిడి రాష్ట్రాలుగానీ, నక్సలిజానికి, మావోయిజానికి బౌద్ధిక, సైద్ధాంతిక పరంగానేగాక, నాయకత్వ పరంగా, కేడర్ పరంగా పట్టుగొమ్మలు. నక్సల్ ఉద్యమం బెంగాల్‌లో పుట్టి అక్కడి నుండి దేశం నలుమూలల విస్తరించినప్పటికీ, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోనే అది లోతుగా వేళ్లూనుకుని బలాన్ని సంతరించుకుంది. విస్తృతంగా అగ్ర, ఉప నాయకత్వాన్ని, కేడర్ను, పదాతి శక్తులను సమకూర్చింది. ప్రజాయుద్ధ పంథాని, వ్యూహాన్నీ, సైనిక పాటవాన్ని సమకూర్చడంలో ముందు నిలిచింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఈ నక్సల్బరీ పాటవాన్ని పటాపంచలు చేయడంలో, సమూలంగా కాకపోయినా చాలా మట్టుకు మట్టుపెట్టడంలో దేశంలోనే అగ్రస్థానంలో నిలిచింది. ఉమ్మడి రాష్ట్రంలో నక్సల్ శక్తుల ఏరివేతలో ఆరితేరి, అనుభవం గడించిన పోలీసు వ్యవస్థ విడిపోయిన రెండు రాష్ట్రాలకు అందివచ్చింది. ముఖ్యంగా తెలంగాణ రాష్ట్రానికి ఈ పోలీసు వ్యవస్థ హెచ్చుగా ఒనగూరింది.

నక్సల్ ఎజెండానే తన ఎజండా అనే టిఆర్ఎస్ ప్రచారం, కెసిఆర్ చాణక్య నీతి, బలీయమైన ప్రత్యేక తెలంగాణ ప్రజా ఆకాంక్షతో కూడుకున్న సకల జనోద్యమం తెలంగాణ రాష్ట్రాన్ని సాధించినా ప్రజాస్వామిక తెలంగాణ సమకూరలేదు. దీని ఫలాలు సంపన్నులకు దక్కినంతగా శ్రామిక ప్రజలకు దక్కలేదు. పాత గడీల స్థానంలో కొత్త గడీలు, పాత దొరల స్థానంలో మెరుగులద్దుకున్న పాలిష్ దొరలు, బడా భూస్వాముల స్థానంలో పిల్ల భూస్వాములు, రౌడీకోరు కాంట్రాక్టర్ల స్థానంలో ఆధునిక కాంట్రాక్టర్లు, ఫాసిస్టు పాలన, పోలీసు రాజ్యం తెలంగాణలో రూపురేఖలు మార్చుకుని స్థిరపడ్డాయి. 'ఇదేమి రాజ్యం? పోలీసు రాజ్యం! తుపాకీ రాజ్యం!' తిరిగి మరిగొచ్చింది. నూతన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మరో 'దిక్కు-దివాణం' లేని అస్తవ్యస్త పోలీసు నియంత రాజ్యంగా మారింది.

అప్పట్లో పీపుల్స్‌వార్ పేరున రాష్ట్రమంతా విస్తరించిన నక్సల్బరీ పోరాట పాయ, తన కేడర్ను పెద్దఎత్తున కోల్పోయి ఆత్మరక్షణకై కొత్తజాగా వెతుక్కుని దండకారణ్యంలో దండును ఏర్పాటు చేసుకుంది. తదనంతరం మరో మావోయిస్టు పాయతో కలిసి 2004లో సిపిఐ (మావోయిస్టు)పార్టీగా రూపాంతరం చెంది, ఇంచుమించు మధ్య భారత ప్రాంతాలకే పరిమితమై ఉనికిని కొనసాగిస్తోంది.

గతంలో, ఈ పార్టీ నాయకత్వంలో దేశవ్యాపితంగా పలు ప్రాంతాల్లో జరిగిన వర్గ పోరాటాల కారణంగా ఆయా సమాజాల్లో పలు మార్పులు చోటు చేసుకున్నాయి. ఈ ఉద్యమాలను రాజ్యం ఉక్కుపాదం మోపి అణచి వేయడంతో వర్గపోరాటాలు స్తబ్దతకు గురయ్యాయి. తత్కారణంగా నూతన దోపిడీ రూపాలు ఈ ప్రాంతాల్లో చోటుచేసుకున్నాయి. ఉద్యమం ఉన్నచోట ఒక రకమైన పరిణామాలు చోటు చేసుకుంటుంటే, ఉద్యమం వెనకపట్టు పట్టిన చోట మరో రకమైన పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. ఈపార్టీ కేంద్ర నాయకత్వంలో సీనియర్ స్థానంలో అధికంగా ఉన్నది ఈ ఉభయ తెలుగు రాష్ట్రాల నుండే! ఈ పార్టీకి జరిగిన నష్టాలు దేశ వ్యాపితంగా ఉన్నప్పటికీ, తెలుగు రాష్ట్రాల వారు, అందునా తెలంగాణ అధిక శాతం శక్తిని నష్టపోయింది. నష్టపోగా, దృఢంగా నిలబడి, వారి ఉద్యమ వాహనాన్ని ఇప్పుడు నడిపిస్తున్న సారథులు అధికశాతం ఈ ఉభయ రాష్ట్రాలవారే!

అందుచేత వీరి ఏరివేతపై దృష్టి కేంద్రీకరించమని అమిత్‌షా చెబుతున్నాడు. దానికి తెలంగాణ ముఖ్యమంత్రి, ఆ రాష్ట్ర పోలీసు అధినాయకత్వం అనుభవపూర్వక వనరు, ఓ రిజర్వాయర్. అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం వామపక్ష తీవ్రవాదమని ఇప్పుడు చెపుతున్నది ఈ మావోయిస్టు పార్టీ గురించే. అణిచివేయాలని, తుడిచిపెట్టాలని వ్యూహం రచిస్తున్నది ఈ మావోయిస్టు ఉనికినే! పై సమీక్షలో అమిత్ షా తెలంగాణ ముఖ్యమంత్రికి, ఆ రాష్ట్ర పోలీసు అధికారులకు అధిక ప్రాముఖ్యత ఇచ్చిన నేపథ్యం, పూర్వరంగం ఇదేనని చెప్పాలి.

ఇదే సమావేశంపై మావోయిస్టు పార్టీ కూడా ఓ సుదీర్ఘ ప్రకటన విడుదల చేసింది. ఈ సమావేశంలో రూపొందించిన ఏడాదికాల ప్రభుత్వ అణచివేత కేంపెయిన్ పథకాన్ని ఓడించాలని, కేంద్రం నాయకత్వంలో రూపొందిన నూతన ఉన్నత విప్లవ ప్రతిఘాతుక ప్రహార్ అభియాన్‌ను ఓడించమని, ఆ పార్టీ మధ్య రీజినల్ బ్యూరో అధికార ప్రతినిధి ప్రతాప్ పత్రికలకు విడుదల చేసిన ప్రకటన పాఠం ఏమిటో ఇప్పుడు చూద్దాం:

"...అభివృద్ధి మంత్రాన్ని జపం చేస్తూ కేంద్ర హోం మంత్రి నూతన, ఉన్నతమైన ఏడాది కాల అణచివేత కేంపెయిన్ పథకాన్ని రూపొందించాడు. ఈ పథకాన్ని పిఎల్‌జిఏ నాయకత్వంలో పూర్తిగా ఓడించాలని మాపార్టీ మధ్య రీజియన్ బ్యూరో (ఆంధ్రప్రదేశ్, ఒడిశా, తెలంగాణ, ఛత్తీస్‌గఢ్, మహారాష్ట్ర) విప్లవ ప్రజలకు పిలుపునిస్తోంది. గత సంవత్సరం జాతీయ భద్రతా సలహాదారు రూపొందించిన 8 మాసాల నిర్ణయాత్మక సైనిక కేంపెయిన్‌ను (2020 నవంబర్ నుండి 2021 జూన్ వరకు) పిఎల్‌జిఏ నాయకత్వంలో అత్యంత ధైర్య సాహసాలతో విప్లవ ప్రజలు తిప్పికొట్టారు. ఇటీవల దండకారణ్య ప్రత్యేక జోన్ సైనిక కమిషన్ అందించిన నివేదిక ప్రకారం 8 మాసాల గొప్ప ప్రజా ప్రతిఘటనలో 90 మంది పోలీసులు మరణించి 259 మంది గాయపడ్డారు. వీటిలో అధిక శాతం ప్రజలు చేపట్టిన చురుకైన ఆత్మరక్షణ చర్యలలో భాగంగానే జరిగాయి.

ఇక ఇపుడు మనం మరింత చాకచక్యంగా, దృఢమైన పట్టుదలతో

పోరాడాలి. గ్రామ గ్రామాన ప్రజలు చురుకైన ఆత్మరక్షణ చర్యలకు పూనుకోవాలి. మనం కోరుకోని యుద్ధాన్ని దోపిడీ పాలకులు తమ ప్రయోజనాల కోసం మనపై రుద్దుతున్నారు. దానిని ప్రజా యుద్ధం ద్వారానే ఓడించాలి. ఈసారి జాతీయ భద్రతా సలహాదారును పక్కన పెట్టి స్వయంగా కేంద్ర హెూం మంత్రి రంగంలోకి దిగి సమీక్ష సమావేశం నిర్వహించి తాను రూపొందించిన చుట్టుముట్టి మట్టుబెట్టే సైనిక కేంపెయిన్‌కు అభివృద్ధి పేరుతో రాజకీయ రూపం ఇచ్చి రోడ్లు, ఆస్పత్రులు, పాఠశాలలు, తమ రియాక్షనరీ భావజాలాన్ని వ్యాపింప చేయడానికి ఏకలవ్య విద్యాలయాలు, మొబైల్ టవర్లు అంటున్నాడు. కానీ, నిజానికి అయన చాల స్పష్టంగా మావోయిస్టుల నిర్మూలనకు అవసరమైన నిధులు, అదనపు బలగాలను కేంద్రమే సమకూరుస్తున్నదని పూర్తిస్థాయి ఫలితాలు రాబట్టడం పైనే రాష్ట్రాలు దృష్టి పెట్టాలని అన్నాడు.

చర్యకు ప్రతిచర్య తప్పనిసరి అంటూ, ఆయుధాలు విడిచి పెట్టాలని అనుకునే వారికి ప్రభుత్వాలు స్వాగతం పలుకుతాయనీ, అయితే, వాటితో అమాయక ప్రజలు, పోలీసులకు హాని కలిగిస్తే మాత్రం వారికి అదే స్పందన ఎదురవుతుందని భారత రాజ్యాంగాన్ని అవహేళన చేస్తూ షా హెచ్చరించాడు. నిజానికి తీవ్రమైన ఆర్థిక, రాజకీయ సంక్షోభంలో కూరుకుపోయిన దోపిడీ పాలక వర్గాలకు దేశంలో ప్రజల ప్రత్యామ్నాయ శక్తిగా ఎదిగివస్తోన్న మా పార్టీని తుదముట్టించడం మినహా వారి ప్రజావ్యతిరేక విధానాల అమలుకు మరోదారి లేదని వారు సహజంగానే కలవర పడుతున్నారు. దేశంలో వెల్లువెత్తుతున్న విశాల ప్రజారాశుల పోరాటాలలో వారిని 'మావోయిస్టు భూతమే' వెంటాడుతోంది. అందుకే వారు మా పార్టీ నిర్మూలనకు కలలు కంటున్నారు.

కానీ, ఈ దేశ పీడిత ప్రజలు వారి కలలను ధ్వంసం చేసి తీరుతారని మా పార్టీ మరోసారి స్పష్టం చేస్తోంది. 2017లో ఐదేళ్ల కాల వ్యవధితో వారు రూపొందించిన ఆపరేషన్ సమాధాన్ చివరి సంవత్సరంలోకి ప్రవేశించినందున రానున్న ఏడాదిలో మావోయిస్టులను కూకటివేళ్లతో ఏరివేయాలని ఉబలాట పడుతున్నాడు. విప్లవోద్యమ ప్రాంతాలలో రక్తపాతాన్ని సృష్టించడానికి వేగిర పడుతున్న కేంద్ర, రాష్ట్రాల ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక యుద్ధ విధానాలను పూర్తిగా ఖండించాలనీ, వాటికి వ్యతిరేకంగా, దృఢంగా పోరాడాలనీ మా పార్టీ దేశ కార్మిక, కర్షక, విద్యార్థి, మేధావి, మహిళలకు పిలుపునిస్తోంది. సామ్రాజ్యవాద వ్యతిరేక దేశభక్తులను, లౌకిక వాదులను, వామపక్ష మిత్రులను కోరుతోంది. విదేశాలలోని భారత విప్లవ మిత్రులను బలమైన సంఘీభావ ఉద్యమాన్ని నిర్మించాల్సిందిగా విజ్ఞప్తి చేస్తోంది.

ప్రపంచంతో పాటుగా మన దేశ ప్రజలు సామ్రాజ్యవాదులు సృష్టించిన కరోనాతో సతమతమవుతున్నారు. వారికి కనీస వైద్యం అందడంలేదు. రోగాలతో, ఆకలితో మరణాల సంఖ్య దినదినం పెరుగుతోంది. ప్రభుత్వ మతిలేని లాక్‌డౌన్లతో ఆర్థిక వ్యవస్థ రుణాత్మక వృద్ధి దిశలో పరుగులు తీస్తోంది. ఉద్యోగాలు కోల్పోయిన లక్షలాది కార్మికులు, వలస కూలీలు వీథుల పాలవుతున్నారు. నిరుద్యోగం ఎన్నడూలేని స్థాయికి పెరిగింది. నిత్యావసర సరుకుల ధరలు చుక్కలంటుతున్నాయి.

విద్యాలయాలు మూసివేసి ఆన్లైన్ విద్య అనడంతో పేద విద్యార్థుల జీవితాలు అగమ్యగోచరంగా తయారయ్యాయి. ఉద్యోగులకు జీతభత్యాలు సరిగా అందడం లేదు. గత 10 మాసాలుగా లక్షలాది రైతులు ప్రభుత్వ సాగు చట్టాల రద్దుకు దేశ రాజధాని ఢిల్లీలోనే ధర్నా చేస్తున్నారు. దేశంలోని మూలవాసీ ప్రజలు పోలీసు క్యాంపులకు వ్యతిరేకంగా జల్, జంగల్, జమీన్ కోసం పోరాడుతున్నారు. ఈ సమస్యలన్నింటి పరిష్కారానికే మావోయిస్టులు పోరాడుతున్నారు. వారిని కూకటివేళ్లతో పెకలించడానికి దోపిడి పాలక వర్గాలు నడుం బిగించాయి.

కానీ, సమస్యలున్నంత వరకు ప్రజా పోరాటాలు; మావోయిస్టులు ఉండి తీరుతారు. పైసమస్యలన్నీ వదలి తీవ్రమైన ఆర్థిక సంక్షోభం మధ్య అభివృద్ధి పేరుతో మావోయిస్టుల నిర్మూలనకు వేల కోట్ల రూపాయలను వెచ్చిస్తూ షా తన గురువుగారి అభివృద్ధి మంత్రాన్ని జపిస్తున్నాడు. మావోయిస్టుల ఉద్యమ ప్రాంతాల కోసం ప్రకటిస్తున్న ప్రత్యేక పథకాలకు రు. 3,698.24 కోట్లు విడుదలయ్యాయన్నారు.

మరోవైపు మోదీ హయాంలో చేస్తున్న దేశ, విదేశీ అప్పులు హిమాలయాలతో పోటీ పడుతున్నాయి. 2017లో అకాంక్ష జిల్లాల పేరుతో 125 జిల్లాలను ప్రకటించిన భారత ప్రభుత్వం ఏటేటా పెరుగుతున్న ఆర్థిక భారాన్ని భరించలేని తీవ్ర సంక్షోభ పరిస్థితులలో వాటి సంఖ్యను క్రమంగా 25కు కుదించిన అసలు విషయాన్ని మరుగు పరుస్తూ మావోయిస్టుల ప్రాబల్యం తగ్గిందంటూ తమ ప్రభుత్వ గొప్పతనాన్ని చాటుకుంటున్నది.

నిజానికి అడవులలో నిర్మిస్తున్న విశాలమైన రోడ్లు ప్రకృతి వనరులను కొల్లగొట్టుక పోవడానికే తప్ప అందులో ప్రజల అభివృద్ధి శూన్యం. దానిని మరుగు పరచడానికి ఆస్పత్రులు, పాఠశాలలు అంటున్నారు. ప్రజల సమస్యలకు మావోయిస్టు విప్లవ పోరాటాలే నిజమైన పరిష్కారాన్ని చూపగలవనే ఎరుకతోనే వారు ఈ ఫాసిస్టు దాడులకు పాల్పడుతున్నారు. దోపిడీ పాలక వర్గాలు తలపెడుతున్న కేంపెయిన్లను ఓడించకుండా మనం ఏ ఒక్క మౌలిక సమస్యను పరిష్కరించుకోలేం. బహుముఖంగా వాటితో తలపడి వాటిని ఓడించడమే ఈనాడు మన ముందున్న ఏకైక కర్తవ్యం.

గత 20 ఏళ్లుగా బిలియన్ల కొద్దీ డాలర్లు గుమ్మరించి, హద్దులెరుగని అవినీతిని ప్రోత్సహించి, 180 టన్నుల నుండి 10 వేల టన్నులకు మాదక ద్రవ్యాల వ్యాపారాన్ని వృద్ధిచేసి, పది లక్షల అఫ్ఘనిస్తాన్ పౌరులను అంతమొందించి బదులుగా వెలవెలపోతున్న అమెరికా జెండాతో అలంకరించిన అమెరికా బిడ్డల శవపేటికలను దిగుమతి చేసుకొని, అంతిమంగా అవమానకరమైన ఓటమితో వెనుతిరిగిన ప్రపంచ ప్రజల నంబర్ వన్ శత్రువు అమెరికా ఓటమి చందంగానే దాని కొమ్ముకాస్తున్న హిందుత్వ పాలక వర్గాలు భారత ప్రజాయుద్ధంలో ఓటమిపాలు కాకతప్పదని చరిత్ర సాక్షిగా నిరూపిద్దాం."

సెప్టెంబర్ 26 నాటి సమావేశంలో అమిత్ షా వామపక్ష తీవ్రవాదుల తుడిచివేతకు అనుసరించాల్సిన ప్రభుత్వ వ్యూహం, తెలంగాణ పోలీసు అధికారులు 90 నిముషాలపాటు అమిత్ షాకు ప్రదర్శించిన ప్రత్యేక నివేదిక, వీటికి సమాధానంగా మావోయిస్టు పార్టీ ప్రతినిధి విడుదల చేసిన ప్రకటన, ఈ మూడింటినీ గమనిస్తే రాబోయే రోజుల్లో ఇరుపక్షాలు భీకర సమరానికి దిగుతాయని స్పష్టమౌతోంది. ఈ సమరపు పర్యవసానాలు ఎలా ఉండబోతున్నాయో ఇప్పుడే ఊహించి చెప్పడం సాధ్యం కాదు.

ఐతే, నక్సలిజంపై ఇటువంటి సమావేశాలు, సమీక్షలు సాలీనా జరిగేవే అయినా, ప్రస్తుత సమావేశానికి ఓ ప్రత్యేకత ఉంది. మోడీ భాజపా పాలన ఇప్పుడు పెద్ద సంక్షోభంలో కూరుకుపోయింది. దేశ ఆర్థిక స్థితి, రాజకీయ, సామాజిక సమీకరణాలు మార్పుకు గురౌతున్నాయి. మోడీ మోజు దిగజారి నేలచూపు చూస్తోంది. రెండు ఎన్నికల్లో, 10 ఏళ్ల పాలనలో చేసి చూపిస్తామన్న 'అద్భుతాలు' ఏమీ జరగలేదు. ఇప్పుడు ఎలక్షన్ల పర్వం మొదలు కాబోతోంది. అందుచేత మోడీ 20 ఏళ్ల రాజ్యాధికార ఘట్టాన్ని ఉన్నతంగా నిలబెట్టే కొంగొత్త భజనతో ఆ నేల చూపు గ్రాఫ్‌ను బలవంతంగా పైకి లేపాలనే కాషాయ శ్రేణుల కొత్త ప్రయత్నం జోరుగా సాగుతోంది.

సెప్టెంబర్ 27న భారత రైతాంగ ఉద్యమం, దానికి మద్దతుగా నిలబడ్డ ఆదివాసీ ఉద్యమకారులు, కార్మిక సంఘాలు, ప్రతిపక్ష రాజకీయ పార్టీలు దేశవ్యాప్త సమ్మెలో పాల్గొని విజయవంతం చేశారు. ఈ సమ్మె అనంతరం, కేంద్ర హోం శాఖ సహాయ మంత్రిగా ఈ మధ్యనే పదవి సంపాయించిన ఉత్తరప్రదేశ్ నివాసి అజయ్ మిశ్రా కుమారుడు ఆశిష్ మిశ్రా, అక్టోబర్ 7న లఖింపూర్ ఖేరీలో నలుగురు రైతులతో సహా ఎనమండుగురు వ్యక్తులపై వాహనాలను ఎక్కించి కుమ్మి చంపిన దారుణ సంఘటన దేశాన్ని కుదిపి వేస్తున్నది. ఐనా కానీ, మోడీ-షా ద్వయం, ఎప్పటిలానే ఈ సంఘటనపై నోరు మెదపక స్పందనేలేని రాతి బొమ్మల్లా మౌనం దాల్చారు. వారి అనుయాయి, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి, యోగీశ్వర ఆదిత్యనాథ్ తన హిత-సన్నిహిత-ఆశ్రిత 'మిశ్రా'లను రక్షించే కుట్రల కుతంత్రాల అల్లికలో తలమునకలై ఉన్నాడు.

తమ బిడ్డల దారుణ హత్యలకు తల్లడిల్లుతున్న తల్లిదండ్రులను లక్షలు కుమ్మరించి కొనే సెటిల్మెంట్ బేరసారాలతో, పోలీసు బెదిరింపులతో, పట్ట పగటి హత్యాకాండను భూస్థాపితం చేసే పనిలో మునిగి ఉన్నాడు ఆదిత్యా నాథుడు. ప్రతిపక్ష రాజకీయ పార్టీల నాయకులను బాధిత కుటుంబాల పరామర్శకు కూడా ప్రవేశం లేకుండా రాజ్యాంగ ధర్మాన్నే కాక, సాధారణ మానవతా ధర్మాన్ని కూడా మంటగలుపుతున్నాడు ఈ యుపి ముఖ్యమంత్రి. భాజపా పాలక వ్యవస్థ సర్వం ఈ హత్యాకాండకు జేజేలు కొడుతోంది.

హర్యానా కాషాయ ముఖ్యమంత్రి ఖట్టర్, ఉద్యమించే రైతులను కర్రలతో ఎక్కడికక్కడ చావగొట్టమని బహిరంగ ప్రకటనే చేశాడు. ఈ ప్రకటనకన్నా ముందే, ఆయన మోచేతి నీళ్లు తాగే ఓ జిల్లా అధికారి, అక్కడ పోలీసులకు రైతుల బుర్రలు పగలగొట్టమని ఆర్డర్లు జారీచేశాడు. ఇది ఏ పక్ష తీవ్రవాదం ? ఈ తీవ్రవాదం పెంచిపోషించి, ప్రవచించి, ప్రచారంచేసి, కిందికి ఊడలు దించుకుని, పైపైకి విస్తరించాల్సిన జన సంక్షేమ వాదమా? ఇదే వికాస వేదమా? ఇదేనా ఆత్మ నిర్భరత? దీనికి ఏ సమీక్షలు అవసరంలేదా?

కార్పొరేట్ వ్యవసాయానికి గేట్లు బార్లా తెరుస్తూ కేంద్ర ప్రభుత్వం తెచ్చిన రైతు ఖూనీ చట్టాలను పూర్తిగా రద్దు చేయాలని రైతాంగ ఉద్యమం మొదలై సంవత్సరం కావస్తోంది. 5 నెలలుగా మధ్య భారతంలో ఆదివాసీలు తమ మాన ప్రాణ రక్షణకు, జల్-జంగిల్-జమీన్ కాపాడుకోడానికి, ఆయా రాష్ట్రాల, కేంద్ర ప్రభుత్వాల దమన నీతికి, అణచివేతకు, పోలీసు, మిలట్రీ క్యాంపుల ఎత్తివేతకు ఉద్యమిస్తూనే ఉన్నారు. తెలంగాణ రాష్ట్రంలో పోడు భూములు కాపాడుకోడానికి నిత్యం ఆదివాసీలు పోరాడుతూనే ఉన్నారు. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో విశాఖ ఉక్కు పరిశ్రమ ప్రైవేటు పరం చేయ కూడదని కార్మికులు, ఉద్యోగులు, స్థానికులు ఉద్యమిస్తూనే ఉన్నారు. ఇవన్నీ శాంతియుత పోరాటాలే కదా! మరి వారి ఉద్యమ ఘోషను వినే, పట్టించుకునే ప్రభుత్వమెక్కడా?

కార్మిక హక్కులను కాలరాస్తూ అమలు చేస్తున్న దుర్మార్గ చట్టాలకు, ప్రభుత్వ ఆస్తుల ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా అనేక ప్రభుత్వ రంగ సంస్థల, బ్యాంకింగ్, బీమారంగ ఉద్యోగులు, కార్మికులు ఇప్పటికే పలుమార్లు దేశ వ్యాపిత సమ్మెలు నిర్వహించి ఉన్నారు. వీటి గురించి మోడీ-షాలు ఇంతకాలం ఏ సమీక్ష, ఏ చర్చ నిర్వహించలేదు. వామపక్ష తీవ్రవాదాన్ని అంతమొందించే తీరుతెన్నులు సమీక్షించడానికి, కొత్త ప్రణాళికలు రచించడానికి నక్సల్ ప్రభావిత రాష్ట్ర ముఖ్యమంత్రులను, తత్సంబంధిత శాఖాధిపతులను, పోలీసు బాస్‌లను హోం మంత్రి అమిత్ షా క్రమం తప్పకుండా సమావేశపరచాడు.

కశ్మీర్ నుండి, కన్యాకుమారి వరకు ప్రజలు పలు దైనందిన సమస్యలపై, రాజ్యాంగంలో పొందుపరిచిన హక్కులకై శాంతియుతంగానే ఉద్యమిస్తున్నారు. ప్రభుత్వ విధానాలను, అప్రజాస్వామిక నీతిని ప్రశ్నిస్తూనే ఉన్నారు. ఇవన్నీ రాజ్యాంగ బద్ధ ఉద్యమాలే! వీటిలో రాజ్యాంగ వ్యతిరేక, అప్రజాస్వామిక ప్రశ్నలుగానీ, కోరికలుగానీ, డిమాండ్లుగానీ, ఉద్యమాలుగానీ లేనేలేవు. మోడీ-షా భాజపా పాలనలో వీటన్నిటికీ దొరుకుతున్న సమాధానం ఒక్కటే - హింస, బల ప్రయోగం, అణచివేత, జైళ్లు, హత్యలు; పోలీసు కాషాయ శక్తుల జమిలి జులుం, దేశ అత్యున్నత న్యాయస్థాన తీర్పులను కూడా లెక్కచేయని అధికార మదం. మరి ఇటువంటి ఫాసిస్టు దుశ్చర్యల నుండే, దుర్మార్గపు అణిచివేత నుండే, ఉద్యమం పుట్టుకురావడం సహజం.

మన దేశంలో అర్ధవలస-అర్ధ భూస్వామ్య-ఫాసిస్టు సామాజిక స్థితిగతుల నుండే 1960 దశకంలో వామపక్ష తీవ్రవాదంగా పిలవబడుతున్న నక్సల్బరీ ఉద్యమం పుట్టి పెరిగింది. ఆనాటి నుండి ఈ నాటి వరకు అన్ని రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలకు నక్సలిజం, వామపక్ష తీవ్రవాదం లేక మావోయిస్టు ఉద్యమం ఒక సవాల్‌గా మారిందని ప్రకటిస్తూనే ఉన్నాయి.

ఇక తీవ్రవాదాల గురించి మాట్లాడుకోవాల్సి వస్తే మన దేశంలో ఇపుడు ప్రబలంగా విస్తరించి ఉన్నది బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్ట్ తీవ్రవాదం. భారత రాజ్యం ఇప్పుడు ఈ తీవ్రవాదపు కబంధ హస్తాల్లో చిక్కుకుని ఉంది.

రెండవది దీనికి ప్రత్యర్థి. ఈ ప్రత్యర్థి తనది పీడిత ప్రజాపక్ష వాదంగా, మావోయిజంగా నిర్వచించుకుంటున్నది. అలానే వారి విధాన పత్రాల్లో 'పీపుల్స్‌వార్' లేక 'ప్రజాయుద్ధం' ద్వారానే శ్రామిక ప్రజా విముక్తి సాధ్యమనే సిద్ధాంత ఆచరణలను ప్రజలకు బోధిస్తున్నది. ఆ మార్గాన్నే ఎన్నుకుని గత 50 ఏళ్లుగా నడత సాగిస్తున్నది. వీరికే ప్రభుత్వాలు వామపక్ష తీవ్రవాదులనే ముద్ర వేశాయి. ఇపుడు వీరిని అంతమొందించే ఆఖరి పాదంలో, అంతిమ పథంలో తామున్నామని హోం మంత్రి షా చెబుతున్నాడు. కావచ్చు, కాకపోవచ్చు. ఆ విషయం

దేశ అంతర్గత భద్రతామంత్రి అమిత్ షా గారికి, ఇంకా మావో యిస్టు పార్టీ కేంద్ర నాయకత్వానికి తెలియాలి.

అయితే దేశాల చారిత్రక మానవ సామాజిక అనుభవం ప్రతి అణచివేత, ప్రతి ఊచకోత ఏదో ఒక రకపు తీవ్రవాదానికి దారి తీస్తుందని చెబుతోంది. ఈనాటి ఇస్లామిక్ తీవ్రవాదం అలా పుట్టి పెరిగిందే కదా!

అయితే మతవాద అతివాదాలకు పూర్తి విరుద్ధమైనది మార్క్సిస్టు -లెనినిస్టు- మావోయిస్టు వాదం. ఇది శ్రామిక రాజ్యాధికార సాధనకు, వర్గరహిత, దోపిడీ పీడనా రహిత సమాజ నిర్మాణానికై శ్రామిక ప్రజల మధ్య పనిచేస్తుంది. అయినప్పటికీ పాలక ప్రభుత్వాలు అన్నిచోట్లా ఈ ఇరు శ్రేణులను ఒకేగాటకట్టి టెర్రరిస్టు ముద్ర వేస్తున్నాయి.

భారతదేశంలో నక్సల్బరీ విప్లవోద్యమం మొదలై 50 ఏళ్లు దాటింది. అది పుట్టినప్పటి తీవ్ర పరిస్థితుల్లో అది అతి తీవ్రతను ప్రదర్శించి చాలానే నష్ట పోయింది. కుంచించించుకు పోతూ, విస్తరిస్తూ, తిరిగి నష్టపోతూ, పడుతూ లేస్తూ దాని గమనం ఇప్పటివరకు సాగింది. ప్రభుత్వ పోలీసు, అర్ధ-సైనిక, సైనిక బలగాల దాడుల్లో చాలా నష్టాలు చవిచూసింది. ఈ సుదీర్ఘ యాత్రలో తనతో కూడుకున్న శక్తుల నుండి ఎంతో మంది ఏవేవో కారణాలతో ఉద్యమం నుండి బయటకు వచ్చారు. మావోయిస్టు పార్టీకి పెద్ద వనరుగా ఉన్న ఆదివాసీ సమాజం కూడా పలు మార్పులకు గురై ఇప్పుడు చీలిపోయింది. ఇవి ప్రభుత్వానికి కలిసొస్తున్న అంశాలు.

మావోయిస్టు పార్టీ తన సైనిక శక్తి, పాటవాలతో పాటు బహుళ శ్రామిక ప్రజా రాశులకు, వివిధ ప్రజా సమూహాలకు తన వాదనను, విముక్తి విధి విధానాలను తీసుకువెళ్లలేని బలహీనతలను ఎదుర్కొంటోంది. ఒక్క భారత దేశంలోనే కాదు, ఫిలిప్పీన్స్, టర్కీ పెరూ, కొలంబియా తదితర దేశాల్లోనూ మావోయిస్టు పార్టీలు ఇటువంటి స్థితిని అధిగమించ లేకుండా స్తబ్దతకు లోనవ్వడమో, క్రమంగా బలహీనపడటమో చూస్తున్నాం.

భారతదేశం అత్యంత క్లిష్టమైన సమాజం. ఈ సమాజంలో ప్రతి విడివిడి సమూహం వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఉంది. ఈ సమూహాలు ఇమేజెస్ వెంబడి పరిగెడుతుంటాయి. ఆ ఇమేజెస్ అద్భుతాలు సృష్టిస్తాయని నమ్ముతాయి. ఈ సమూహాలన్నీ అశాస్త్రీయ అంధకారంలో, వ్యక్తుల అతీత శక్తుల భయంకరమైన ఆరాధనలో ఈదులాడుతూ ఉంటాయి. అంచేత అంబానీ అడ్డగోలుగా కోట్లకు పడగలెత్తుతున్నాడన్నా, అదానీ అక్రమంగా ఎదిగిపోతున్నాడన్నా వాళ్ల చెవి కెక్కదు, పట్టదు. పైగా అటువంటి వారిని ఆరాధ్యులుగా, దైవాంశ సంభూతులుగా భావించి కీర్తిస్తారు, వారికి కిరీటాలు తగిలిస్తారు. ఈ పని కూలీ చేస్తాడు, చిరు వ్యాపారి చేస్తాడు, చిరుద్యోగి చేస్తాడు, సూటు బూటు మనిషీ చేస్తాడు.

ఇలా ఎందుకు చెప్పవలసి వస్తుందంటే ఇంతవరకు ఈ దేశంలో, ఇంకా చెప్పాలంటే మొత్తం ప్రపంచంలో కమ్యూనిస్టులు ఈ ఇమేజ్ సమ్మోహం నుండి మానవాళిని పక్కకు ఈడ్చడంలో, విముక్తం చేయడంలో విఫలమయ్యారు. మరి ఇప్పుడు మావోయిస్టు పార్టీ మట్టుకు ఈ పని చేయగల్గుతుందా? ఈ పని చేయకుండా, విప్లవాన్నది విజయవంతం చేయడం సాధ్యమా? సామ్రాజ్యవాదం, అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి, దేశీయ దళారీ బూర్జువా పెట్టుబడి, బ్రాహ్మణీయ హిందుత్వ ఫాసిజం, నయా భూస్వామ్యం అనే మహాపర్వతాల పెనుభారంతో నుజ్జునుజ్జవుతున్న భారత దేశాన్ని విముక్తి చేసి, శ్రామిక ప్రజలకు ఓ వెలుగుదారి చూపించగల్గుతుందా?

మావోయిస్టు పార్టీపై ఇటువంటి ఓ ప్రశ్నార్థక, సందేహాత్మక ప్రజా మానసిక స్థితి కనిపిస్తోంది. ప్రజలు ఈ స్థితిని అధిగమించి చైతన్యవంతం అవ్వాలంటే పార్టీ వారికి ఓ కొత్త చూపును, కొత్త ఆచరణ మార్గాన్ని సైద్ధాంతికంగా, అందించవలసి ఉంది. ఈ పార్టీపై అపారమైన నమ్మకం పెట్టుకున్న ప్రజల్లో కొత్త ఆశలు చిగురింప చేసే లోతైన అధ్యయనం, విశ్లేషణలతో కూడుకున్న నూతన ఆచరణ ఈ పార్టీ చేపట్టాల్సి ఉంది. అటువంటి ప్రయత్నం, నిరంతర దిద్దుబాటు కార్యక్రమం ఆ పార్టీ నిర్వహిస్తున్నదని వారి సిద్ధాంత పత్రాలు తెలియచేస్తున్నాయి.

గత 5 దశాబ్దాల్లో దేశంలో, సమాజంలో చోటుచేసుకున్న, చోటుచేసుకుంటున్న మార్పులను, పరిణామాలను ఈ పార్టీ లోతుగా అధ్యయనం చేస్తున్నదని, విశ్లేషిస్తున్నదని చెప్పడానికి తార్కాణం వారు 2021 జనవరి మాసంలో విడుదల చేసిన మూడు ప్రధాన పత్రాలను ఇక్కడ ఉదాహరణగా చూపవచ్చు. ఆ పత్రాలు: 1.భారతదేశ ఉత్పత్తి సంబంధాల్లో మార్పులు- కార్యక్రమం, 2. భారత దేశంలో కుల సమస్య-దృక్పథం 3. భారతదేశంలో జాతుల సమస్య - వైఖరి.

ఈనాడు మావోయిస్టు పార్టీ ఒక్కటే ఈ దేశంలో ప్రజల పక్షాన నిఖార్సుగా, త్యాగనిరతితో, నిబద్ధతతో నిలబడి పనిచేస్తోంది గనుక ఆ పార్టీ విస్తృత శ్రామిక రాశుల్లో, వారి భాగస్వామ్య పాత్రలో గణనీయమైన మార్పు తీసుకురాగల సత్తా సంతరించుకుంటే, అటువంటి సాధన సంపత్తి సమకూర్చు కోగల్గితే, అది భారత శ్రామిక ప్రజా విముక్తిని త్వరితగతిన సాధ్యం చేయగలదు. ప్రభుత్వాల అణచివేత, తుడిచివేత సైనిక చర్యలను తట్టుకుని ఆ పార్టీ తాను ప్రకటించుకున్న గమ్యాన్ని చేరుకోగలదు.

ప్రభుత్వాల ఇష్టాయిష్టాల పైనో, కొంతమంది వ్యక్తుల, సమూహాల ఊహాజనిత వాదనల, భావనల పైనో సామాజిక మార్పులు రావు. విప్లవ పర్యవసానాలు ఉండవు. దోపిడీ, పీడన, అణచివేతలు సమాజంలో ఉన్నంతకాలం వర్గ సంఘర్షణ, వర్గ పోరాటం ఉంటాయి. మార్పుకోసం పోరాడే శక్తుల సమీకరణ ఉంటుంది. ఈ సమీకరణాల ఉధృతి, తీవ్రత ప్రజా పోరాట నిర్మాణ దక్షతలపై ఆధారపడి బలపడతాయి. వాటిని నడిపించే సైద్ధాంతిక శక్తిపై వాటి చోదకత ఉంటుంది. ఈ సమీకరణల దశ-దిశలు ఎప్పుడూ ఒకేలా ఉండవు.

అంతిమంగా పీడిత-తాడిత పక్షాలు, పీడక దోపిడీ పక్షాలు యుద్ధంలోకి దిగి తేల్చుకోవాల్సిందే! తమ తమ అధికారం నిలుపు కోవాలన్నా, కొత్తగా సాధించాలన్నా ఈ వర్గ యుద్ధంలో గెలవాల్సి ఉంటుంది. ఈ మధ్యలో చోటుచేసుకునే మార్పులన్నీ పాలక-పాలిత పక్షాల మధ్య తాత్కాలిక రాజీలే తప్ప సమూల మార్పుకాదు.

అంతిమంగా సమాజ గమనానికి ప్రజలే నిర్ణేతలు, మార్పు సాధకులు. పాలకులు కానే కాదు. మంత్రుల సమావేశాలు, ప్రజా ఉద్యమాల అణచివేత ప్రణాళికలు సామాజిక రుగ్మతలకు శాశ్వత పరిష్కారాలు కాజాలవు. వీ

*(రచయిత శ్రామికనేస్తం సంపాదకులు)*

# కశ్మీర్‌లో నెలకొన్న దుస్థితీ, రానున్న ప్రమాదమూ

*అక్టోబర్ మొదటి వారంలో కశ్మీర్‌లో తిరిగి ప్రారంభమైన హింసాకాండ నేపథ్యాన్ని వివరిస్తూ, భవిష్యత్ పర్యవసానాల గురించి హెచ్చరిస్తున్నారు* **అనురాధ భాసిన్**

అక్టోబర్ తొలి రోజుల్లో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ అధినేత మోహన్ భగవత్ జమ్మూ కశ్మీర్ లలో పర్యటించాడు. కొత్తగా కేంద్ర పాలిత ప్రాంతంగా మారిన ఆ ప్రాంతంలో ఆయన మొదటి పర్యటన అది. జమ్మూలో ఒక సదస్సులో మాట్లాడుతూ, ఆ ప్రాంతంలో వ్యవస్థ మారాలంటే, "మొట్టమొదట మానసిక స్థితి మారాలి, హృదయ పరివర్తన జరగాలి" అన్నాడాయన.

ప్రజలతో సంప్రదింపులు జరపకుండానే జమ్మూ కశ్మీర్ ప్రత్యేక హోదాను రద్దు చేసి, రాష్ట్రాన్ని రెండు కేంద్రపాలిత ప్రాంతాలుగా మార్చి రెండు సంవత్సరాలు గడిచిపోయాక ఇప్పుడు ఎక్కడ చూస్తే అక్కడ మనసు మారిపోయిన చిహ్నాలే కనబడుతున్నాయి. కాకపోతే, బహుశా భగవత్ కోరుకున్నటువంటి మార్పు కాదది.

రాజ్యాంగం నుంచి అధికరణం 370ని, అధికరణం 35ఎ ను తొలగించిన 2019 ఆగస్ట్ 5 తర్వాత, గత కాలపు రాష్ట్రం ఒక భయానకమైన నిశ్శబ్దంలో మునిగిపోయింది. కొత్తగా ఏర్పడిన కేంద్ర పాలిత ప్రాంతం లడఖ్‌లో, బౌద్ధులు అధిక సంఖ్యాకులుగా ఉండే లే జిల్లాలో మాత్రమే ఉత్సాహంతో కూడిన ఉత్సవాలు జరిగాయి. హిందువులు అధిక సంఖ్యాకులుగా ఉండే జమ్మూ ప్రాంతంలో కూడ కొన్ని సంబరాలు జరిగాయి.

ఇవాళ చూస్తే, తాము కశ్మీరీ రాజకీయ ఆధిపత్యాన్ని తప్పించుకున్నా మనుకుంటే అంతకన్న ఘోరంగా ఆ ప్రాంతపు హిల్ కౌన్సిల్ సాగిస్తున్న పెత్తందారీ ఆధిపత్యం కింద నలిగిపోతున్నామని లడఖ్ రాజకీయ నాయకులు అంటున్నారు. దానితో అసంతృప్తి పెరుగుతూ, ప్రత్యేక రాష్ట్రం కావాలనే ఆకాంక్షలు మళ్లీ తలెత్తుతున్నాయి. తమ భూమినీ, ఉద్యోగాలనూ బైటి నుంచి వచ్చినవాళ్లు కొల్లగొడతారనే ఆందోళన, వరదలాగ బైటి జనం వచ్చిపడితే తమ ప్రాంతపు పర్యావరణానికి ప్రమాదం ఏర్పడుతుందనే ఆందోళన చెలరేగుతున్నాయి. మరొకవైపు రాజ్యాంగంలోని ఆరవ షెడ్యూల్‌లో చేర్చడం ద్వారా తమ ప్రాంతపు ఆదివాసి సముదాయాలను పరిరక్షించాలని వారు చేస్తున్న డిమాండ్ మీద ప్రభుత్వం ఉలుకూ పలుకూ లేకుండా ఉంది. ఈ సమస్యలకు తోడుగా, చైనీయులు అధీన రేఖ దాటి చొచ్చుకురావడం లడఖ్‌లోని రెండు లక్షల డెబ్భై వేల లడఖ్ వాసులను తీవ్రంగా ఆందోళన పరుస్తున్నది.

ఇక జమ్మూలో కూడ అసంతృప్తి ప్రారంభమయింది. తమ ప్రాంతం పట్ల వివక్ష చూపుతున్న ప్రభుత్వ "అగమ్యగోచర విధానాల"ను నిరసిస్తూ జమ్మూ చాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ, ఎన్నో వ్యాపార సంస్థలు, బార్ అసోసియేషన్ ఆఫ్ జమ్మూ సెప్టెంబర్ 22న సమ్మె చేశాయి. 2019 ఆగస్ట్ తర్వాత ఈ ప్రాంతంలో మొట్టమొదటి సమ్మె ఇది.

స్పష్టంగా చెప్పాలంటే, జమ్మూ గాని, లడఖ్ గాని అధికరణం 370ని పునరుద్ధరించాలనీ ఏమీ కోరడం లేదు. రెండు ప్రాంతాల లోను, నిరసనకారులందరూ ఏకీభావంతో ఉన్న ఒకే ఆకాంక్ష స్థానికులకు భూమి మీద, వ్యాపారం మీద, ఉద్యోగాల మీద ప్రత్యేక హక్కులకు రక్షణ ఇవ్వాలనీ, రాజ్యాంగ హామీ ఇవ్వాలనీ మాత్రమే. హిమాచల్ ప్రదేశ్‌లో, ఈశాన్య రాష్ట్రాలలో ఉన్న అటువంటి ప్రత్యేక రక్షణలను వాళ్లు ఉదాహరణగా చూపుతున్నారు.

గత మూడు దశాబ్దాలుగా భారతీయ జనతా పార్టీ వైపు బౌద్ధులు చూపుతున్న మొగ్గు, జమ్మూ కశ్మీర్ నుంచి తమ లడఖ్ ప్రాంతాన్ని వేరు చేసి కేంద్రపాలిత ప్రాంతంగా మార్చాలనే వారి ఆకాంక్షను నెరవేర్చడంతో మరింత బలపడింది. అయితే ఆ నిర్ణయం ఈ ప్రాంతంలోని రెండు జిల్లాల మధ్య అఖాతాన్ని మరింత పెంచింది. బౌద్ధుల ప్రాబల్యం ఉన్నలే జిల్లాకూ, ముస్లింల ప్రాబల్యం ఉన్న కార్గిల్ జిల్లాకూ మధ్య ఉన్న అఖాతం అది. కాని రెండు సంవత్సరాల్లో లడఖ్‌లో తలెత్తిన కొత్త ఆందోళనలు, ఆ విభేదాల రాజకీయ క్షేత్రాన్ని మార్చేశాయి. ఇప్పుడు రెండు జిల్లాలలోని రాజకీయ బృందాలన్నీ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షతో ఏకమయ్యాయి.

ఇక జమ్ములోని హిందూ ప్రాంతం సాంప్రదాయకంగా దేశ విభజనకు ముందు నుంచీ కూడ ఆర్ఎస్ఎస్ భావజాలం ప్రభావంలో ఉంది. 2019 తర్వాత జరిగిన మార్పుల పట్ల తీవ్రమైన అసంతృప్తి ఉన్నప్పటికీ, జమ్ములో హిందూ భావజాల సమూహం యథాతథంగానే ఉంది. దానికే కట్టుబడి ఉంది. జమ్ములో రాజకీయ వైఖరి మారే అవకాశం ఏదీ లేనట్టు కనబడుతున్నది గాని, 2019 ఆగస్ట్ 5 తర్వాతి ఆర్థిక పర్యవసానాల పట్ల అసంతృప్తి మాత్రం క్రమంగా వ్యక్తమవుతున్నది. మొత్తానికి విభజనానంతర పర్యవసానాలతో వారు సంతోషంగా లేరనేదే రెండు ప్రాంతాల స్పష్టమైన ఏకాభిప్రాయం.

అయితే, ఎప్పుడూ రాజకీయ సంక్షోభానికీ, సంఘర్షణకూ కేంద్ర స్థానంలో ఉండే కశ్మీర్‌లోయలో మాత్రం అసాధారణమైన నిశ్శబ్దం వ్యాపించింది. గుప్కార్ ప్రకటనలో వ్యక్తీకరణ పొందినట్టుగా అప్పుడప్పుడు అక్కడక్కడ అధికరణం 370 రద్దు పట్ల కొన్ని రాజకీయ పార్టీల గొణుగుడు తప్ప, ఎక్కడా స్పష్టంగా కనిపించే నిరసన సూచనలు లేవు. రాళ్లు విసరడాలు లేవు, దైనందిన సమస్యల నుంచి రాజకీయ సమస్యల వరకు తమ ఆకాంక్షలు ప్రకటించడానికి వీథుల్లో భారీ ప్రజా సమీకరణలు, ప్రదర్శనలు లేవు. వార్తాపత్రికల నిండా జమ్మూ కశ్మీర్ అధికార వ్యవస్థ సాధించిన విజయాల గురించిన వార్తలూ

ప్రకటనలూ మాత్రమే కనబడుతున్నాయి. లేదాలోయలో పర్యాటకుల తాకిడి ఎలా ఉందో, వైమానికదళ విన్యాసాలు ఎలా జరుగుతున్నాయో, కొత్త చలనచిత్ర విధానం ఎలా ఉందో వంటి వార్తలు మాత్రమే ఉంటున్నాయి.

కశ్మీర్‌లో హృదయ పరివర్తన జరిగిందా-భగవత్ కలగంటున్నటువంటి మార్పు జరిగిందా?

శ్రీనగర్‌లో ఇటీవల జరిగిన ఒక బహిరంగ ప్రజా ఉత్సవంలో, ఒక ముఖ్యమైన రహదారిలో కొంత భాగాన్ని కళలకు కేటాయించిన ప్రాంతంగా మార్చారు. అక్కడ రహదారి మీద విద్యార్థులు కశ్మీర్ నైసర్గిక సౌందర్యపు చిహ్నాలను చిత్రించారు. కొన్ని రోజుల తర్వాత ఆ కళాత్మక చిత్రాల మీద పడుకుని విశ్రాంతి తీసుకుంటున్న ఊరకుక్కల బొమ్మలూ, సౌందర్యమయంగా మారిపోయిన ఆ ప్రాంతం మీద ఉచ్చులు పోస్తున్న కుక్కల బొమ్మలూ సోషల్ మీడియాకు ఎక్కాయి.

ఆ చిత్రాల తాత్కాలిక సౌందర్యం ఒక గాథ. గుంతలు పడిన రోడ్లు, మురికి కంపు కొట్టే చెత్తకుండీలు, పగిలిపోయిన స్ట్రీట్ లైట్లు, తరచూ పోయే కరెంటు, ఉండీ లేనట్టున్న మంచినీటి సరఫరా లాంటి దైనందిన వాస్తవికతతో ఈ చిత్రాలను పోల్చి చూపుతూ స్థానికులు, తమ నగరంలో గౌరవప్రదమైన జీవనానికి అత్యవసరమైనవాటికి కొరత ఉన్నప్పుడు ఈ చిత్రాలు ఆ ఖాళీని భర్తీ చేయగలవా అని అడుగుతున్నారు. స్థానిక ఆర్థిక వ్యవస్థ కూడ కునారిల్లుతున్నది. సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ (సి ఎం ఐ ఇ) తాజా నివేదిక ప్రకారం స్థానిక నిరుద్యోగం అతి ఎక్కువగా, దేశంలోకెల్లా అతి ఎక్కువ స్థాయిలో 21.6 శాతంగా నమోదైంది.

కాని ఇటువంటి సమస్యలకు ప్రచారసాధనాలలో స్థలమే దొరకదు. అందుకు బదులుగా, ఈ చిత్రకళా వ్యవహారాన్ని స్మార్ట్ సిటీ పథకపు కలికితురాయిగా, స్థానిక కళాకారులకు అవకాశంగా ప్రచారసాధనాలు వర్ణించాయి. దాదాపు బానిసత్వాన్ని అనుభవించినప్పటికీ, ఇటీవల ఎన్నో సంక్షోభాల నుంచి సాగివచ్చినప్పటికీ, కశ్మీరీ కళాకారులకూ, చేతివృత్తుల నిపుణులకూ శతాబ్దాలుగా ప్రేరణనిస్తున్నవి పుష్పాలంకరణలూ, ప్రకృతి చిత్రణలూ మాత్రమే. సుప్రసిద్ధమైన పష్మినా శాలువాలు గాని, కాగితపు గుజ్జుతో తయారుచేసే వస్తువులు గాని చేతివృత్తుల కళాకారుల మీద అమలైన దారుణమైన దోపిడీ చరిత్రను, కశ్మీర్ దుస్థితిని, దాని సంచలన రాజకీయాలను ఎప్పుడూ చూపనే లేదు. ప్రభుత్వం కళకు, కళాకారులకు ప్రోత్సాహం, ఆదరణ ఇచ్చేమాట నిజమే గాని, ఆ కళాకారులు తమను తాము పుష్పాలంకరణలకు, షికారాలకు, కాంగ్రిలకు పరిమితం చేసుకున్నప్పుడు మాత్రమే అది ఉంటుంది. 'జాతీయ ప్రయోజనాల' కోసం కశ్మీర్ ను అట్లా మాత్రమే చూడవలసి ఉంటుంది. అందుకు భిన్నమైన కళాత్మక వ్యక్తీకరణ లేదా అత్యంత సాధారణమైన మాట కూడ భారత రాజ్యం పట్ల విమర్శనాత్మకమైనదిగానో, లేక భారత రాజ్యానికి అభిమానపాత్రులైన మిత్రులకు వ్యతిరేకమైనదిగానో కనబడుతుంది. అందువల్ల ఆ రచయితలు, కళాకారులు, జర్నలిస్టులు, చివరికి సాధారణ నెటిజన్లు కూడ శిక్షలకు గురవుతారు.

క్రిమినల్ నేరారోపణలు, అరెస్టులు, అక్రమ నిర్బంధాలు లేదా ప్రశ్నించడం కోసం పోలీస్ స్టేషన్‌కు రమ్మని నోటిమాట ఆదేశాల రూపంలో ఉండే రాజ్య స్పందనా ప్రక్రియ ఆయా వ్యక్తులను భయపెడుతుంది, చివరికి ఆ వ్యక్తులు సోషల్ మీడియా నుంచే అదృశ్యమైపోయేట్టు చేస్తుంది. ఉదాహరణకు, శ్రీనగర్‌లో ఉండే చిత్రకారుడు ముదసిర్ గుల్ ను మేలో అక్రమంగా నిర్బంధించారు. పాలస్తీనియన్ జెండాను తల మీద కప్పుకుని కళ్ల నిండా నీళ్లతో ఉన్న ఒక స్త్రీ బొమ్మను ఒక గోడ మీద చిత్రించి, దాని కింద "మనం పాలస్తీనా" అని ఒక వాక్యం రాశాడనేది ఆయన మీద ఆరోపణ. గాజా మీద ఇజ్రాయెల్ బాంబుదాడులు చేసి, పాలస్తీనా పౌరులను బలిగొన్న ఘటనకు ప్రతిస్పందన అది.

ఆగస్ట్ 5 తర్వాత కశ్మీర్ ప్రచారసాధనాలలోని అతి పెద్ద భాగం రాజ్యం చెప్పుచేతల్లోకి వచ్చింది. ప్రభుత్వ అత్యాధునిక నియంత్రణా యంత్రాంగం ఒక భయ భీతావహ వాతావరణాన్ని తయారుచేసి పెట్టింది. అత్యధిక ప్రచారసాధనాలు పైవారు ఏమి చెపితే దాన్ని అంగీకరించి నోరు మూసుకుని కూచోవడం, లేదా పర్యవసానాలను భరించడానికి సిద్ధపడడం అనే స్థితి వచ్చింది. స్థానిక వార్తాపత్రికలలో చాల భాగం ఇప్పుడు వార్తల కన్న ఎక్కువ స్థలంలో ప్రభుత్వ ప్రకటనలు వేస్తున్నాయి. పత్రికలన్నీ ప్రభుత్వ విజయాల గురించిన వార్తలతో నిండిపోతున్నాయి. చాల తరచుగా ప్రభుత్వం రాసి ఇచ్చిన వార్తా నివేదికలను తప్పులు కూడ దిద్దకుండా అచ్చు వేస్తున్నారు.

ప్రభుత్వం ప్రచారం చేసే ఈ సానుకూల కథనానికి తూట్లు పొడిచే విమర్శనాత్మక వార్తారచన చేసే జర్నలిస్టులు ప్రధాన లక్ష్యంగా మారుతారు. పోలీసుల నుంచి పిలుపులు, జర్నలిస్టుల ఇళ్ల మీద దాడులు, తప్పనిసరిగా జవాబు ఇవ్వాలని ఆదేశిస్తూ వ్యక్తిగత సమాచారం బైటపెట్టాలనే ఒత్తిళ్లు, తీవ్రవాద ఆరోపణలపై కొందరి అరెస్టులు వంటి ఇటీవలి చర్యల ద్వారా విలేఖరుల మెడలకు ఉరి బిగిస్తున్నారు. ఇదంతా భయం గొలిపే నిశ్శబ్దాన్ని సృష్టించడానికే.

ఈ చర్యలకు గురి అవుతున్నవారి భయం వల్ల గాని, అవమాన భావన వల్ల గాని ఈ నిర్బంధ చర్యలు బహిరంగంగా అందరికీ తెలిసేలా బైటికి రావడం లేదు. దీనికి జూన్ 2020 నుంచి ప్రచార మాధ్యమాల విధానం అనే రూపంలో అమలులో ఉన్న సెన్సార్ షిప్ జత కలిసింది. ఈ విధానపు ప్రధాన లక్ష్యం ప్రచార మాధ్యమాల ద్వారా ప్రభుత్వం గురించి సానుకూల దృక్పథాన్ని ప్రచారం చేయడం. ఆ విధంగా ప్రచార సాధనాలను ప్రజా సంబంధాల విభాగంగా మార్చివేసిన తర్వాత ప్రభుత్వం ప్రపంచానికి ఏమి చూపదలచుకున్నదో అది మినహా మిగిలినవన్నీ అదృశ్యమై పోతున్నాయి.

ప్రభుత్వం సాగిస్తున్న ఈ ఒత్తిళ్ల ఎత్తుగడల గురించి మాట్లాడడానికి వార్తాపత్రికల సంపాదకులు సిద్ధంగా లేరు. జర్నలిస్టుల పట్ల ప్రభుత్వం అనుసరిస్తున్న "తాయిలాలు (ప్రకటనలు) తన్నులు (వేధింపులు)" పథకంలోని నగదు రూపక ప్రయోజనాలను కొందరు అనుభవిస్తుండగా, చాలా జాగ్రత్తతో కూడిన వైఖరి తీసుకోవాలనుకునే మరికొందరు అధికారులనుంచి వచ్చే ఫోన్ కాల్స్ తో నోరు మూసుకుంటున్నారు. ఆ ఫోన్ కాల్స్ స్పష్టంగానే "పరిణామాల" గురించి బెదిరిస్తాయి. ఏ ఒక్కరూ బైటికి చెప్పడానికి సిద్ధంగా లేరు గాని, కొందరైనా, వ్యక్తిగత సంభాషణల్లోనైనా తమ దుస్థితి గురించి పంచుకుంటారు.

ఒకసారి ప్రచారమాధ్యమాలు మౌనంలోకి జారిపోయాయంటే మొత్తం ప్రజానీకం గొంతు కోల్పోయినట్టే. చిత్రహింసలు, చట్టవ్యతిరేక హత్యలు, బలవంతపు అదృశ్యాలు వంటి దారుణమైన మానవహక్కుల ఉల్లంఘనల కన్న ఎక్కువగా ఇలా ప్రపంచానికి తెలియకుండా ఉండిపోయే పద్ధతుల ద్వారా నియంతృత్వం అంతకంతకూ ఎక్కువగా అమలవుతున్నప్పుడు ప్రచార మాధ్యమాలు మౌనం దాలిస్తే అది మరింత సులభమవుతుంది. ఒక మిలిటెంట్ తోనో, బహిరంగంగా పనిచేసే కార్యకర్తతోనో సంబంధం ఉండడం, లేదా ఎక్కడో అనుకోకుండా జరిగిన దాడుల్లో ఒక స్మార్ట్ ఫోన్ దొరికి అందులో సమాచారమూ సోషల్ మీడియా పోస్టులు ఉండడం ఇప్పుడు 'దేశద్రోహ' నేరానికి సాక్ష్యాధారాలవుతాయి. చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం కింద నేరారోపణలకు దారితీస్తాయి. లేదా ప్రజా భద్రతా చట్టం కింద పదే పదే నిర్బంధానికి కారణమవుతాయి.

నేషనల్ బ్యూరో ఆఫ్ క్రైం రికార్డ్స్ 2020 నివేదిక ప్రకారం, దేశ జనాభాలో కేవలం ఒక్క శాతం మాత్రమే ఉన్న జమ్ము కశ్మీర్‌లో దేశంలోని మొత్తం యుఎపిఎ కేసులలో మూడో వంతు కేసులు నమోదయ్యాయి. దేశం మొత్తం మీద 2019లో 1226 ఉన్న యుఎపిఎ కేసులు 2020లో 796కు పడిపోగా, జమ్ము కశ్మీర్‌లో మాత్రం అదే కాలంలో 255 నుంచి 287కు పెరిగాయి. ఈ యుఎపిఎ కేసుల్లో చాల భాగం గురించి పత్రికల్లో వార్తలు కూడ రావడం లేదని న్యాయవాదులు, కార్యకర్తలు అంటున్నారు. ఇక బెదిరింపుల గురించి, దాడుల గురించి వార్తలు మరింత తక్కువ వస్తాయి. సర్వత్రా భయం వ్యాపించిన ఇటువంటి వాతావరణంలో, అటు అధికారులు గాని, ఇటు దాడులకు గురవుతున్న వ్యక్తులు గాని సమాచారాన్ని బైటపెట్టరు. ఈ భయ వాతావరణం ఎంత విస్తృతంగా ఉన్నదంటే, కశ్మీర్ నుంచి సమాచారం కోసం నేను ఎప్పుడూ మాట్లాడుతూ ఉండే వాళ్లలో చాల మంది ఇప్పుడు అసలు నా ఫోన్ ఎత్తడం లేదు, ఒకవేళ మాట్లాడినా తమ పేరు బైటపెట్టగూడదని కోరుతున్నారు.

సైనికశక్తి సాగించిన పాశవిక చర్యలు మాత్రమే కాదు, 2019 తర్వాత ప్రభుత్వం ప్రవేశపెట్టిన అనేక చట్టాలు, విధానాలు, ఈ భయ వాతావరణం కింది దాకాలోతుగా వ్యాపించడానికి కారణమయ్యాయి. ఈ కొత్త చట్టాలలో వందలాది సంచార జాతులను నిర్వాసితులను చేసిన, వారి సాంప్రదాయక ఆశ్రయాలైన అడవులనుంచీ, పశుగ్రాస ప్రాంతాల నుంచీ వెళ్లగొట్టిన భూమి చట్టాలున్నాయి. ఇప్పుడీ కొత్త చట్టాల ప్రకారం, రాళ్లు విసిరిన నేరాలతో సహా కొన్ని నేరారోపణలున్న వ్యక్తులకు అధికారులు పాస్ పోర్ట్ నిరాకరించవచ్చు. "రాజ్య భద్రతకు ప్రమాదకరమైన చర్యల"లో పాల్గొన్నారనే ఆరోపణతో ప్రభుత్వోద్యోగులను నిరంకుశంగా ఉద్యోగాల నుంచి తొలగించవచ్చు. ఈ చట్టాలు నెలకొల్పిన ప్రమాణాల ప్రకారం కూడ ఘోరమైనదని అనిపించే తాజా ప్రభుత్వ ఉత్తర్వు ఒకటుంది. ఈ కొత్త ఉత్తర్వు ప్రకారం, కుటుంబ సభ్యులు, సన్నిహిత మిత్రులు చేసిన పనులకు కూడ ప్రభుత్వోద్యోగులకు శిక్ష విధించవచ్చు. ఈ ఉత్తర్వులో ఉపయోగించిన భాష ఎంత అస్పష్టమైనదీ, విశాలమైనదీ అంటే, అది అనేక మంది మనసులలో భయభీతావహం నింపింది. ఏదో ఒక సాకు మీద తమ ఉద్యోగం ఎప్పుడు ఊడిపోతుందో అనే నిరంతర భయంలో బతుకుతున్నామని నా మిత్రులైన ప్రభుత్వోద్యోగులు అంటున్నారు.

ఈ కథనాలకు ప్రచారసాధనాల్లో చోటే దొరకదు. "సజావుగా ఉన్న పరిస్థితి", "పర్యాటక రంగం", "విజయాలు", "అధికరణం 370 రద్దు వల్ల లాభాలు", "తీవ్రవాదం" అనే అధికార కథనాలు మాత్రమే జమ్ము కశ్మీర్ గురించి ప్రాచుర్యంలో ఉంటాయి.

గడిచిన రెండు సంవత్సరాలలో, ప్రభుత్వమూ, భద్రతా బలగాలూ పదే పదే ప్రకటించినది మిలిటెంట్ల మీద వారు సాధించిన విజయం గురించీ, మిలిటెంట్లు చనిపోయిన ఎన్ కౌంటర్ల జాబితాల గురించీ మాత్రమే. అధికారిక సమాచారం ప్రకారం, జూలై చివరి నాటికి 90 మంది మిలిటెంట్లు చనిపోయారు. అంతకంతకూ తక్కువ మంది మిలిటెంట్లుగా మారుతున్నారు. "ఇది భద్రతా బలగాలకూ సమాజానికీ కూడ శుభవార్త" అని పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ విజయకుమార్ జూలైలో అన్నారు.

ఉత్సాహం నిండిన ఈ ప్రకటన మిలిటెన్సీలో తలెత్తుతున్న కొత్త ధోరణులను పరిగణనలోకి తీసుకోలేదు. గత కొద్ది నెలల్లోనే మిలిటెంట్లు అత్యున్నత భద్రతా ప్రాంతాల మీద నిర్భయంగా దాడులు చేశారు. నిరాయుధ జవాన్ల మీద, పౌరుల మీద దాడులు చేశారు. ఈ సంవత్సరం ఇప్పటివరకూ, 28 మంది సాధారణ పౌరులు మిలిటెంట్ల చేతుల్లో హతమయ్యారు. అక్టోబర్ మొదటి వారంలో ఏడుగురు సాధారణ పౌరులు చంపివేయబడ్డారు. అందులో ఐదుగురు అల్పసంఖ్యాక వర్గాలకు చెందినవారు. ముస్లింలు అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న కశ్మీర్‌లోయ ప్రాంతంలో అల్పసంఖ్యాక వర్గపు వ్యక్తుల హత్యలు జరుగుతున్నాయంటే, అది రానున్న మహా ఉత్పాతానికి ఒక సూచన. ఆ ఉత్పాతాన్ని జమ్ము కశ్మీర్ గాని, మిగిలిన దేశం గాని భరించజాలవు.

మిలిటెంట్లు అనుసరిస్తున్న కొత్త వ్యూహం భద్రతా బలగాలకు తీవ్రమైన సవాల్. ఇటీవల పెచ్చరిల్లిన హత్యలతోనే ఈ సవాల్ ఉనికిలోకి వచ్చింది. ఆ ఘటనలు వేరువేరుగానే జరిగినప్పటికీ, తీవ్రవాదులుగా అనుమానిస్తున్నవారు కశ్మీర్‌లోని అల్పసంఖ్యాకవర్గాలకు చెందిన ఇద్దరు పాఠశాల ఉపాధ్యాయులను ప్రత్యేకంగా ఎంచుకొని మరీ కాల్చి చంపేశారు. అలాగే ఒక ప్రముఖ కశ్మీరీ పండిట్ ఔషధ వ్యాపారిని ఆయన దుకాణంలోనే కాల్చి చంపారు. ఇండియన్ ఎక్స్ ప్రెస్‌లో వచ్చిన వార్తలో పేరు చెప్పని ఒక భద్రతా అధికారి ఈ దాడులు "పార్ట్ టైం" మిలిటెంట్లు చేసి ఉంటారని, వారు ఎక్కడా నిఘాలో లేరని, పిస్టల్ ఉపయోగించి, సాధారణ లక్ష్యాలను చంపుతారని అన్నాడు.

అధికరణం 370 రద్దు చేస్తున్నప్పుడు, ఇక దానితో "తీవ్రవాదం అంతమవుతుందని, జమ్ము కశ్మీర్ వాసులు సమానత్వాన్నీ, అభివృద్ధినీ సాధిస్తారని" భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం హామీ ఇచ్చింది. అందుకు భిన్నంగా ఇవాళ్టి కశ్మీర్ స్థితి, అధికారిక తప్పిదాల వల్ల బాగుచేయడానికి వీలులేనంత దుస్థితి, విధ్వంసాల సుడిగుండంలోకి తోసివేయబడిన ప్రాంతానికి ప్రతీకగా ఉన్నది. గత రెండు సంవత్సరాలలో మొత్తం పాలనా, భద్రతా యంత్రాంగపు సకల శక్తీ,

కేంద్రీకరణా అంతా కూడ సైనిక, పాలనా పీడన ద్వారా కశ్మీర్‌లోని రాజకీయ, సామాజిక, ఆర్థిక స్థలాలను అణగదొక్కడం మీద మాత్రమే ఉండింది. దశాబ్దాలుగా కశ్మీర్ ఎన్నో దశల అతి భయానక నిరంకుశత్వం కింద నలిగిపోయినప్పటికీ, గతంలో ఢిల్లీ సైనిక పీడన మధ్యలో అప్పుడప్పుడు ఊపిరి పీల్చుకునే అవకాశం ఇస్తుండేది. ఇప్పటిలాగా మొత్తం జన బాహుళ్యాన్ని ఇక భరించడానికి వీల్లేని స్థితికి నిరంతరం నెట్టుతూ పోతుంటే ఎటువంటి పర్యవసానాలు ఉంటాయనే అనాలోచిత వైఖరి ఉండేది కాదు.

దాదాపు ఒక నెల కింద, కశ్మీర్‌లో కొనసాగుతున్న సంక్షోభ స్థితిని ఒక భయానక సంఘటన మళ్లీ గుర్తు చేసింది. హురియత్ నాయకుడు సయ్యద్ అలీ షా జిలానీ మరణించిన గంటలోపే ఆయన మృతదేహాన్ని స్వాధీనం చేసుకోవడానికి పోలీసు బలగాలు ఆయన ఇంటిని చుట్టుముట్టాయి. ఒక ఏడాదిగా మంచంలోనే ఉండి, నిష్క్రియాపరంగా ఉండిన, తొంబయో పడిలో ఉన్న వృద్ధనాయకుడి మృతదేహాన్ని రహస్యంగా గుట్టు చప్పుడు కాకుండా బలవంతాన తీసుకుపోయి, తెల్లవారేలోపు ఖననం చేశారంటే, "పరిస్థితి మెరుగుపడింది" "సజావుగా ఉంది" "వేర్పాటువాద నాయకుల ప్రభావం క్షీణిస్తున్నది" లాంటి ప్రగల్భాలన్నీ ఎంత నిజమో తెలుస్తున్నది. నిర్బంధంతో పాటు, తామే చేసిన అనేక పొరపాట్లవల్ల కశ్మీరీ వేర్పాటువాద నాయకులు ఇవాళ ప్రాసంగికత లేనివారుగా కనబడుతుండవచ్చు. కాని వేర్పాటువాద భావనలు అంతరించాయనే సూచనలేమీ లేవు. అంతకంతకూ పెరుగుతున్న పరాయి భావన, ఆగ్రహం, నిరాశ వేర్పాటువాద భావనలను బలోపేతం చేస్తున్నాయి. రాజకీయ, ప్రజాస్వామిక స్థలాలనేవే లేకుండా, ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా కాలరాచింది గనుక ఆ భావనలకు బైటికి కనబడే వ్యక్తీకరణ లేకపోవచ్చు. ఇక బైటపడేది తుపాకుల ద్వారా మాత్రమే బైటపడుతుంది.

ఉదారవాదులు, మేధావులతో సహా చాల మంది భారతీయులు ప్రభుత్వం చూపే 'అంతా బాగుంది' అనే తప్పుడు దృశ్యపు వలలో చిక్కుకుంటారు. వాళ్లకు అది తప్ప మరేమీ వినబడదు. కాని కశ్మీర్‌లోని భయం గొలిపే మౌనమే, ప్రభుత్వం చెప్పే "అంగీకారం", ఏదో ఒకరకమైన సామూహిక సంతృప్తి అనే కథనాలకు వ్యతిరేక సాక్ష్యమిస్తున్నది. కశ్మీరీలు అనుదినం నివసిస్తున్న వాస్తవికత ఎంత దారుణమైనదో, సంవత్సరాలుగా మోస్తూవస్తున్న వేదన ఎంత బరువైనదో ప్రధాన భారత భూభాగంలో నివసిస్తున్న భారతీయులు అర్థం చేసుకోవడం కష్టం. తాము బతకవలసి వస్తున్న బ్రహ్మాండమైన భయంవల్ల, 2019 కంటె ముందు ఉండిన అతి స్వల్పమైన హక్కులు కూడ నానాటికీ తరిగిపోతున్న స్థితితో తలపడుతుండడం వల్ల కశ్మీరీలు భారత మేధావుల, ఉదారవాదుల మౌనం పట్ల ఆగ్రహంతో కాకపోతే అసంతృప్తితో మాత్రం ఉన్నారు.

అల్పసంఖ్యాక వర్గాల వారిని ఎంచుకుని చంపడంతో పాటు, మొత్తంగా సాధారణ ప్రజల హత్యలు ఇప్పటికైనా మన కళ్లు తెరిపించాలి. కాని భారత ఉదారవాదుల తక్షణ స్పందనలు ఆశాజనకంగా మాత్రం లేవు. కశ్మీర్‌లోని అల్పసంఖ్యాకవర్గపు వ్యక్తుల హత్యల పట్ల న్యాయంగానే దేశవ్యాప్త ఆగ్రహం పెల్లుబకగా, అనంతనాగ్‌లో కేవలం బారికేడ్ లు దాటి వెళ్లాడనే కారణంతో ఒక గుజ్జర్ ముస్లిం వ్యక్తిని భద్రతా బలగాలు చంపివేసిన ఘటన కనీసమైన జవాబుదారీతనపు ప్రశ్నలను కూడ రేకెత్తించలేదు.

సాధారణ పౌరులను మిలిటెంట్లో, రాజ్య భద్రతా బలగాలో చంపివేసిన ఘటనలు కశ్మీర్‌లో సంక్షోభాన్ని మరింత తీవ్రం చేయడమో, నిరాశానిస్పృహలను పెంచడమో మాత్రమే చేయవు. వాటికి మరింత తీవ్రమైన, సుదూరమైన పర్యవసానాలుంటాయి. మరీ ముఖ్యంగా ప్రస్తుత దేశ పాలకులు విభజన రాజకీయాలను పెంచిపోషించే పనిలో, రాజ్యాంగబద్ధ ప్రజాస్వామ్యాన్ని పక్కనపెట్టి తమ హిందుత్వ ఎజెండాను ముందుకు తీసుకుపోయే పనిలో తలమునకలుగా ఉన్నప్పుడు ఆ పర్యవసానాలు తీవ్రంగా ఉంటాయి. ముట్టుకుంటే పగిలిపోయే మత సామరస్యమూ ఉధృతమైన మతోన్మాద మనోభావాలూ భారతీయ జనతా పార్టీకి అపారమైన సంపద. వాటిని తమ ఎన్నికల అవకాశాల కోసం వాడుకోవడం అనే కళలో వాళ్లు నిష్ణాతులయ్యారు, ఆ కళ మీద వాళ్లదే గుత్తాధిపత్యం. అందువల్లనే ఇటీవలి హత్యలను వివరించడానికి ప్రయత్నిస్తున్న కశ్మీరీలు చాలమంది "అంతర్గత రాజ్యం" అనే కుట్ర సిద్ధాంతాన్ని ముందుకు తెస్తున్నారు. అటువంటి కుట్ర సంభావ్యతను కాదనడానికి లేదు. కాని ఆ సిద్ధాంతాన్ని బలపరచడానికి తగినన్ని ఆధారాలు కూడ ఇప్పటికైతే లేవు. అయితే, సాధారణ ప్రజానీకానికి చేరువ కావడం, మిలిటెంట్లను ఒంటరి చేయడం అనే పనిని వదిలి, తీవ్రవాదం మీద పోరాటం పేరుతో మొత్తం జనాభా మీద మితిమీరిన వేగంతో అణచివేత కొనసాగించి, కశ్మీర్ ను ఈ స్థితికి తీసుకురావడంలో రాజ్యం అదుపులేని బాధ్యతారాహిత్యాన్ని పాటించిందని చెప్పడానికి మాత్రం అన్ని ఆధారాలూ ఉన్నాయి.

ఇటీవలి హత్యలు, ప్రత్యేకించి పండిత్ ల, సిక్కుల హత్యలు, ప్రతి ఒక్కరినీ భయపెట్టాయి, దిగ్భ్రాంతి పరిచాయి. కాని కశ్మీరీలలో మీరు ఎవరితో మాట్లాడినా సరే, ప్రతి ఒక్కరూ, ఇదంతా ఊహించనిదేమీ కాదని అంటారు. కశ్మీరీలకు వ్యతిరేకంగా అమలైన నిరంకుశత్వానికి తొలి స్పందనలు తప్పనిసరిగా హింసాత్మకంగా, నిర్హేతుకంగా, ద్వేషపూరితంగా ఉండబోతాయని అందరూ ఊహించారు. భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం ఎంత పెద్ద ఎత్తున మందుగుండు సామగ్రి పోగుచేసి పెట్టిందంటే, అది ఊహాతీతమైన పరిమాణపు అగ్నిపర్వతాన్ని పేల్చగలుగుతుంది. ఆ రానున్న ఉత్పాతానికి ముందస్తు సూచనలే ప్రస్తుతం అక్టోబర్ మొదటివారంలో చిటపటమన్నాయి. "మనం మహా గడ్డు కాలాన్ని ఎదుర్కోబోతున్నాం. ఇప్పుడు కనబడుతున్నవి దాని పై అంచులు మాత్రమే" అని పీపుల్స్ కాన్ఫరెన్స్ అధ్యక్షుడు సజాద్‌లోన్ అన్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం "ఈ ఎత్తైన గుర్రాన్ని దిగడం మంచిది" అని ఆయన ప్రభుత్వానికి హితవు పలికారు.

గతంలో ఉండిన జమ్ము కశ్మీర్ రాష్ట్రపు దుర్బలత్వాన్ని చైనా చొరబాట్లు, అఫ్ఘనిస్తాన్‌లో మారుతున్న పరిణామాలు, పాకిస్తాన్ కూ చైనాకూ మధ్య పెరుగుతున్న మైత్రి వంటి ఇరుగుపొరుగు దేశాల

# అమ్మకానికి ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు

*దేశ రక్షణకు సంబంధించిన ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలను ప్రైవేట్‌పరం చేయడమంటే దేశ రక్షణను ప్రమాదపుటంచులకు నెట్టడమేనని అంటున్నారు* **పబ్బతి వెంకటేశ్వర్లు**

ఆత్మ నిర్భర భారత్‌లో దేశ రక్షణకు మూలమైన వ్యవస్థలు కూలిపోతున్నాయి. మూడు వందల సంవత్సరాల అద్భుత చరిత్ర కలిగిన భారత ఆయుధ కర్మాగారాల చరిత్ర ఇక చరిత్రలో కలువబోతున్నది. ఒక దేశం, ఆ దేశ ప్రజలు క్షేమంగా ఉండాలంటే అభివృద్ధి కార్యక్రమాలు, సంక్షేమ కార్యక్రమాలు, సజావుగా సాగాలంటే, దేశం సుభిక్షంగా ఉండాలంటే, ఆ దేశం పొరుగు దేశాల నుంచి ఎటువంటి ప్రమాదాలు ఎదుర్కొనకుండా ఉండాలి. పొరుగు దేశాల నుంచి వచ్చే ప్రమాదాలు ఎదుర్కోవడానికి ఆర్థికంగానే కాక ఆయుధపరంగా కూడా సిద్ధంగా ఉండాల్సి ఉంటుంది. రక్షణ వ్యవస్థలు పటిష్టంగా ఉండాలి. దానికి అవసరమైన ఆయుధ సంపత్తిని సమకూర్చుకోవడానికి స్వయం సంమృద్ధిని సాధించాలి. దానికి బయటి దేశాల మీద ఆధారపడకుండా సొంతంగా తమ రక్షణ అవసరాలకు సరిపోయే ఆయుధ సామగ్రిని స్వయంగా తయారు చేసుకోగలగాలి. అవసరమైన నైపుణ్యాలను సాధించి ఆయుధాలను ఉత్పత్తి చేసే స్వయంప్రతిపత్తి వ్యవస్థను కలిగి ఉండాలి. కానీ ప్రస్తుత పరిస్థితి చూస్తుంటే దేశ రక్షణ కోసం ముందు ముందు ప్రైవేట్ శక్తులపై, అలాగే ఇతర దేశాలపై ఆధారపడి వారి దయాదాక్షిణ్యాల కోసం దేబిరించాల్సిన పరిస్థితి దాపురించబోతున్నది.

మూడు శతాబ్దాల ఆయుధ కర్మాగారాలకు చెదలు పట్టబోతున్నది. బ్రిటిష్ ఇండియా కాలం నుంచి నేటి వరకు కావలసిన ఆయుధ సంపత్తిని అందించి దేశ రక్షణకు జరిగిన రెండు యుద్ధాలకు ఆయుధాలను స్వయం సరఫరా చేసి సాక్షీభూతమైన ఆయుధ కర్మాగారాలన్నీ శిధిల చరిత్రకు చిహ్నంగా మిగులబోతున్నాయి. దేశ రక్షణకు రాబోయే కాలంలో ప్రమాదం పొంచి ఉన్నట్టు కనిపిస్తుంది. ఎందుకంటే దేశం అన్ని రంగాల్లో అభివృద్ధి చెందడానికి, ప్రజలకు ప్రభుత్వం తరఫున సహాయం, సంక్షేమ ఫలాలు అందడం కోసం ఏర్పాటు చేసిన అనేక సంస్థలు, ఒక రకంగా దాదాపు అన్ని సంస్థలు కనీవినీ ఎరుగని రీతిలో అమ్మబడుతున్నాయి. అనేక ప్రభుత్వ రంగ సంస్థలు అంగట్లో సరుకులుగా మారి ప్రైవేట్ వ్యక్తులకు బంగారు గుడ్లు పెట్టే సంస్థలుగా మారుతున్నాయి. ప్రభుత్వ సంస్థలు అంటే ప్రజలకు నమ్మకం. ప్రజలకు అందుబాటులో ఉండి స్వలాభాపేక్ష లేకుండా అవి చేసే సేవలు ప్రజలకు ఊరటనిస్తాయి. అదే ప్రైవేటు సంస్థలు తమ సంపాదనే లక్ష్యంగా పని చేస్తాయి. ప్రజల కష్టనష్టాలతో వాటికి సంబంధం లేదు. వాటి అంతిమ లక్ష్యం సంపాదనే. ప్రభుత్వ రంగ సంస్థలన్నీ ప్రైవేట్ సంస్థగా మారుతుంటే తమ జీవితాలు భవిష్యత్ కాలంలో ఎంత దుర్భరంగా మారబోతున్నాయో అర్థం చేసుకోగలిగిన వారు ఆందోళన పడుతున్నారు. ఈ క్రమంలో దేశ రక్షణకు మూడు శతాబ్దాలుగా సేవలందిస్తున్న ఆయుధ కర్మాగారాలన్నీ పునర్నిర్మాణం పేరిట దేశ రక్షణ ప్రవేట్ చేతుల్లోకి వెళ్లిపోతున్నది. ప్రధానమంత్రి నరేంద్రమోడీ గారి నాయకత్వంలోని కేంద్ర మంత్రివర్గం 2021, జూన్ 16న భారతదేశ ప్రధాన ఆయుధాలు, సైనిక పరికరాల తయారీ సంస్థ ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ బోర్డు(ఒ.ఎఫ్.బి )ను కార్పొరేటీకరణ చేయడానికి నడుం బిగించింది. ఇదే ప్రస్తుత ఆందోళనకి కారణం ఈ సందర్భంగా ఆర్డినెన్సు ఫ్యాక్టరీల గురించి వాటి పునర్నిర్మాణం గురించి దాని పర్యవసానాల గురించి చర్చించుకోవలసి ఉన్నది.

**చరిత్ర**

ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ బోర్డు అనేది దేశంలో నెలకొల్పబడ్డ ఇండియన్ ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలతో కూడుకున్నది. ఇది డైరెక్టర్ ఆఫ్ ఆర్డినెన్స్ అని పిలువబడుతుంది. రక్షణ మంత్రిత్వశాఖ (ఎం.ఓ.డి) ఆధ్వర్యంలో పనిచేస్తుంది. దీని కింద 41 ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు, తొమ్మిది శిక్షణా సంస్థలు, మూడు ప్రాంతీయ మార్కెటింగ్ కేంద్రాలు, నాలుగు ప్రాంతీయ భద్రతా నియంత్రణలు ఉన్నాయి. ఓ.ఎఫ్.బి, ప్రపంచంలోని పరికరాల తయారీదారులలో 37వ స్థానంలో ఉంది. ఆసియాలో

---

రాజకీయ దృశ్యం మరింత బలహీనపరుస్తుంది. అయితే, ఈ భౌగోళిక-రాజకీయ ప్రమాదం భారత ప్రభుత్వం స్వయంగా తన విధానాల ద్వారా తెస్తున్న ప్రమాదం కన్న పెద్దది కాదు. ఒక కోటీ ముప్పై ఆరు లక్షల పౌరుల ప్రాంతాన్ని అణచివేయడం, దాని అధికారాలను రద్దు చేయడం అనేవి ఆ తప్పుడు విధానాలు. మరో మాటల్లో చెప్పాలంటే, దేశ భూభాగంలోని ప్రజలను అంచులకు నెట్టినప్పుడే దక్షిణాసియాలో తలెత్తుతున్న వ్యూహాత్మక సమస్యలు మరింత జటిలంగా మారుతాయి.

దురదృష్టవశాత్తూ, భారత రాజ్య విధానాలు సరిగ్గా ఆ దిశలోనే సాగుతున్నాయి. దానివల్ల రానున్న పర్యవసానాలు కేవలం జమ్మూ కశ్మీర్ కు మాత్రమే కాదు, యావత్తు దేశానికే ఎలా ఉంటాయో తలచుకుంటేనే భయం కలుగుతున్నది.

(రచయిత జమ్మూ నుంచి వెలువడే ఇంగ్లిష్ దినపత్రిక ది కశ్మీర్ టైమ్స్ ఎగ్జిక్యూటివ్ ఎడిటర్)

రెండవ స్థానంలో ఉంది. ఇది ప్రపంచంలోని అతి పెద్ద ప్రభుత్వ నిర్వహణ ఉత్పత్తి సంస్థ. భారతదేశంలో అతి పురాతనమైనది. ఫోర్త్ ఆర్మ్ ఆఫ్ డిఫెన్స్ అని, ఫోర్స్ బిహైండ్ ఆర్మ్డ్ ఫోర్సెస్ అని పిలుస్తారు. గత సంవత్సరం వీటి ఉత్పత్తి సామర్థ్యం మూడు బిలియన్ డాలర్లుగా ఉండి ప్రైవేట్ సంస్థలకు అందనంత ఎత్తులో దీని సామర్థ్యం ఉంది. ప్రతి సంవత్సరం మార్చ్ 18న భారతదేశంలో ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ దినోత్సవంగా జరుపుకుంటారు. దీనిలో దాదాపు 80000 మందికి పైగా ఉద్యోగులు పనిచేస్తున్నారు.

ఆర్డినెన్స్ బోర్డు భారతదేశంలో భారత రైల్వేల కంటే అత్యంత పురాతనమైన చరిత్ర కలిగింది. మొట్టమొదట భారతదేశంలో డచ్ పోస్టర్ అండ్ కంపెనీ 1712 సంవత్సరంలో కలకత్తాలోని ఇషాపూర్ లో గన్ పౌడర్‌ని తయారు చేసే ఆయుధ ఫ్యాక్టరీని స్థాపించింది. ఆ తర్వాత 1802లో కలకత్తాకి దగ్గర్లోని కాసీఫోర్‌లో దేశీయ ఆయుధ కర్మాగారం స్థాపించబడింది. ఈ స్వదేశీ కంపెనీకే రెండు వందల ఇరవై సంవత్సరాల చరిత్ర ఉంది. 1775లో కలకత్తా పోర్టు విలియం బోర్డ్ ఆఫ్ ఆర్డినెన్స్ ఏర్పాటు చేయడం జరిగింది. 1935లో భారత దేశంలోని మొత్తం రక్షణ ఉత్పత్తి పరిశ్రమలు నిర్వహించడానికి ఇండియన్ ఆర్డినెన్స్ సర్వీస్ ప్రవేశపెట్టబడింది. 1979లో ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ బోర్డు స్థాపించబడింది. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ బోర్డు ప్రస్తుతం రక్షణ మంత్రిత్వ శాఖ కింద ఉంది., త్రివిధ సాయుధ దళాలకు, పారామిలటరీకి కీలకమైన ఆయుధాలు, మందుగుండు సామగ్రిని సరఫరా చేస్తుంది. ఆయుధాలు, మందుగుండు సామగ్రి, సాయుధ దళాలు, పారా మిలటరీ, పోలీసు బలగాలు ఉపయోగించే సామాగ్రిలో పెద్ద భాగం శాతయాభీ శాతం- నడిపే ఫ్యాక్టరీల నుండి వస్తాయి. వాటి ఉత్పత్తులలో పౌర, సైనిక-గ్రేడ్ ఆయుధాలు, మందుగుండు సామగ్రి, పేలుడు పదార్థాలు, ప్రొపెల్లెంట్‌లు, క్షిపణి వ్యవస్థలు, సైనిక వాహనాలు, సాయుధ వాహనాలు, ఆప్టికల్, ఎలక్ట్రానిక్ పరికరాలు, పారాచూట్‌లు, సహాయక పరికరాలు, సాయుధ దళాల దుస్తులు, సాయుధ దళాల కోసం సాధారణ స్టోర్ అంశాలు ఉన్నాయి. వీటి ద్వారా ఆయుధాలు, మందుగుండు సామగ్రి, ఆయుధాలు విడిభాగాలు, రసాయనాలు, పేలుడు పదార్థాలు, పారాచూట్లు, తోలు వస్తువులు ప్రపంచవ్యాప్తంగా 30కి పైగా దేశాలకు ఎగుమతి చేయబడతాయి.

ఇండియన్ ఆర్డినెన్స్ ఫ్యాక్టరీల ప్రధాన కస్టమర్‌లు భారత సాయుధ దళాలు. ఇండియన్ ఆర్మీ, ఇండియన్ నేవీ, ఇండియన్ ఎయిర్ ఫోర్స్. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు. సాయుధ దళాలకు ఆయుధాలను సరఫరా చేయడమే కాకుండా సివిల్ సంస్థలైన భారత రైల్వేలు, ఇస్రో, డిఫెన్స్ రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్, లిక్విడ్ ప్రొపల్షన్ సిస్టమ్స్ సెంటర్, న్యూక్లియర్ ఫ్యూయల్ కాంప్లెక్స్, ఏరోనాటికల్ డెవలప్‌మెంట్ ఏజెన్సీ, డిపార్ట్ మెంట్ ఆఫ్ అటామిక్ ఎనర్జీ, డిపార్ట్ మెంట్ ఆప్ టెలికమ్యూనికేషన్స్, స్టేట్ ఎలక్ట్రిసిటీ బోర్డులు. భారతదేశంలోని ప్రభుత్వ రంగ సంస్థలు, ఎచ్ఎంటి లిమిటెడ్, హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్, భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్, భారత్ డైనమిక్స్ లిమిటెడ్. మొదలైనవి కూడా ఉన్నాయి.

గతంలో ప్రభుత్వాలు ఈ కంపెనీల సమర్థత పెంచడం కోసం 4 కమిటీలు వేసింది 1. టిఆర్ఎస్ నాయర్ కమిటీ (2000), విజయ్ కేల్కర్ కమిటీ (2005), వైస్ అడ్మిరల్ మాన్ పూరి కమిటీ (2015) కార్పొరేట్లకు అనుకూలంగా ఉన్నట్లు కనిపించినప్పటికీ నాలుగో కమిటీ మాజీ మంత్రి మనోహర్ పారికర్ ఏర్పాటుచేసిన లెఫ్టినెంట్ జనరల్ డిబి షెట్కర్ అధ్యక్షతన ఏర్పడిన కమిటీ కార్పొరేటీకరణను సూచించలేదు కానీ రెగ్యులర్ ఆడిట్ చేయాలని సూచించింది.

2021, జూన్ 16న కేంద్ర మంత్రివర్గం నిర్ణయం ప్రకారం, ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ బోర్డు 41 ఉత్పత్తి యూనిట్లను (ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు) కార్పొరేట్ చేయడానికి భారత ప్రభుత్వం నిర్ణయించింది. రక్షణ ఉత్పత్తి, రక్షణ మంత్రిత్వ శాఖ ప్రకారం, భారత ప్రభుత్వం 2021, అక్టోబర్ 1న ("అపాయింటెడ్ డేట్"), 41 ఉత్పత్తి యూనిట్ల నిర్వహణ, నియంత్రణ, కార్యకలాపాలు, నిర్వహణను 7 ప్రభుత్వ కంపెనీలకు బదిలీ చేయాలని నిర్ణయించింది. కేంద్ర మంత్రి వర్గ నిర్ణయం ప్రకారం ఒఎఫ్‌బి యొక్క కార్పొరేటీకరణ కోసం వ్యూహాత్మక, అమలు నిర్వహణలో కన్సల్టెన్సీ సేవలను అందించడానికి ప్రభుత్వం అడ్వైజరీ సర్వీసెస్ ప్రైవేట్ లిమిటెడ్‌తో పాటు ఖైతాన్ అండ్ కో లిమిటెడ్‌ను కన్సార్టియం సభ్యునిగా నియమించింది. మరుసటి రోజు, కార్పొరేటీకరణ కోసం రక్షణ మంత్రి రాజ్‌నాథ్ సింగ్ ఛైర్మన్‌గా సభ్యులు హెూం మంత్రి అమిత్ షా, ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్, కార్మిక, ఉపాధి మంత్రి సంతోష్ గంగ్వార్‌లతో ఒక సాధికారిక మంత్రివర్గంను నియమించింది. ఉద్యోగుల వేతనాలు, పదవీ విరమణ ప్రయోజనాలను కాపాడుతూ పునరావాస ప్రణాళికతో సహా మొత్తం ప్రక్రియను పర్యవేక్షించడానికి, మార్గనిర్దేశం చేయడానికి ఇది ఏర్పాటు చేయబడింది. ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం ఒకేరకమైన ఉత్పత్తుల తయారీలో పాల్గొని కంపెనీలన్నింటిని ఒక క్లస్టర్‌గా విభజించారు. 41 ఫ్యాక్టరీలు 9 శిక్షణా సంస్థలను ఏడు డిఫెన్స్ పబ్లిక్ సెక్టార్ యూనిట్స్ (డిపిఎస్‌యు)లుగా విభజించింది.

అవి

1. మునిషన్ ఇండియా లిమిటెడ్
2. ఆర్మీ వెహికల్స్ నిగం లిమిటెడ్
3. అడ్వాన్స్‌డ్ వెపన్స్ అండ్ ఎక్విప్మెంట్ ఇండియా లిమిటెడ్
4. ట్రూప్ కంఫోర్ట్ లిమిటెడ్
5. యంత్రా ఇండియా లిమిటెడ్
6. ఇండియా ఆప్టిల్ లిమిటెడ్
7.గ్లైడర్స్ ఇండియా లిమిటెడ్

పైన పేర్కొన్న ఏడు గ్రూప్ కంపెనీలు భారతదేశ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్ లేదా భారత్ డైనమిక్స్ లిమిటెడ్ వంటి ప్రభుత్వ యాజమాన్యంలోని డిఫెన్స్ పబ్లిక్ సెక్టార్ అండర్ టేకింగ్స్ లాగా మారతాయి.

దీనిలో పనిచేసే ఉద్యోగులు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు వర్తించే అన్ని నియమాలు, నిబంధనలకు లోబడి ఉంటారని వారి వేతన ప్రమాణాలు, భత్యాలు, సెలవులు, వైద్య సదుపాయాలు, కెరీర్

పురోగతి, ఇతర సేవా పరిస్థితులు కూడా కేంద్ర ప్రభుత్వ సేవకులకు వర్తించే విధంగానే ఉంటాయని హామీ ఇస్తున్నారు. పదవీ విరమణ పొందినవారు, ఉన్న ఉద్యోగుల పెన్షన్ బాధ్యతలు ప్రభుత్వం భరిస్తూనే ఉంటుంది. ఉద్యోగుల ప్రయోజనాలను కాపాడటానికి ప్రభుత్వం కట్టుబడి ఉందని యూనియన్‌లకు ప్రభుత్వం తెలిపింది. ఉత్పత్తి యూనిట్‌లకు చెందిన ఉద్యోగులందరూ కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులుగా తమ సేవలను మార్చకుండా ప్రారంభంలో రెండు సంవత్సరాల పాటు డీమ్డ్ డిప్యుటేషన్‌పై కార్పొరేట్ సంస్థలకు బదిలీ చేయాలని నిర్ణయించారు.

**ఉద్యోగుల నిరసన**

రక్షణ రంగ సంస్థలలో ప్రధానమైన రక్షణ రంగ కార్మికుల సమాఖ్యలు మూడు ఉన్నాయి అవి - 1. ఆల్ ఇండియా డిఫెన్స్ ఎంప్లాయీస్ ఫెడరేషన్ 2. ఇండియన్ నేషనల్ డిఫెన్స్ వర్కర్స్ ఫెడరేషన్, 3. భారతీయ ప్రతిరక్షా మజ్దూర్ సంఘ్. ఇవి ప్రధాన రాజకీయ పార్టీలకు అనుబంధంగా పనిచేస్తుంటాయి. బిజెపి అనుబంధ సంఘం కూడా ఈ నిర్ణయాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తున్నది. ఏడు కొత్త డిపిఎస్‌యుల కింద 41 ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలను తీసుకురావాలనే నిర్ణయాన్ని ఉద్యోగులు తిరస్కరించారు. మొత్తం 41 ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలను ఏడు కొత్త డిఫెన్స్ పబ్లిక్ సెక్టార్ సంస్థల కిందకు తీసుకురావడంతో, ఈ ఫ్యాక్టరీల రక్షణ పౌర ఉద్యోగుల ప్రజాభిప్రాయ సేకరణలో తీర్మానానికి వ్యతిరేకంగా అత్యధికంగా ఓటు వేశారు. ప్రజాభిప్రాయ సేకరణలో పాల్గొన్న 99.41 శాతం మంది ఉద్యోగులు ఫ్యాక్టరీల కార్పొరేటీకరణకు వ్యతిరేకంగా ఓటు వేశారు. కేవలం 365 మంది మాత్రమే మద్దతుగా ఓటు వేశారు. కార్పొరేటీకరణ నిర్ణయానికి నిరసనగా అక్టోబర్ 1ని బ్లాక్ డేగా పాటించాలని సమాఖ్యలు నిర్ణయించాయి. ఫెడరేషన్ల ప్రతినిధులు 2021, ఆగష్టు 27న సెక్రటరీతో జరిగిన సమావేశంలో, కార్పొరేట్ చేయడానికి భారత ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని గట్టిగా వ్యతిరేకించా రు. "భారత సాయుధ దళాల జీవనాడి భారత ఆయుధ కర్మాగారాలు" అని వాటి కార్పొరేటీకరణకు తాము ఒప్పుకోమని ఖరాఖండిగా చెప్పాయి. దీనికి వ్యతిరేకంగా సమ్మె చేస్తామని హెచ్చరించారు. అలాగే దేశ వ్యాప్తంగా ఆగస్ట్ 2020 న సమ్మె చేశారు. ఆ తర్వాత ప్రభుత్వం సంప్రదింపులకు ఆహ్వానించింది. ఉద్యోగుల ప్రయోజనాలకు ఎటువంటి విఘాతం కలిగించమని చెబుతూనే ప్రభుత్వ యాజమాన్యంలోని శాతయాఖీ శాతం ల కార్మికులు కార్పొరేటీకరణకు నిరసనగా సమ్మె చేయడం చట్టవిరుద్ధం అని ఎసెన్షియల్ డిఫెన్స్ సర్వీసెస్ బిల్లు 2021 (03 ఆగస్టు 2021 న లోక్‌సభ ఆమోదించింది) ని తీసుకొచ్చింది.

నేటి కార్పొరేటీకరణ రేపటి ప్రైవేట్ కు మార్గం అని దీన్ని తీవ్రంగా అడ్డుకుంటామని హెచ్చరించారు. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ బోర్డులను కార్పొరేటీకరణ చేయబోమని గతంలో రక్షణ మంత్రులుగా పనిచేసిన మనోహర్ పారికర్ వంటి నేతలు హామీ ఇచ్చారని అన్నారు. ఏనాడు కూడా కార్మికనేతల్ని సంప్రదించలేదని, అంతర్జాతీయ కార్మిక చట్టాలను ఉల్లంఘిస్తున్నారని ఆరోపిస్తున్నారు. కనీసం పార్లమెంట్లో కూడా చర్చించకుండా ఏకపక్షంగా బిజెపి ప్రభుత్వం నిర్ణయం తీసుకొన్నదని విమర్శిస్తున్నారు. ప్రభుత్వం ఈ సంఘాలతో చర్చలు జరుపుతామని ఉద్యోగులకు ఏ రకమైన ఇబ్బందులు రానివ్వమని ఒకపక్క చర్చలు జరుపుతూనే కార్పొరేటీకరణకు ఉత్తర్వులు జారీ చేసింది. దీనికి కారణాలుగా కంపెనీలు తయారు చేస్తున్న వస్తువులు నాసిరకంగా ఉంటున్నాయని, వీటివల్ల అనేక మంది సైనికులు చనిపోవటమో, గాయపడటమో జరుగుతున్నదనీ, మందుగుండు, తుపాకుల సరఫరా సకాలంలో చేయడంలేదనీ, ఆధునిక ప్రమాణాలను ఆధునిక ఆయుధాలను తయారు చేయలేక పోతున్నారనీ ఆరోపిస్తున్నారు. కార్మికుల సమ్మెల వల్ల కూడా నష్టాలు చవిచూడాల్సి వస్తున్నదని చెబుతున్నది. అలాగే ఉత్పత్తి ఖర్చులు విపరీతంగా పెరుగుతున్నాయని చెబుతున్నది. దేశంలోని అనేక ప్రాంతాల్లో ఈ కంపనీలు విస్తరించి ఉండటం వల్ల నిర్వహణ ఇబ్బందిగా మారిందని అన్నింటినీ ఓ.ఎఫ్.బి పర్యవేక్షించలేక పోతుందని రకరకాల కారణాలు చూపిస్తుంది. అలాగే కాగ్ రిపోర్ట్‌ను ఉటంకిస్తున్నది. అందుకే కార్పొరేటీకరణకు మొగ్గుచూపుతున్నామని చెప్తుంది.

అయితే ఉద్యోగులు మాత్రం ప్రైవేటు సంస్థల కన్నా మెరుగైన ఫలితాలను చూపుతున్నామని, ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచడానికి అవసరమయ్యే సాంకేతికత, ముడి సామగ్రి సరఫరా చేయాల్సిన బాధ్యత మంత్రిత్వ శాఖదేనని అంటున్నారు. భారతదేశంలో అత్యధికంగా 3 బిలియన్ డాలర్ల ఉత్పత్తి చేశామని, ప్రపంచ ఎగుమతుల్లో 2017-19 సంవత్సరాల్లో ప్రపంచంలో 23వ స్థానంలో ఉంటే, 2019 లో 19 వ స్థానానికి చేర్చామని చెబుతున్నారు. దాదాపు 30 దేశాలకు పైగా రక్షణ ఉత్పత్తి జరుగుతుంది. మా ఉత్పత్తులలో నాణ్యత లేకుంటే విదేశాలు ఎలా మా ఉత్పత్తుల్ని దిగుమతి చేసుకుంటాయని ప్రశ్నిస్తున్నారు. ఎగుమతుల్లోనే కాకుండా సైన్యం యొక్క అవసరాలను తీర్చడంలో తమదే ప్రధానమైన పాత్ర అని వీరు లెక్కలు చూపుతున్నారు.

మోడీ ప్రభుత్వం 2019లో రెండవసారి అధికారంలోకి వచ్చిన తర్వాత ప్రభుత్వరంగ సంస్థలన్నింటినీ గంపగుత్తగా అమ్మేయడం ప్రారంభించింది. అత్యధిక ఉత్పత్తి సామర్థ్యం, వేల లక్షల ఎకరాల భూములను అప్పనంగా ప్రైవేటు సంస్థలకు అమ్మజూస్తున్నది. కోట్ల రూపాయల విలువైనటువంటి భూముల్ని అతి తక్కువ ధరలకే ప్రైవేటు కంపెనీలకు కట్టబెడుతున్నది. ప్రభుత్వం వ్యాపారం చేయదు అంటూనే లాభాలు రావట్లేదు, నష్టాలలో నడపలేము అంటున్నది. మరి నష్టాల్లో ఉన్న వాటిని ప్రైవేటు యాజమాన్యాలు ఎందుకు అంతగా ఎగబడి కొనడానికి ప్రయత్నిస్తున్నాయో ఏలినవారికే ఎరుక. నిర్వహణ సామర్థ్యాన్ని పెంచకుండా,వాటికి సరైన సమయంలో సరుకులు టెక్నాలజీ అందించకపోవడం వల్ల ఇబ్బందులు తలెత్తుతున్నాయి. సమస్యల్ని పరిష్కరించలేక పారిపోతుంది. వాటిని వదిలించుకో జూస్తుంది. ఆత్మ నిర్భర భారత్, మేకిన్ ఇండియా లాంటి పథకాలు తీసుకొచ్చి స్వయంప్రతిపత్తి సాధించాలి అని చెబుతూనే వాటికి విరుద్ధంగా ఈ కంపెనీలన్నింటినీ పునర్నిర్మాణం పేరిట క్రమంగా ప్రైవేటీకరణ వైపు దారులు పరుస్తున్నది. స్వయం ప్రతిపత్తి సాధించి

అభివృద్ధి పథాన నడుపాల్సిన స్థితి నుండి తప్పుకొని వాటిని పరహస్తం చేయాలని చూడటం విడ్డూరం. కార్మిక సమ్మెల మూలంగా నష్టాలు వస్తున్నాయని తన అనుకూల పత్రికలు,కమిటీల ద్వారా కార్మికుల కష్టాన్ని తక్కువ చేసి చూడటం, ఈ స్థితికి వారే కారణం అని చెప్పడం సమస్యను పక్కదారి పట్టించడమే. ఇది భాధ్యతా రాహిత్య వాదనే. ఎందుకంటే వారి హక్కులకు భంగం కలిగినప్పుడు కూడా ఎదిరించకుండా బానిస మనస్తత్వం కలిగి ఉండటం కూడా సరైనది కాదు కనుక హక్కుల సాధన కోసం సమ్మెలోకి ఎప్పుడో ఒకసారి వెలుతుండవచ్చు. అంత మాత్రాన అన్నింటికీ వారే బాధ్యులు అన్న ప్రచారమే సరియైనది కాదు. ఎందుకంటే వారి కృషి మూలంగానే కదా ప్రైవేటు సంస్థలకంటే మిన్నగా ఉత్పత్తిని సాధిస్తున్నారు. సింగరేణి బొగ్గు సంస్థలో కూడా సమ్మెలు జరుగుతాయి. తిరిగి పనిలోకి చేరాక ఉత్పత్తి ఏ స్థాయిలో ఉందో చూడవచ్చు.సింగరేణి అద్భుతమైన లాభాలు ఆర్జిస్తుంది. ప్రతి సంవత్సరం కార్మికులకు అందుతున్న బోనసే దీనికి నిదర్శనం. సమ్మెల వల్ల మొత్తం వ్యవస్థ ఎందుకు ఇక్కడ నాశనం కాలేదు. కారణం కార్మికులు కాదు, సంఘాలు కాదు, సంస్థను నడుపుతున్న అధికారులది ప్రభుత్వానిది. ఈ నెపం కార్మికులకు మీదికి నెట్టడం సరైనది కాదు.

ప్రభుత్వం చాలా కాలంగా ఓ.ఎఫ్.డిల నుంచి సైనికుల డ్రెస్సులు, ఆయుధాలు మొదలైనవి కొనడం లేదు. వీటిని ఎక్కువగా ప్రైవేట్ కంపెనీల నుండి, విదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నాయి. ఆర్డర్లు లేక నిర్వహణ ఖర్చులు పెరిగిపోతున్నాయి. ప్రైవేట్‌లో కొనాల్సిన అవసరమేముంది. ఎందుకు ప్రైవేటు కంపెనీల వైపు మొగ్గు చూపుతాయో జగమెరిగిన సత్యమే. రక్షణ రంగ కొనుగోళ్లలో ఎన్ని అవకతవకలు, కుంభకోణాలు జరిగాయో అందరికీ తెల్సిందే. భారత కంపెనీలకు ఆర్డర్లు ఇస్తే తమకు గిట్టుబాటు కాదు అందుకే బయటి దేశాలకు ఆర్డర్లు ఇస్తారు. ఆర్ అండ్ డి సంస్థలకు నిధులు ఇవ్వక పోవడంతో కొత్త ఉత్పత్తులపై పరిశోధనలు సాగటం లేదు. అత్యంత ప్రధానమైన దేశ రక్షణ వ్యవస్థలు కూడా ప్రైవేటు లేదా విదేశీ సంస్థల చేతుల్లోకి వెళితే అవి తమ స్వలాభం చూసుకుంటాయే తప్ప దేశ అవసరాలు కాదు. యుద్ధ సమయంలో లేదా ఇతర క్లిష్ట సమయాల్లో రక్షణ సామగ్రి పంపిణీ చేసే సందర్భంలో అవి తమ బాధ్యతగా వ్యవహరించజాలవు. ఆ విపత్కర పరిస్థితుల్లో కూడా తమ స్వలాభాన్ని చూసుకొని అత్యధిక ధరలు నిర్ణయిస్తాయి. ఆ కష్టసమయంలో విధి లేని పరిస్థితుల్లో అవి చెప్పినట్లే నడుచుకోవలసి వస్తుంది. దీనికి ఉదాహరణగా కరోనా సమయంలో ప్రైవేట్ ఆస్పత్రుల నిర్వాకాన్ని కళ్లార చూసాం. ప్రజలంతా ఈ ప్రైవేటు ఆసుపత్రుల ఆగడాలను తట్టుకోలేక ప్రభుత్వ ఆసుపత్రులను ఆశ్రయించిన అనుభవం మరిచిపోలేం. ఈ రక్షణ సంస్థల పరిస్థితి కూడా ఇంత కంటే భిన్నంగా ఉండదు. అలాగే అనేక దేశ రక్షణ రహస్యాలు ప్రైవేటు వ్యక్తులకు చేరితే అలాగే విదేశీ సంస్థల చేతుల్లోకి చేరితే జరుగబోయే ప్రమాదం ఊహకందనిది. వాజపేయి హయాంలో రక్షణ రంగ సంస్థల్లో విదేశీ పెట్టుబడుల వాటా 26 శాతం ఉంటే అది ఇప్పుడు 74 శాతానికి చేరింది. పూర్తిగా 100 శాతానికి చేరితే ఇంకా ప్రమాదకరం. కార్పొరేటీకరణ క్రమంగా ప్రైవేటీకరణవైపే. ఇది కాదనలేని నగ్న సత్యం.

ఎన్నో ఏళ్లుగా ప్రజాధనంతో నిర్మించిన అనేక ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటైజేషన్, మానిటైజేషన్ వంటి కార్యక్రమాలతో, కనబడకుండా చేసే ప్రక్రియను బిజెపి ప్రభుత్వం కొనసాగిస్తుంది. రోడ్లు, విద్యుత్, సహజ వాయువు, పెట్రోలియం ఉత్పత్తుల పైపు లైన్లు, గోడౌన్లు, రైల్వే, టెలికాం టవర్లు, ఆప్టిక్ ఫైబర్ నెట్వర్క్ విమానాశ్రయాలు, ఓడరేవులు, స్టేడియంల ఆస్తులు అమ్మటానికి వీలైనవని నీతి ఆయోగ్ ప్రతిపాదనలు ప్రభుత్వానికి అందజేసింది. ఈ క్రమంలోనే ఆర్డినెన్సు కంపెనీల వేల కోట్ల ఎకరాల భూమి కూడా అప్పనంగా కార్పొరేట్లకు అమ్మటానికే ఈ పునర్నిర్మాణం. ఒక్క తెలంగాణలోని ఆర్డినెన్స్ ఫ్యాక్టరీకే మూడు వేల ఐదు వందల ఎకరాల భూమి ఉంది. ఇట్లాంటి ఫ్యాక్టరీలు దేశం మొత్తం మీద 41 ఉన్నాయి. వీటన్నింటినీ అమ్మటం ద్వారా వచ్చిన సొమ్ముతో మౌలిక సదుపాయాల కల్పనకు ఖర్చు చేస్తామని చెబుతున్నది. ఉన్న ప్రభుత్వ రంగాలను అమ్మి, ప్రభుత్వ ఆధ్వర్యంలో మౌలిక సదుపాయాలు కల్పిస్తామని అనటం హాస్యాస్పదం.

జాతీయవాదం, దేశభక్తి గురించి అనుక్షణం మాట్లాడే బిజెపి ప్రభుత్వం దేశ రక్షణకే ప్రమాదం వాటిల్లే పనులకి పూనుకోవటం శోచనీయం. ప్రభుత్వ రంగ సంస్థలు అంటేనే చీత్కార భావాన్ని ఏర్పరుచుకొని, ఏం సాధించదలుచుకున్నదో అర్థం కాకున్నది. నిరంతరం దేశ నాయకత్వం ప్రజల స్థితిగతులు, దేశరక్షణ పరిస్థితుల పట్ల అప్రమత్తత చూపాల్సి ఉంటుంది. తాత్కాలిక ప్రయోజనాలు చూడకుండా, దీర్ఘకాలిక ప్రయోజనాలు చూసుకుంటూ పాలన సాగించాల్సి ఉంటుంది. బలమైన ప్రైవేటు యాజమాన్యాలు ప్రభుత్వాల మీద ఒత్తిడి తెచ్చి తమకు అనుకూలమైనటువంటి చట్టాలు తయారు చేయించుకోవడానికి సర్వశక్తులూ ఒడ్డి ప్రభుత్వానికి, ప్రభుత్వంలో ఉన్న పార్టీలకు అత్యంత సన్నిహితంగా మెలుగుతూ, అవసరమైన అన్ని రకాల సహాయ సహకారాలు అందిస్తూ, తనకు అవసరమైన వాటిని సాధించుకోవడానికి ప్రయత్నిస్తాయి. నేర్చుకోవాల్సింది ప్రభుత్వమే. ఇవి ఎందుకు తమతో అంటకాగుతున్నాయి, వాటి కోరికలు ఎవరికి ప్రయోజనం చేకూరుస్తాయో తెలుసుకొని పాలన సాగించాల్సి ఉంటుంది. ఆదానీ, అంబానీలకో విదేశీ కంపనీలకో ధారాదత్తం చేయడం అంటే తన చేతిలోని కత్తిని శత్రువుకు ఇచ్చి పోరాటం చేయడం లాంటిదే. ప్రైవేట్ యాజమాన్యాలు అంటే ప్రజలకు కనిపించని శత్రువులే. దేశ రక్షణకు, ప్రజలకు ప్రమాదం వాటిల్లే పనులకు దూరంగా ఉండాలి. సార్వభౌమాధికార పరిరక్షణ, సార్వత్రిక ప్రజాక్షేమమే ప్రభుత్వ అభిమతం కావాలి. కానీ వీటికి దూరంగా జరిగినప్పుడు, ప్రజా చైతన్యమే ప్రభుత్వం మెడలు వంచాల్సి ఉంటుంది. ప్రజాస్వామ్య విలువలను వదిలి ప్రతిపక్ష హీనమైన సందర్భంలో, కాలం విసిరిన అనారోగ్య పరిస్థితుల్లో ప్రజా సమూహాలు ఒకటిగా కూడాలేని అనివార్య స్థితిలో గుట్టుగా దేశ భద్రతకు ప్రజా సంక్షేమానికి వ్యతిరేకమైన నిర్ణయాలు జరిగినప్పుడు వాటిని ఎదుర్కోవడానికి ప్రజా ఉద్యమాలే శరణ్యం.

*(రచయిత ఉపాధ్యాయుడు)* వీ

# ప్రైవేటీకరణ దిశగా టిఎస్ ఆర్‌టిసి

*ఆర్‌టిసిని ప్రైవేటీకరిస్తే ప్రయాణ చార్జీల పెంపుకు అదుపు ఉండదనీ, ప్రజలకు భారం అవుతుంది గనుక ప్రజా రవాణాను ప్రభుత్వంలో విలీనం చేసుకోవాలనే ఆకాంక్షతో ప్రజలు ఉద్యమించాలనీ అంటున్నారు* **తండా సదానందం**

మానవ జాతి అభివృద్ధి పరిణామ క్రమంలో రవాణా కీలక భూమికను పోషిస్తున్నది. అందులో ప్రజా రవాణా అత్యంత ముఖ్యమైనది. ప్రజా రవాణా సామాన్య ప్రజలకు అందుబాటులో ఉంటూ వారి జీవితాలలో అంతర్భాగమై వారి అభివృద్ధికి, గమనశీలతకు దోహదపడుతుంది. అటువంటివాటిలో రైల్వేలు, ఆర్‌టిసి ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి. మానవ వనరులు పుష్కలంగా ఉన్న సంస్థ ఆర్‌టిసి. సుదూర ప్రాంతాలకు, రైలు మార్గం లేని ప్రదేశాలకు ప్రజా సేవే మా కర్తవ్యం అంటూ లక్షలాది మంది ప్రయాణికులను చౌకగా, సౌకర్యంగా, భద్రంగా గమ్యస్థానాలకు చేర్చడంలో అందె వేసిన చేయి ఆర్‌టిసి సంస్థది. 89 సంవత్సరాల క్రితం ప్రజలకు సేవలు అందించడానికి ఉపక్రమించిన ప్రగతి రథచక్రాలు ప్రస్తుతం ప్రైవేటీకరణ దిశగా పరుగులు తీస్తున్నాయి.

అన్ని రంగాలపై ప్రపంచీకరణ ప్రభావం పడినట్లే రవాణా రంగం ముఖ్యంగా ప్రజా రవాణాపై తీవ్ర ప్రభావం పడింది. ఈ మధ్యకాలంలో డీజిల్ ధరలు విపరీతంగా పెరగడంతో ప్రయాణికుల సౌకర్యం, ప్రజా సేవకు ప్రాధాన్యత తగ్గి వ్యాపార ధోరణితో బస్సులను నడపవల్సిన దుస్థితి దాపురించడంతో పేద ప్రజల ప్రయాణాలపై తీవ్ర ప్రభావం పడనుంది. దీనికితోడు పాలకుల నిర్లక్ష్యం, యాజమాన్య అలసత్వం, కార్మికుల ఉపేక్ష వెరసి తెలంగాణ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ కార్పొరేట్ల చేతుల్లోకి, కార్మికులు ఇంటి బాట పట్టే విధంగా ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి. అయితే కార్మికులు ప్రభుత్వంలో విలీనం చేయాలని పట్టుబడుతుండగా ప్రభుత్వం ప్రైవేటీకరణ దిశగా, విలువైన ఆర్‌టిసి ఆస్తులను కార్పొరేట్ పెత్తందార్లకు అమ్మడానికి ప్రయత్నాలు సాగించడం ప్రజా సంక్షేమం, సామాజిక బాధ్యత నుండి వైదొలగడం అవుతుంది.

ప్రజల జీవన విధానంలో భాగమై పెనవేసుకుని పోయిన ప్రజా రవాణా వ్యవస్థ అయినా ఆర్‌టిసి పీకల్లోతు అప్పుల ఊబిలో చిక్కుకుపోవడం, ఆక్యుపెన్సీ రేషియో, ఇంధన సామర్థ్యం సరిగానే ఉన్నా, కార్మికులు రోజుకు 16 గంటలు పని చేస్తున్నా నష్టాలు ఎందుకు వస్తున్నాయి? నష్టాలకు కారణం ప్రభుత్వ విధానాలా? కార్మికుల పని తీరా? యాజమాన్య లోపభూయిష్టమైన పరిపాలనా? ప్రభుత్వ తీరు చూస్తుంటే ఈ నష్టాలకు యాజమాన్యం బాధ్యత ఏమీ లేనట్టు, కార్మికుల లోపాలు, ప్రజల ఆదరణ లేకపోవడమే కారణం అన్నట్లుగా చూపిస్తుంది. ఆర్‌టిసి సంస్థ కష్టాల కడలి నుండి గట్టెక్కించలేమా? పరిశీలిద్దాం.

**పుట్టు పూర్వోత్తరాలు:**

ప్రజా రవాణా కోసం ఏడో నిజాం ఉస్మాన్ అలీ ఖాన్ 1932 జూన్‌లో మూడు లక్షల 93 వేల రూపాయల పెట్టుబడితో భారతదేశంలోనే మొట్ట మొదటగా హైదరాబాద్ రాష్ట్రంలో నిజాం గ్యారెంటీడ్ రాష్ట్ర రైల్వే రోడ్డు రవాణా శాఖ పేరిట 3 డిపోలు, 27 బస్సులు, 166 మంది కార్మికులతో రైల్వే ప్రయాణికుల సౌకర్యార్థం సికిందరాబాద్ నుండి నాంపల్లి వరకు బస్సులను నడిపేవారు. రైల్వే పరిపాలన ఆధ్వర్యంలో షెడ్యూల్ చేసిన బస్ సర్వీసులు 450 కిలోమీటర్ల పరిధిలో నడిచాయి. 1936 నాటికే హైదరాబాద్ నుంచి తెలంగాణలోని అన్ని జిల్లాలకు బస్సులు నడవడం ప్రారంభమైంది. అనతికాలంలోనే దాదాపు 500 వాహనాలు 7,200 కిలోమీటర్ల పరిధికి విస్తరించడం జరిగింది.

**ఎపిఎస్ ఆర్‌టిసిగా, తదుపరి టిఎస్ ఆర్‌టిసిగా అవతరణ:**

నిజాం గ్యారెంటీడ్ రాష్ట్ర రైల్వే రోడ్డు రవాణా శాఖను భారత ప్రభుత్వానికి అప్పగిస్తూ, నెంబర్ ప్లేట్‌లోని జెడ్ అక్షరం తన తల్లి జెహ్రా బేగంను సూచిస్తున్నందున, ప్రతి బస్సు నెంబర్‌లో జెడ్ అక్షరం చేర్చే విధంగా ఒప్పందం చేసుకున్నాడు ఉస్మాన్ అలీ ఖాన్. 1951 నవంబర్ 1న ఈ సంస్థ హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వ శాఖగా మార్చబడింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తర్వాత 1958లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థగా (ఎపిఎస్ ఆర్‌టిసి) ఏర్పడింది. 2014లో తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత 2015లో తెలంగాణ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ (టిఎస్ ఆర్‌టిసి)గా విభజించబడింది.

టిఎస్ ఆర్‌టిసిలో హైదరాబాద్, గ్రేటర్ హైదరాబాద్, కరీంనగర్ అనే మూడు జోన్లు ఉన్నాయి. ఈ సంస్థలో 11 రీజన్‌లు, 97 డిపోలు, 357 బస్ స్టేషన్లు ఉన్నాయి. ఈ సంస్థ వెన్నెల, గరుడ, గరుడ ప్లస్, రాజధాని, ఇంద్ర, డీలక్స్, సూపర్ లగ్జరీ, ఎక్స్‌ప్రెస్, పల్లె వెలుగు, హైదరాబాద్ సిటీ బస్సులు మొదలైన సర్వీసులను నడుపుతున్నది. 1950లో కేంద్ర ప్రభుత్వం ఆర్‌టిసి చట్టం చేసింది. ఆర్‌టిసిలో రాష్ట్రం కేంద్రం 2:1 నిష్పత్తిలో పెట్టుబడి పెట్టాలి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 1988 వరకు ఈ నిష్పత్తి కొనసాగుతూ వచ్చింది. అటు తరువాత కేంద్ర రాష్ట్రాలు ఆర్‌టిసికి నిధుల కేటాయింపు నిలిపివేశాయి. అంతవరకూ రాష్ట్ర ప్రభుత్వం 140 కోట్లు, కేంద్రం 70 కోట్లు మొత్తం 210 కోట్ల రూపాయలు ఆర్‌టిసికి పెట్టుబడి పెట్టాయి. 1989 నుంచి పెట్టుబడుల కోసం ఆర్‌టిసి అప్పులు చేయడం ప్రారంభించింది. తమిళనాడు, కేరళ, గుజరాత్, మహారాష్ట్ర రాష్ట్రాలు తమ రాష్ట్రాలలోని రోడ్డు రవాణా సంస్థలకు వేల కోట్ల రూపాయలు ప్రభుత్వ సహాయంగా అందజేసి ఆ సంస్థల మనుగడకు కృషి చేయగా, తెలుగు రాష్ట్రాలు ప్రభుత్వం నుండి రావలసిన బకాయిలు అంద చేయకుండా, సంస్థను అప్పుల పాలు చేసి నష్టాల బాటలో పయనింప చేస్తుండడం శోచనీయం. ప్రభుత్వం ఆర్‌టిసికి కొత్తగా చైర్మన్‌ను, పూర్తి స్థాయిలో ఎండిని నియమిస్తే కష్టాలతో, నష్టాల బాటలో ఉన్న ప్రజా రవాణా సంస్థను

పరిరక్షిస్తారనుకుంటే, వారేమో ఈ నష్టాలు కొనసాగితే ప్రైవేట్ పరం చేస్తామని చెబుతుండడం కొండ నాలుకకు మందేస్తే ఉన్న నాలుక ఊడిపోయిన చందంగా ఉంది.

**ప్రాముఖ్యత - లక్ష్యాలు:**

ఆర్‌టిసి ప్రభుత్వ యాజమాన్యంలో నడిచే ఒక సంస్థ. ఆర్‌టిసి చార్జీలు పెరిగితే, ఏవైనా ప్రమాదాలు జరిగితే ప్రభుత్వం బాధ్యత వహించాలని డిమాండ్ చేస్తారు. ఏవైనా ప్రభుత్వ వ్యతిరేక నిరసనలు, ప్రదర్శనలు జరిగితే ఆర్‌టిసి ఆస్తులకు నష్టం జరుగుతుంది. ఆర్‌టిసిలో రవాణా చార్జీలు సామాన్యులకు అందుబాటులో ఉంటాయి. మారుమూల గ్రామాలకు ప్రయాణ సదుపాయాలు, ప్రత్యేక అవసరాల నిమిత్తం ప్రత్యేక బస్సులు, జాతరలు జరిగినప్పుడు, పెళ్లిళ్ల పేరంటాలకు, రాజకీయ సమావేశాలకు, విద్యార్థుల విహార యాత్రలకు బస్సులు నడపడం జరుగుతుంది. పెరుగుతున్న ప్రయాణ అవసరాలకు అనుగుణంగా అనేక మార్పులను చేపట్టింది. నేడు 96 శాతం రూట్లలో ఆర్‌టిసి బస్సులు పరిగెడుతున్నాయి. ఫలితంగా ఎర్ర బస్సు సామాన్యుల జీవితాలతో పెనవేసుకుని పోయింది. ఆర్‌టిసి సంస్థ ప్రయాణికులకు పరిశుభ్రమైన, అనుకూలమైన, సమయానుగుణంగా ప్రయాణ సదుపాయాలను సరసమైన చార్జీలతో అందించడం, ఆర్థికంగా మానవతా యుతంగానూ ఉద్యోగులకు సంతృప్తి కలిగే విధానాలు, స్వయం సమృద్ధితో నిర్వహణ, ప్రగతిని సమాజంలో ఉన్నతమైన స్థానాన్ని సాధించడం లక్ష్యాలుగా పనిచేస్తుంది.

ఈ లక్ష్యాల సాధనకు వ్యాపారాన్ని నిజాయితీగా ప్రావీణ్యంగా మంచి ఫలితాలను అందించే విధంగా నిర్వహించడం, తమ వ్యాపారానికి పట్టుకొమ్మలు అయిన వినియోగదారులను గౌరవిస్తూ వారికి సంతృప్తి కలిగే విధంగా నాణ్యమైన సేవలను అందించడం, సాంకేతికంగానూ, ఆర్థికంగానూ నూతన విధానాలను పరిశీలించి అనుసరించడం, ప్రణాళికాబద్ధంగా శిక్షణలోను, సహకారంలోను ఉద్యోగుల ఉత్పాదకతను నైపుణ్యాన్ని అభివృద్ధి చేయడం, సంస్థ ఉద్యోగులు, వారి కుటుంబాల శ్రేయస్సుకు, అభివృద్ధికి కృషి చేస్తూ ఉండడం, పర్యావరణానికి, సమాజానికి అవసరమైన విషయాల పట్ల ప్రత్యేక శ్రద్ధ, కాలుష్య నివారణ, ప్రభుత్వ విధానాలను పూర్తిగా అనుసరించడం వంటి విధానాలతో సంస్థ లక్ష్యాల సాధనకు పాటుపడుతుంది. ఇంతటి ఉన్నతమైన లక్ష్యాలు, విధానాలను కలిగి ఉన్నా అత్యంత ప్రజాదరణ కలిగిన ఆర్‌టిసి ఈ మధ్యకాలంలో నష్టాల పాలై సంస్థ మనుగడకే ప్రమాద ఘంటికలు మోగుతున్నాయి. ఆర్‌టిసి సంస్థకు నష్టాలు ఎందుకు వస్తున్నాయి? కొన్ని కారణాలను విశ్లేషించుకుందాం.

ప్రస్తుత తరుణంలో ఆర్‌టిసి పీకల్లోతు నష్టాల్లో ఉంది. ఇవి ఒక్కసారిగా వచ్చినవి కావు. కరోనా సంక్షోభంతో ఆర్‌టిసి సుమారు మూడు వేల కోట్లకు పైగా ఆదాయాన్ని కోల్పోయింది. టికెట్ల అమ్మకం ద్వారా రోజుకు సరాసరి 13 కోట్ల నుంచి పద్నాలుగు కోట్ల వరకు ఆదాయం వచ్చేది. అద్దె బస్సుల నిలుపుదల, కరోనా మహమ్మారి విలయ తాండవంతో ఆదాయం 13 కోట్ల నుండి 6 కోట్లకు పడిపోవడంతో ఉద్యోగుల జీతభత్యాలు చెల్లించలేని పరిస్థితి ఏర్పడింది. ఆర్‌టిసికి ఆదాయం కంటే ఖర్చు ఏటా వెయ్యి కోట్ల రూపాయల వరకు అదనపు వ్యయం అవుతుంది. ఆర్‌టిసి ఖర్చులో పెద్ద మొత్తంలో జీతభత్యాలు, డీజిల్ పన్నులకే సరిపోతుంది. ఆదాయ, వ్యయాల మధ్య తేడా వలన ప్రతి ఏటా 720 కోట్ల నష్టంతో నష్టాల బాటలో నడుస్తుంది. 2 సంవత్సరాల క్రితం లీటర్ డీజిల్ ధర 68 రూపాయలు కాగా, నేడు అది 98 రూపాయలకు చేరింది. దీంతో ఇంధనం ఖర్చు 1,300 కోట్లకు పైగా భరించాల్సి వస్తుంది. అలాగే టైర్లు, ఇతర విభాగాలపై ప్రతి ఏటా ఖర్చు 150 కోట్లు, ప్రైవేట్ మోటార్ వాహనాలు చెల్లించినట్లు మోటార్ వెహికల్ పన్ను 290 కోట్లు, డీజిల్‌పై పన్ను ప్రతి ఏటా 300 కోట్లకు పైగా రాష్ట్ర ఖజానాకు చెల్లించవలసి రావడం, మొత్తంగా 2021 నాటికి 2,329 కోట్లకు పైగా నష్టాల ఊబిలో కూరుకుపోయింది.

దూర ప్రాంతాలకు బస్సు సర్వీసులు లేక ఆదాయాన్ని కోల్పోతుంది. దూర ప్రాంత సర్వీసులు అయిన అద్దె బస్సులకు 105 కోట్లకు పైగా బకాయిలు చెల్లించకపోవడంతో 3,200కు పైగా అద్దె బస్సులను నిలిపివేసి వాటి యజమానులు సమ్మె చేస్తున్నారు. ఈ క్రమంలో ఇన్నాళ్లు అంతర్రాష్ట్ర సర్వీసులుగా నడిపిన దాదాపు 450కి పైగా ఆర్‌టిసి అద్దె బస్సులు కొన్ని నెలలుగా నిలిచిపోయాయి. ప్రస్తుతం ఆర్‌టిసి సంస్థకి చెందిన 150 బస్సులు మాత్రమే అంతర్రాష్ట్ర సర్వీసులుగా తిరుగుతున్నాయి. వాటిల్లో చాలా బస్సులు కాలం చెల్లినవి. రోజులు గడిచేకొద్దీ వాటి సంఖ్య కూడా తగ్గిపోనుంది. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాల నుండి హైదరాబాద్‌కు నిత్యం సుమారు 545కు పైగా కాంట్రాక్టు టూరిస్టు బస్సుల్లో 15 వేల నుంచి 20 వేల మంది వచ్చి వెళ్తున్నారు. దీనివల్ల ఆర్‌టిసికి రోజుకు దాదాపు రెండు కోట్ల నుంచి మూడు కోట్ల వరకు ఆదాయం రాకుండా నష్టం వాటిల్లుతుంది. పెళ్లిళ్లు, పండుగల సీజన్‌లో, ఇతర ప్రత్యేక సందర్భాలలో ఇది మరింత పెరగనుందని ఆర్‌టిసి ఉద్యోగ సంఘాలు చెబుతున్నాయి.

సకాలంలో అద్దెలు చెల్లించి అద్దె బస్సులను నడుపుతుంటే ఆర్‌టిసికి ఆదాయం పెరుగుతుందని అభిప్రాయ పడుతున్నారు. అద్దె బకాయిలు పాక్షికంగా 55 కోట్ల దాకా చెల్లించి 250 అద్దె బస్సులను పునరుద్ధరించినా, ఈ విషయం ప్రయాణికులకు తెలియకపోవడం, ప్రైవేటు టూరిస్ట్ బస్సులకు అలవాటు పడి ఆర్‌టిసి బస్సులలో ప్రయాణించడానికి విముఖత చూపడంతో సాధారణంగా 80 నుండి 85 శాతం ఆక్యుపెన్సీ ఉండే ఆర్‌టిసి బస్సుల్లో 45 నుంచి 50 శాతం పడిపోయి, ఆదాయం గణనీయంగా తగ్గింది. ఆర్‌టిసి బస్సు ఒక కిలోమీటర్ తిరిగితే 35 రూపాయల ఆదాయం వస్తుంటే, ఖర్చు మాత్రం 55 రూపాయలకు పైగా ఉంటుంది. దీంతో సగటున రోజుకు కోటి రూపాయల నష్టం వాటిల్లుతుంది. ఇంధనం ధరలు పెరిగినప్పుడల్లా వాటికి అనుగుణంగా ప్రవేట్ సంస్థల మాదిరిగా ఆర్‌టిసి చార్జీలు పెంచడానికి వీలు లేదు. ప్రభుత్వ అనుమతితోనే పెంచాలి. పలు వర్గాలకు బస్సులలో ఉచితంగా లేదా రాయితీలతో కూడిన ప్రయాణం అందించడం, లక్షల మంది విద్యార్థులు ఆర్‌టిసి బస్సుల్లో ఉచితంగా లేదా నామమాత్రపు చార్జీలతో ప్రయాణం చేస్తారు. వీరికే కాకుండా వయో వృద్ధులు, దివ్యాంగులు మొదలగు వారికి బస్సు ప్రయాణాల్లో రాయితీ లభిస్తుంది. ఈ బస్సు పాసుల రాయితీలను ప్రభుత్వం ఆర్‌టిసికి చెల్లించడం లేదు. చాలా గ్రామాలకు బస్సు నడిపినప్పుడు బస్సుల్లో తగినంతమంది ప్రయాణికులు ఉండరు. బస్సు వెళ్లే దూరం, ప్రయాణికుల సంఖ్య, ఆదాయాన్ని బట్టి చూస్తే ఆ బస్సు నడపడం వల్ల చాలా నష్టం వస్తుంది. కానీ ఆయా గ్రామాలకు బస్సు సౌకర్యం కల్పించాలనే ఉద్దేశంతో లాభ నష్టాలతో నిమిత్తం లేకుండా బస్సులను నడపడం జరుగుతుంది.

అదే విధంగా హైదరాబాద్ సిటీ బస్సులు గంటకు 15 కిలోమీటర్ల

వేగంతో మాత్రమే నడపాల్సి రావడంతో ఇంధన సామర్థ్యం, ఆక్యుపెన్సీ లేక ప్రతి సంవత్సరం ఏడాదికి నాలుగు వందల కోట్ల నష్టం వాటిల్లుతుంది. ప్రజల సంక్షేమం కోసం, ప్రయాణ సౌకర్యాల కోసం సిటీ బస్సులను నడిపించాల్సిన పరిస్థితి.

వివిధ వర్గాలకు రాయితీలు ఇస్తూ, నష్టాలు వస్తున్న మార్గాలలో సైతం బస్సులు నడుపుతూ ఉన్నప్పటికీ డీజిల్‌పై పన్ను, రూట్ టాక్సీ లాంటివన్నీ ప్రైవేట్ సంస్థల మాదిరిగానే చెల్లిస్తుండడం వలన ఆర్‌టిసి అప్పులపాలు అవుతుంది. ఆర్‌టిసి కార్మికులు ఒక సొసైటీగా ఏర్పడి తమ జీతాల్లో నుంచి కొంత సొమ్ము పొదుపు చేసుకుని దాన్నుంచి అవసరమైన వారు అప్పులు తీసుకుంటారు. దాన్ని కోపరేటివ్ క్రెడిట్ సొసైటీ అంటారు. చివరకు ఆ సంస్థ దగ్గరున్న 1080 కోట్ల నిధులను ఆర్‌టిసి యాజమాన్యం దారి మళ్లించడంతో ఉద్యోగులకు ఆర్థిక సాయం అందని పరిస్థితి ఏర్పడింది. గతంలో తీసుకున్న రుణాలకు సంబంధించి నాలుగు నెలలుగా వాయిదాలు చెల్లించడం లేదని, దీంతో ఈ సిసిఎస్‌ను ఎగవేతదారుగా పరిగణించి సదర్ బ్యాంక్ అధికారులు ఖాతాను నిలిపివేశారు. దీంతో సకాలంలో వేతనాలు అందక ఇబ్బంది పడుతున్న ఆర్‌టిసి కార్మికుల పరిస్థితి మూలిగే నక్కపై తాటికాయ పడ్డ చందంగా తయారైంది.

2013 వేతన ఒప్పంద ఎరియర్స్ బాండ్స్ విలువ 280 కోట్లు, 2018 తర్వాత రిటైర్ అయిన కార్మికులకు చెల్లించాల్సినవి 52 కోట్లు, 2020 నుంచి వివిధ కారణాలతో సర్వీస్‌లో ఉండి చనిపోయిన నాలుగు వందల మంది కార్మికుల కుటుంబాలకు ప్రావిడెంట్ ఫండ్‌లోని ఇన్సూరెన్స్ స్కీమ్ ద్వారా రావలసిన 24 కోట్లు చెల్లించకపోవడంతో కార్మికులు ఆర్థిక ఇబ్బందులతో అష్టకష్టాల పాలవుతున్నారు. ఉద్యమకాలంలో ఆర్‌టిసిని ఆదుకుంటామని, ఆర్‌టిసి ఉద్యోగులను ప్రభుత్వ ఉద్యోగులవలె పరిగణిస్తామని ప్రగల్భాలు పలికి వాటిని నెరవేర్చక కాలయాపన చేస్తుండటంతో, హామీల అమలు కోసం కార్మికులు 2019 అక్టోబర్ 5 నుండి 52 రోజుల పాటు 2019 నవంబర్ 25 వరకు చారిత్రాత్మక సమ్మె చేశారు. 49,860 మంది ఉద్యోగులున్న ఆర్‌టిసి సంస్థలో 48,660 మంది సమ్మెలో పాల్గొన్నారు. పక్క తెలుగు రాష్ట్రంలో ప్రభుత్వం ఆర్‌టిసిని ప్రభుత్వంలో విలీనం చేయడంతో తెలంగాణ ఆర్‌టిసి కార్మికులలోను ఆర్‌టిసిని ప్రభుత్వంలో విలీనం చేయాలని కోరిక బలపడి సమ్మెకు ఉపక్రమించారు. ప్రభుత్వం ఈ సమ్మె పట్ల చాలా మొండి వైఖరి, కఠిన వైఖరితో వ్యవహరించడం వల్ల ప్రజలు, కార్మికులు అనేక ఇక్కట్ల పాలయ్యారు.

సమ్మె పట్ల ప్రభుత్వ విధానానికి నిరసనగా అక్టోబర్ 12న ఖమ్మం పట్టణంలో శ్రీనివాసరెడ్డి అనే డ్రైవర్ పెట్రోలు పోసుకొని నిప్పంటించుకొని ఆత్మహత్యకు పాల్పడగా, హైదరాబాద్‌లో సురేందర్ గౌడ్ అనే కండక్టర్ ఉరివేసుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. వీరేకాక మరికొంత మంది గుండెపోటుతో, మతిస్థిమితం తప్పి మరణించారు. సమ్మెకు రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు మద్దతు ప్రకటించి ఆర్థికంగా, హార్దికంగా కార్మికులకు సహాయం అందజేయడం జరిగింది. ఆర్‌టిసిని ప్రభుత్వంలో విలీనం చేయాలన్న డిమాండ్‌ను వదిలిపెట్టినా ప్రభుత్వం చర్చలకు పిలువలేదు. ప్రభుత్వం ప్రజాస్వామికంగా స్పందించకపోవడం బాధాకరమని కార్మిక సంఘాల నాయకులు ఆవేదన చెందుతూ ఆర్‌టిసి కార్మికుల అవసరాలను, హైకోర్టు తీర్పును దృష్టిలో పెట్టుకొని నవంబర్ 25న కార్మిక సంఘాల ఐక్య కార్యాచరణ కమిటీ సమ్మె విరమిస్తున్నట్లు ప్రకటించింది. సమ్మె అనంతరం కార్మిక సంఘాలను రద్దుచేసి సంక్షేమ మండళ్లు మాత్రమే చలామణిలో ఉంటాయని ప్రకటించడం, తక్షణ సాయంగా 100 కోట్ల రూపాయలు అందించి తాత్కాలిక ఉపశమనం కల్పించి, రిటైర్మెంట్ వయసును 60 ఏళ్లకు పెంచడం జరిగింది.

**60 ఏళ్లు వద్దు, 58 చాలు:**

30 సంవత్సరాలకు పైగా సమయాసమయాలు లేకుండా, రాత్రనక పగలనక విధులు నిర్వర్తించిన కార్మికులు పదవీ విరమణ చేసేందుకు అనుమతించాలని 58 ఏళ్లు దాటిన దాదాపు రెండు వేల మంది ఆర్‌టిసి డ్రైవర్లు, కండక్టర్లు మొర పెట్టుకుంటున్నారు. ఏళ్ల తరబడి సేవలందించిన సీనియర్ డ్రైవర్లు, కండక్టర్లు పలువురు దృష్టిలోపం, బిపి, షుగర్, గుండె జబ్బులతో బాధపడుతున్నారు. వివిధ రకాల వ్యాధులతో శరీరం సహకరించక ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించలేకపోతున్నారు. ఇటీవల ఒక ఆర్‌టిసి బస్సు తొర్రూర్ పట్టణంలో ఆగి ఉన్న మోటార్ బైక్‌ను ఢీకొట్టడంతో మోటార్ బైక్‌పై ఉన్న నా మిత్రుడు ఒకరు కిందపడిపోయి గాయాల పాలవగా, మోటార్ బైక్ బస్సు కింద నలిగి పెద్ద మొత్తంలో డ్యామేజ్ అయ్యింది. ఇదేమని డ్రైవర్‌ను ప్రశ్నించగా ఉదయం నుండి విధుల్లో ఉన్నానని వయసు ఉడిగిపోవడం వల్ల కంటి చూపు మందగించి మోటార్ బైక్ కనబడలేదని, దానికి నష్టపరిహారం చెల్లించడానికి వేతనాలు రావడంలేదని, న్యాయ పరంగా చర్యలు తీసుకోవడానికి నాకు ఎటువంటి అభ్యంతరం లేదని తన ఆవేదనను వ్యక్తం చేశారు. ఈ సంఘటనను బట్టి 58 సంవత్సరాలు దాటిన కార్మికులు పడుతున్న ఇబ్బందులను అర్థం చేసుకోవచ్చు. పెద్ద వయసులో అధికారుల వేధింపులు భరించలేక పోతున్నామని, సెలవు మంజూరు విషయంలో కూడా ఇబ్బందులు పెడుతున్నారని, ఇలాంటి వేధింపులు తట్టుకోలేక ఈ మధ్యన సీనియర్ డ్రైవర్ ఆత్మహత్యకు పాల్పడ్డాడు. ఇంతకాలం సంస్థ అభివృద్ధికి కృషిచేసిన తాము గౌరవ ప్రదంగా బాధ్యతల నుంచి తప్పుకుంటామని, తమకు రావాల్సిన రిటైర్మెంట్ బెనిఫిట్స్ అందించి పదవీ విరమణకు అవకాశం ఇవ్వాలని పలువురు కోరుతున్నారు.

**పదిహేడు వేల మంది కార్మికులు ఇంటి బాట:**

తీవ్ర నష్టాల్లో కూరుకుపోయిన టిఎస్ ఆర్‌టిసి గట్టెక్కించేందుకు సంస్కరణలు ప్రవేశపెట్టడమే పరిష్కారమని సంస్థ భావిస్తోంది. ఆర్థిక సంక్షోభంతో సంస్థకు చెందిన పదిహేడు వేల మందిని స్వచ్ఛంద ఉద్యోగ విరమణ (విఆర్ఎస్), తప్పనిసరి ఉద్యోగ విరమణ (సిఆర్ఎస్) ద్వారా ఇంటికి పంపించే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. ప్రస్తుతం ఆర్‌టిసిలో 49,250 మంది వివిధ స్థాయిలలో ఉద్యోగులుగా పనిచేస్తున్నారు. ఇందులో 18,432 మంది డ్రైవర్లు, 20,229 మంది కండక్టర్లు ఉన్నారు. అయితే రోడ్డు మీద పరిగెడుతున్న బస్సుల కంటే కార్మికులు ఎక్కువగా ఉన్నారు. 9,184 బస్సులలో సుమారు 3,250కి పైగా కాలం చెల్లినవిగా గుర్తించి ఉపసంహరించింది. 12 ఏళ్లకు పైగా నడిచిన బస్సులను ప్రయాణికుల కోసం వినియోగించరాదని కేంద్ర ప్రభుత్వ నిబంధనలు అనుసరించి బస్సులను ఉపసంహరించడం జరిగింది. ఈ బస్సుల్లో పనిచేయవలసిన డ్రైవర్లు ఖాళీగా ఉంటున్నారు. పలు ఎక్స్‌ప్రెస్ బస్సులలో టిమ్స్ వినియోగిస్తుండడం వల్ల కండక్టర్ల అవసరం లేకుండా పోయింది. గతంలో ఒక బస్సుకు సమర్థంగా నిర్వహించేందుకు ఐదారుగురు పనిచేసేవారు. నేడు ఒక్కో బస్సుకు

ఎనిమిది మంది పెరిగారు. దీంతో మిగులు ఉద్యోగులను గుర్తించి 58 ఏళ్లు నిండిన 6,064 మందిని పంపించే అవకాశం, 34 ఏళ్ల సర్వీస్, 55 సంవత్సరాల వయస్సు నిండిన సుమారు 11 వేల మందికి తప్పనిసరి పదవీ విరమణ అమలు చేసే అవకాశం ఉంది. దీని ద్వారా ఆర్‌టిసి వేతన భారాన్ని 80 కోట్ల మేర తగ్గించే ప్రతిపాదనలు తయారు చేస్తున్నారు. ఆరేళ్ల నుండి ఎనిమిది ఏండ్ల వరకు సర్వీస్ ఉన్న ఉద్యోగులకు కంపల్సరీ రిటైర్మెంట్ స్కీం అమలు చేస్తే ఆర్‌టిసిపై సుమారు రెండు వేల కోట్ల నుండి మూడు వేల కోట్ల దాకా భారం పడే అవకాశం ఉంది.

**పరిష్కార మార్గాలు:**

ఆర్‌టిసి సంస్థను ప్రజాసేవ సంస్థగా లేదా లాభాలు ఆర్జించి పెట్టే వ్యాపార సంస్థగా చూడాలా? అనే విషయంపై ప్రభుత్వం వద్ద స్పష్టత లేకపోవడం నష్టాలకు కారణం. చార్జీల పెంపు విషయంలో, నష్టాల రూట్లలో ప్రయాణికుల సౌకర్యం కోసం బస్సులు నడపడం సామాజిక సేవ సంస్థగా, పన్నుల రాయితీ ఇచ్చే విషయంలో వ్యాపార సంస్థగా వ్యవహరించడం మూలంగా నష్టాలు ఎక్కువ అవుతున్నాయి. ప్రైవేట్ సంస్థల మాదిరిగా రోడ్ టాక్స్, డీజిల్‌పై పన్ను, వివిధ విభాగాలపై వస్తు సేవల పన్ను ఏటా దాదాపు 1,000 కోట్ల వరకు ఆర్‌టిసి చెల్లించడం జరుగుతుంది. ఈ పన్నుల నుండి రాయితీ కల్పించి పన్నుల భారాన్ని తగ్గించాలి. ఆర్‌టిసి కార్మికులు దాదాపు మూడోవంతు డీజిల్ పైనే ఖర్చు చేయడం జరుగుతుంది. డీజిల్ ధరలు పెరిగే కొద్దీ ఆర్‌టిసిపై అదనపు భారం పడుతుంది. విమానాల ఇంధనంపై వ్యాట్ తక్కువగా ఉంటుంది, రైల్వేలకు డీజిల్‌ను కేంద్ర ప్రభుత్వం సబ్సిడీ ధరకే అందజేస్తుంది. 25 కోట్ల లీటర్ల డీజిల్ వాడకం చేసే ఆర్‌టిసి సంస్థకు మాత్రం ప్రభుత్వం ఎటువంటి రాయితీలు కల్పించదు. కనీసం ఒక్క రూపాయి పెరిగినా 25 కోట్ల అదనపు భారం పడుతుంది. రాష్ట్ర ప్రభుత్వం గుట్టుచప్పుడు కాకుండా డీజిల్‌పై అమ్మకం పన్ను 23 నుండి 28 శాతానికి పెంచింది. కనుక కేరళ, తమిళనాడు రాష్ట్రాలు ఆర్‌టిసిలకు సబ్సిడీపై డీజిల్‌ను సరఫరా చేసినట్లు తెలంగాణలో కూడా సబ్సిడీపై డీజిల్‌ను అందజేయాలి.

స్టేజీ స్టేజికి బస్సు ఆపి ప్రయాణికులను తీసుకెళ్లే హక్కు, స్వేచ్ఛ ఒక్క ఆర్‌టిసికి ఉంది. కానీ ప్రైవేట్ వాహనాలు కూడా స్టేజి స్టేజికి ఆపి ప్రయాణికులను తీసుకెళ్లడం జరుగుతుంది. ఇది చట్ట విరుద్ధం. ఈ అక్రమ రవాణాను పట్టించుకునే నాథుడే లేడు. తత్ఫలితంగా ఆర్‌టిసికి ఎంతో నష్టం వాటిల్లుతుంది. పల్లె వెలుగు, సిటీ బస్సులను నడపడంలో నష్టాలను పూడ్చుకోవడానికి ఆర్‌టిసి వయబులిటీ గ్యాప్ ఫండింగ్ కింద నిధులు సమకూర్చాలని డిమాండ్ ఉంది. హైదరాబాద్ సిటీలో జిహెచ్ఎంసి ద్వారా సిటీ బస్సు నష్టాలను పూడ్చాలని నిర్ణయం తీసుకున్నా అమలుకు నోచుకోలేదు. కార్గో సర్వీసులను పకడ్బందీగా నిర్వహించాలి. ఆర్‌టిసి ఉన్న ఆస్తులను, భూములను వాణిజ్యపరంగా ఉపయోగించాలి. నష్టాల భారం రాష్ట్ర ప్రభుత్వమే భరించాలి.

అంతర్జాతీయ ప్రమాణాల ప్రకారం ప్రతి లక్ష మందికి 60 బస్సులు అవసరం. దాని ప్రకారం తెలంగాణ రాష్ట్రానికి 24 వేల బస్సులు అవసరం. కానీ ఆర్‌టిసి బస్సులు 8,357, అద్దె బస్సులు 2,103 కలిపి మొత్తం పది వేల నాలుగు వందల అరవై బస్సులు మాత్రమే ఉన్నాయి. అందులో మూడు వేలకు పైగా కాలం చెల్లిన బస్సులను ఉపసంహరించడం జరిగింది. మిగిలిన డొక్కు బస్సుల ద్వారా కెఎంపిఎల్ సామర్థ్యం, ఆక్యుపెన్సీ రేషియో తక్కువగా ఉంటుంది. కనుక అన్ని రూట్లలో బస్సు సర్వీసులను పెంచాలంటే నూతన బస్సులను కొనుగోలు చేయాలి. పాత వాటి స్థానంలో నూతన బస్సుల వాడకం ద్వారా నష్టాలను కొంతవరకు తగ్గించవచ్చు. నూతన రాష్ట్రంలో రోడ్ల బాధ్యత, భద్రత, నిర్మాణం, నిర్వహణ పూర్తిగా అధ్వాన్నం. రహదారులు బాగా లేక గంటకు 50 కిలోమీటర్ల వేగానికి పైగా ప్రయాణించే బస్సు, రోడ్ల గుంతల వలన గంటకు 15 కిలోమీటర్ల దూరం ప్రయాణించ లేకపోవడం వలన ఇంధన వాడకం పెరిగి నష్టం వస్తుంది. హైదరాబాద్ లాంటి నగరాలలో మెట్రోకు అనుసంధానించి బస్సులు నడుపుకుంటే లాభాలు పెంచుకోవచ్చు. అద్దె బస్సుల భారాన్ని తగ్గించుకోవాలి. లాభాలు వచ్చే రూట్లలో అద్దె బస్సులకు బదులు ఆర్‌టిసి సంస్థ బస్సులనే నడపాలి.

**చార్జీల వడ్డన - ప్రజల ఆదరణ**

తెలంగాణ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థను గట్టెక్కించాలంటే 20 నుంచి 30 శాతం మేర చార్జీలు పెంచక తప్పదని ఆ సంస్థ యాజమాన్యం భావిస్తూ ఇటీవల ప్రభుత్వంతో చర్చలు కూడా జరపడం జరిగింది. ఈ చార్జీల వడ్డన కరోనా కారణంగా ఉద్యోగాలను, ఉపాధిని కోల్పోయి తీవ్ర ఆర్థిక ఇబ్బందుల్లోవున్న ప్రజల నెత్తిన పిడుగుపడినట్లు అవుతుంది. ఏకాఏకిన 30 శాతం చార్జీలు పెంచితే ప్రయాణికుల నుంచి వ్యతిరేకత రావడమే కాక, ఆర్‌టిసికి దూరం అయ్యే ప్రమాదం ఉందని నిపుణులు భావిస్తున్నారు. ప్రస్తుత తరుణంలో ప్రభుత్వమే భరించి, ఇవ్వవలసిన రాయితీలు అన్నింటినీ చెల్లించి, అనవసర వ్యయాన్ని నియంత్రించుకుని దాదాపు 60 వేల కోట్లకు పైగా ఆస్తులు ఉన్న ఆర్‌టిసి, అందుబాటులో ఉన్న వనరులను సద్వినియోగం చేసుకొని టికెటేతర ఆదాయాన్ని రెట్టింపు చేసుకునే విధానాలపై దృష్టి సారించి, యాజమాన్య నిర్వహణ లోపాలను సరిదిద్దుకొని అధికారులు, ఉద్యోగులు జవాబుదారీ తనాన్ని పెంచుకుంటే ఆర్‌టిసి ఆదాయం ఆశించిన స్థాయికి చేరుతుంది.

**ముగింపు:**

నిజాం పాలనా కాలం నుండి నేటి వరకు నిర్విరామంగా ఉన్నతమైన, చౌకగా, భద్రతతో కూడిన సేవలందించిన రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ పాలకుల సహాయ నిరాకరణ, యాజమాన్య అనాలోచిత విధానాల వల్ల నేడు కోలుకోలేని స్థితిలో ఉంది. అత్యధికంగా మానవ వనరులున్న ఆర్‌టిసి పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయి ప్రభుత్వ సాయం అందిస్తే తప్ప ప్రగతి రథం కదిలే పరిస్థితిలో లేదు. గత ప్రభుత్వాలు అన్ని రూట్లను జాతీయం చేసుకొని ఆర్‌టిసి బస్సులను నడిపి ప్రజా సంక్షేమం కోసం, ప్రజల సౌకర్యం కోసం పాటు పడగా, ఆర్‌టిసికి ఉన్న విలువైన 1400 ఎకరాల భూమిని అమ్మకానికి పెట్టడం, ప్రైవేటీకరణకు ఆజ్యం పోయడమే. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఇంకా 1,300 గ్రామాలకు బస్సు సౌకర్యం అసలే లేదు. మూడు వేల గ్రామాలకు ఒకసారి మాత్రమే ఎర్ర బస్సు పోతుంది. ఇటువంటి తరుణంలో ఆర్‌టిసిని ప్రజా సేవా సంస్థగా గుర్తించి పెట్టుబడులు పెట్టాలి, నష్ట పరిహారం చెల్లించాలి.

కేవలం మన రాష్ట్రం, మనదేశంలోనే కాదు ప్రపంచంలో ఏ దేశం ప్రజా రవాణా సంస్థలను లాభాపేక్షతో నడపడం లేదు. ప్రజా సేవ లక్ష్యంతోనే నడుపుతున్నాయి. నష్టాలు వచ్చినప్పుడు భరిస్తున్నాయి. మన ప్రభుత్వాలు ఆదర్శంగా భావించే అమెరికా, బ్రిటన్, జర్మనీ వంటి పెట్టుబడిదారీ దేశాలు కూడా నేరుగా ఆర్థిక సహాయం అందించి

# నో టీచర్, నో క్లాస్ విద్యా వ్యవస్థ దుస్థితి

***ప్రభుత్వాలు బడ్జెట్‌లో విద్యారంగానికి అవసరమైన నిధులు కేటాయించకపోవడం, ఉపాధ్యాయ ఖాళీలను భర్తీ చేయకపోవడం విద్యను ప్రైవేట్ పరంచేసి సరుకుగా మార్చడానికే అంటున్నారు* బి. రామకృష్ణ**

భారతదేశంలోని పాఠశాల విద్యా వ్యవస్థ స్థితిగతులపై యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్ సైంటిఫిక్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్ (యునెస్కో) 2021, అక్టోబర్ 5న నివేదికను విడుదల చేసింది. ఐక్యరాజ్య సమితి పేర్కొన్న సుస్థిర అభివృద్ధి లక్ష్యాలలో విద్య గురించి చెప్పిన వాటిని ప్రస్తావించింది. ఉపాధ్యాయుల స్థితిగతులను మెరుగుపరచడం ద్వారా విద్యా లక్ష్యాలను చేరుకోగలరనే విషయాన్ని తెలిపింది. పిల్లలకు విద్యను అందించడంలో ఉపాధ్యాయులది కీలకమైన పాత్ర అని జాతీయ విద్యా విధానం 2020 చెప్పిన విషయాన్ని పునరుక్తి చేసింది.

అందరికీ సమాన, సంలీన విద్య, జీవిత పర్యంత అభ్యసన అవకాశాలను కల్పించే లక్ష్యాన్ని ప్రధాన అంశంగా చేసుకుని దానికి సంబంధించి దేశ విద్యా వ్యవస్థ పై అధ్యయనాన్ని యునెస్కో చేసింది. ఇందుకోసం యూనిఫైడ్ డిస్ట్రిక్ట్ ఇన్ఫర్మేషన్ సిస్టం ఫర్ ఎడ్యుకేషన్ (యుడిఐఎస్ఇ) 2018/19, 2019/20లలో పొందుపరిచిన సమాచారాన్ని, నేషనల్ స్టాటిస్టికల్ ఆఫీస్ చేసిన పీరియాడిక్ లేబర్ ఫోర్స్ సర్వే 2018/19 తయారుచేసిన అధికారిక సమాచారాన్ని కొన్ని కేస్ స్టడీస్‌ని ఆధారం చేసుకున్నారు. వాటి ఆధారంగా దేశంలోని వివిధ రాష్ట్రాలలోని పలు రకాల పాఠశాలల వివరాలను తెలిపారు. పాఠశాలల్లో తాగునీరు, మరుగుదొడ్లు, విద్యుత్ సౌకర్యం, రోడ్డు వసతి సౌకర్యం, లైబ్రరీ మొదలైన వివరాలను అందించారు. ఉపాధ్యాయుల నియామకాలు, అర్హత, వృత్తిపరమైన సమస్యలు చర్చించారు. ఉపాధ్యాయ ఖాళీలు, ఏకోపాధ్యాయ పాఠశాలలు, రెగ్యులర్, కాంట్రాక్ట్ నియామకాలు, ఉపాధ్యాయుల కొరత మొదలగు వివరాలు అందించారు.

ఈ నివేదికలోని వివరాలు పలు రాష్ట్రాలలోని విద్యా వ్యవస్థ యొక్క దుస్థితిని తెలియపరుస్తున్నాయి. దేశం మొత్తం మీద 15,51,000 పాఠశాలలు ఉన్నాయి. అందులో 67 శాతం (10,32,018) ప్రభుత్వ అధీనంలో పనిచేస్తున్నాయి. అయితే మొత్తం విద్యార్థులు 24,83,38,582 మందిలో 49 శాతం మాత్రమే ప్రభుత్వ పాఠశాలల్లో చదువుతున్నారు. ప్రైవేటు పాఠశాలల్లో 34 శాతం, ప్రైవేట్ ఎయిడెడ్ పాఠశాలల్లో 11 శాతం, ఖాసీ ప్రభుత్వ బడుల్లో 2.47 శాతం, గుర్తింపులేని వాటిలో 2 శాతం మంది విద్యార్థులు చదువుతున్నారు. 67 శాతం ఉన్న ప్రభుత్వ పాఠశాలల్లో 49 శాతం, మిగతా 33 శాతం (5,18,982)గా ఉన్న ప్రభుత్వేతర పాఠశాలల్లో 51 శాతం పిల్లలు చదువుతున్నారు. అంటే సగానికి పైగా పిల్లలు ప్రభుత్వేతర బడుల్లో చదువుతున్నారు. అంటే సగం మంది బడి పిల్లల చదువులకు ప్రభుత్వం బాధ్యత పడటం లేదు. వారి మానాన వారిని వదిలేసారన్నమాట. మరోవైపు విద్యా హక్కు చట్టం 2009, 6 నుండి 14 సంవత్సరాల పిల్లలకు ఉచిత నిర్బంధ విద్య అని చెబుతుంది. ఇక్కడే తేలిపోతున్నది కదా సగానికిపైగా విద్యార్థులకు విద్య ఉచితం కాదన్నది! తద్వారా ఉచిత నిర్బంధ విద్యను అందించాలన్న రాజ్యాంగ స్ఫూర్తి ఎలా నీరుగారి పోతున్నదో తెలుసుకోవచ్చు.

దేశం మొత్తంలోని 10,32,018 ప్రభుత్వ పాఠశాలల్లో ఏకోపాధ్యాయ పాఠశాలలు 1,10,971 ఉన్నాయి. వీటిలో 89 శాతం పాఠశాలలు గ్రామీణ ప్రాంతాల్లోనే ఉన్నాయి. తెలంగాణలో 6,678 (16 శాతం) ఏకోపాధ్యాయ పాఠశాలలున్నాయి. అందులో 72 శాతం గ్రామీణ ప్రాంత పాఠశాలలే. ఈ ఏకోపాధ్యాయ పాఠశాలల్లో చదువులు ఎలా ఉంటాయో ఎవరైనా ఊహించుకోవచ్చు. ఒకే టీచర్ పాఠశాలలోని అన్ని తరగతుల పిల్లలకు ఏక సమయంలో బోధించడం ఎంత దుర్భరమో తెలియంది కాదు. ఇలాంటి పాఠశాలల్లో బహుళ తరగతి బోధనాభ్యసన ప్రక్రియ ఎలా జరపాలో వివరించే ఉపాధ్యాయ

---

ప్రజా రవాణా వ్యవస్థను ఆదుకుంటాయి. అనేక దేశాలు ఇలా ఆదుకోవడమే కాదు పలు రాయితీలు, పన్ను మినహాయింపులు ప్రకటించి ఉచిత బస్సు ప్రయాణాలను కూడా అనుమతించి ప్రజలలో నమ్మకాన్ని పెంచుతాయి. అలాంటి విధానంగా ప్రయత్నాలు చేయకపోగా ఉన్న ఫలంగా చార్జీలు పెంచి ఉన్న ఆక్యుపెన్సీని తగ్గించి ప్రజలకు ఆర్‌టిసిని దూరం చేయడం ఎవరి ప్రయోజనాల కోసం? పాలకులు ఆలోచించాలి. ప్రజా సేవా సంస్థ ఆర్‌టిసిని పన్నుల భారం నుండి రక్షించాలి. టికెట్ చార్జీల ఆదాయాన్ని సగటున రోజుకు 11 కోట్ల వరకు వచ్చేలా చూడాలి.

సామాన్య ప్రజానీకానికి భద్రత, భరోసాతో కూడిన ప్రయాణ సౌకర్యాన్ని అందించే సగటు మానవుని ప్రయాణ సాధనం ఎర్ర బస్సు. ఆర్‌టిసి పరిరక్షణ ధ్యేయంగా పనిచేస్తున్న కార్మిక సంఘాల ద్వారానే సాధ్యం కాదు. కార్మిక వర్గ పోరాటం వారి విముక్తి కోసమే కాదు. అణచివేత నుంచి, దోపిడీ నుంచి మొత్తంగా మానవాళి విముక్తి కోసం అది పోరాడుతుంది. కార్మిక వర్గ పోరాటం దోపిడీ పీడనల నుంచి సమాజాన్ని రక్షించడం. కాబట్టి పౌరసమాజం, ప్రజాస్వామిక వాదులు, ప్రజలు ఆర్‌టిసిని ప్రైవేట్ పరం చేయకుండా పరిరక్షించుకునేందుకు నడుం బిగించాలి. లేకపోతే ప్రైవేట్ విద్యా సంస్థలలో విద్యను కొనుగోలు చేసినట్లే, కార్పొరేట్ హాస్పిటల్‌లో వైద్యం కోసం లక్షలాది రూపాయలు వెచ్చించినట్లే ప్రజా రవాణా సంస్థ ప్రైవేట్ పరం పాలైతే కూడా విపరీతమైన దోపిడీ మొదలవుతుంది. ప్రతి ఒక్కరూ బాధ్యతగా తీసుకొని పాలకుల విధానాలను ఎండగట్టి, ప్రజలను చైతన్యవంతులను చేసి, ఆర్‌టిసిని ప్రభుత్వంలో విలీనం చేసుకునే విధంగా, బకాయిలను చెల్లించి తక్షణమే ఆర్‌టిసి కార్మికులకు సకాలంలో వేతనాలు అందే విధంగా ఉద్యమించి కాపాడుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

(రచయిత టిపిటిఎఫ్ మహబూబాబాద్ జిల్లా ఉపాధ్యక్షులు) వీ

శిక్షణ దేశం మొత్తంలో ఎక్కడా లేదు. దానికి సంబంధించి నేషనల్ కౌన్సిల్ ఫర్ టీచర్ ఎడ్యుకేషన్, నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రీసెర్చ్ అండ్ ట్రెనింగ్ (ఎన్‌సిఇఆర్‌టి), వివిధ రాష్ట్రాలలోని స్టేట్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రీసెర్చ్ అండ్ ట్రెనింగ్ (ఎస్‌సిఇఆర్‌టి)లు గాని ప్రణాళికలను/శిక్షణలను/వ్యూహాలను/కార్యాచరణను తెలిపింది లేదు. విద్యా హక్కు చట్టంలో కూడా తరగతికి ఒక టీచర్ అనేది కాకుండా విద్యార్థుల సంఖ్యను బట్టి పాఠశాలల్లో టీచర్ల సంఖ్య నిర్ణయించబడింది. ఇదొక చట్టబద్ధ దౌర్భాగ్యం.

ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లల సంఖ్యను పెంచడం ఎలాగా అనే దానికంటే పిల్లలు తక్కువగా ఉన్నారని బడులను కలిపేయడం, మూసేయడం వంటివి చేస్తూ ప్రభుత్వ పాఠశాలల సంఖ్య తగ్గించేయడం దేశవ్యాప్తంగా అనేక రాష్ట్రాలలో జరుగుతున్నది.

పిల్లలు లేరని చెబుతూ తరగతికో టీచర్, తరగతికి ఒక గది, ఇతర సౌకర్యాలు ఇవ్వడం కుదరదని మూసివేతకు తెగపడుతున్నాయి ప్రభుత్వాలు. పిల్లలు లేనప్పుడు ఇవన్నీ సమకూర్చడం వ్యర్థం కదా అని పైకి కనిపిస్తుంది. సరైందిగా కూడా అనిపిస్తుంది. కానీ అసలు మరుగున పడుతున్న విషయం ఏమిటంటే సకాలంలో ఉపాధ్యాయ నియామకాలు చేపట్టకపోవడం, పాఠశాలల్లో ఆకర్షణీయమైన, పిల్లల స్నేహపూర్వక పరిస్థితులను ఎప్పటికప్పుడు మెరుగు పరచకపోవడం, మరోవైపు ప్రైవేటు బడులను ఇబ్బడిముబ్బడిగా ప్రోత్సహించడం జరుగుతుంది. ఇదంతా కూడా కనిపించని కుట్ర చాపకింద నీరులా ప్రవహిస్తుంటుంది. పైకి మాత్రం ఎంతగానో విద్య కోసం తపిస్తున్నట్లు గుణాత్మక, అందరికీ సమాన విద్య అందించడానికి అన్నట్లుగా మాట్లాడుతుంటారు. ఫలితంగా ప్రభుత్వేతర బడుల్లోకి పిల్లలు త్రోసి వేయబడుతున్నారు. ప్రైవేటు బడులను తగ్గించే, నియంత్రించే, చివరకు రద్దుచేసే విధానాలు ఎక్కడా కానరావు.

దేశవ్యాప్తంగా డిజిటల్ విద్యా వసతులు, సమాచార, ప్రసార సాంకేతికత సౌకర్యాలు చాలా తక్కువగా ఉన్నాయని, దేశం మొత్తంలో కంప్యూటర్లు, ల్యాప్ టాప్‌లు ఉన్న పాఠశాలలు 22 శాతం మాత్రమే. అందులో 78 శాతం పాఠశాలల్లో ఈ సౌకర్యాలు లేవు. ఉన్నవాటిలో 18 శాతం మాత్రమే గ్రామీణ ప్రాంతాలలో అందుబాటులో ఉన్నాయి. ఇంటర్నెట్ వసతి 19 శాతం బడులకే ఉన్నది. వీటిలో గ్రామీణ ప్రాంతాలలో 14 శాతం మాత్రమే అందుబాటులో ఉన్నాయి. పాఠశాలల్లో లైబ్రరీ వసతులు చాలా తక్కువగా ఉన్నాయని నివేదిక తెలియజేస్తున్నది. విద్యార్థులు తమ తరగతి స్థాయికి తగ్గ అభ్యసన సామర్థ్యాలు కలిగి ఉండడం లేదని, ఐదవ తరగతి వారు రెండవ తరగతి సామర్థ్యాలను కూడా కలిగి ఉండడం లేదని, పదవ తరగతి వారు 8 వ తరగతి వారి అభ్యసన స్థాయిలను సాధించడం లేదని యునెస్కో నివేదిక స్పష్టం చేసింది. ఇలా ఎందుకు జరుగుతున్నది అనేది ఆలోచించవలసిన విషయం.

దేశవ్యాప్తంగా ప్రభుత్వ బడుల్లో 11,16,846 ఉపాధ్యాయుల అవసరం ఉన్నది. 19 శాతం ఉపాధ్యాయ పోస్టులు ఖాళీలు ఉన్నాయి. వీటిలో 69 శాతం గ్రామీణ ప్రాంతాలకు సంబంధించినవే. అత్యధికంగా ఉపాధ్యాయ ఖాళీలు ఉత్తరప్రదేశ్‌లో3,23,577 ఉన్నాయి. ఆ తర్వాత బీహార్‌లో 2,22,316, మధ్యప్రదేశ్‌లో 87,630, పశ్చిమ బెంగాల్లో 84,912, మహారాష్ట్రలో 74,445, ఝార్ఖండ్‌లో 59,896, తెలంగాణలో 37,204, గుజరాత్‌లో 30,869, ఆంధ్రప్రదేశ్‌లో 27,398 ఉపాధ్యాయుల ఖాళీలు ఉన్నాయి. ఈ లెక్కలు తరగతికి ఒక టీచర్ కాకుండా మొత్తం విద్యార్థుల సంఖ్య ఆధారంగా చేసిన అధికారిక సమాచారం. ఇంత పెద్ద మొత్తంలో ఖాళీలు ఉన్నప్పుడు గుణాత్మక విద్య ఎలా సాధ్యం అనే ప్రశ్న ఉదయించక మానదు.

పూర్వ బాల్య విద్య, ప్రత్యేక అవసరాల విద్య, శారీరక వ్యాయామ విద్య, సంగీతం, కళలు వృత్తి విద్యలకు సంబంధించిన టీచర్ల కొరత తీవ్రంగా ఉన్నదని, వీటికి సంబంధించిన సమాచారం లేదని నివేదిక తెలిపింది. అసలు అటువంటి పోస్టులే లేవు. ఒక వేళ ఉన్నా అవి భర్తీ చేయబడవు. ఉపాధ్యాయుల లోటు ముందు ముందు మరింత పెరిగే అవకాశం ఉన్నదని, రాబోయే 15 ఏళ్లలో నేటి ఉపాధ్యాయులలో 30 శాతం తిరిగి భర్తీ చేయవలసి ఉంటుందని నివేదిక స్పష్టం చేసింది. పూర్వ ప్రాథమిక విద్యకు సంబంధించిన ఉపాధ్యాయులలో 7.7 శాతం, ప్రాథమిక పాఠశాలలో 4.6 శాతం, ప్రాథమికోన్నత పాఠశాలలో 3.3 శాతం ఉపాధ్యాయులకు తగిన అర్హతలు లేవు. మరోవైపు ఉపాధ్యాయ ఖాళీలు, ఉపాధ్యాయుల కొరత ఉండడంతో నాణ్యమైన విద్య ఎలా సాధ్యపడుతుంది?

సమాన, సంలీన, గుణాత్మకమైన విద్యను అందించాలని చెప్పే జాతీయ విద్యా విధాన పత్రం 2020 ప్రైవేటు విద్యా వ్యవస్థను నియంత్రించడం పై మాట్లాడదు. ప్రభుత్వ, ప్రైవేటు విద్యాసంస్థలను సమానంగా పరిగణించాలని, పైగా విదేశీ విద్యా సంస్థలను ఆహ్వానించాలని చెబుతుంటుంది. ఉపాధ్యాయుల స్థితిగతులను మెరుగుపరచడానికి తద్వారా విద్యా లక్ష్యాలను చేరుకోవడం సులభం అవుతుందని ఈ పత్రం చెబుతుంది. విద్యా లక్ష్యాలను చేరుకోవడంలో ఉపాధ్యాయుల పాత్ర కీలకమైనదని చెబుతుంది. వాస్తవంలో దీనికి వ్యతిరేకమైన పరిస్థితి కనిపిస్తుంది. రెగ్యులర్ ఉపాధ్యాయుల నియామకాలు చేపట్టకుండా అలాగే వదిలేస్తూ మరోవైపు విద్యా వలంటీర్లని, కాంట్రాక్ట్, పార్ట్ టైమ్, గంటల ఆధారంగా అని రకరకాలుగా చెబుతూ తక్కువ జీతాలతో నియమించే అశాస్త్రీయమైన పద్ధతులను పాటిస్తున్నారు.

ఉపాధ్యాయ వృత్తికి సగటు స్థానం ఉన్నదని, దీనిని మహిళలు, గ్రామీణ యువత ఉద్యోగ అవకాశంగా ఎంచుకుంటున్నారని నివేదిక చెప్పింది. ప్రైవేటు పాఠశాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయుల పరిస్థితి అధ్వాన్నంగా ఉందని, వారికి జీతాలు అతి తక్కువగా ఉంటున్నాయని, ఆరోగ్య, ప్రసూతి సెలవులు, ఇతరత్రా ప్రయోజనాలు ఏమీ ఉండవని యునెస్కో నివేదిక తెలిపింది. ప్రైవేటు బడుల్లో అతి తక్కువ వేతనాలతో ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. వారికి సంబంధించి శాస్త్రీయంగా వేతనాలను నిర్ణయించే విధానం ప్రభుత్వం చేతిలో లేదు. అటువైపు నేటి వరకు ఏ ప్రభుత్వము ఆలోచించింది లేదు.

ప్రజలు అనుకుంటున్న దానికి భిన్నంగా ఉపాధ్యాయులపై పనిభారం అధికంగా ఉన్నదని, వీరు కనిపించని వత్తిళ్లకు గురవుతున్నారని నివేదిక వివరించింది. విద్యా విధాన రూపకల్పనలో దాని ఆచరణ, పర్యవేక్షణలో ఉపాధ్యాయుల, ఉపాధ్యాయ సంఘాల భాగస్వామ్యం ఉండడం లేదని దీన్ని మెరుగు పరచవలసి ఉన్నదని యునెస్కో నివేదిక చెబుతుంది.

గుణాత్మక ఉపాధ్యాయ విద్య గురించి జాతీయ విద్యా విధానం 2020 మాట్లాడుతుంది. గత దశాబ్ద కాలంగా దేశవ్యాప్తంగా ఉన్న ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణా సంస్థల్లో చాలా వరకు ఖాళీ ఉన్నాయి. తెలంగాణ రాష్ట్రానికి వస్తే 80 శాతం పైగా ఖాళీలున్నాయి. ఇటువంటి ఉపాధ్యాయ శిక్షణా సంస్థల నుండి ఎటువంటి శిక్షణను ఆశించగలం? వాటి నుండి బయటకు వచ్చే వారిలో బోధనా సామర్థ్యాలు ఎలా

# బడుల మూసివేత సామాజిక హత్య

*సమాజ నిర్మాణంలో అతి కీలక పాత్ర వహించే ప్రభుత్వ పాఠశాలలను ఏదో ఒక కారణం మీద మూసివేయడం అంటే సమాజాన్ని హత్య చేయడమే అంటున్నారు* **మైస శ్రీనివాస్, చుంచు శ్రీశైలం**

తెలంగాణ రాష్ట్రంలో ప్రభుత్వ బడులకు మూసే విధానాలు వేగంగా అమలవుతున్నాయి. కింది నుంచి పై వరకు అంటే తల్లిదండ్రులు, గ్రామం అధికారులు, ప్రభుత్వం ఈ విషయాన్ని చాలా తేలికగా తీసుకుంటున్నాయి. నిజానికి వ్యాపార, సంకుచిత, స్వార్థ విలువలను వెనక్కి నెట్టి, కుటుంబ, సామాజిక, నిస్వార్థ, నైతిక విలువలతో కూడిన సమాజాన్ని నిర్మించేది ప్రభుత్వ బడులు మాత్రమే. అలాంటి బడులను అకారణంగా, సునాయాసంగా గొంతు నలిపేయడం అంటే హత్యతో సమానం. ఒక్క మనిషి హత్యను మించి సామూహిక, సామాజిక హత్యతో సమానం. ఈ మహా పాపంలో భాగమవుతున్న ప్రతీ ఒక్కరూ భావి సమాజానికి తప్పక సంజాయిషీ ఇచ్చుకోవాల్సి వస్తుంది. పెట్టుబడి ఆడిస్తున్న ఆటలో దాని తరపున ఆటగాడిగా ఉన్న ప్రభుత్వం ప్రతీ ఉదయం బడి గంట మోగాల్సిన గ్రామాల్లో సామాజిక వినాశనానికి మృత్యు గంట మోగిస్తోంది. స్థానిక ప్రజా ప్రతినిధులకు గానీ, బడి మీద పడి ఆధారపడిన ఉపాధ్యాయులు, విద్యాధికారులకు గానీ దీని మీద పట్టింపే లేకపోయింది. దీంతో బడులను మూసివేసే కార్పొరేట్ ప్రభుత్వాల విధానాలకు ఎదురు లేకుండాపోయింది. ప్రభుత్వం బడుల్లో విద్యార్థులు చేరకపోవడం వల్లే మూసివేస్తున్నామని చెప్తూ ఆ నెపాన్ని ఉపాధ్యాయులు, తల్లిదండ్రుల మీదకు నెట్టివేస్తుంది. పిల్లల అవసరాలు, తల్లిదండ్రుల కోరికలు, పాఠశాలల కనీస వసతులు, ఉపాధ్యాయుల సమస్యలు వంటివన్నీ ప్రభుత్వ దుష్ప్రచారం ముందు నిలువలేకపోతున్నాయి.

గత దశాబ్దన్నర కాలం నుంచి విద్యార్థులు లేరన్న సాకుతో పాఠశాలల మూసివేత మొదలైంది. కానీ ఆయా ప్రభుత్వ బడుల్లో పిల్లలు చేరకపోవడానికి, తల్లిదండ్రులు చేర్పించక పోవడానికి గల అసలు కారణాలను తెలుసుకునే, విశ్లేషించే ప్రయత్నం ఒక్కటంటే ఒక్కటి కూడా నేటికీ అధికారికంగా, శాస్త్రీయంగా జరగలేదు. కేవలం ఉపాధ్యాయులను నిందితులుగా చేసే విష ప్రచారం మాత్రమే విస్తృతం చేశారు.

పాఠశాలలో విద్యార్థుల సంఖ్య సున్నా అంటే దానర్థం ఆ అవాస ప్రాంతంలో లేదా ఆ గ్రామంలోనే బడి ఈడు పిల్లలు లేరని కాదు. ఊరిలో ఉన్న బడిని వదిలి, కిక్కిరిసిన బస్సుల్లో, ప్రమాదపు అంచుల్లో పయనించి దూర ప్రాంతాలకు పిల్లలను ప్రతీ రోజు వెళ్లగొడుతున్న కారణాలు తల్లిదండ్రుల దృష్టిలో వేరే ఉన్నాయి. అందులో సమాజం మొత్తం వెంపర్లాడుతున్న ఆంగ్ల మాధ్యమ బోధన మొదటిది. ఒకటి లేదా రెండు గదుల్లో అన్ని తరగతులు ఒకరు లేదా ఇద్దరు ఉపాధ్యాయులు నిర్వహించాల్సి రావడం మరొక ప్రధాన కారణం.

రాష్ట్రంలో ఉన్న మొత్తం 60,47,932 విద్యార్థుల్లో అన్ని సంక్షేమ గురుకుల పాఠశాలల్లో చదువుతున్న విద్యార్థులు 4,39,540 మంది. అంటే కేవలం 7 శాతం మంది చదువుతున్న వ్యవస్థను ప్రభుత్వం తమ ప్రాధాన్య విద్యా విభాగంగా బహిరంగంగా ప్రకటించి, 19,73,571 మంది అంటే 33 శాతం విద్యార్థులు చదువుతున్న ప్రభుత్వ, పంచాయతీ రాజ్ స్థానిక సంస్థల పాఠశాలలను గాలికొదలడం కూడా ముఖ్య కారణమే.

ఉంటాయి? మరోవైపు ఇబ్బడి ముబ్బడిగా ప్రైవేటు ఉపాధ్యాయ శిక్షణ సంస్థలకు అనుమతులు ఇచ్చేసాయి ప్రభుత్వాలు. వాటిలో తీవ్రమైన ఉపాధ్యాయ శిక్షణ బోధకుల కొరత ఉంది. అక్కడ డిగ్రీలు అమ్ముకోవడం తప్ప గుణాత్మక ఉపాధ్యాయ శిక్షణ లేదు.

వాటిని రద్దుచేస్తూ ప్రభుత్వ ఉపాధ్యాయ శిక్షణ సంస్థల్లో పూర్తి స్థాయిలో నియామకాలు చేపట్టి నాణ్యమైన ఉపాధ్యాయ శిక్షణ అందించే ప్రణాళికలు లేకుండాపోయాయి. అటువైపు అడుగులు వేయని ప్రభుత్వాలు నాణ్యమైన విద్యను అందించాలని, అందిస్తామని చెప్పుకోవడం ఎంత విడ్డూరమో. ఉపాధ్యాయ విద్యలో గుణాత్మకతను పెంచడానికి టీచర్ ఎలిజిబిలిటీ టెస్ట్ (టెట్)ను పెడుతున్నారు. ఇది కేంద్ర స్థాయిలో, అలాగే రాష్ట్రాల స్థాయిలో జరుగుతుంది. ఉపాధ్యాయ శిక్షణా సంస్థలను బలోపేతం చేయకుండా అక్కడ నాణ్యమైన ఉపాధ్యాయ శిక్షణలు ఇవ్వకుండా కోర్సులను ఏదో ఒకలా అయిపోయాయని అనిపిస్తున్నారు. ఇక్కడ కదా గుణాత్మకతను పటిష్టం చేయాలి. అలా కాకుండా టెట్ పేరుతో మంచి ఉపాధ్యాయులను నియమించడానికి అన్నట్లుగా గొప్పను సాధిస్తున్నట్లుగా చెబుతుంటారు. టెట్ తర్వాత ఉపాధ్యాయ నియామక పరీక్షలు ఉంటాయి. ఉపాధ్యాయ శిక్షణా సంస్థలను ఉన్నత స్థాయి ప్రమాణాలతో తీర్చిదిద్దాల్సింది పోయి టెట్ పేరుతో ఉపాధ్యాయ అర్హత పరీక్ష నిర్వహించడం అంటే మసి పూసి మారేడుకాయ చేస్తున్నట్లే తప్ప మరొకటి కాదు. అసలు టెట్ అవసరమే లేదు. ఎందుకంటే ఉపాధ్యాయ నియామక పరీక్షలు ఎలాగూ ఉన్నాయి.

పూర్వ బాల్యదశ నుండి యూనివర్సిటీ స్థాయివరకు ప్రజలకు అందించవలసిన విద్య గురించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు పెద్దగా పట్టింపులు లేవు. ప్రత్యేక శ్రద్ధ అసలేలేదు. ఈ విషయాలను బడ్జెట్లో తక్కువ కేటాయింపులు, మౌలిక వసతుల ఏర్పాటులో తీవ్రమైన నిర్లక్ష్యం, రెగ్యులర్ ఉపాధ్యాయ నియామకాలు చేపట్టకపోవడం, అశాస్త్రీయమైన విద్యా వలంటీర్, కాంట్రాక్ట్, పార్ట్ టైం ఉద్యోగులచే అతి తక్కువ వేతనాలతో పని చేయించుకోవడం, ప్రైవేటు విద్యాసంస్థలకు పుట్టగొడుగుల్లా అనుమతులు ఇవ్వడం ద్వారా తెలుసుకోవచ్చు. ప్రభుత్వం బాధ్యతపడి అందించవలసిన విద్యను ప్రైవేట్ శక్తుల చేతుల్లో వ్యాపార సరుకుగా మార్చి వేస్తున్నారు. అలాంటి వారే చాలా సందర్భాలలో విద్య గురించి, దాని ఆవశ్యకత, నాణ్యత గురించి మాట్లాడుతుండటం వంచనే అవుతుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)*

మిగతా కొన్ని చోట్ల ఉపాధ్యాయుల పని తీరు కూడా కారణం కావచ్చు. కానీ అది చాలా స్వల్పం. అయినా అది సరిదిద్ద లేని కారకం కానే కాదు. అందుకోసమే విద్యా శాఖలో పర్యవేక్షణాధికారులు సృష్టించబడ్డారు. ప్రభుత్వం వారి నియామకాలను పక్కకు పెట్టి, ఒక్కొక్క ఎంఇఓకు 5 నుంచి 6 మండలాల, డిఇఓలకు రెండు, మూడు జిల్లాల ఇంచార్జ్ బాధ్యతలు అప్పజెప్పడం కూడా మరిన్ని బడులను బొంద పెట్టడానికే అనేది స్పష్టం.

ఆ క్రమాన్ని విజయవంతంగా కొనసాగిస్తూ ఇప్పటికే వేల సంఖ్యలో మూసివేసిన బడులకు ప్రతీ సంవత్సరం మరికొన్నింటిని తోడు చేస్తున్నారు. ఈ ప్రక్రియను ప్రభుత్వం పని సర్దుబాటు, పాఠశాలల విలీనం, హేతుబద్ధీకరణ అని అందంగా పిలుస్తుంది. వీటి వల్ల ఉపాధ్యాయ ఖాళీలను భర్తీ చేయడం, పాఠశాలల వసతుల కల్పన వంటి పనుల నుంచి తప్పించుకుంటుంది. రాను రాను విద్యారంగ బడ్జెట్‌ను తగ్గించుకోజూస్తుంది. విద్యారంగానికి కేటాయించే బడ్జెట్‌ను ప్రభుత్వం నిరర్ధకమైనదిగా భావిస్తుంది. అందులో భాగంగానే ఇప్పటికే ఉన్న 39,093 ఉపాధ్యాయ ఖాళీలు భర్తీ చేయకుండా సున్నా పాఠశాలల పేరు చెప్పి ఉపాధ్యాయులను సర్దుబాటు చేస్తుంది. అంతేకాకుండా పదోన్నతులు కల్పించి ఉన్నత పాఠశాలల్లో విషయ నిపుణుల అవసరాలను తీర్చకుండా ప్రాథమిక ఉపాధ్యాయులను సర్దుబాటు పేరుతో పనిచేయిస్తూ శ్రమ దోపిడీకి పాల్పడుతుంది.

ప్రభుత్వం అధికారికంగా ప్రకటించే యుడిఐఎస్ఇ లెక్కల ప్రకారం ప్రస్తుత విద్యా సంవత్సరంలొనే రాష్ట్రంలో 1,201 పాఠశాలల్లో విద్యార్థులు నమోదు (సున్నా) కాలేదు. ఈ జాబితాలో 163 పాఠశాలలతో నల్గొండ జిల్లా మొదటి స్థానంలో ఉండగా, 140 పాఠశాలలతో మహబూబాబాద్ జిల్లా రెండవ, వరంగల్(80) మూడవ, జనగామ (49) నాలుగవ, యాదాద్రి (47) ఐదవ స్థానాల్లో ఉన్నాయి. అవన్నీ ప్రాథమిక పాఠశాలలే అనుకున్నా (సుమారు 5 ఉన్నత, 3 (ప్రాథమికోన్నత) ఒక్కో పాఠశాలలో రెండు పోస్టుల చొప్పున 2402 ఉపాధ్యాయ పోస్టులు ఈ ఒక్క సంవత్సరం లోనే రద్దు కానున్నాయి. దానర్థం అంత మేరకు నిరుద్యోగులు, రాబోయే తరాలు తమ ఉద్యోగావకాశాలను కోల్పోయినట్లే లెక్క. అంటే రాష్ట్రంలో ఉన్న మొత్తం ఉపాధ్యాయ పోస్టుల్లో (1,60,091) 1.5 శాతం (2402) పోస్టులు ఈ ఒక్క సంవత్సరంలోనే రద్దుకానున్నాయి. గత సంవత్సరాలలో రద్దు కాబడి నిద్రావస్థలో దాచబడిన వాటికి జతగా ఈ సంవత్సరం ప్రభుత్వం జత చేసిన ఉద్యోగావకాశాలు ఇవి.

ఒక పక్క ఏ ఒక్క పాఠశాలను కూడా మూసివేయమంటూ, ప్రతీ పాఠశాలకు ఒక్క ఉపాధ్యాయుడినైనా కచ్చితంగా కొనసాగిస్తామంటూ అధికారికంగా ప్రభుత్వ ఉత్తర్వులు నెం. 25 జారీ చేసింది. దానికనుగుణంగా సున్నా నమోదు పాఠశాలలను తెరిచే కనీస ప్రయత్నం కాదు కదా అందుకు గల కారణాలు తెలుసుకోవడానికి కూడా ఇష్టం లేకుండా ఉంది. పని సర్దుబాటు పేరుతో ఉపాధ్యాయుల అనధికార బదిలీలకు తెర తీసింది. వసతుల లేమితో కొట్టుమిట్టాడడం కంటే, గ్రామీణ ప్రాంత బడులను వదిలి కొన్ని సౌకర్యాలైనా ఉండే పట్టణ ప్రాంతాల్లోకి వెళ్లడానికి కొంతమంది ఉపాధ్యాయులు ఇష్టపడుతున్నారు. ప్రభుత్వం కూడా ఇలాంటి పద్ధతులకు ప్రోత్సాహకాలు అందిస్తోంది. ఇది విద్యా రంగానికి ఎంత నష్టమో, ఎంతటి సామాజిక ద్రోహమో ఉపాధ్యాయులంతా గ్రహించాలి. బడుల మూసివేతకు ప్రభుత్వ విధానాలను, కుట్రలను సాగనివ్వమంటూ ఎదురొడ్డి నిలవాలి. తల్లిదండ్రుల మద్దతు కూడగట్టి అవసరమైన గదుల కోసం, అదనపు టీచర్ల కోసం, సౌకర్యాల కోసం పోరాడాలి. అక్కడక్కడా జరుగుతున్న ఇలాంటి సాహసోపేత, విజయ గాథలు అందరికీ ఆదర్శం కావాలి.

రాష్ట్రంలో ఏ ఒక్క బడిని మూయాలన్నా కఠిన నిబంధనలు, బాధ్యతాయుత ప్రక్రియను ప్రభుత్వ పరంగా అమలుచేయాలి. ఒక అవాస ప్రాంతంలో నూతనంగా బడిని ఏర్పాటు చేయాలంటే ఆ ప్రక్రియలో స్థానిక సర్పంచ్, మండల, జిల్లా విద్యాశాఖ అధికారులు, ఆ నియోజకవర్గ ఎంఎల్ఏలు భాగస్వాములు అవుతారు. బడిని ప్రారంభించడంలో ఉన్న భాగస్వామ్యం మూసివేయడంలో ఎందుకు అవసరం లేదో ఆశ్చర్యం కలిగించే విషయం. ప్రస్తుతం పిల్లల నమోదు పట్ల పాఠశాలలో పని చేసే ఉపాధ్యాయుని నిర్ధారణే బడిని బలివ్వడానికి ప్రాతిపదిక అవుతుంది. ఇది సరైనది కాదు. పాఠశాలలకు విద్యార్థులు ఎవ్వరూ రాని పక్షంలో తల్లిదండ్రులను ఒప్పించే అన్ని ప్రయత్నాలు చేయాలి. విఫలమైన తప్పనిసరి పరిస్థితుల్లో మూసివేయడానికి గల కారణాలను గ్రామసభలో ఉపాధ్యాయులు, విద్యాశాఖాధికారుల సమక్షంలో చర్చించి నమోదు చేయాలి. బడిని కొనసాగించడానికి ఎలాంటి అవకాశం లేదని ఆ గ్రామ సభ నిర్ధారించి తీర్మానించాలి. ఆ తీర్మానాన్ని అనుసరించి మండల, జిల్లా విద్యాశాఖల, నియోజకవర్గ ఎంఎల్ఏల అభిప్రాయం తీసుకొన్నప్పుడు మాత్రమే ఆ భారమైన నిర్ణయం అమలులోకి రావాలి. ఆచరణలో ఈ ప్రక్రియ అమలు చేస్తే అసలు పాఠశాలలు మూసివేసే ప్రసక్తే ఉండదు, అవసరమే రాదు.

వీటన్నింటి కంటే ముందు ఇప్పటికిప్పుడు నమోదు సున్నాగా ఉన్న 1,201 పాఠశాలల్లో తక్షణమే విద్యార్థులను చేర్పించి పునః ప్రారంభించడానికి విద్యాశాఖ ఉద్యమంలా ఒక కార్యక్రమాన్ని చేపట్టాలి. బడిబాట, పల్లె, పట్టణ ప్రగతి నిర్వహణ లాగానే 'బడిని బ్రతికిద్దాం' అనే కార్యక్రమాన్ని రూపొందించాలి. మూతబడిన పాఠశాలల అవాస ప్రాంతాలను సందర్శించి, గ్రామస్తులతో సమావేశాలు నిర్వహించాలి. విద్యాశాఖతో పాటు అన్ని స్థాయిల ప్రజాప్రతినిధులను, ఉపాధ్యాయ సంఘాలను భాగస్వామ్యం చేయాలి. కార్యక్రమ విజయవంతానికి వివిధ స్థాయిల్లో పర్యవేక్షణ బృందాలను నియమించాలి.

కోవిడ్ పరిస్థితుల్లో ప్రభుత్వ పాఠశాలల వైపు మొగ్గుతున్న ప్రజల ఆలోచనను ఆసరాగా చేసుకొని ప్రభుత్వ విద్యా వ్యవస్థను పటిష్టపరిచాలి. అందుకు ఇది అరుదైన అవకాశం. ప్రభుత్వ విద్యా పరిరక్షణ ఉద్యమకారులుగా గత పది సంవత్సరాలుగా పాఠశాలల మూసివేతను వ్యతిరేకిస్తున్నాం. ఇటీవల ఈ బృందం మహబూబాబాద్ జిల్లాలో దసరా సెలవుల్లో చేసిన ఈ ప్రయత్నం విజయవంతం అయింది. సందర్శించిన ప్రతీ మూతబడిన పాఠశాల అవాస ప్రాంతంలో ప్రజలు బడిని కాపాడుకోవడానికి తమ సంసిద్ధతను వ్యక్తం చేశారు. కొన్నిచోట్ల నూతనంగా గ్రామ పంచాయతీగా ఏర్పడ్డ తమకు కచ్చితంగా పాఠశాల ఉండాల్సిందేనన్న అభిప్రాయం వెలిబుచ్చారు. ఈ ప్రయత్నం మూలంగా అందరిని సమన్వయం చేసి సెలవుల అనంతరం ఒక పాఠశాలను తెరిపించడం గమనించాల్సిన విషయం. మరిన్ని బడులను తెరిపించే ప్రయత్నం కూడా జరుగుతోంది. ప్రభుత్వ బడులు కావాలి అనుకుంటున్న ప్రజల అభిప్రాయాలకు విరుద్ధంగా, మానవీయ సమాజ సృష్టికి కర్మగారాలైన ప్రభుత్వ బడులను మూసివేయడమంటే అది సామాజిక హత్య కాక మరేమిటి?

*(రచయితలు టిపిటిఎఫ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి, టిపిటిఎఫ్ జిల్లా కౌన్సిలర్, మహబూబాబాద్)*

# అస్సాంలో అమానవీయ సంఘటన

***అస్సాంలో జరిగిన కనీస మానవత్వంలేని ఘటన నేపథ్యంలో పాలకులు ప్రజల్ని మత ప్రాతిపదికన విభజించి మైనారిటీలను అణిచివేయాలనుకోవడం సమస్యకు పరిష్కారం కాదంటున్నారు రాజేంద్రబాబు అర్విణి***

ఘోరం ... ఘోరం ... ఎంత ఘోరం! ఒక ముస్లిం యువకుడు ...పేరు మొయినుల్ హక్. వయసు 33. సమీప దూరం నుండి పోలీసులు కాల్చి చంపారు. తుపాకులతో కాల్చి చంపడంతో కథ ముగియలేదు. ఆ పోలీసులతో పాటు ప్రభుత్వ కొలువులో ఉన్న గవర్నమెంట్ ఫొటోగ్రాఫర్ పోలీసుల కాల్పుల తర్వాత అచేతనంగా పడి ఉన్న మొయినుల్ హక్ శరీరంపై ఎక్కి తొక్కాడు కసితో, కోపంతో. తుపాకీ దెబ్బకు నేలకూలిన ఆ ముస్లిం యువకుడి శరీరం పై కరాళ నృత్యం చేశాడు. వారిద్దరి మధ్య శత్రుత్వం ఏమీ లేదు. అసలు పరిచయం కూడా లేదు. ఈ సంఘటన అస్సాం రాష్ట్రంలో సెప్టెంబర్ 2021, 23న జరిగింది. ఫొటోగ్రాఫర్ పేరు బిజోయ్ శంకర్ బనియా. బిజోయ్ శంకర్ బనియా పోలీసు తూటాలకు బలి అయిన హక్ శరీరం పైకి ఎక్కి అంత కసితో తొక్కాడంటే అందుకు కారణం మొయినుల్ హక్ ముస్లిం కావడమే. అందునా, బంగ్లాదేశ్ నుండి వలస వచ్చిన ముస్లిం కావడమే. అవశేషాలుగా మిగిలిపోయిన ఖడ్గ మృగాల జనాభాను పరిరక్షించే చర్యలకు ప్రశంసలు పొందిన అస్సాం రాష్ట్రం ఇప్పుడు ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి హిమంత బిశ్వ శర్మ ఆధ్వర్యంలో మృగాల్లాగా ముస్లింలపై దాడి చేయమని, మరీ ముఖ్యంగా బెంగాలీ ముస్లింలను తరిమికొట్టండని ప్రజలను ప్రోత్సహిస్తున్నాడు. ముస్లింల పట్ల విద్వేషాన్ని తలకెక్కించుకున్న హిమంత బిశ్వ శర్మ కొన్నేళ్ల క్రితం జరిగిన ఎన్నికల్లో తనకు బెంగాలీ ముస్లింల ఓట్లు అక్కరలేదని ప్రకటించుకున్నాడు. "వాళ్ల ఓట్లతో నేను ఎం.ఎల్.ఏ. కాదలచుకోలేదు" అని బహిరంగ ప్రకటన చేసేంత హిందూ మత పిచ్చి ఉన్నవాడు హేమంత్ శర్మ.

ఈ సంఘటన అస్సాంలోని దరాంగ్ జిల్లాలో జరిగింది. ఒక ప్రాజెక్ట్ నిర్మాణం కోసం సిరాజ్‌హర్ ప్రాంతంలోని గ్రామాలను ఖాళీ చేయించాలని పోలీసులు ప్రయత్నించగా గ్రామస్తులు అడ్డుకున్నారు. ప్రతిఘటిస్తున్న ప్రజలకు, పోలీసులకు మధ్య ఘర్షణ హింసాత్మకంగా మారి ఇరువురు ప్రాణాలు కోల్పోగా అనేకమంది గాయపడ్డారు. అక్కడి ప్రజలు ఎక్కువగా బెంగాలీ భాష మాట్లాడే ముస్లింలు. పేద రైతులు, వ్యవసాయ కూలీలు, దినసరి కూలీలు. వారు దాదాపు 10,000 బీఘాల (ఒక బీఘా 0.7 ఎకరాతో సమానం) ప్రభుత్వ భూమి ఆక్రమించుకున్న 'కబ్జాదారులు' అని ప్రభుత్వ వాదన. కబ్జాదారులను ఏరివేసి ఆ ప్రభుత్వ స్థలంలో శివాలయం, దానికి అనుభంధంగా ఒక అతిథి గృహం, కాంపౌండ్ వాల్ నిర్మిస్తామని మొదట వాగ్దానం చేసి, తదుపరి 'గఋఖుతి' అన్న పేరుతో వ్యవసాయ పరిశ్రమ నొక దానిని ఏర్పాటు చేస్తామని ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి హిమంత్ బిశ్వ శర్మ శాసనసభలో ప్రకటించాడు. అందుకోసం కొంతకాలం క్రితం 1200 నుండి 1300 కుటుంబాలను ఖాళీ చేయించారు కూడా. 'కబ్జా దారులు' అని అస్సాం ప్రభుత్వం నిందారోపణ చేస్తున్న ఆ ప్రాంతపు కుటుంబాల వారితో ఒక ప్రముఖ ఇంగ్లిష్ దినపత్రిక (ది ఇండియన్ ఎక్స్‌ప్రెస్) ముఖాముఖి వివరాలు సేకరించగా, తాము ఈ ప్రాంతానికి వలస వచ్చి 40 ఏళ్లకు పైగానే అయ్యిందని, నది పొంగి పొర్లితే తమ ఇళ్లు, పొలాలు అన్నీ మునిగి పోయి బార్‌పేట, గోపాల్‌పేరా జిల్లాల నుండి తాము వలస వచ్చామని, అప్పుడు స్థానిక ప్రజల నుండి ఆ భూమిని కొనుగోలు చేశామని, ఆ కాలంలో ఒప్పంద పత్రాలు తప్ప రిజిస్ట్రేషన్‌లు వగైరాలు తమకు తెలియదని ఆ గ్రామ ప్రజలు చెప్పారు.

పోలీసు అధికారుల సమక్షంలో బెంగాలీ ముస్లిం మృతుని శరీరం పై కసితో చిందులు వేస్తున్న పౌరుని కంకాళ నృత్యం చూపిస్తున్న వీడియో సామాజిక మాధ్యమాలలో వైరల్ అయ్యింది కాబట్టి అది దేశ ప్రజల దృష్టినాకర్షించింది కానీ, ఈ విధంగా 'కబ్జాదారులు' అని నిందారోపణ చేసి స్థానిక ప్రజలకు, వలదారులకు (ఎన్నో దశాబ్దాలుగా వారు అక్కడ జీవిస్తున్నా వారిని ఇంకా వలస వచ్చిన వారిగానే ప్రభుత్వం గుర్తిస్తున్నది) మధ్య విద్వేషాన్ని రగిలించి చాలా చోట్ల హేమంత్ బిశ్వ ప్రభుత్వం వారిని ఖాళీ చేయించే పనికి పూనుకుంది. బలవంతంగా నిర్వాసితులను చేసిన అన్ని చోట్లా సాధారణంగా కన్పించిన అంశం ఏమిటంటే, ఆయా జిల్లాలలో బెంగాలీ ముస్లింల జనాభా అధిక సంఖ్యలో ఉండడమే. కేంద్ర ప్రభుత్వం ఇటీవలి కాలంలో అమలుకు ఉద్దేశించిన పౌర (సవరణ) చట్టం, జాతీయ పౌరుల జాబితా (ఎన్‌ఆర్‌సి) బెంగాలీ మూలాలు కలిగిన అస్సాంలోని ముస్లింల పాలిటి ఉరితాళ్లయి కూచున్నాయి. ప్రతి మనిషికి ఉండే ప్రాథమిక హక్కు పౌరసత్వపు హక్కు. ఈ ప్రాథమిక హక్కును దేశంలోని కొన్ని సమూహాల నుండి దూరం చెయ్యడానికి రాజ్యం కుట్ర పూరితంగా ఈ చట్టాలను ప్రజల పై ప్రయోగిస్తుందన్న విమర్శకు ప్రత్యక్ష ఉదాహరణ అస్సాంలో బెంగాలీ ముస్లింలపై జరుగుతున్న దాడులు, వారికి వ్యతిరేకంగా పెరుగుతున్న విద్వేష ప్రచారం.

అస్సాంకు చెందిన జాతీయ పౌరుల జాబితా 2019, ఆగస్టు 31నాడు ప్రచురించ బడింది. 1971, మార్చ్ 24 కంటే ముందు వారు గాని, వారి పూర్వీకులు గాని భారతదేశంలో నివసించి ఉన్నారని రుజువులు చూపిస్తేనే వారు భారత పౌరులుగా పరిగణించబడతారు. 1971, మార్చ్ 24 అంటే బంగ్లాదేశ్ యుద్ధం ప్రారంభమైన దినం. అప్పట్నుంచి సరిహద్దులు దాటి బంగ్లాదేశ్ నుండి పెద్ద ఎత్తున పొట్ట చేతబట్టుకొని ప్రజలు వలసలు వచ్చారని అంచనా.

ఆ తర్వాత వలస వచ్చినా, ఇప్పటికే 50 ఏళ్లయింది. ఈ అర్ధ శతాబ్దంలో దాదాపు మూడు తరాలు పురుడు పోసుకొని ఉంటాయి. 1971 కంటే ముందు వలస వచ్చిన వారు కూడా ఇప్పుడేం రుజువులు చూపించగలరు! అయితే, ఈ షరతులన్నీ హిందువులకు వర్తించవు. వలస వచ్చిన వారు హిందువులయితే వారు ఈ దేశ పౌరులే. ముస్లింలు మాత్రమే 'కబ్జాదారులు'. ఇదీ మతం పునాదిగా మనుషులను విభజించే బిజెపి నీతి. వలస ప్రజలకు వ్యతిరేకంగా సంక్షుభిత చరిత్ర గలిగిన అస్సాం లాంటి ప్రదేశాలలో నివసిస్తున్న ముస్లింలు కేంద్ర ప్రభుత్వ ఈ విధాన నిర్ణయం వలన సుడిగుండాల తుఫాను తాకిడికే గురి అయ్యారు.

పేద బెంగాలీ ముస్లిం కుటుంబాలకు చెందిన రైతులు, వ్యవసాయ కూలీలపై "ఆక్రమణ దారులు" అని "కబ్జాదారుల"ని ముద్రవేసి వారిని వాళ్ల ఇళ్లల్లోంచి, దశాబ్దాలుగా సాగు చేసుకుంటున్న పొలాల నుండి బయటికి వెళ్లగొట్టడం అవాంఛనీయం. అయితే కొన్ని దశాబ్దాలుగా అపరిష్కృతంగా సాగుతున్న సమస్య ఒకటుంది. అది "స్థానికులకు" "వలసదారులకు" మధ్య చిరకాలంగా నలుగుతున్న వైరుధ్యం. "మేం బ్రహ్మపుత్ర నది ఒడిలో జన్మించిన వాళ్లం" అని స్థానికులు గర్వంగా చెపుతారు, "వాళ్లు విదేశీయులు, వాళ్లు వచ్చి ఇక్కడ వ్యవసాయం, ఇతర పనులు చేసుకుంటున్నారు. మాకు దక్కవలసిన ఉపాధి అవకాశాలు వాళ్లు కొల్లగొడుతున్నారు" అన్నది స్థానికుల ఆవేదన. దీన్ని ఆసరాగా తీసుకొని హిమంత బిశ్వ శర్మ ప్రభుత్వం బిజెపి సిద్ధాంతమయిన "మత మెజారిటేరియన్" వాదనను పటిష్ట పరుచుకోవాలని ప్రయత్నించడం కూడా అవాంఛనీయమే.

ప్రభుత్వాలు ఉన్నదెందుకు? సమస్యలు పరిష్కరించడానికి. కానీ, ఉన్న సమస్యలను చిలవలు పలువలుగా వ్యాపింపజేసి తమ పబ్బం గడుపు కోవడం కాదు. కొన్ని సార్లు లేని సమస్యలు సృష్టించి ప్రజల మధ్య విభేదాలు పెరిగేటట్టుగా పథకం పన్నుతారు కూడా. ఈ రకమయిన చర్యల పట్ల ప్రజలు జాగరూకతతో వ్యవహరిస్తూ అలా వక్రమార్గాలు అవలంబించే ప్రభుత్వాలను అభిశంసించాలి.

కొంత మంది అభిప్రాయ పడుతున్నట్టుగా ఇది "హిందూత్వాని"కి చెందిన "ముస్లిం వ్యతిరేక ఎజెండా" లో భాగమయి ఉండవచ్చు. హేమంత్ బిశ్వ శర్మ ప్రభుత్వం తన కక్షపూరిత చర్యల ద్వారా అల్పసంఖ్యాక వర్గాలకు ప్రాణాంతకంగా తయారు కావడం తీవ్రంగా ఖండించాల్సిన విషయం. భూ సమస్య, వ్యవసాయ రంగంలో మార్పులు, వక్రీకరించిన సాంస్కృతిక జాతీయత వీటన్నింటి సమాహారమే జాతుల మధ్య విద్వేషాలు తీవ్రతరం కావడానికి తోడ్పడింది. అస్సాంలోని కొన్ని ప్రాంతాలలో గ్రామస్తులు "మియా ముస్లింలు" - అంటే బెంగాలీ నేపథ్యం కలిగిన ముస్లింలు - పశువులను మేపడానికి భూములను వాడుకొని సమస్యను తీవ్రతరం చేస్తున్నారని ఆరోపిస్తుంటారు. వలస కాలం నాటి ప్రభుత్వం శిస్తు చెల్లించిన వారే భూమిని వ్యవసాయం కోసమో లేదా వ్యవసాయ సంబంధిత లేదా వ్యవసాయేతర పనులకోసం వాడుకోవచ్చన్న విధానం అవలంబించడం, ఆ విధానం చాలా కాలం కొనసాగడం కూడా సమస్య తీవ్రం కావడానికి తోడ్పడింది. అసలు సమస్యను గుర్తించి, వాస్తవంగా ఉన్న వైరుధ్యాలను పరిష్కరిస్తే జాతుల సమస్య తీవ్రత తగ్గి మనుషులు అమానవీయంగా మారరు.

అస్సాంలో నివసిస్తున్న బెంగాలీ ముస్లింలను ఏరివేయాలని, వారిని యాతనలకు గురి చెయ్యాలన్న భాజపా పథకం మరెక్కడో వ్యతిరేక ఫలితాలను కనబరుస్తుందన్న అవగాహన పాలకులలో కొరవడడం దురదృష్టకరం. పొరుగు దేశమయిన బంగ్లాదేశ్‌లో హిందూ జనాభా పై పెరుగుతున్న దాడులు ఆందోళన కలిగిస్తున్నాయి. బంగ్లాదేశ్ ప్రధానమంత్రి షేక్ హసీనా బంగ్లాదేశ్‌లోని హిందువులపై దాడులను, గృహ దహనాలను, మానభంగాలను, హత్యాకాండను ఖండిస్తూనే, వాటికి పాల్పడ్డవారిపై కఠిన చర్యలు ఉంటాయని హెచ్చరిస్తూనే భారత దేశంలో కూడా ముస్లింలపై దాడులను ఆపడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చర్యలు తీసుకోవడం లేదని, అది సంస్కారవంతమయిన పాలనకు నిదర్శనం కాదంటూ అన్యాపదేశంగా విమర్శలు గుప్పించారు. దీనికి భారత ప్రభుత్వం ఏమి సమాధానం చెపుతుంది?

అస్సాంలో బెంగాలీ ముస్లింలు ఉన్నట్లే, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో మాత్రమే కాదు ప్రపంచ వ్యాప్తంగా హిందువులు ఉన్నారు. కాబట్టి, బెంగాలీ ముస్లింలను నిరాశ్రయులను చెయ్యడం లాంటి పనులకు స్వస్తి పలకాలి. వారిపై కాల్పులు జరిపిన వారిపై, ఆ బెంగాలీ ముస్లిం పార్థివ శరీరం పై చిందులు వేసిన ఫొటోగ్రాఫర్ పై కఠిన చర్యలు తీసుకోవాలి. బంగ్లాదేశ్ ప్రధాన మంత్రి ఆ దేశం లోని హిందువులకు రక్షణ కల్పిస్తామని, వారిపై దాడులను ఉపేక్షించబోమని కఠిన హెచ్చరిక చేశారు. మరి, బెంగాలీ ముస్లింలపై జరుగుతున్న దాడులను గురించి మన దేశ ప్రధాన మంత్రి మౌనం వహించడం ఏ సంకేతాలనిస్తుంది? అస్సాం ముఖ్యమంత్రి హిమంత బిశ్వ శర్మ అనాలోచిత చర్యలను కట్టడి చెయ్యడం ప్రధాన మంత్రి బాధ్యత అని మోడీ గుర్తెరగాలి.

ఈ వ్యాసం రాస్తున్న సమయానికి కల్లోల కశ్మీర్ నుండి తాజా వార్తలు దేశ మీడియాను ముంచెత్తాయి. అక్కడా ఇదే సమస్య-లోకల్, నాన్ లోకల్. కశ్మీర్ పోరాటం కొత్తకోణం రూపొందించుకుంటుందన్న అనుమానం కలగడం సహజం. మిలిటెంట్‌లు ఈసారి స్థానికేతర హిందువుల మీదా, కశ్మీరీ పండిట్‌ల మీద దృష్టి సారించారు. ఇంతవరకు 2021, అక్టోబర్ 20 నాటికి సుమారు 11 మంది సాధారణ పౌరులు, వలస వచ్చిన కూలీలు మిలిటెంట్లు జరిపిన కాల్పుల్లో ప్రాణాలు కోల్పోయారని అంచనా. అందులో ఒక టీచరు, ఒక స్కూలు ప్రిన్సిపాల్ కూడా ఉన్నారు. 'ది హిందూ' పత్రిక సేకరించిన వివరాల ప్రకారం మూడు నుండి నాలుగు లక్షల మంది వలస కూలీలు ప్రతి సంవత్సరం ఉత్తరప్రదేశ్, బీహార్, ఛత్తీస్‌గఢ్, ఝార్ఖండ్, ఉత్తరాఖండ్ రాష్ట్రాల నుండి కశ్మీర్ లోయకు పనుల కోసం వలస వస్తారు. వారంతా పొట్టకూటి కోసం వచ్చే కూలీలే. వారందరినీ రక్షణ శిబిరాలలోకి తరలించాలని కశ్మీర్ పోలీసు శాఖ ప్రకటించిందంటే సమస్య ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. పనులు వదిలి పెట్టి లక్షలాది మంది పేదలు ప్రాణ భయంతో రైల్వే స్టేషన్ల వద్ద, బస్ స్టేషన్‌ల వద్ద క్యూలు కట్టారు. కశ్మీర్ లెఫ్టినెంట్ గవర్నర్ "రాలిన ప్రతి రక్తపు చుక్కకూ ప్రతీకారం తీర్చుకుంటామని" హూంకరిస్తున్నాడు. ఇది శాంతి భద్రతల సమస్య కాదని, యుద్ధాలతో గాని ప్రతీకారాలు తీర్చుకోవడాలతో గాని సమస్యకు పరిష్కారం లభించదని, ప్రజల భావోద్వేగాలు, రాజకీయ పరమయిన అంశాలకు సంయమనంతో, చర్చల ద్వారా పరిష్కారం కోసం వెతకడమే ప్రజాస్వామిక దృక్పథమని మన పాలకులకు ఎప్పుడర్థమవుతుందో!

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

# హుజూరాబాద్ ఉప ఎన్నిక ఏం చెబుతోంది..?

***రాష్ట్ర ప్రజల సమస్యలను పక్కన పెట్టి హుజూరాబాద్‌లో అనేక పథకాలను కుమ్మరించి, ఎన్నికల నియమాలను ఉల్లంఘిస్తూ గెలుపే ధ్యేయంగా టిఆర్ఎస్ పనిచేస్తున్నదని అంటున్నారు ఎం. రవి***

ఎన్నికలు వస్తుంటాయి.. పోతుంటాయి.. కానీ.. దేశంలోనే అత్యంత ఖరీదైన ఉప ఎన్నికగా హుజూరాబాద్‌ను ఇప్పుడు చూస్తున్నాం. ఎక్కడ చూసినా ఇదే చర్చ. ఎవరినోట విన్నా ఇదే ముచ్చట..! ఈ ఉప ఎన్నిక వల్ల టిఆర్ఎస్ ప్రభుత్వం కూలిపోయేది లేదు.. బిజెపి అధికారంలోకి వచ్చేదిలేదు. కాంగ్రెస్‌కు ఒరిగేదేమీ లేదు..! మరి ఎందుకింత హడావుడి..? ఎందుకింత విపరీత ఖర్చు..? ఎవరికోసం ఈ విపరీత పోకడ.. ఎవరికోసం ఈ రోత కూతలు..? ఎందుకింత మాటల యుద్ధం..? ప్రజల అవసరాలను, సమస్యలను గాలికి వదిలేసి.. తమ నియోజకవర్గాలను పట్టించుకోకుండా ఎంఎల్ఏలు, ఎంపిలు, మంత్రులు, నాయకులు, కార్యకర్తలు హుజూరాబాద్‌లో చేస్తున్న హంగామాతో ఏం జరుగుతుంది..? అన్న ప్రశ్నలకు ఇప్పుడు మనం జవాబులు వెతుక్కోవాల్సిన అవసరం వస్తోంది.

టిఆర్ఎస్ ప్రభుత్వంలో మంత్రిగా ఉంటూనే ఈటల రాజేందర్ పలుమార్లు గులాబీ బాస్ కెసిఆర్‌పై ధిక్కార స్వరం వినిపించడం.. ఏకంగా గులాబీ ఓనర్లమంటూ స్వరం పెంచడంతో మొదలైన రచ్చ రోజురోజుకూ పెరుగుతూ వచ్చింది. చివరకు.. భూ కబ్జాల మంత్రిగా ఆరోపిస్తూ సిఎం కెసిఆర్ తన సొంత పత్రిక నమస్తే తెలంగాణలోనే భారీ స్థాయిలో కథనాలు రాయించి మంత్రి పదవి నుంచి ఈటలను తొలగించడం రాష్ట్ర రాజకీయాల్లో పెను సంచలనంగా మారింది. ఆ తర్వాత టిఆర్ఎస్ పార్టీకి రాజీనామా చేసి ఈ క్రమంలో సొంత పార్టీ పెట్టాలా..? బహుజనులు గొంతుకై నినదించాలా..? లేక కెసిఆర్ లాంటి ఉద్దండులను ఎదుర్కోవాలంటే అంతకుమించిన కాషాయ దండులో చేరాలా..? అనే తర్జన భర్జనల మధ్య బిజెపికి గూటికి చేరిన నాటి నుంచి మొదలైన హుజూరాబాద్ ఉప ఎన్నికల హడావుడి అంతాఇంతా కాదు. నాపై పోటీకి వస్తావారా కెసిఆర్.. వస్తావారా హరీశ్..! అంటూ ఈటల రాజేందర్ సంచలన వ్యాఖ్యలతో మొదలైన ప్రచారం నెలలుగా హోరెత్తుతోంది.

హుజూరాబాద్ ఉప ఎన్నికలో ఓడిపోతే టిఆర్ఎస్ ప్రభుత్వం కూలిపోయేది లేదు. కానీ.. గెలిచితీరాల్సిన పరిస్థితి గులాబీ అధినేత కెసిఆర్ ముందు పెనుసవాలుగా ఉంది. ఈ ఉప ఎన్నికలో గెలిచి తనకు ఎదురేలేదని జనంలో నిరూపించుకోవడానికి.. కెసిఆర్‌ను ఢీకొట్టడం ఎవరివల్లా కాదని చెప్పడానికి.. ఎవరైనా ధిక్కార స్వరం వినిపిస్తే పాతాళానికి తొక్కేస్తానని హెచ్చరించడానికి.. హుజూరాబాద్ ఉప ఎన్నికను ఒక సందర్భంగా కెసిఆర్ తీసుకుంటున్నారు. అందుకే ఎలాగైనా గెలిచి తీరాల్సిందేనన్న పట్టుదలతో ఉన్న కెసిఆర్.. అందుకు తగ్గట్టే వ్యూహాత్మకంగా అడుగులు వేస్తున్నారు. పార్టీ అభ్యర్థిగా యువనేత గెల్లు శ్రీనివాస్‌యాదవ్‌కు అవకాశం ఇచ్చారు. ఎవరూ అడుగకముందే.. హుజూరాబాద్ నియోజకవర్గంలో దళితబంధు పథకాన్ని పైలెట్ ప్రాజెక్టుగా ఎంపిక చేసి ప్రారంభించడం గమనార్హం. ఏకంగా దళిత లబ్దిదారుల ఖాతాల్లోకి పది లక్షల రూపాయలు జమ చేస్తున్నారు. కోట్ల రూపాయలు నియోజకవర్గంపై కుమ్మరిస్తున్నారు. నిజానికి.. ఎస్‌సి వర్గాల అభివృద్ధి కోసం, సంక్షేమం కోసం సబ్‌ప్లాన్ నిధులను సక్రమంగా ఖర్చుచేయని కెసిఆర్.. ఎస్‌సి కార్పొరేషన్ రుణాలు ఇవ్వని కెసిఆర్.. ఇప్పుడు కేవలం హుజూరాబాద్ నియోజకవర్గంలోనే దళిత బంధు పథకాన్ని ప్రవేశపెట్టడంలో ఆంతర్యం ఏమిటో సులభంగా అర్థం చేసుకోవచ్చు.

ఒకవేళ టిఆర్ఎస్ ఓడిపోతే.. గులాబీ బాస్ పతనం మొదలైందనే బలమైన సంకేతాలు ప్రజల్లోకి వెళ్లే ప్రమాదం ఉంది. ఈ నేపథ్యంలో అధికార బలాన్నంతా ఉపయోగిస్తున్నారు. మంత్రులు, ఎంఎల్ఏలు, ఇతర ప్రజా ప్రతినిదులు, నాయకులు, కార్యకర్తలు మొత్తం హుజూరాబాద్‌లో మకాం వేశారు. మరోవైపు.. ఈటల రాజేందర్ బిజెపిలో చేరినా.. ఈ ఉప ఎన్నికను తన వ్యక్తిగతంగానే తీసుకుంటున్నారు. ప్రజలు కూడా అలాగే చూస్తున్నారు. ఈ ఉప ఎన్నికల్లో గెలిచి తన సత్తా చాటాలని.. గులాబీ బాస్ కెసిఆర్ పతనానికి నాంది పలకాలని ఈటల రాజేందర్ చూస్తున్నారు. ఇదే సమయంలో ఈటలను గెలిపించుకుని వచ్చే అసెంబ్లీ ఎన్నికల నాటికి టిఆర్ఎస్ పార్టీకి ప్రత్యామ్నాయంగా ఎదగాలని బిజెపి చూస్తోంది. ఇక్కడ మరొక విషయం ఏమిటంటే.. నేతల నీతిమాలిన రాజకీయాలకు హుజూరాబాద్ ఉప ఎన్నిక ఒక నిదర్శనంగా నిలుస్తుంది. టిఆర్ఎస్ ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న ఈటలపై బిజెపి నేతలు దుమ్మెత్తి పోశారు. అవినీతి మంత్రివర్గమంటూ ఆరోపణలు గుప్పించారు. బిజెపిలోకి రాగానే.. అవినీతి మంత్రి ఈటల మచ్చలేని నేతగా ఎలా మారాడన్న ప్రశ్నకు కమలం నేతలు సమాధానం చెప్పాలి. తన తమ్ముడు, కుడి భుజం అంటూ ఈటలను పలు సందర్భాల్లో పొగిడిన కెసిఆర్‌కు.. ఈటల అవినీతి ఎందుకు కనిపించలేదో ప్రజలకు చెప్పాల్సిన అవసరం ఉంది.

టిపిసిసి సారథిగా రేవంత్‌రెడ్డి బాధ్యతలు చేపట్టిన తర్వాత ఎదుర్కొనే మొదటి ఎన్నిక కావడంతో అందరిచూపు రేవంత్‌పైనే ఉంది. కానీ.. ఈ ఉప ఎన్నికతో రాత్రికి రాత్రి ఏం జరగబోదని మొదట్లో రేవంత్ చెప్పడం గమనార్హం. కానీ.. గత ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసిన కౌషిక్ రెడ్డికి 60 వేలకు పైగా ఓట్లు వచ్చాయి.

# కార్పొరేట్ల కోసమే బ్యాడ్ బ్యాంక్

*పారు బాకీల వసూలు కోసం ఏర్పాటు చేస్తున్న బ్యాడ్ బ్యాంక్ ప్రజల ఆస్తులను పణంగా పెట్టి కార్పొరేట్ సంస్థలకు సంపదను బదలాయింపు చేయడానికేనని అంటున్నారు* **సంతోష్**

అడ్డదారిలో ఐశ్వర్యవంతులయ్యేలా తగిన హామీలేమీ లేకుండానే పాలకుల ప్రమేయంతో భారీ రుణాలివ్వడానికి ఒక బ్యాంకు, ఆ అప్పును తిరిగి వసూలు చేయడానికి మరో బ్యాంకు... ఇదే బ్యాడ్ బ్యాంకు. వాణిజ్య బ్యాంకుల లాభాలను నిరర్ధక ఆస్తులు (మొండి బాకీలు) హరిస్తున్న నేపథ్యంలో బ్యాంకులను నిరర్ధక ఆస్తుల బెడద నుంచి బయట పడేసేందుకు బ్యాడ్ బ్యాంకును ఏర్పాటు చేయాలని చాలాకాలంగా కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ (సిఐఐ) ప్రభుత్వాన్ని కోరుతోంది. దీనికి రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అభ్యంతరం లేదని తెలిపింది. నేషనల్ అసెట్ రీకన్స్ట్రక్షన్ కంపెనీ లిమిటెడ్ (ఎన్ఎఆర్సిఎల్) పేరిట ఒక బ్యాడ్ బ్యాంక్‌ను కంపెనీ చట్టం కింద తెరవనున్నట్టు కేంద్ర ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ ఈ ఏడాది (2021-22) బడ్జెట్‌లోనే ప్రకటించారు. దేశంలోని వివిధ వాణిజ్య బ్యాంకులు పలు దశల్లో ఇచ్చిన రుణాల వసూలు కోసం రెండు సంస్థలను ఏర్పాటు చేస్తున్నట్లు సెప్టెంబర్ 15న ప్రభుత్వం ప్రకటించింది.

ఒకటి బ్యాడ్ బ్యాంక్ (ఎన్ఎఆర్సిఎల్), ఇది వాణిజ్య బ్యాంక్‌ల నుండి చెడ్డ రుణాలను కొనుగోలు చేస్తుంది. ఇది ప్రభుత్వ రంగ స్వభావాన్ని కలిగి ఉంటుంది. సంబంధిత మొండిబాకీలో 15 శాతాన్ని ప్రభుత్వం వెంటనే సంబంధిత బ్యాంక్‌కు చెల్లిస్తుంది. మిగతా 85 శాతానికి ప్రభుత్వ హామీతో బ్యాడ్ బ్యాంక్ సెక్యూరిటీలు ఇస్తుంది. అంటే ఆ ఆస్తి విక్రయం ఐదు సంవత్సరాలలోపు జరిగితే ఆ సొమ్ముతో సెక్యూరిటీలు విడిపించుకోవచ్చు. లేకుంటే అంతే సంగతులు, కథ మొదటికొస్తుంది. ఇదంతా కాగితంపై పథకం, ఆచరణలో ఏం జరుగుతుందో ముందుగాని తెలియదు. దీనివల్ల బ్యాంకుల బ్యాలెన్స్ షీట్లు ప్రక్షాళన అవుతాయి. అంటే ఎన్‌పిఎలకు తమ లాభాలను ఏటా సర్దుబాటు చేయటం నుండి బ్యాంకులు విముక్తి పొందుతాయి.

ఇక రెండవది ఇండియన్ డెట్ రిజల్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఐడిఆర్సిఎల్) ఆస్తుల నిర్వహణ బాధ్యతను చూస్తుంది. బ్యాంకులకు బకాయి ఉన్న మొత్తాల్లో కొంతైనా రికవరీ చేసేందుకు గాను సాధ్యమైనంత మంచి ధరకు ఆ ఆస్తులను విక్రయించడానికి చూస్తుంది. ఇది ఒక సేవా సంస్థ లేదా కార్యాచరణ సంస్థ. ఈ సంస్థకు అవసరమైన మార్కెట్ నిపుణుల సహాయం కూడా అందిస్తారు. పెద్ద మొత్తాలుగా ఉన్న పారు బకాయిల సమస్యను పరిష్కరించేందుకు ఇదొక వినూత్నమైన పద్ధతిగా ప్రభుత్వం తీసుకువచ్చింది. మొండి బాకీలను బ్యాడ్ బ్యాంక్ వసూలు చేసి సంబంధిత బ్యాంక్‌కు జమ చేస్తుంది. ఇక్కడ హెయిర్‌కట్ పడితే దాన్ని ఎవరు భరిస్తారు? బ్యాడ్ బ్యాంక్‌నా, రుణదాత బ్యాంకునా లేక ప్రభుత్వమా అనే స్పష్టత లేదు. నిర్మాణ లోపాలను సరిదిద్దడానికి కూడ బ్యాడ్ బ్యాంక్ తోడ్పడదు. ఇదంతా ముందు ముందు ప్రభుత్వ బ్యాంక్‌లను ప్రైవేటీకరించడానికే నన్నది స్పష్టం.

ప్రభుత్వ విధానాలు సృష్టించిన సంక్షోభాన్ని చెరిపివేసేందుకు చేసే ప్రయత్నం తప్ప ఇది మరొకటి కాదు. బ్యాంకుల ఎన్‌పిఎ భారం తగ్గించే నిమిత్తం ప్రభుత్వం కొంతకాలం క్రితమే దివాళా చట్టం (ఇన్‌సాల్వెన్సీ అండ్ బ్యాంక్‌రప్టసీ చట్టం) తెచ్చింది. బ్యాంకులు నివేదించిన భారీ మొండి బాకీదారుల ప్రైవేటు ఆస్తులను మార్కెట్‌లో విక్రయించి సొమ్ము రాబట్టడం దాని పని. దాని కింద పరిష్కారాలు విపరీత జాప్యంతో పాటు బ్యాంకులకు తలగొరుగుడు (హెయిర్‌కట్- రావలసిన సొమ్ములో భారీ కోత) ఎక్కువగా ఉంది. అంటే బ్యాంకు ఇచ్చిన రుణాల్లో కొంత కోతపెట్టి మిగిలినది చెల్లిస్తారు. దాన్ని కొనసాగిస్తూనే ఇప్పుడు బ్యాడ్ బ్యాంక్‌ను తెచ్చారు.

దీని ప్రకారం బ్యాంకులు తమ ఎన్‌పిఎ ఆస్తులను ఈ బ్యాంకుకు బదిలీ చేస్తాయి. ఎన్ఎఆర్సిఎల్ (బ్యాడ్ బ్యాంక్) రుణ దాతలచే ఏర్పాటు చేయబడుతోంది. ప్రభుత్వ రంగ బ్యాంకుల వాటా 51 శాతం ఉంటుంది. ఎన్ఎఆర్సిఎల్‌కు సహకరించడానికి ప్రభుత్వ, ప్రైవేట్ బ్యాంకులు కలిసి ఐడిఆర్సిఎల్‌ను ఏర్పాటు చేస్తాయి. నిరర్ధక

---

ప్రస్తుతం కౌశిక్‌రెడ్డి అధికార టిఆర్ఎస్ పార్టీ గూటికి చేరుకున్నారు. ఈ పరిస్థితుల్లో కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా బరిలోకి దిగిన బల్మూరి వెంకట్‌కు ఎన్ని ఓట్లు వస్తాయన్నది కీలకం కానుంది. టి కాంగ్రెస్ సారథిగా బాధ్యతలు చేపట్టిన రేవంత్ కాంగ్రెస్ శ్రేణుల్లో జోష్ నింపేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు. మరి హుజూరాబాద్ ఉప ఎన్నికల్లో ఎన్ని ఓట్లు తెచ్చిపెడుతారో చూడాలి మరి. ఇలా మూడు పార్టీలకు ఈ ఉప ఎన్నిక అత్యంత కీలకంగా మారిన నేపథ్యంలోనే దేశంలోనే అత్యంత ఖరీదైన ఎన్నికగా మారుతుందని చెప్పొచ్చు. కోట్ల రూపాయలు గుమ్మరిస్తున్నారు. ఇష్టా రాజ్యంగా ఖర్చు పెడుతున్నారు. అంతేగాకుండా.. ఈ ఉప ఎన్నికలో పేయిడ్ మీడియాదే హవా నడుస్తోంది. దీంతో ఏది నిజమో.. ఏది అబద్ధమో.. ప్రజల నాడి ఏమిటో..? వారి ఆలోచన ఏమిటో..? బయటి ప్రపంచం తెలుసుకోలేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

*(రచయిత జర్నలిస్టు)* వీ

ఆస్తులు లేదా చెడ్డ రుణాల సమస్యను పరిష్కరించడానికి బ్యాడ్ బ్యాంక్ తోడ్పడుతుందా అంటే సందేహమే.

రిజర్వ్ బ్యాంకు గడిచిన పదేళ్లలో మొత్తం రు. 10 లక్షల కోట్ల రుణాలను రద్దు చేసింది. ఇంత పెద్ద మొత్తం కేవలం 50 మంది కార్పొరేట్ వ్యక్తులకు మాత్రమే సంబంధించినవి కావడం గమనార్హం. గడిచిన ఏడేళ్ల కాలంలో బిజెపి నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వం దాదాపు ఎనిమిదిన్నర లక్షల కోట్ల రూపాయలను కార్పొరేట్లకు ఇలాగే వదిలేసింది. సంవత్సరానికి సుమారు లక్షా పది వేల కోట్ల రూపాయల చొప్పున మొండి బకాయిలను రద్దు చేస్తూ బ్యాంకింగ్ వ్యవస్థ పతనానికి కారణమవుతోంది.

బ్యాంకులు ఏదైనా వ్యక్తికి లేదా సంస్థకు ఇచ్చిన రుణానికి సంబంధించిన రుణ వాయిదాలు వరుసగా మూడు నెలల పాటు తిరిగి రాకపోతే బ్యాంకులు దానిని నిరర్థక ఆస్తిగా (నాన్ పెర్ఫార్మింగ్ అసెట్స్)గా పరిగణిస్తాయి. ఇలాంటి కేసుల్లో తొంబై రోజుల తరువాత కూడా 3 సంవత్సరాలు గడిచినా ఆ రుణ వాయిదాలు లేదా అసలు, వడ్డీ ఆ వ్యక్తి లేదా సంస్థ నుంచి తిరిగిరాని పక్షంలో వాటిని బ్యాంకులు లాస్ అస్సెట్స్‌గా గుర్తిస్తాయి. ఇక ఆ రుణ మొత్తంపై పూర్తిగా ఆశలు వదులుకుంటాయి. ఇలాంటి సందర్భంలోనే ఆ రుణాలకు సంబంధించిన వివరాల్ని బాలెన్స్ షీట్ల నుంచి తొలగిస్తాయి. దీనినే ఇప్పుడు రైటాఫ్ లేదా రిటర్న్ ఆఫ్ అంటున్నారు.

దేశంలో తొలి బ్యాడ్ బ్యాంక్ ఏర్పాటు చేస్తున్నట్లు కేంద్ర ఆర్థికమంత్రి నిర్మలా సీతారామన్ ప్రకటించడంతో గత నాలుగేళ్లుగా దీనిపై సాగుతున్న చర్చలు ఒక కొలిక్కి వచ్చినట్లయింది. ఇంతకీ బ్యాడ్ బ్యాంక్ అంటే ఏమిటి? అది ఎలా పనిచేస్తుంది? బ్యాడ్ బ్యాంక్ ఒక బ్యాంక్‌గా పనిచేస్తుందన్న అభిప్రాయం కలుగుతుంది కానీ అది బ్యాంక్‌గా ప్రారంభం కావడానికి దాని దగ్గర పారుబాకీలు మాత్రమే ఉంటాయి. సాంకేతికంగా బ్యాడ్ బ్యాంక్ అనేది ఆస్తుల పునర్నిర్మాణ సంస్థ (ఎఆర్‌సి) లేదా ఒక ఆస్తి మేనేజ్‌మెంట్ కంపెనీ, ఇది బ్యాంకుల మొండి బాకీలను స్వాధీనం చేసుకుంటుంది. వాటిని నిర్వహిస్తుంది. బ్యాడ్ బ్యాంక్ రుణాలు ఇవ్వడం, తీసుకోవడంలో పాల్గొనదు, కానీ వాణిజ్య బ్యాంక్‌లు తమ బ్యాలెన్స్ షీట్లను శుభ్రం చేసుకోవడానికి, మొండి బాకీలను పరిష్కరించడానికి తోడ్పడుతుంది. మొండి బాకీలను స్వాధీనం చేసుకోవడం సాధారణంగా రుణం పుస్తక విలువ కంటే తక్కువగా ఉంటుంది. మాజీ రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ రఘురామ్ రాజన్ మొండి బాకీని ప్రభుత్వ బ్యాంక్ నుండి మరొక బ్యాడ్ బ్యాంక్‌కు మార్చడం తప్ప ఇందులో వాటిని అరికట్టే చర్యలు ఏమిలేవని పేర్కొన్నాడు.

పబ్లిక్ రంగంలోని వాణిజ్య బ్యాంకుల నుంచి రుణం తీసుకొని తిరిగి చెల్లించకుండా ఉన్న రు. 2 లక్షల కోట్ల మేరకు గల మొండి బకాయిల వసూలు బాధ్యతను ఈ బ్యాడ్ బ్యాంకుకు అప్పగించడానికి నిర్ణయించారు. ఈ బ్యాంకును పోషించడానికి రు. 30,600 కోట్ల మేరకు గ్యారంటీ సమకూర్చడానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది. ఈ గ్యారంటీ సొమ్మును ఉపయోగించుకొని బ్యాంకుల వద్ద నుంచి మొండి బకాయిల బాధ్యతను స్వీకరించి వాటి వసూలుకు ఉపక్రమించడం బ్యాడ్ బ్యాంకు బాధ్యత. ఈ బ్యాడ్ బ్యాంకు తాను బాధ్యత తీసుకునే నిరర్థక ఆస్తి విలువలో 15 శాతం మొత్తాన్ని ముందుగా రుణమిచ్చిన బ్యాంకుకు చెల్లిస్తుంది. మిగతా సొమ్ముకు ప్రభుత్వమిచ్చిన గ్యారంటీలను సమర్పిస్తుంది. అయితే అది బకాయిల వసూళ్లలో ఎంత వరకు సఫలమవుతుందనేదే కీలక ప్రశ్న. దేశంలోని బ్యాంకులు వాణిజ్య స్థాయి ఉత్పత్తి కార్యక్రమాల్లో బొత్తిగా ఆసక్తి, అనుభవంలేనివారి ప్రతిపాదనలకే పాలకుల ఒత్తిడితో ఎక్కువగా రుణాలిచ్చి అవి తిరిగిరాని పరిస్థితిని తామే సృష్టించుకుంటాయని అనుభవంలో నిస్సందేహంగా రుజువైంది.

బ్యాడ్ బ్యాంక్ ఆలోచన ఇప్పటిది కాదు. 1980ల నుంచే దాని ప్రస్తావన కనిపిస్తుంది. మొదట అమెరికాలో మెల్లన్ బ్యాంక్ 1988లో ఏర్పడింది. ఆ తర్వాత స్వీడన్, ఫ్రాన్స్, జర్మనీలలో బ్యాడ్ బ్యాంకులు ఏర్పడ్డాయి. పారుబాకీల వసూలులో అవి విజయవంతం కావడంతో బెల్జియం, ఫిన్‌లాండ్, మలేసియా, ఇండోనేషియాల్లోనూ బ్యాడ్ బ్యాంకులను ఏర్పరిచారు. ఏదేమైనా, అవి రిజల్యూషన్ ఏజెన్సీలుగా మారాయి.

ఇప్పుడు మన దేశంలో వ్యాపార సంస్థల వద్ద పేరుకుపోయిన మొండి బకాయిలను ఈ బ్యాడ్ బ్యాంకుకి అప్పగిస్తే వాటిని స్వాధీనపర్చుకుని వాటిని మార్కెట్లో విక్రయించేందుకు ప్రయత్నిస్తుంది. కంపెనీలు కాస్త నష్టానికి తమ ఆస్తులను బ్యాడ్ బ్యాంకుకు స్వాధీనపరిస్తే, వాటిని అధిక ధరకు అమ్మడం ద్వారా లబ్ధిపొందాలనేది బ్యాడ్ బ్యాంక్ లక్ష్యం. నిజానికి ఇక్కడ జరిగేది ఏమిటంటే బ్యాడ్ బ్యాంక్ వేసే వేలంలో ఒక కార్పొరేట్ ఆస్తిని మరో కార్పొరేట్ మార్కెట్ విలువ కంటే తక్కువకు కొంటుంది. మారుపేర్లతో ఒకరి ఆస్తులను మరొకరు తక్కువ ధరకు కొంటారు. అసలు విలువ రాదనేది స్పష్టం.

2008లో అమెరికా చిక్కుల్లో పడిన ఆస్తుల వసూలు కార్యక్రమం (ట్రబుల్డ్ అసెట్ రిలీఫ్ ప్రోగ్రాం (టార్ప్) ప్రారంభించగా, 2009లో ఐర్లాండ్ జాతీయ ఆస్తుల నిర్వహణ సంస్థ నేషనల్ అసెట్ మేనేజ్‌మెంట్ ఏజెన్సీ (నామా)ని నెలకొల్పింది. ఎన్‌పిఎల వల్ల దెబ్బతిన్న బ్యాంకులకు తగిన మూలధనాన్ని సమకూర్చకుండా కేవలం పారుబాకీలను వేరు చేస్తే ప్రయోజనం ఉండదని బ్యాంక్ ఫర్ ఇంటర్‌నేషనల్ సెటిల్‌మెంట్స్ పేర్కొంది. మొదటి నుంచి అన్ని జాగ్రత్తలు తీసుకునే బ్యాంకులకు చాలా తక్కువ ఎన్‌పిఎలు ఉంటాయి. సరైన ప్రణాళికతో వ్యవహరించడం వల్ల అటువంటి బ్యాంకులు పెద్దయెత్తున రుణ వితరణ కొనసాగించినా ఎన్‌పిఎల శాతం తక్కువగానే ఉంటుందని అధ్యయనాలు చాటుతున్నాయి. అలాంటి వాటికే బ్యాడ్ బ్యాంక్ వల్ల ప్రయోజనం ఉంటుంది.

అసలు ఎన్‌పిఎలను ఎన్ఎఆర్‌సిఎల్ ఏ విధంగా వసూలు చేయబోతోంది, అందుకు ఏదైనా ప్రత్యేక యంత్రాంగం ఉందా అనే ప్రశ్నలూ ఉద్భవిస్తున్నాయి. బ్యాంకులను నిరర్థక ఆస్తుల బెడద నుంచి బయటపడేసేందుకు చాలా సంఖ్యలో బ్యాడ్ బ్యాంకులను ఏర్పాటు చేయాలని సిబిఐ సూచించింది. బ్యాడ్ బ్యాంకులు అనగా వాణిజ్య బ్యాంకుల్లో పేరుకుపోతున్న నిరర్థక ఆస్తులను బదలాయించుకుని వసూలు ప్రక్రియను చేపడతాయి. ఈ నిరర్థక ఆస్తులు ప్రొవిజన్‌లను మినహాయించుకున్న తర్వాతి మొత్తంలో కొంత శాతం తగ్గుదలతో

బదలాయించవలసి ఉంటుంది. దీని ద్వారా నిరర్థక ఆస్తుల పట్టిక వాణిజ్య బ్యాంకుల్లో మాయమవుతుంది. బ్యాడ్ బ్యాంకులోకి చేరుతుంది. అంతేతప్ప మొండి బాకీలు వసూలు అయ్యే అవకాశాలు చాల తక్కువేనని చెప్పవచ్చు.

వాణిజ్య బ్యాంకులు వసూలు చేయలేని బాకీలను బ్యాడ్ బ్యాంకులు ఎలా వసూలు చేయగలవు? రాని బాకీలను వాణిజ్య బ్యాంకుల నుంచి బ్యాడ్ బ్యాంకులకు బదలాయించమని కార్పొరేట్లు ఎందుకు కోరుతున్నాయి? ఎందుకంటే బదలాయింపు సందర్భంగా చోటు చేసుకునే డిస్కౌంటెడ్ విలువను మాత్రం చెల్లిస్తే సరిపోతుంది. లేదా రుణ వసూళ్లలో బ్యాడ్ బ్యాంకులకున్న కాలపరిమితి వల్ల పూర్తిగా రైట్ ఆఫ్ అయ్యే అవకాశమూ ఉన్నది! లేదా ఇన్సాల్వెన్సీ బ్యాంక్రప్టసీ కోడ్‌ను ఉపయోగించి బ్యాడ్ బ్యాంకుల బెడద నుంచీ బయట పడవచ్చు. ఈ బ్యాడ్ బ్యాంకులను ఏర్పాటు చేయడానికి ప్రభుత్వమే ధనం వెచ్చించాలి. రుణగ్రస్తులపై చర్యలకు ఉపక్రమించే వెసులుబాటును వాణిజ్య బ్యాంకులకు కల్పించకుండా రాని బాకీల వసూళ్లకు బ్యాడ్ బ్యాంకులను ఏర్పాటు చేయడంలోని ఔచిత్యమేమిటో పాలకులకే తెలియాలి.

వాస్తవానికి బడా వ్యాపార సంస్థలకు, ఆశ్రిత పెట్టుబడిదారులకు పెద్ద మొత్తంలో అవాంఛనీయమైన బదిలీలు జరిపేందుకు ఒక సాధనంగా బ్యాంకింగ్ వ్యవస్థను ప్రభుత్వం ఉపయోగించుకుంటోంది. అందువల్ల భారతదేశంలో పారుబకాయిల సమస్య చాలా తీవ్రంగా ఉంది. వీటిలో చాలా భాగం అనుకూలమైన కార్పొరేట్లకు పెద్ద మొత్తాల్లో ఇచ్చిన రుణాలే ఉంటాయి. వాటిని రుణ గ్రహీతలు తిరిగి చెల్లించరాదని భావిస్తారు. పైగా ఇలా రుణాలు చెల్లించలేకపోవడానికి ఊహించని రీతిలో నష్టాలు వచ్చాయంటూ బహిరంగంగా సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తారు. కానీ చాలా కేసుల్లో, బ్యాంకులు చట్టబద్ధంగా తమకు రావాల్సిన బకాయిలు రాక నిస్సహాయంగా ఉండిపోతే, మరోపక్క ప్రమోటర్లు మరింత సంపన్నులై తప్పించుకుంటున్నారనడానికి చాలా స్పష్టమైన సాక్ష్యాధారాలు ఉన్నాయి. ఇటీవల వెలువడ్డ పాండోరా పేపర్స్‌లో దివాళా తీసినామని చేతులెత్తేసిన చాల మందికి విదేశాల్లో దొంగపేర్లతో కంపెనీలు ఉన్నట్లు ఆధారాలతో బయట పడింది.

రుణాలు చెల్లించలేకపోయిన కంపెనీల నుండి గానీ వారి ప్రమోటర్ల నుండి గానీ వారిచ్చిన హామీ పత్రాల ఆధారంగానే డబ్బును వసూలు చేసిన సందర్భాలు చాలా తక్కువ. ఆ ఆస్తులను కొనుగోలు చేసే వారు దొరకడంపైన లేదా వాటిని మొత్తంగా విక్రయించడం పైనే ఈ రికవరీ ఆధారపడి ఉంటుందనేది యథార్థం. చాలా కేసుల్లో ఈ క్రమం స్తంభించిపోతోంది. మరికొన్ని కేసుల్లో చాలా సంవత్సరాలు పడుతోంది. ఒకవేళ ఆస్తులను విక్రయించగల్గినా నిరాశాజనకమైన రీతిలో చాలా తక్కువ మొత్తం వస్తోంది. పెద్ద మొత్తంలో రుణాలు తీసుకున్న వారిలో ఎక్కువ మంది రాజకీయ పలుకుబడి కలిగిన ఘరానా పెద్ద మనుషులే ఉంటారు. ఇంకొక వైపు బ్యాంకుల్లోని రుణాలు తీసుకొని వాటితో సొంత ఆస్తులు పెంచుకొని వ్యాపారాలను దివాళా స్థితికి తీసుకుపోయి చేతులెత్తేసి దేశం నుంచి పారిపోయే విజయ మాల్యాలు, నీరవ్ మోడీల బాపతు కూడా ఉన్నారు. మరోవైపు దేశ విదేశాల్లోని బ్యాంకుల నుంచి భారీగా అప్పు తెచ్చి ఎగ్గొట్టి అరెస్టుల నుంచి తప్పించుకోవడానికి వీలుగా పాలక రాజకీయ పక్షాల్లో చేరి బాధ్యత గల మంత్రి పదవులు అనుభవించే వారు కూడా కనిపిస్తుంటారు. ఇలాంటి బడా బాబుల నుంచి మొండి బాకీలు ఎలా వసూలు జేస్తారు?

ఇవాళ మన పబ్లిక్ రంగ బ్యాంకుల నిరర్థక ఆస్తుల (తిరిగి వసూలు కాని రుణాల మొండి బకాయిలు) విలువ రు. 6 లక్షల ముప్పై వేల కోట్లు. ఇందులో మూడవవంతు విత్తాన్ని వసూలు చేయడానికి మాత్రమే బ్యాడ్ బ్యాంకును నెలకొల్పుతున్నారు. ఇలా తీసుకొని ఎగ్గొట్టిన రుణాల్లో అధిక భాగం పారిశ్రామిక రంగానికి చెందినవే. ఈ రంగం నుంచి బకాయి పడిన రుణాలు రు.3,33,143 కోట్లు. 'ఇతర రకాల' మొండి బకాయిలు రు. 1,77,275 కోట్లు. కాగా వ్యవసాయం దాని అనుబంధ రంగాల నుంచి వసూలు కావలసిన రుణాలు రు.1,11,328 కోట్లు, గృహ రుణాలు రు. 17,045 కోట్లు. విద్యా రుణాలు రు. 5,626 కోట్లు. 2008లో అమెరికాలో ఆర్థిక సంక్షోభం విరుచుకుపడడానికి ముందే దేశంలోని పబ్లిక్ రంగ బ్యాంకులు విచ్చలవిడిగా ఇచ్చిన రుణాలే ఎక్కువగా ఈ నిరర్థక ఆస్తులలో ఉన్నట్టు తెలుస్తుంది. ఈ దేశంలో స్వయం వికాసం కలిగిన పారిశ్రామిక రంగం గట్టిగా వేళ్లూనుకోకపోవడమే ఈ మొండి బకాయిల సమస్యకు కొంత కారణమనిపిస్తుంది.

మన దేశంలో స్వయం ప్రకాశం (ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం) లేని పరిశ్రమలు ప్రభుత్వం అండతో కథ నడిపించడానికి అలవాటు పడ్డాయి. ఆ క్రమంలో పబ్లిక్ రంగ బ్యాంకులు లూటీకి గురవుతున్నాయి. ఇలా ఈ బ్యాంకులు నష్టపోతున్న భారీ విత్తానికి బదులుగా కేంద్ర బడ్జెట్‌లో వాటికి నిధులు కేటాయించడం మోడీ పాలనలో పరిపాటయిపోయింది. అది కేంద్ర ఖజానాకు భారంగా మారింది. కరోనా లాక్‌డౌన్‌ల వల్ల ఉత్పత్తులు, అమ్మకాలు పడిపోయి పారిశ్రామిక రంగం కుదేలయిపోయిన వర్తమాన నేపథ్యంలో బ్యాడ్ బ్యాంకు విజయవంతం కావడం కష్టమని నిపుణులు హెచ్చరిస్తున్నారు. బ్యాండ్ బ్యాంకు రుణ గ్రహీతల మీద పలు రకాల ఒత్తిడి తెచ్చి మొండి అప్పును వసూలు చేయడానికి ప్రయత్నిస్తుందే గాని వారి ఆస్తులను వేలం వేయడం ద్వారా అప్పును వసూలు చేసుకునే అవకాశం దానికి లేదు. అందుచేత అది కర్తవ్య నిర్వహణలో సమర్థవంతంగా నిరూపించుకునే అవకాశం లేదు. ప్రభుత్వ ప్రకటిత లక్ష్యం నేరవేరే అవకాశాలు చాల తక్కువ.

ఒకవేళ బ్యాంక్‌లు తమకొచ్చిన లాభాల నుండి మొండి బాకీలను సర్దుబాటు చేసుకున్నా తిరిగి పెట్టుబడులను సమకూర్చకపోతే అప్పుడు అసలైన ప్రమాదం ఉంటుంది. బ్యాంకులు దివాళా తీస్తే సామాన్యుడైన డిపాజిటర్ బడా వ్యాపార సంస్థలకు బదిలీ చేసిన మొత్తాల మేరకు నష్టాల భారాన్ని భరించాల్సి ఉంటుంది. ఒకవేళ ప్రభుత్వం తన హామీల ద్వారా ఈ నష్టాలను భర్తీ చేసినట్లయితే, పన్ను చెల్లింపుదారుడు, సామాన్య పౌరుడు, ఆ ప్రభుత్వ వ్యయం తాలూకు ప్రయోజనాల్ని కోల్పోతారు. ఈ నేపథ్యంలో బ్యాడ్ బ్యాంకు కూడా ప్రభుత్వానికి మరో ఆర్థిక భారంగా మారితే ఆశ్చర్యపోనక్కర లేదు. మొత్తానికి, ఏ రకంగా చూసినా కూడా పారు బకాయిలు, వాటిని ఎదుర్కొనే పథకాలు అన్నీ కూడా ప్రజలను పణంగా పెట్టి కార్పొరేట్ సంస్థలకు సంపదను బదలాయింపు చేసే

# సమాచార హక్కు చట్టం నిర్వీర్యం

*సమాచార హక్కు చట్టం అమలుతో తమ అవినీతి అక్రమాలు ఎక్కడ బయటకొస్తాయోననే భయంతో పాలకులు ఆ చట్టాన్నే నిర్వీర్యపరుస్తున్నారని అంటున్నారు* **చిమ్మె. జాన్ బర్నబాస్**

సమాచార హక్కు చట్టం (ఆర్‌టిఐ) 2005 వచ్చి 17 సంవత్సరాలు అవుతున్నప్పటికీ ఈ చట్టం అంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఏదో ఒక ఇబ్బందికరమైన చట్టం గానూ, అనవసర చట్టం గానూ భావిస్తూ వస్తున్నాయి. డా. మన్మోహన్ సింగ్ ప్రధాన మంత్రిగా ఉన్న కాలంలో రూపుదిద్దుకున్న ఈ చట్టం ఇప్పటి వరకూ దేశంలో అనేక రకాల సమస్యలను వెలికితీసింది. ప్రజల నుంచి వచ్చే విజ్ఞప్తుల ద్వారా ప్రజలకు బాధ్యులుగా ఉండాలనే జిజ్ఞాస ప్రభుత్వాధికారులలో ప్రారంభమైంది. అయితే మొదటి నుంచీ కూడా ప్రభుత్వాధికారులు ఈ చట్టం నుంచి ఎలా తప్పించుకోవాలనే ప్రయత్నంలోనే ఉన్నట్లు ఇప్పటి వరకూ ఉన్న అనుభవాల ద్వారా తెలుస్తున్నది.

వాస్తవానికి ప్రధాన విధాన నిర్ణయాల రూపకల్పన, ప్రజలను ప్రభావితం చేసే నిర్ణయాల ప్రకటన సందర్భాలలో ఆయా అంశాలకు సంబంధించిన అన్ని వాస్తవాలను అధికార యంత్రాంగం ప్రచురించాలి. సమాచార హక్కు చట్టంలోని సెక్షన్ 4(1)(సి) ప్రకారం ప్రతి ప్రభుత్వ కార్యాలయం దీనిని అనుసరించాలి. 4(1)(బి) ప్రకారం ఆయా ప్రభుత్వ కార్యాలయాలలో విధులు నిర్వహిస్తున్న ఉద్యోగుల బాధ్యతల వివరాల పట్టిక ఆయా కార్యాలయాల బయట బోర్డు రూపంలో ఉంచాలి. కనీసం ఇంతవరకూ చాలా కార్యాలయాలు కూడా 4(1)(బి)కి నోచుకోలేదు. ఆ కార్యాలయానికి వచ్చే పౌరుడు ఏ పనికి ఎవరిని సంప్రదించాలో తెలియక తికమకపడుతూ ఉంటారు. ఇది ఈ దేశంలో ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వాల దౌర్భాగ్యంగా అభివర్ణించుకోవచ్చు.

ప్రభుత్వాల పాలనలో పారదర్శకత, జవాబుదారీ తనాలే లక్ష్యంగా, అక్రమార్కుల ఆటలు కట్టించగలిగే ఒక అస్త్రంగా సమాచార హక్కు చట్టం 2005 రూపొందించబడింది. దీనికి ముందు ప్రాథమిక స్థాయిలో సమాచార స్వేచ్ఛ చట్టం 2002 రూపొందించారు. అయితే 2005లో సమాచార హక్కు చట్టం వచ్చిన తర్వాత అది రద్దయిపోయింది.

పౌరులకున్న సమాచార హక్కును చట్టబద్ధం చేయడం కోసం కేంద్ర సమాచార కమిషన్‌నూ, రాష్ట్ర సమాచార కమిషన్‌లనూ

---

మార్గాలే తప్ప మరొకటి కాదు.

ఈ విధానంలో ప్రతిపాదిత బ్యాడ్ బ్యాంక్ 15 శాతం రుణాలకు నగదు రూపంలో చెల్లించనుండగా మిగిలిన 85 శాతం ప్రభుత్వ హామీ కలిగిన సెక్యూరిటీ రసీదులను జారీ చేయడానికి ప్రభుత్వం సిద్ధం అయింది. ఇదంతా కేవలం సిద్ధాంతమే తప్ప వాస్తవంలో ఏం జరుగుతుంది అనేది కాలమే సమాధానం చెప్పాలి. ఏది ఏమైనా ఇది ప్రభుత్వం చేసే మరో మాయ తప్ప ఇది పరిష్కారం మాత్రం కాదు. బ్యాడ్ బ్యాంకులు వలస బ్యాంకుల బ్యాలన్స్ షీట్ ప్రక్షాళన అవుతుంది తప్ప సమస్య మరలా పునరావృతం కాదని చెప్పలేము. మరలా ఎన్‌పిఎలు పుట్టుకొస్తునే ఉంటాయి. వాటిని బ్యాడ్ బ్యాంకులకు బదిలీ జరుపుతూనే ఉంటారు. అప్పుడైనా ఇప్పుడైనా ఎప్పుడైనా నష్టపోయేది ప్రజలేనన్నది యథార్థం. కార్పొరేట్లకు ప్రభుత్వం పూచీ పడుతూనే ఉంటుంది.

2022 మార్చి 31 నాటికి ఆర్‌బిఐ, ప్రభుత్వ లెక్కల ప్రకారం దేశంలో రు. 10.40 లక్షల కోట్ల అప్పులు మొండి బకాయిలుగా ఉంటాయని వివరించారు. ఇందులో 79 శాతం కార్పొరేట్ సంస్థలకు చెందినవే ఉంటాయి. ప్రభుత్వ బ్యాంకులు వసూలు చేయలేని అసమర్థతను బ్యాడ్ బ్యాంకులకు బదిలీ చేయడమే అవుతుంది. దీంతో బ్యాంకుల ప్రైవేటీకరణకు మార్గం సులువవుతుంది. ప్రభుత్వ ఉద్దేశం కూడ అదేనన్నది యథార్థం. నిజానికి బ్యాంకులు రుణ మంజూరు చేసే విధానాలు మరింత పటిష్టం చేయగలిగితే ఇవి చాలా వరకూ తగ్గిపోతాయన్నది వాస్తవం. అంత పెద్ద మొత్తాలను మంజూరు చేసే విషయంలో అజాగ్రత్తగా వ్యవహరించే అధికారులపై, తప్పుడు ధ్రువ పత్రాలు చూపించే వ్యాపారస్తులపై క్రిమినల్ చర్యలు తీసుకునే విధంగా చట్టాలను మార్పు చేయడానికి ప్రభుత్వం చిత్తశుద్ధితో ముందుకు వస్తే కచ్చితంగా ఈ మొండి బకాయిల భారం తగ్గిపోతుంది. సమస్య వచ్చాక ప్రత్యామ్నాయం కోసం చూడడం కన్నా సమస్య మూలాన్ని గుర్తించి పరిష్కారం కోసం ప్రయత్నం చేయనంత కాలం ఈ మొండి బకాయిల ప్రవాహం ప్రహసనం కొనసాగుతూనే ఉంటుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

---

*మానవ ఆలోచన భౌతిక సత్యాన్ని గ్రహించగలదా అనేది సైద్ధాంతిక ప్రశ్న కాదు. అది ఆచరణలో తేలే ప్రశ్న. సత్యాన్ని, అంటే, తన ఆలోచనకు సంబంధించిన వాస్తవికతనూ, శక్తినీ, తాను చూసే పార్శ్వాన్నీ మనిషి ఆచరణలోనే రుజువు చేయవలసి ఉంటుంది. ఆలోచన వాస్తవికమైనదా, అవాస్తవికమైనదా అనే వివాదాన్ని ఆచరణ నుంచి వేరు చేస్తే అది కేవలం పండిత చర్చే అవుతుంది.*

*- కార్ల్ మార్క్స్*

నెలకొల్పడం కోసం, సంబంధిత ఇతర అంశాల కోసం రూపొందినదీ చట్టం. అయితే సమాచారాన్ని బహిర్గతం చేయడం అన్నది ఆచరణ దగ్గరకు వచ్చేసరికి ప్రభుత్వ కార్యక్రమాల అసమర్థత, పరిమిత ద్రవ్య వనరుల సమర్థ వినియోగం, సున్నిత సమాచారం గోప్యతను కాపాడడం వంటి ప్రజా ప్రయోజనాలకు విరుద్ధంగా మారే అవకాశం ఉంది. అందువలన సమాచార హక్కు అన్న ప్రజాస్వామ్య ఆశయానికి పెద్దపీట వేసే క్రమంలో ఈ వైరుధ్యాలను తొలగించాల్సిన అవసరం ఉన్నది. దరఖాస్తు దారులకు అండగా నిలవాల్సిన సమాచార హక్కు కమిషన్‌లు కేవలం ప్రభుత్వాధికారుల పక్షం వహిస్తూ దరఖాస్తు దారులను అపహాస్యం పాలు చేస్తున్నారు. సమాచార హక్కు కమిషనర్లుగా ఐఎఎస్/ఐపిఎస్ విశ్రాంత అధికారులు నియామకం కావడం కూడా అందుకు ఒక కారణం. 'రుసుం'లు వేయవలసిన చోట కూడా వారిని క్షమించి వదిలివేయడం పరిపాటిగా మారింది.

ప్రజా సమాచార అధికారులు (పిఐఒ), మొదటి అప్పిలేటి అధికారు (ఎఫ్ఎఒ)లు తాము ఏమీ తప్పు చేయలేదనే భావనతో ఉంటున్నారు. సరియైన సమాచారం, సరియైన సమయంలో ఇవ్వకపోవడం కూడా 'తప్పు'గా భావించడం లేదు సమాచార కమిషన్‌లు. అంతేకాకుండా దరఖాస్తు దారులే సరియైన విధంగా (రూపంలో) అడగలేదనే చక్కని జవాబుతో ప్రజా సమాచార అధికారులు ఇచ్చిన వివరణలతో సంతృప్తి చెందుతూ ఉంటున్నారు. ఇది పూర్తిగా దరఖాస్తు దారుల అవసరాన్నీ, లక్ష్యాన్నీ, కృషినీ, పోరాటాన్నీ నిర్వీర్యం చేయడమే. వాస్తవానికి 'సమాచార హక్కు కమిషన్' సమక్షంలో దరఖాస్తు దారుడు భౌతికంగా హాజరు కానవసరం లేదు చట్టం ప్రకారం. భౌతికంగా హాజరు కావడం చాలా ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. భౌతికంగా హాజరు కాని దరఖాస్తు దారులను, వారికి ప్రాధాన్యత లేని విషయంగా పరిగణిస్తూ, సమాచార కమిషనర్‌లు దరఖాస్తు దారుల పక్షం కాకుండా, ప్రజా సమాచార అధికారుల పక్షంగా తీర్పులిస్తున్నారు. ఇది పూర్తిగా గర్హనీయం. అప్రజాస్వామికం. సమాచార హక్కు చట్ట స్ఫూర్తికి విరుద్ధం.

దేశ వ్యాప్తంగా ఉన్న సమాచార హక్కు కమిషన్‌లు 26. వీటన్నింటిలో దాదాపుగా 3 లక్షల అప్పీలు పిటిషన్‌లు పెండింగ్‌లో ఉన్నాయి. ఇవి నిజంగా ఆచరణలో పరిష్కరించబడాలంటే దాదాపుగా 7 సంవత్సరాలు పట్టొచ్చనేది అధికార వర్గాల అంచనా. ఈ చట్టం ప్రకారం ప్రతి సంవత్సరం ఆయా రాష్ట్రాల సమాచార హక్కు కమిషన్‌లు తమ తమ 'సంవత్సరిక నివేదిక'ను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు అప్పజెప్పాలి. కొన్ని సంవత్సరాలుగా ఈ పనిని ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు అడగడం లేదు. ఈ కమిషన్‌లు ఇవ్వడం లేదు. ఈ సమాచార హక్కు కమిషన్‌ల కార్యకలాపాలను సమీక్షించే అధికారం రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి ఉన్నప్పటికీ వారు కూడా దీనిని పట్టించుకోని కారణం చేత సమాచార హక్కు కమిషన్‌ల ప్రగతి చాలా విచారకరంగా ఉన్నది. కాబట్టి సమాచార హక్కు కమిషనర్‌ల నియామకం ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నాయకుడు కలిసి పానెల్ తయారు చేసిన దానిపై గవర్నర్ నిర్ణయం తీసుకుంటారు. అందులో కేవలం సమాచార హక్కు చట్టంపై పనిచేసిన వారినీ, నిష్ణాతులనూ, పరిశోధకులనూ, సామాజిక కార్యకర్తలనూ నియమించాలి. ఆ విధంగా కాకుండా కేవలం తమకు అనుకూలమైన వారినీ, గతంలో తమవద్ద పనిచేసిన ఐఎఎస్/ఐపిఎస్ అధికారులను ప్రభుత్వం నియమించడం ద్వారా వీటి పనితీరు కేవలం అలంకార ప్రాయంగా మారింది.

సమాచార హక్కు చట్టం అమలుకు సమాచార హక్కు కమిషన్‌ల పనితీరే ప్రమాణం, కొలమానమూ అంటూ దేశ అత్యున్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు గతంలోనే స్పష్టీకరించింది. నిబంధనలకు అనుగుణంగా తగిన సంఖ్యలో సమాచార హక్కు కమిషనర్లను ప్రభుత్వం ఏర్పాటు చేయడం వలన సమాచార హక్కు చట్టాన్ని పరిరక్షించినది అవుతుందని సుప్రీంకోర్టు తన తీర్పులో స్పష్టపరిచింది. సమాచార హక్కు కమిషనర్‌లను ఏర్పాటు చేయకపోవడం బాధ్యతారాహిత్యం, పౌరుల భావ ప్రకటనా స్వేచ్ఛ-ఆర్టికల్ 19(1)లో అంతర్భాగమైన సమాచార హక్కును కాలరాస్తూ రాజ్యాంగ విలువలనూ, ప్రమాణాలనూ తుంగలో తొక్కినట్లే.

స్వతహాగా దేశ ప్రధాన మంత్రి నరేంద్రమోడీ, కేంద్ర హోం మంత్రి అమిత్ షా ప్రాతినిధ్యం వహిస్తున్న గుజరాత్ రాష్ట్రంలోనే సమాచార హక్కు చట్టం పనితీరు చాలా అధ్వాన్నంగా ఉన్నదని గత సంవత్సర గుజరాత్ రాష్ట్ర సమాచార నివేదిక స్పష్టపరిచింది. చాలా ప్రభుత్వ కార్యాలయాలల్లో సెక్షన్ 4(1)(బి) పట్టిక అమలులో లేదని సారాంశం. గుజరాత్ రాష్ట్రంలో ప్రతి సంవత్సరం వస్తున్న సమాచార హక్కు అప్పీళ్ల సంఖ్య చాలా రాష్ట్రాలతో పోల్చితే ఎక్కువగా ఉందని సంవత్సరిక నివేదిక తెలియజేస్తోంది.

దేశ వ్యాప్తంగా సమాచార హక్కు కమిషన్‌లకు వచ్చే రెండవ అప్పీళ్ల సంఖ్య దాదాపుగా 40 నుంచి 50 లక్షల సంఖ్య ఉంటోంది. అధికార రహస్యాల చట్టం వర్తించనప్పటికీ ఆ పేరు మీద కింది స్థాయిలో దరఖాస్తులకు సరిగా జవాబివ్వకుండా ప్రభుత్వాధికారులు తిరస్కరిస్తున్నారు. కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల్లో సరియైన సమాధానం ఇవ్వకుండా, అడిగిన సమాచారమివ్వకుండా కాలయాపన చేస్తూ ఏలాగూ పై అధికారులు సమాచారమిస్తారంటూ, తిరస్కరించకుండా రెండవ అప్పీళ్లకు అనగా కేంద్ర సమాచార హక్కు కమిషన్‌కు ఫిర్యాదు చేసే విధంగా కేంద్ర సర్వీసు అధికారులు వ్యవహరిస్తున్నారు. ఇది శోచనీయం.

ప్రాథమిక స్థాయిలోనే కేంద్ర ప్రజా సమాచార అధికారి (సిపిఐఒ) తిరస్కరించే దరఖాస్తులే దాదాపుగా 40 శాతం ఉన్నాయంటూ ఇటీవల 'సతర్క్ నాగరిక్ సంఘటన్' (ఎస్ఎన్ఎస్) అనే సంస్థ చేసిన సర్వేలో వెల్లడయింది. కేవలం 2-3 శాతం ప్రభుత్వ ఉద్యోగులకు మాత్రమే సమాచార హక్కు కమిషన్‌లు రుసుము లేదా వారి పట్ల తీవ్రమైన వైఖరి ప్రదర్శిస్తున్నట్లు ఇటీవల సర్వే వెల్లడి చేసింది. సమాచార హక్కు చట్టాన్ని ఉపయోగించి ప్రభుత్వ కార్యాలయాల్లో జరుగుతున్న పనులను తెలుసుకో గోరే కార్యకర్తలను చాలా చోట్ల హత్యలు చేస్తున్నారు. ఉత్తరాది రాష్ట్రాలలో ఇప్పటి వరకూ దాదాపు 100 మంది హత్యలకు గురయ్యారు. ప్రమాదాలలో చనిపోయే విధంగా వాహనాలతో కొట్టి చంపారు. కనీసం వాటిపై విచారణ లేదు. ఎందుకనగా ప్రభుత్వ అధికారులు, రాజకీయ నాయకులు కుమ్మక్కై చేస్తున్న హత్యాకాండ ఇది.

# రైతు పోరు ఓ గంగా ప్రవాహ హోరు

*మోడీ ప్రభుత్వం కార్పొరేట్ల వ్యూహాలను అమలుపరుస్తూ, రైతు ఉద్యమంపై అణచివేత కొనసాగిస్తున్నా దాన్ని ఎదిరిస్తూ రైతులు ఇంతకాలం ఉద్యమించడం సమస్య తీవ్రతను తెలుపుతుందని అంటున్నారు* **షేక్. కరిముల్లా**

'వ్యవసాయం ప్రజలకు తిండి పెట్టే మానవీయ వృత్తి'. మానవ జాతి పరిణామ క్రమంలో రైతాంగం చాలా విశిష్టమైన పాత్ర నిర్వహించింది. దేశ ప్రజలకు, ముందు తరాలకు భవిష్యత్తులో ఆహార భద్రత కోసం రైతాంగం మరింత గొప్ప పాత్ర నిర్వహించాల్సి ఉంది. గత 10 నెలలుగా గడ్డకట్టే చలిలో ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, సొంత ఊరువాడ వదిలిపెట్టి లాఠీ దెబ్బలు తింటూ ఈ దేశ ప్రజల ఆకలి తీర్చడం కోసం, ఆహార భద్రత కోసం రైతులు ఉద్యమిస్తున్నారు. కార్పొరేట్ల సేవకులైన బిజెపి ప్రభుత్వ వైఖరితో విసిగిపోయి రైతు వ్యతిరేక నల్లసాగు చట్టాలను రద్దు చేయాలని, విద్యుత్ బిల్లులు ఉపసంహరించాలని, ప్రభుత్వ రంగ ప్రజా ఆస్తుల రక్షణకై గత నెల 27న భారత్ బంద్‌కు పిలుపునిచ్చారు. న్యాయమైన ఈ బంద్‌ను ప్రజలు, బిజెపి ఏతర రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు, విద్యార్థి, ఉద్యోగ, ఉపాధ్యాయ వర్గాలు స్వచ్ఛందంగా మద్దతును ఇచ్చాయి. 500 రైతు సంఘాలు, 450 కార్మిక సంఘాలు పాల్గొన్న ఈ దేశవ్యాప్త బంద్ సంపూర్ణంగా విజయవంతమైంది. ఢిల్లీ సరిహద్దుల్లో గత సంవత్సరం నవంబర్ 26న మొదలైన రైతు ఉద్యమం 2021 సెప్టెంబర్ 26 నాటికి 10 నెలలు పూర్తి చేసుకుంది. అయితే ఇంతవరకు రైతుల ఉద్యమ స్ఫూర్తి ఏమాత్రం తగ్గలేదు. అవసరమైతే 2024లో జరిగే సార్వత్రిక ఎన్నికల దాకా ఉద్యమం కొనసాగుతుందని రైతులు ప్రకటించారు. ఈ రైతుపోరు ఓ గంగా ప్రవాహ హోరై నల్లసాగు చట్టాలు రద్దయ్యేవరకు కొనసాగుతుంది.

ఇప్పుడు ఈ నల్ల చట్టాలను ఎలా అర్థం చేసుకోవాలి? దీని మూలాలను చర్చిద్దాం: భారతదేశం మౌలికంగా వ్యవసాయ ఆధారిత దేశం. నూటికి 70 శాతం మంది ప్రజలు ఈ రంగం మీద ఆధారపడి జీవనం సాగిస్తున్నారు. మొత్తం మన ఆర్థిక వ్యవస్థకు ఇరుసు, ఆక్సిజన్ వ్యవసాయమే. ఇంత ప్రాధాన్యత గల ఈ రంగ వృద్ధిరేటు 1980 వరకు బాగానే ఉంది. 1980 నుంచి దేశంలో అమలులోకి వచ్చిన నూతన ఆర్థిక విధానాలతో మన జీవనాడి అయిన వ్యవసాయ రంగాన్ని దేశ, విదేశీ కార్పొరేట్లకు తాకట్టు పెట్టారు. అప్పటి నుండి ప్రపంచ బ్యాంకు ఆదేశాలతో కార్పొరేట్ కంపెనీలకు లాభాలు వచ్చే విధంగా భారత పాలకులు విధానాలు చేపట్టారు. రైతు వ్యతిరేక విధానాలు రాను రాను తీవ్రమై నేటి ఈ దుస్థితికి దారితీసింది. దేశానికి అన్నం పెట్టే రైతులు 10 నెలలుగా రోడ్లపై నిలబడి పోరాడుతున్నారు. ఇదే వ్యవసాయ రంగ తీవ్ర సంక్షోభానికి కారణం. '2020 కల్ల రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తా' అని ఉత్తర కుమార ప్రగల్భాలు పలికిన మోడీ దేశ ప్రజల ఆహార, ఆరోగ్య భద్రత, జీవించే హక్కులను

---

సమాచార హక్కు కార్యకర్తలను పనిలేని వారిగా లేదా బ్లాక్ మెయిల్ చేసే వారిగా ప్రభుత్వాధికారులే చిత్రీకరిస్తున్నారు. నిజంగా ప్రభుత్వాధినేతలంతా నిజాయితీపరులైతే స్వచ్ఛందంగా అన్ని విషయాలు 'శ్వేత పత్రం' ద్వారా ప్రభుత్వమే విడుదల చేయొచ్చు. అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ దొందు దొందుగానే వ్యవహరిస్తున్నాయి. ఐఎఎస్/ఐపిఎస్ అధికారులైతే చట్టానికి అతీతులన్నట్లుగా, దైవాంశ సంభూతులుగా వ్యవహరిస్తున్నారు. ఇది మరీ దుర్మార్గంగా ఉంది. ప్రభుత్వం వద్ద తగిన సమాచారం ఉంటుంది కాబట్టి వెంటనే అన్ని ప్రభుత్వ కార్యాలయాల్లో సమాచార హక్కు చట్టం 4(1)(బి)ను అమలు జరపాలి. వచ్చే దరఖాస్తులను కొన్ని గంటల్లోనే పరిష్కరించవచ్చు. ఆ విధంగా పరిష్కరించకుండా ఫిర్యాదు చేసే వారినీ, దరఖాస్తు దారులనూ పౌరులుగా కాకుండా, దొంగలుగా చూస్తున్నారు. అసలు దొంగలు సమాచారం ఇవ్వలేని వారు,'రాజకీయ నాయకులు, వారు ఏ పార్టీకి చెందిన వారైనప్పటికీ అందరూ కలిసే సమాచార హక్కు కార్యకర్తలపై దాడులు చేస్తున్నారు. ఇది పూర్తిగా రాజ్యాంగ హక్కుల ఉల్లంఘననే.

సమాచార హక్కు చట్టం సెక్షన్ 21-24 వరకు 'ఇతరతరా నిబంధనలు' చాప్టర్‌లో సమాచార హక్కు కార్యకర్తలకూ, దరఖాస్తు దారులకూ సరియైన రక్షణను న్యాయస్థానాలు కల్పించే విధంగా రూపొందించబడ్డాయి. వీటిని కూడా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తుంగలో తొక్కాయి. గ్రామ పంచాయితీలు మొదలు రాష్ట్రపతి భవన్ వరకు సమాచార హక్కు పరిధిలోకి వచ్చే వారే. అటువంటప్పుడు సమాచార హక్కు కార్యకర్తలకు రక్షణ కల్పించడం ప్రభుత్వాల విధికాక మరి ఎవరిదవుతుంది. కంచే చేను మేసిన చందంగా ఉంది ప్రభుత్వాల వైఖరి. కొన్ని ప్రభుత్వ శాఖలలో పనితీరు ప్రజలకు అర్థమయ్యే పరిస్థితే ఉండదు. కోర్టులు/దేవాదాయ ధర్మాదాయ శాఖ, కమర్షియల్ టాక్స్, ఇన్‌కం టాక్స్ విభాగం, సినిమా/టీవీ పరిశ్రమల వినియోగం లాంటి అనేక శాఖల పట్ల ప్రభుత్వమే స్వచ్ఛందంగా ప్రజలకు వివరాలు తెలియజేయవలసి ఉంది. ప్రజలు తమకు తాముగా అప్రమత్తతతో ప్రశ్నించే తత్వం అలవర్చుకోవడం ద్వారానే ప్రభుత్వాలను నిలదీయవచ్చు, వారి అవినీతి, అక్రమాలపై పోరు సల్పవచ్చు. సమాచార హక్కును కాపాడుకోవడం ద్వారా ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణకు పాటు పడవచ్చు.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

కాలరాసే దుర్మార్గపు చట్టాలు తీసుకొచ్చాడు. ఈ చట్టాల ద్వారా ఆదానీ, అంబానీ లాంటి బడా బాబులకు ఈ దేశ ప్రజల సర్వం దోచిపెట్టాలని పూనుకున్నాడు. ఎందుకంటే భారతీయ వ్యవసాయ రంగాన్ని ఈ బడా బాబుల చేతిలో పెడితే ప్రజలకు ప్రాథమికంగా జీవించడానికి అవసరమైన ఆహారాన్ని నియంత్రించవచ్చు. అలాగే విత్తనాలను నియంత్రిస్తే భూమి మీద జీవాన్నే నియంత్రించవచ్చు. తద్వారా మొత్తం సమాజాన్ని నియంత్రించవచ్చు, తమ గుప్పిట్లో పెట్టుకోవచ్చు, ప్రజల జీవితాలతో ఆటలాడుకోవచ్చు. ఇది కార్పొరేట్ల వ్యూహం. ఈ కుట్రకు వత్తాసు పలికే యంత్రాంగమే మోడీ ప్రభుత్వం. ఈ చట్టాలు అమలులోకి వస్తే మొత్తం వ్యవసాయం, నదులు, అడవులు, చెట్లు, భూగర్భ జలాలు, ఖనిజాలు మొత్తం సమస్త ప్రకృతి సంపద కార్పొరేట్లు కొల్లగొడతారు. తద్వారా ఈ దేశ ప్రజల జీవించే హక్కును కాలరాస్తారు. ఇక ప్రజలకు మిగిలేది ఆకలి చావులే. ఇప్పటికే వ్యవసాయ రంగ సంక్షోభం వల్ల ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతులు కనుమరుగైపోతారు. మోడీ ఈ రెండున్నర ఏండ్ల పాలనలో 39 వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. 1998 నుండి రైతుల ఆత్మహత్యలు, ఆకలి చావులు నిత్యకృత్యమైనాయి. దీనికి తోడు విద్య, వైద్యం వంటి ప్రాథమిక సేవలు ప్రైవేటీకరణ చేయబడ్డాయి. వీటి మీద కూడా రైతులు ఎక్కువగా ఖర్చు పెట్టాల్సి వచ్చింది. ఇటు పెరిగిపోతున్న ఖర్చులు, వ్యవసాయ సంక్షోభం, కరోనా విలయం కారణంగా మొత్తం వ్యవస్థ ఒక విష వలయంలో చిక్కుకున్న వేళ ఈ నల్ల చట్టాలు రైతులపై 'మూలిగే నక్కపై తాటికాయ' పడిన చందంగా భూమి నుంచి రైతును దూరం చేయడానికి వచ్చాయి. తమ కాళ్ల కింద భూమి తమది కాకుండా పోతూ ఉంటే రైతులు ఏమి చేయాలి? ఎక్కడికి వెళ్లాలి? ఎవరు ఊరుకుంటారు? కాబట్టి రైతు ఉద్యమానికి సంపూర్ణ మద్దతు ఇవ్వాలి.

రాజ్యం ఈ నల్ల చట్టాల రూపంలో మనదేశ రైతాంగంపై ఆఖరి వేటు వేయనే వేసింది. ఇప్పటికే వ్యవసాయ సంక్షోభం వల్ల గ్రామీణ ప్రాంతాల్లో నిరుద్యోగం పెరిగి యువత పొట్టచేత పట్టుకొని నగరాలకు అడ్డ కూలీలుగా వలస పోతున్నారు. జీవచ్ఛవాలుగా బతుకుతున్నారు. కరోనా విలయం 20 కోట్ల మంది ప్రజలు వలస కూలీల రూపంలో నిరాశ్రయులైన విషయం బయట ప్రపంచానికి చాటింది. 2020 ఏప్రిల్‌లో లాక్‌డౌన్ సమయంలో వలస కూలీల సంక్షోభం కళ్లార చూసిన ప్రపంచం నివ్వెరపోయింది. ఇలాంటి స్థితిలో ప్రజలకు తిండి పెట్టే వ్యవసాయ రంగం బడా బాబుల చేతిలోకి పోతే కలిగే దుష్ఫలితాలు అన్నీ ఇన్నీ కావు. వ్యవసాయ ఉత్పత్తులు ప్రజల అవసరాలకు కాకుండా వ్యాపారం, లాభాల కోసం చేయబడుతుంది. దేశీయ అవసరాల కొరకు ఆహార పంటలు పండించకుండా, ఎగుమతుల కొరకు వాణిజ్య పంటలు సాగుచేయబడతాయి. వ్యవసాయం కార్పొరేట్ బహుళజాతి కంపెనీల ఆధీనంలోకి వెళ్లిపోతుంది. పెట్టుబడిదారీ విధానంలో వ్యాపారం తప్ప మానవీయతకు తావు ఉండదు. విపరీతంగా రసాయనిక ఎరువులు, పురుగు మందుల వాడకం వలన భూమి నిస్సారమైపోతుంది. జన్యు మార్పిడి పంటల ద్వారా నేల, నీరు, గాలి కలుషితం అవుతాయి. పర్యావరణానికి తీవ్ర హాని జరుగుతుంది. క్యాన్సర్, కరోనా లాంటి కొత్త కొత్త వ్యాధులు విజృంభిస్తాయి. ప్రజల ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి. ఆహార, ఆరోగ్య భద్రతలు దెబ్బతింటాయి. మానవ నాగరికతలు నదీ పరివాహక ప్రాంతాలలో వ్యవసాయం నుంచే పుట్టినాయి. వ్యవసాయం చేయడం ఒక సృజనాత్మక జీవన విధానం. ప్రాణాధార భూ వనరులు బడా బాబులకు అందించడం అంటే ఆకలిని సృష్టించడమే. ఇప్పటికే దేశంలో 50 కోట్ల మంది ప్రజలు ఆకలితో అల్లాడుతున్నారు. ఈ ఆకలి మరింత తీవ్రమవుతుంది. ఈ అన్యాయపు చట్టాలు ప్రజల ఆహార భద్రత, జీవించే హక్కును కాలరాస్తాయి. ఇవి రాజ్యాంగం కల్పించిన జీవించే హక్కును (ఆర్టికల్ 21) హరించే చట్టాలు. ఇవి రాజ్యాంగ విరుద్ధం. ప్రజలు జీవించే సహజమైన మౌలిక హక్కును హరించే అధికారం పార్లమెంట్‌కు లేదు. కాబట్టి ఈ చట్టాలు చెల్లవు. ఇక్కడ మనుషులు బతకాలి అంటే పోరాడాల్సిందే. ఆ మట్టి చేతులు చేస్తున్న పోరాటానికి అండగా నిలవాల్సిందే. మోడీ రైతు వ్యతిరేక విధానాలను ఓడించాల్సిందే. ఫాసిస్టు మూకలకు తగిన గుణపాఠం చెప్పాల్సిందే.

ఇంత జరుగుతున్నా మోడీ ప్రభుత్వం వెనక్కి తగ్గడం లేదు. రైతుల ఆందోళనలను చిన్నచూపు చూస్తూ, బల ప్రయోగంతో అణచాలని చూస్తున్నది. ఇందులో భాగమే హర్యానాలోని కర్నాల్ ఘటన. ఈ ఘటనతో ఉద్యమాన్ని ఉధృతం చేసే క్రమంలో యుపిలోని ముజఫర్‌నగర్‌లో సెప్టెంబర్ 5న జరిగిన రైతుల మహా పంచాయత్ విజయవంతం అయింది. వివిధ రాష్ట్రాల నుండి లక్షల సంఖ్యలో రైతులు పాల్గొన్నారు. సెప్టెంబర్ 27న భారత్ బంద్‌కు పిలుపునిచ్చారు. మతాన్ని రాజకీయ ప్రయోజనాలకు వాడుకుని అధికారంలోకి వచ్చిన బిజెపి బడా బాబులకు అందిస్తున్న సేవలను రైతులు అర్థం చేసుకున్నారు. 2013లో ముజఫర్‌నగర్‌లో జరిగిన మత కలహాల ఆసరాగా 2017లో యోగి సర్కార్ యుపిలో అధికారంలోకి వచ్చింది. అప్పుడు ముస్లింల మీద దాడీ చేసినవారే ఇప్పుడు రైతు ఉద్యమంలో ప్రధాన పాత్ర పోషిస్తున్నారు. బిజెపి కుట్రలు ఎంత ప్రమాదకరమో రైతులు గ్రహించారు. ఈ నల్ల చట్టాలు అన్ని మతాల వారి జీవించే హక్కును హరిస్తాయని గుర్తించారు. హిందూ - ముస్లిం ఐక్యత నినాదాలు హోరెత్తాయి. బిజెపి హిందుత్వ విధానాలు బడా బాబుల ప్రయోజనాల కోసమేనని రైతులే కాక మిగతా ప్రజలు కూడా గ్రహించారు. ఈ మహా ఉద్యమం దేశ ప్రజల ప్రయోజనాల కోసమేనని రైతులు ప్రకటించారు. ఇక్కడ మంచి పరిణామం ఏమిటంటే రాబోయే ఎన్నికలలో బిజెపికి తగిన గుణపాఠం చెప్పాలని, ఓడించాలని రైతులు పిలుపునిచ్చారు. ఇది నూతన రాజకీయ సంస్కృతికి దారి కావాలి. రేపటి నవ భారత నిర్మాణానికి దిక్సూచి కావాలి. ఈ ఉద్యమం నుంచి వందల కొద్ది ఉన్న రైతు కార్మిక సంఘాల నుంచి ఒక నూతన ప్రజా ప్రత్యామ్నాయ రాజకీయ పార్టీ పుట్టుకు రావాలి. ఇది నేటి చారిత్రక అవసరం. రేపటి సూర్యోదయం రైతులది కావాలి. రైతు రాజ్యం ఏర్పడాలి. రైతు రాజవ్వాలి. సోషలిస్టు వ్యవస్థలు ఏర్పడాలి. ఇదే మానవాళి విముక్తికి మార్గం. వీ

*(రచయిత సామాజిక కార్యకర్త)*

# చైనా లక్ష్యంగా ఆకస్ కూటమి

***చైనాను కట్టడిచేయడానికే ఆకస్ కూటమిని అమెరికా ఏర్పాటు చేసిందని, ఇది మూడవ ప్రపంచ యుద్ధానికి దారితీయవచ్చునని అంటున్నారు*** **ఎ.నర్సింహారెడ్డి**

నేటి ప్రపంచ భౌగోళిక రాజకీయాలలో ఆసియా ప్రాంతం ప్రాధాన్యత పెరిగింది. ఆసియాలో చైనా ఆర్థిక, సైనిక, సాంకేతిక రంగాలలో అభివృద్ధి చెందడమే కాక అమెరికా, ఇయు దేశాలకు సవాలుగా నిలుస్తోంది. ప్రపంచ వాణిజ్యంలో భారత్, వియత్నాం, సింగపూర్ లాంటి దేశాలు తమ వాటాను పెంచుకున్నాయి. ఆసియాలో అమెరికా ఆధిపత్యానికి, వాణిజ్య విస్తరణకు చైనా, రష్యా, ఇరాన్‌లు అడ్డుగా నిలిచాయి. అమెరికా దశాబ్ద కాలంగా ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది. రోజు రోజుకు దాని ప్రభావం కొడిగడుతోంది. 1990లలో అమెరికా ప్రపంచ దేశాల మీద రుద్దిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలైన సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలను ఉపయోగించుకొని చైనా, భారత్, సింగపూర్, వియత్నాం, దక్షిణకొరియా దేశాలలోని దళారీ బూర్జువా వర్గం కుబేరులుగా ఎదిగారు. దీంతో 21వ శతాబ్దం ఆసియాదేనని ప్రపంచ ఆర్థిక వేత్తలు చెబుతున్నారు.

అమెరికా ఇటీవలనే రెండు దశాబ్దాల అఫ్ఘనిస్తాన్ యుద్ధం నుంచి పరాభవంతో వైదొలిగింది. వందకు పైగా దేశాలలో సైనిక జోక్యం చేసుకున్న అమెరికా, పులి మాంసాహారం మానేసినట్లు యుద్ధ కాంక్షను విరమించుకొని దౌత్యపరంగా సమస్యను పరిష్కరించు కుంటుందని జో బైడెన్ ప్రకటించారు. అమెరికా ప్రపంచంలోనే అతిపెద్ద సైనిక శక్తిని కలిగి ఉన్నప్పటికీ, ఆర్థిక, సాంకేతిక, రాజకీయ రంగాలలో తన ఆధిపత్యాన్ని క్రమంగా కోల్పోతున్నట్లు అనేక సంఘటనలు తెలుపుతున్నాయి. ఇటీవలి కాలంలో సైనిక ఆధిపత్యాన్ని కూడ కోల్పోతోంది. రష్యా ఆయుధ పరంగా అమెరికాకు సవాలుగా మారింది. అందువల్ల అఫ్ఘనిస్తాన్‌లో పోయిన పరువు నిలబెట్టుకోవడానికి నూతన ఎత్తుగడలకు దిగింది. ఆస్ట్రేలియా, ఇంగ్లాండ్, అమెరికాలతో కూడిన త్రైపాక్షిక సైనిక ఒప్పందం కుదిరినట్లు జో బైడెన్ సెప్టెంబర్ 15న ప్రకటించాడు. మధ్య ఆసియా దేశాలకు కీలకమైన అనుసంధాన స్థానంలో ఉన్న అఫ్ఘనిస్తాన్ నుండి అమెరికా సేనలను ఉపసంహరించుకోవడంతో ఈ ప్రాంతంలో వ్యూహాత్మక బలబలాలలో పెను మార్పులు సంభవించే అవకాశం ఉంది. సోషల్ సామ్రాజ్యవాద దేశమైన చైనా, రష్యాల ప్రభావం అఫ్ఘనిస్తాన్‌పై పెరుగనుంది.

**'సామ్రాజ్యవాదం అంటేనే యుద్ధం'**

అఫ్ఘనిస్తాన్ నుండి వైదొలిగినట్లు కనిపిస్తున్న అమెరికా సామ్రాజ్యవాదం తన అణ్వాయుధాల రాక్షస క్రీడను ఆసియా పసిఫిక్ (ఇండో పసిఫిక్)లో ప్రదర్శించడానికి ఉవ్విళ్లూరుతోంది. అఫ్ఘనిస్తాన్‌లో పరాజయం అనంతరం ఇండో-పసిఫిక్ ప్రాంతాన్ని మరో రణక్షేత్రంగా మార్చడానికి కుట్రపూరితంగా రాజకీయాలకు తెర తీసింది. ఎక్కడో ఒకచోట యుద్ధం లేకుండా ఆయుధ ప్రయోగం జరుగదు, అమెరికా ఆయుధ బేహారులకు యుద్ధం లేకుండా వ్యాపారం జరుగదు. ఆయుధ వ్యాపారం జరుగకుండా అమెరికా సామ్రాజ్యవాదం మనలేదు. ప్రస్తుతం ప్రపంచ ఆయుధ ఎగుమతుల్లో అమెరికా 37 శాతంతో అగ్ర స్థానంలో ఉంది. ప్రపంచం మొత్తం దిగుమతి చేసుకునే ఆయుధాల్లో ఆసియా, ఓసియానా దేశాల వాటా 42 శాతం ఉంది. అమెరికా ఆయుధ ఉత్పత్తిలో భారత్ 9.5 శాతం, ఆస్ట్రేలియా 5.1 శాతం, జపాన్ 2.2 శాతం ఆయుధాలను దిగుమతి చేసుకుంటున్నాయి.

చైనా కట్టడికి అమెరికా, జపాన్, ఆస్ట్రేలియా, భారత్‌లతో కూడిన క్వాడ్రిలేటరల్ సెక్యూరిటీ డైలాగ్ (క్వాడ్) ఉండగా మళ్లీ ఎవరూ ఊహించని విధంగా ఆస్ట్రేలియా, ఇంగ్లాండ్, అమెరికాలతో కూడిన త్రైపాక్షిక సైనిక కూటమిని జో బైడెన్ ప్రకటించారు. ఈ మూడు సభ్య దేశాలుగా ఆకస్ (ఆస్ట్రేలియా (ఎ), బ్రిటన్ (యునైటెడ్ కింగ్‌డమ్ (యుకె), అమెరికా సంయుక్త రాష్ట్రాలు (యుఎస్) పేరుతో సైనిక కూటమి (ఎయుకెయుఎస్) ఏర్పడినట్లు మూడు దేశాల నేతలు ప్రకటించారు. ఈ ఒప్పందం ప్రకారం ఆస్ట్రేలియాకు సైబర్ సామర్థ్యాలు, కృత్రిమ మేధస్సు, క్వాంటం టెక్నాలజీలు, సముద్రగర్భ సామర్థ్యాలపై సహకారం ఉంటుంది. ఆస్ట్రేలియా తన వైమానిక దళం, నావికాదళం కోసం కొత్త లాంగ్-రేంజ్ స్ట్రైక్ సామర్థ్యాలను కూడ పొందుతుంది. ఈ ఒప్పందం సైనిక సామర్థ్యంపై దృష్టి పెడుతుంది.

ఆకస్ కూటమి ఏర్పాటు ప్రపంచ భౌగోళిక రాజకీయాల్లో ఒక నూతన పరిణామం కాగా, ఆస్ట్రేలియాకు అణు ఇంధనంతో నడిచే 8 జలాంతర్గాములను అందిస్తామన్న అమెరికా ప్రకటన వెలువడడం మరో పరిణామం. ఈ కూటమి ఏర్పాటుతో మిత్రదేశాలు (ఫ్రాన్స్, ఇయు, జపాన్, భారత్, న్యూజిలాండ్, ఇండోనేషియా), శత్రు దేశాలు (చైనా, రష్యా, ఇరాన్‌లు) ఉలిక్కిపడ్డాయి. అమెరికా అనుంగు మిత్రులు ఫ్రాన్స్, జర్మనీలు ఆకస్ ఏర్పాటును తీవ్రస్థాయిలో ఖండించాయి. ఇండో-పసిఫిక్ ప్రాంతంలో క్వాడ్ ద్వారా పీట ముడివేసుకున్న జపాన్, భారత్‌లు పైకి చెప్పకపోయినా ఈ పరిణామంతో లోలోపల ఆందోళన చెందాయి. బ్రిటన్ ప్రధాని బోరిస్ జాన్సన్ ఈ మూడు దేశాలు భౌగోళికంగా దూరంగా ఉన్నప్పటికీ మనం సహజ మిత్రులం అని వ్యాఖ్యానించడంలో శ్వేత జాత్యహంకారం ఇమిడి ఉన్నట్లు విదితమవుతోంది.

అమెరికా, బ్రిటన్‌లు ఇండో-పసిఫిక్ ప్రాంత దేశాలు కావు. ఈ కూటమిలో ఆస్ట్రేలియా ఒక్కటే ఇండో-పసిఫిక్ ప్రాంత దేశం. ఆకస్ కూటమి ఏర్పాటును స్వాగతిస్తూ ఆస్ట్రేలియా ప్రధాని స్కాట్ మారిసన్

మాట్లాడుతూ 'మా సాంకేతిక పరిజ్ఞానం, మా శాస్త్రవేత్తలు, మా పరిశ్రమలు, మా రక్షణ బలగాలు కలిసి సంయుక్తంగా పనిచేస్తూ, అంతిమంగా ప్రయోజనం సిద్ధించేలా మరింత భద్రమైన, సురక్షితమైన (ఇండో-పసిఫిక్) ప్రాంతాన్ని అందిస్తాము' అన్నారు. నిజానికి ఇండో-పసిఫిక్ ప్రాంత భద్రత ప్రధానంగా ఆ ప్రాంతంలోని దేశాలకు సంబంధించిన అంశం. కానీ అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచం మొత్తంలో తన ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయని వాదిస్తుంది. ఇక ఆస్ట్రేలియా బ్రిటన్ డొమినియన్ కనుక తన ప్రయోజనాలు ముడిపడి ఉన్నాయని బ్రిటన్ వాదిస్తుంది. ఈ వాదనలు ఆ రెండు దేశాల ఆధిపత్య, ఆర్థిక ప్రయోజనాలకు సంబంధించినవి తప్ప ఇండో-పసిఫిక్ ప్రాంతాలలోని దేశాల క్షేమాన్ని కాంక్షించి మాత్రం కాదన్నది యథార్థం. అసలు ఇండో-పసిఫిక్ అన్న పదజాలం మిలిటరీ ప్రయోజనాల రీత్యా రెండవ ప్రపంచ యుద్ధం తరువాత 1951లో బ్రిటన్ వలస ఆధిపత్యానికి వ్యతిరేకంగా జర్మనీ ఉపయోగించింది. ఇప్పుడు అమెరికా దాన్ని అంది పుచ్చుకుంది.

**అమెరికాకు సవాలుగా మారిన చైనా దూకుడు:**

ఆసియాలో సామాజికార్థిక ఫలితాలను మెరుగుపరిచే లక్ష్యంతో 2015 డిసెంబర్ 25న అంతర్జాతీయ రుణ సంస్థలైన అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐఎంఎఫ్), ప్రపంచ బ్యాంకు (డబ్ల్యూబి), ఆసియా అభివృద్ధి బ్యాంకు(ఎడిబి) లకు దీటుగా చైనా చొరవతో ఏర్పడ్డ ఆసియా మౌలిక వసతుల పెట్టుబడి బ్యాంక్ (ఎఐఐబి), ప్రాంతీయ సమగ్ర ఆర్థిక భాగస్వామ్యం (ఆర్‌సిఇపి), ఆసియాన్ డెవలప్‌మెంట్ బ్యాంక్, ఆసియాన్ రీజనల్ ఫోరం తదితర సంస్థలు అమెరికా సామ్రాజ్యవాదుల ఆర్థిక, రాజకీయ పెత్తనానికి ఆటంకంగా నిలిచాయి. ఆర్థికంగా ప్రపంచంలో రెండవస్థానానికి చేరిన చైనా అమెరికాకు పోటీగా ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా, యూరప్ దేశాలతో వాణిజ్య, వ్యాపార, పారిశ్రామిక, దౌత్యసంబంధాలు ఏర్పాటు చేసుకోవడం సామ్రాజ్యవాద దేశాలకు, ప్రత్యేకించి అమెరికాకు కంటగింపుగా ఉంది. వ్యాపార, పారిశ్రామిక, సాంస్కృతికాభివృద్ధికి దోహదపడే బెల్ట్ అండ్‌రోడ్ (పాతసిల్క్‌రోడ్) 68 దేశాలను కలుపుతూ అత్యంత భారీ వ్యయంతో నిర్మించనున్న పథకం అమెరికాకు పుండుమీద కారం చల్లినట్లైంది.

ఇవాళ ఇండో-పసిఫిక్ ప్రాంతంలో పెరుగుతున్న చైనా ప్రాబల్యం అమెరికాను ఆందోళనకు గురిచేస్తోంది. దక్షిణచైనా సముద్రం ఆర్థిక, భౌగోళిక వ్యూహంలో ప్రధానమైంది. ప్రపంచ సముద్ర వ్యాపార రవాణా మూడవ వంతు దీని ద్వారానే జరుగుతుంది. ఏటా 3 ట్రిలియన్ డాలర్ల వ్యాపారం జరుగుతుంది. ఇండో-పసిఫిక్ రెండు మహా సముద్రాలు, అనేక ఖండాలకు విస్తరించి ఉంది. ఇది అమెరికా వాణిజ్య, భౌగోళిక రాజకీయ ప్రయోజనాలకు ముఖ్యమైనది. దక్షిణ చైనా సముద్రం పెద్దఎత్తున గ్యాస్, ఆయిల్ నిల్వలు, మత్స్య సంపద, ఖనిజ సంపద కలిగి ఉంది. 20వ శతాబ్దం చివర వరకు దక్షిణచైనా సముద్రంపై అమెరికా ఆధిపత్యం చెలాయించింది. నేడు సోషల్ సామ్రాజ్యవాద చైనా ఆర్థిక, రాజకీయ, దౌత్య రంగాలలో అగ్ర రాజ్యంగా ఆవిర్భవించిన తరువాత పరిస్థితులు మారాయి.

చైనా తన వ్యాపార సరుకుల రవాణా సరఫరాను కాపాడుకోవడానికి, దక్షిణ చైనా సముద్రంపై అమెరికా ఆధిపత్యాన్ని తొలగించి తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడానికి, ఆ ప్రాంతంలో ఉన్న సహజ వనరులను, సంపదను తన అధీనంలో ఉంచుకోవడానికి, దక్షిణ చైనా సముద్రంలో కృత్రిమ ద్వీపాలను నిర్మించి సైనిక స్థావరాలు ఏర్పాటు చేసుకున్నది. 2015లో చైనా అధ్యక్షుడు జి జిన్‌పింగ్ సైనిక ఆధునీకరణను ప్రారంభించాడు. అందులో భాగంగానే నూతన మిలిటరీ పరికరాల పరిశోధన- అభివృద్ధికి మిలియన్ డాలర్లను వ్యయం చేసింది. ఇండో-పసిఫిక్ అంతటా నూతన సైనిక స్థావరాల ఏర్పాట్లు చేసే ఆలోచనలో చైనా ఉంది. చైనాకు పోటీగా పసిఫిక్ మహాసముద్రం మధ్యలో అమెరికా సైనిక స్థావరాన్ని నిర్మిస్తోంది. సైనిక విన్యాసాలు జరుపుకుంటున్నది.

పసిఫిక్ మహా సముద్రాన్ని, హిందూ మహా సముద్రంలోకి కలిపే జలసంధి మలక్కా. ఇది హిందూ మహాసముద్రం, పసిఫిక్ మహాసముద్రం మధ్య ప్రధాన షిప్పింగ్ మార్గంగా ప్రసిద్ధి చెందింది. మలక్కా జలసంధి అండమాన్ సముద్రం(హిందూ మహాసముద్రం), దక్షిణ చైనా సముద్రం (పసిఫిక్ మహాసముద్రం) కలిపే జలమార్గం. ఇది ఇండోనేషియా ద్వీపం మధ్య నడుస్తుంది. పశ్చిమాన సుమత్రా ద్వీపకల్పం, మలేషియా దీవి, తూర్పున దక్షిణ థాయిలాండ్ ఉంది. ఈ జలసంధి ద్వారా జరిగే వ్యాపారానికి అమెరికా సృష్టించే అడ్డంకులను చైనా ఎదిరిస్తోంది. చైనా కదలికలు, సైనిక విన్యాసాలపై నిఘా ఉంచడానికి అమెరికా వైమానిక, నావికా యుద్ధనౌకలను పంపినా చైనా ఏమాత్రం లక్ష్య పెట్టలేదు. అలాగే వాణిజ్యపరంగా ప్రధానమైన, ఇరాన్ ప్రభావం అధికంగా ఉన్న హోర్ముజ్ జలసంధి ఉత్తరాన ఇరాన్‌ను, దక్షిణాన యునైటెడ్ అరబ్ ఎమిరేట్‌లను వేరు చేస్తుంది. ప్రపంచంలోని చమురు, సహజ వాయువులో మూడవ వంతు హోర్ముజ్ జలసంధి గుండా రవాణా అవుతుంది. అంతర్జాతీయ వాణిజ్యం కోసం అత్యంత వ్యూహాత్మక ప్రదేశంగా ఉంది. యుఎఇలోని హోర్ముజ్ జలసంధి, ఎర్ర సముద్ర ప్రాంతంలో చైనా పిఎల్ఎ సైనిక స్థావర ఏర్పాటులో ఉంది.

అమెరికా తన సామ్రాజ్యవాద గుత్తాధిపత్యానికి, హిందూ, దక్షిణ చైనా సముద్రతీర ప్రాంతాలలో నిక్షిప్తమైన సహజ సంపదను దోచుకోవడానికి అడ్డంకిగా ఉండి అన్ని రంగాలలో అభివృద్ధిని సాధించి పోటీగా నిలిచిన చైనాపై ప్రచ్ఛన్న యుద్ధానికి పూనుకున్నది. ఒబామా కాలంలోనే 'పివోట్ టు ఆసియా' వ్యూహాన్ని ప్రకటించాడు. ఆ తర్వాత 2017 నుంచి ట్రంప్ క్వాడ్‌ను ఉనికిలోకి తెచ్చాడు. చైనాకు దగ్గరగా ఉన్న జపాన్, గువాం, దక్షిణ కొరియా ఫిలిప్పైన్స్, సింగపూర్ దేశాలలో సైనిక స్థావరాలను ఏర్పాటు చేసుకొని ఆ దేశాన్ని రెచ్చగొడుతున్నది. దక్షిణ చైనా సముద్ర తీర ప్రాంత దేశాలైన వియత్నాం, బ్రూనె, ఫిలిప్పైన్స్ దేశాలలో ఉన్న వివాదాలను, జపాన్, భారతదేశంతో ఉన్న సరిహద్దు వివాదాలను ఉపయోగించుకోవడం ద్వారా చైనాను లొంగదీసుకోవడానికి చేయని ప్రయత్నం లేదు. చైనాకు వ్యతిరేకంగా ఆసియా కేంద్రంగా (ఆసియా పైవోట్) యుద్ధ సన్నాహాలు చేయాలని బరాక్ ఒబామా తీసుకున్న నిర్ణయాన్ని బైడెన్ ప్రభుత్వం మరింత ముందుకు తీసుకుపోతోంది. అందులో భాగమే క్వాడ్‌ను బలోపేతం చేయడం, కొత్తగా 'ఆకస్' సైనిక కూటమిని ఏర్పాటు చేయడం జరిగింది. అయినప్పటికీ వియత్నాం, జపాన్, ఫిలిప్పైన్స్‌లు ఆచితూచి అడుగులు వేస్తున్నాయి.

**ఆకస్ ఏర్పాటు పర్యవసానాలు:**

ఆకస్ ఏర్పాటు ఆసియా దేశాల భౌగోళిక-రాజకీయ ప్రయోజనాలకు ప్రమాదకారి. మరీ ముఖ్యంగా కూటమి స్వభావం

రీత్యా, ప్రపంచ వ్యాపితంగా వివిధ ప్రాంతాలలో ముఖ్యంగా ఇండో–పసిఫిక్ ప్రాంతంలో భద్రతా సమస్యలను ఈ మిలటరీ కూటమి పెంచుతుంది. ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణాన్ని పెంచుతుంది. భౌగోళిక ఉద్రిక్తతలు తీవ్రతరమవుతాయి. ఆయుధ పోటీని తీవ్రం చేస్తుంది. అన్నింటికంటే ప్రమాదకరమైంది అణుకార్యక్రమ విస్తరణ. ఇది అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక వ్యవస్థను ప్రభావితం చేస్తుంది. దక్షిణ పసిఫిక్ అణు రహిత ఒప్పందాన్ని దెబ్బతీయడమే కాక ఈ ప్రాంత అణురహిత జోన్ ఏర్పాటుకు ఆసియాన్ దేశాలు చేస్తున్న ప్రయత్నాలను ప్రభావితం చేస్తుంది. ఈ ప్రాంతంలో దేశాలు రక్షణావసరాలకు ఏమాత్రం వెనుకాడకుండా ఖర్చు చేస్తున్నాయి. లండన్ కేంద్రంగా పనిచేస్తున్న ఇంటర్నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ స్ట్రాటజిక్ స్టడీస్, స్టాక్ హోం ఇంటర్నేషనల్ పీస్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ నిర్వహించిన సర్వేల్లో ఈ విషయం స్పష్టం అయింది. ఈ దేశాలన్నీ కరోనా సంక్షోభంలో కొట్టుమిట్టాడినా, ఆయుధ పోటీకోసం లెక్కలేకుండా వనరులను ఖర్చు చేస్తున్నాయి. ప్రజలకు ఉపయోగపడవలసిన ఆర్థిక వనరులను కొల్లగొట్టి ఆయుధ కొనుగోళ్లకు మళ్లిస్తున్నాయి.

ఆస్ట్రేలియాకు అణు జలాంతర్గాముల సరఫరా వల్ల తమ ప్రాంతంలో ఆయుధ పోటీ, ముఖ్యంగా అణ్వాయుధ పోటీ తీవ్రమై శాంతికి భంగం కలుగుతుందని మలేషియా, ఇండోనేషియాలు హెచ్చరించాయి. దక్షిణ చైనా సముద్రంలో చైనా–అమెరికా పోటీ వలన నిత్యం ఉద్రిక్తతలు ఏర్పడుతున్న నేపథ్యంలో ఆస్ట్రేలియా అణు జలాంతర్గాములు ఉద్రికత్తలను మరింత తీవ్రం చేస్తాయని ఆసియాన్ కూటమిలోని దేశాలు ఆందోళన చెందుతున్నాయి. ఆస్ట్రేలియాతో ఉమ్మడి సముద్ర సరిహద్దు కలిగి ఉన్న ఇండోనేషియాకు ఈ పరిణామం మరింత కంటగింపు అయింది. ఇండోనేషియా అధ్యక్షుడు జోకో వీడొడో తాను అందుబాటులో ఉండనని, తనను కలవడం సాధ్యపడదని ప్రకటించడంతో ఆస్ట్రేలియా ప్రధాని మోరిసన్ తన ఇండోనేషియా సందర్శనను రద్దు చేసుకోవలసి రావడం బట్టి నూతన కూటమి పట్ల ఆ దేశ కఠిన వైఖరిని అర్థం చేసుకోవచ్చు.

ఇండో–పసిఫిక్ ప్రాంతంలో రక్షణ అవసరాలకు చేసే ఖర్చు గడిచిన పదేళ్లలో 47 శాతం పెరిగిందని స్టాక్ హోం సంస్థ నివేదిక పేర్కొంది. ఈ ప్రాంతంలో చైనా, భారత్‌లు రక్షణ రంగానికి భారీగా నిధులు కేటాయిస్తున్నాయి. ఈ నేపథ్యంలో చైనా కూడా తన రక్షణ వ్యవస్థను ఆధునీకరించేందుకు మరింతగా నిధులు ఖర్చుచేయవచ్చు. ప్రపంచంలో అగ్రరాజ్యంతో పోటీ పడేందుకు ఆయుధ సంపత్తిని పెంచుకుంటూ పోతున్న చైనాకు సవాల్ విసిరేందుకే భారత్, ఆస్ట్రేలియాలు సైన్యాన్ని, ఆయుధ సంపత్తిని పెంచుకునేలా అమెరికా తోడ్పడుతుంది. పర్యవసానంగా భారత్, ఆస్ట్రేలియా దేశాలు సైనికంగా చైనాతో పోటీ పడడానికి చేసే ప్రయత్నాల వల్ల ఆర్థిక వనరులు ఆయుధాల కొనుగోలుకు మళ్లుతాయి. ప్రజల దైనందిన సమస్యలు తీవ్రమవుతాయి. అదే సమయంలో అమెరికా ఆయుధ విక్రయ బహుళజాతి సంస్థలు మాత్రం లాభాలు పొందుతాయి.

**ఆకస్ ఏర్పాటు పట్ల చైనా ఆగ్రహం:**

ఏడు దశాబ్దాలపాటు పూర్వపు సోవియెట్ యూనియన్, అమెరికాల మధ్య సాగిన ప్రచ్ఛన్న యుద్ధం బెడద 90వ దశకం నుంచి తొలగిందని అందరూ అనుకుంటుండగా ఈ ఏడాది మార్చిలో చతుర్భుజ కూటమి(క్వాడ్) దేశాల తొలి శిఖరాగ్ర సమావేశం ఆన్‌లైన్‌లో జరిగింది. దానిపై కొంత 'నాగరికంగా' స్పందించిన చైనా ఈసారి మాత్రం అన్ని మొహమాటాలనూ, దౌత్య మర్యాదలను వదిలి ఆస్ట్రేలియానుద్దేశించి బెదిరింపులకు దిగింది. చైనా కమ్యూనిస్టు పార్టీ అధికార పత్రిక అయిన గ్లోబల్ టైమ్స్ సంపాదకీయం ద్వారా గట్టి హెచ్చరికలే పంపింది. ఇప్పటివరకు అమెరికా–చైనాలకు సమదూరం పాటిస్తూ వచ్చిన ఆస్ట్రేలియా అకస్మాత్తుగా అమెరికా వైపు మళ్లింది. నిజానికి ఆస్ట్రేలియా చైనాకు ప్రధాన వాణిజ్య భాగస్వామి. భౌగోళికంగా చూస్తే చైనా, ఆస్ట్రేలియాల మధ్య ఏ రకమైన పొరపొచ్చాలూ లేవని, కానీ ఆస్ట్రేలియా తనంత తానుగా చైనా–అమెరికాల వైరంలో తలదూర్చి కొరివితో తలగోక్కుంటున్నదని దాని సారాంశం. అమెరికా అండ చూసుకుని సైనిక దుస్సాహసానికి పాల్పడితే చైనా 'నిర్దాక్షిణ్యం'గా బదులుతీర్చుకోవడం ఖాయమని బెదిరించింది. బహుశా దక్షిణ చైనా సముద్రంలో తమ ప్రాణాలను వృథా చేసుకునే పాశ్చాత్య సైనిక పటాలంలో తొలి వంతు ఆస్ట్రేలియాదే కావొచ్చని కూడా విస్పష్టంగా సంకేతాలు పంపింది.

చైనా ఆగ్రహావేశాల మాట అటుంచి ఆస్ట్రేలియా ఈ కూటమికి సై అనడం ప్రపంచ దేశాలన్నిటికీ ఆశ్చర్యం కలిగించింది. వాస్తవానికి అమెరికా ప్రమేయం ఉన్న కూటముల్లో ఆస్ట్రేలియాకు సభ్యత్వం ఉండటం కొత్తేమీ కాదు. 1941లో అమెరికా, బ్రిటన్, కెనడా, న్యూజిలాండ్‌లతో పాటు 'ఫైవ్ ఐస్'(అయిదు నేత్రాల) కూటమిలో అది కూడా భాగస్వామి. రెండో ప్రపంచ యుద్ధం తరువాత 1951లో ఏర్పడిన ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, యునైటెడ్ స్టేట్స్ భద్రతా ఒప్పందం (అంజుస్) లోనూ అది కొనసాగుతోంది. క్వాడ్‌లో సరేసరి. అందులో అమెరికా, భారత్, జపాన్‌లతో పాటు అది కూడా ఉంది. అయితే ఈ మూడు కూటముల తీరుతెన్నులూ వేరు. ఫైవ్ ఐస్ అప్పటి సోవియెట్ యూనియన్‌పై నిఘా పెట్టి ఆ సమాచారాన్ని పరస్పరం ఇచ్చిపుచ్చుకునే ఉద్దేశంతో ఏర్పాటు చేసింది. అంజుస్ రెండో ప్రపంచ యుద్ధకాలంలో జపాన్‌కు వ్యతిరేకంగా అమెరికా, బ్రిటన్‌ల కోసం ఏర్పడింది. క్వాడ్ చైనాకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టిన కూటమి. కానీ కొత్తగా అడుగుపెట్టిన 'ఆకస్' ఆస్ట్రేలియాకు అణుశక్తితో నడిచే జలాంతర్గాములను సమకూర్చాలని నిర్ణయించింది. అదే చైనాకు ఆగ్రహం కలిగిస్తున్న అంశం. ఇది కేవలం దక్షిణ చైనా సముద్ర ప్రాంతంలో తన ఆధిపత్యాన్ని దెబ్బతీయడానికి ఉద్దేశించిందేనని ఆ దేశం రగిలిపోతోంది.

**ఆస్ట్రేలియాది వెన్నుపోటు – ఫ్రాన్స్:**

నూతన సైనిక కూటమి ఆకస్ అమెరికాకు ఊరటనిచ్చిన మాట నిజమే. కానీ, మూడు దేశాల అధినేతలూ కూటమి ఏర్పాటు గురించి ప్రకటించిన కాసేపటికే చైనా సంగతలా ఉంచి, మిత్ర పక్షాలైన ఫ్రాన్స్, యూరోపియన్ యూనియన్(ఇయు)ల నుంచి వినబడిన అపస్వరాలు రాగల రోజుల్లో ఆసక్తికర పరిణామాలు సంభవించ బోతున్నాయన్న అభిప్రాయం కలిగిస్తున్నాయి. అమెరికా, ఆస్ట్రేలియాల పోకడలు ఫ్రాన్స్‌కు ఏమాత్రం నచ్చడం లేదు. 2016లో ఫ్రాన్స్‌తో కుదుర్చుకున్న 12 డీజిల్–విద్యుత్‌లతో నడిచే జలాంతర్గాముల కొనుగోలుకు ఆస్ట్రేలియా 4,300 కోట్ల డాలర్ల ఒప్పందం కుదుర్చుకుని, ఆ ప్రాజెక్టుపై దాదాపు 1,800 కోట్ల డాలర్లు వ్యయం చేశాక ఏకపక్షంగా

హఠాత్తుగా దాన్నుంచి తప్పుకోవటం ఫ్రాన్స్ ఆగ్రహావేశాలకు కారణం. వేల కోట్ల డాలర్ల కాంట్రాక్టును మిత్ర దేశమన్న మర్యాద కూడా లేకుండా అమెరికా సొంతం చేసుకుందన్న బాధ ఫ్రాన్స్‌ను పీడిస్తోంది. దీనికి స్పందనగా ఆస్ట్రేలియా, అమెరికా దేశాల నుంచి తన రాయబారులను వెనుకకు పిలిపించుకుంది. ఇయుతో ఆస్ట్రేలియాకు గల వాణిజ్య ఒప్పందాన్ని పునసమీక్షించాలని, ఇయు ప్రత్యేక సైనిక కూటమిని ఏర్పాటు చేసుకోవాలని ఫ్రాన్స్ ప్రతిపాదిస్తున్నది. ఇప్పటికే బ్రిటన్-ఫ్రాన్స్‌ల మధ్యనున్న సంప్రదాయ ప్రచ్ఛన్న వైరం మరింత పెరిగింది.

ఫ్రాన్స్ విదేశీ మంత్రి జీన్-వైవ్స్ లే డ్రియాన్, రక్షణ మంత్రి ఫ్లోరెన్స్ పార్లీ స్పందిస్తూ "ఆస్ట్రేలియాతో కీలకమైన భాగస్వామ్యం నుండి ఫ్రాన్స్ లాంటి ముఖ్యమైన ఐరోపా మిత్రుడు, భాగస్వామిని మినహాయించే ఈ అమెరికా నిర్ణయం స్థిరత్వం లేనితనాన్ని సూచిస్తోంది. అది కూడా (పశ్చిమ) విలువల విషయంలో గానీ, చట్టబద్ధ సూత్రాలపై ఆధారపడిన బహుళపక్ష వాదం పట్ల గౌరవం లేనితనాన్ని తెలియజేస్తుందన్నారు. ఇహిద్ లోడిగియా మరో ప్రకటనలో "ఇది నిజంగా వెన్నుపోటు. ఆస్ట్రేలియాతో నమ్మకంతో కూడిన భాగస్వామ్యాన్ని స్థాపించాం. ఆ నమ్మకానికి ఆ దేశం ద్రోహం చేసింది" అని తీవ్రంగా స్పందించాడు. అవసరమైన ఆహారం, మంచినీరు ఉన్నంతకాలం సముద్ర జలాల్లో గుట్టుచప్పుడు కాకుండా సంచరించడానికి వెసులుబాటుండే అణుశక్తి జలాంతర్గాముల ముందు, ఆక్సిజన్ కోసం పదే పదే ఉపరితలానికి రాకతప్పని స్థితిలో ఉండే డీజిల్-విద్యుత్ జలాంతర్గాములు సురక్షితమైనవి కాదని ఆస్ట్రేలియా అభిప్రాయపడుతోంది.

ఇక ఇయు అభ్యంతరం వేరు. ఇన్ని దశాబ్దాలుగా నాటో కూటమి ద్వారా తమ వల్ల ప్రయోజనం పొందిన అమెరికా మాట మాత్రమైనా చెప్పకుండా భిన్నమైన బాట పట్టడం ఇయు సహించలేకపోతోంది. ఇయు నుంచి బయటికొచ్చాక బ్రిటన్ తీసుకున్న అతిపెద్ద వ్యూహాత్మక నిర్ణయం ఈ 'ఆకస్'. అమెరికా సాంకేతికతతో తమ దేశంలోనే ఈ జలాంతర్గాముల నిర్మాణం జరుగుతుంది గనుక దానికిది లాభసాటి బేరం కూడా. డొనాల్డ్ ట్రంప్ హయాంలో తీసుకున్న నిర్ణయాలు ఇయు దేశాలను క్రమేపీ అమెరికాకు దూరం చేశాయి. అమెరికాను కాదని అవి రష్యాతో గ్యాస్ పైప్‌లైన్‌పై ఒప్పందానికొచ్చాయి. ఇప్పుడు బైడెన్ ఆవిష్కరించిన 'ఆకస్' వాటిని మరింత దూరం చేసింది. ఆకస్ ఏర్పాటు సామ్రాజ్యవాద కూటమిలో వైరుధ్యాలను మరింత పెంచింది. యూరప్ దేశాలకు గానీ, అందులో కీలకమైన నాటో దేశాలకు గానీ బైడెన్ సర్కార్ ప్రాధాన్యత ఇవ్వడం లేదు. ఇదిలా ఉండగా, ఇంతలో పాత నాటో దేశాల ప్రమేయం లేకుండా నాటో సభ్యదేశం బ్రిటన్‌కి ముఖ్యస్థానాన్ని కల్పిస్తూ 'ఆకస్' ఏర్పాటుకి అమెరికా పూనుకుంది. ఈ చర్య ఎటువైపు దారి తీస్తుందో వేచి చూడాలి. ఈ పరిణామంతో మున్ముందు పునరేకీకరణలు ఎలా ఉంటాయో, ఎవరు ఏ శిబిరంలో చేరతారో, వాటి పర్యవసానాలేమిటో వేచి చూడాల్సి ఉంది.

ఇప్పటికే ఆస్ట్రేలియా పొరుగునే ఉన్న దక్షిణ పసిఫిక్ ద్వీప దేశాల్లో (ఫిజి, వనౌటు, పపువా న్యూగినియా) మిలిటరీ స్థావరాలు నెలకొల్పడానికి 2018 నుంచి చైనా ప్రయత్నాలు ముమ్మరం చేసింది. పోటీగా సమీపంలో పసిఫిక్‌లో తన ప్రధాన మిలటరీ స్థావరమైన గువామ్‌లో తన అణ్వస్త్ర శక్తిని మరింత ఆధునికం చేయడం అమెరికా ప్రారంభించింది. అదే ప్రాంతంలోని ఫ్రెంచి పాలినేసియా ద్వీపకల్పంలో ఫ్రాన్స్ మిలిటరీ స్థావరం ఇప్పటికే ఉన్నది. కాగా 'గేట్ వే టు ఆసియా'గా పిలిచే ఉత్తర ఆస్ట్రేలియా రేవు 'ద పోర్ట్ ఆఫ్ డార్విన్' నిర్వహణను చైనా 2015లో 99 సంవత్సరాల పాటు లీజుకు తీసుకున్నది. ఈ పోర్టు నిర్వహణ మొత్తం ప్రస్తుతం చైనా నియంత్రణలో ఉన్నది. పసిఫిక్‌లో పెరుగుతున్న ఉద్రిక్తతల రీత్యా ఉత్తర ఆస్ట్రేలియాలో చైనా ప్రభావాన్ని పూర్వపక్షం చేయడానికి లేదా సమతూకం చేయడానికి అక్కడ అమెరికా మిలిటరీ ఉనికి పెంచడానికి ఆస్ట్రేలియా నిర్ణయించింది.

**ముగింపు:**

పోఖ్రాన్‌లో భారత్ అణుపరీక్ష జరిపినప్పుడు అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందాన్ని ఉల్లంఘించిందని ఆరోపిస్తూ తమ రక్షణ రంగ ప్రాజెక్టుల్లో పనిచేస్తున్న భారత శాస్త్రవేత్తలను గంటల్లో దేశం వదిలిపోవాలని గెంటేసిన ఆస్ట్రేలియా ఇప్పుడు ఆ 'చాదస్తం' ఎందుకు వదిలిపెట్టాల్సి వచ్చిందో సంజాయిషీ ఇవ్వాల్సి ఉంది. అలాగే ఇరాన్, ఉత్తర కొరియాల అణు కార్యక్రమంపై చిందులు వేసే అమెరికా, బ్రిటన్‌లు ఆస్ట్రేలియాను అణ్వస్త్ర దేశంగా మార్చడానికి ప్రయత్నించడం వాటి ద్వంద్వ వైఖరికి నిదర్శనం. ఏది ఏమైనా భారతదేశం మోడీ నాయకత్వంలో చైనా పట్ల గట్టి వ్యతిరేకతను ప్రదర్శిస్తూ సామ్రాజ్యవాద అమెరికా చేతుల్లో పావుగా మారుతోంది. ఇప్పటికే మలబార్, ఆఫ్రికా విశ్వాసాల పేరుతో సాగుతున్న కసరత్తుల్లో అమెరికా, ఆస్ట్రేలియా ఇంగ్లాండ్‌ల భాగస్వామ్యం పెరిగింది. భారతదేశ స్థానం రాను రాను జూనియర్ భాగస్వామి స్థాయి నుండి దిగజారి సబ్ జూనియర్ స్థాయికి పడిపోయింది. ఆసియా – పసిఫిక్ ప్రాంతంపై ఆర్థిక, రాజకీయ, సైనిక ఆధిపత్యం సంపాదించుకునేందుకు ఒకవైపు అమెరికా, మరోవైపు చైనా తెగబడుతున్నాయి. సూత్రబద్ధమైన దౌత్య విధానాలకు తిలోదకాలు ఇచ్చిన బిజెపి ప్రభుత్వ నాయకత్వంలో భారతదేశం అంతర్జాతీయ వ్యవహారాల్లో అంతకంతకూ ఒంటరిఅవుతున్నది. ఇది దేశానికీ, దేశాభివృద్ధికీ, శాంతి భద్రతలకూ క్షేమకరం కాదు.

అమెరికా తదితర పశ్చిమ దేశాలకు తమ ఆర్థిక-రాజకీయ ఆధిపత్య ప్రయోజనాలే ముఖ్యం. ఆ మాటకొస్తే దక్షిణ చైనా సముద్రం మొత్తం తనదే అని వాదించే చైనాకు కూడా ఆగ్నేయాసియా దేశాల వ్యాపార ప్రయోజనాల పట్ల పట్టింపు, గౌరవం ఉన్నాయనీ చెప్పలేము. ఆకస్ ఏర్పాటుతో సైనిక పోటీతత్వం పెరిగి ఇప్పటికే లోతుగా పాతుకుపోయిన ప్రపంచ పెట్టుబడిదారీ సంక్షోభాన్ని తీవ్రతరం చేస్తుంది. చైనా, రష్యాలతో కయ్యానికి అమెరికా సంసిద్ధతను మరింత నగ్నం కావిస్తుంది. అంతిమంగా మూడో ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని మరింత తీవ్రం చేయనున్నది. అమెరికా సామ్రాజ్యవాదం గత రెండు దశాబ్దాలుగా పశ్చిమాసియాను విధ్వంసం చేసింది. ఇప్పుడు దాని దృష్టి దక్షిణాసియా వైపు మళ్లింది. తన ఆయుధ మార్కెట్ల కోసం, ఆయా దేశాల సహజవనరులను లూటీ చేసేందుకు మానవ నాగరికతను మట్టుబెట్టి దోపిడీ, ఆధిపత్యం లక్ష్యంగా ఆవిర్భవించిన సైనిక కూటమి ఆకస్ ఫలితంగా ఇండో-పసిఫిక్ దేశాల ప్రజలతో పాటు మొత్తం ప్రపంచ దేశాల ప్రజలకు, ముఖ్యంగా శ్రామికవర్గ ప్రజల ప్రయోజనాలకు తీవ్రమైన హాని జరగనున్నది. కనుక అమెరికా యుద్ధోన్మాదాన్ని, ఆధిపత్యవాదాన్ని, బ్రిటన్ కపట బుద్ధినీ, ఆస్ట్రేలియా స్వార్థ బుద్ధినీ, బాధ్యతా రాహిత్యాన్ని ప్రపంచ ప్రజానీకం ముందు బట్టబయలు చేసుకున్నాయి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్రవిద్యార్థి)* వీ

# అత్యాచారాలు - మూలాలు

**నూతన ఆర్థిక విధానాల ఫలితంగా గ్రామీణ ఉపాధి దెబ్బతిని ఉపాధికోసం పట్టణాలకు వెళ్లి మత్తు పదార్థాలకు బానిసైన యువత మహిళలను ప్రలోభాలకు గురిచేసి అత్యాచారాలకు పాల్పడుతున్నారంటున్నారు హుస్సేన్**

దేశంలో స్త్రీలపై అత్యాచారాలు, సామూహిక అత్యాచారాలు, హత్యలు రోజు రోజుకూ పెరుగుతున్నాయి. మధ్య యుగాల కాలం కంటే, మనం చూసిన భూస్వామ్య కాలం కంటే కూడా ఈ రోజు స్త్రీలపై లైంగిక హింస పెద్ద ఎత్తున పెరుగుతున్నది. ఇక పసిపిల్లల పైన, పండు ముసల్లపైన, కన్న బిడ్డల పైన సైతం అత్యాచారాల వార్తలు రోజూ ప్రతి పత్రికలో సర్వసాధారణమౌతున్నాయి.

స్త్రీలపై జరిగే లైంగిక హింసలో క్రూరత్వం పాలు పెరుగుతున్నది. ఒకప్పుడు నిర్మానుష్య ప్రదేశాల్లో, నాలుగు గోడల మధ్య జరిగే దారుణాలు ఈ రోజు నడుస్తున్న వాహనాల్లోనూ, వబ్లిగ్గానూ జరుగుతున్నాయి. 'సామూహిక' అత్యాచారాలు, తదనంతరం హత్యలు రోజూ ఏదో మూలన జరుగుతూనే ఉన్నాయి. ఈ ఉన్మాద పనులకు గుడి, బడి, హాస్టలు, ఆఫీసు, ఇళ్లు, పనిస్థలం, ప్రయాణం అనే తేడా ఉండటంలేదు. కూలి పని, ఉద్యోగం, చదువుల కోసమే కాదు పొరుగింటికి వెళ్లటం కూడా ఆడ పిల్లలకు ప్రమాదంతో కూడిన సాహస కార్యంగా మారింది. ఆధునిక ఆర్థిక వ్యవస్థ స్త్రీలకు స్వేచ్ఛను ఇచ్చి భద్రతను లాగేసుకుంది. సమాజంలోని పురుషోన్మాదం ఇళ్లు అనే జైలు నుండి బయటకు వస్తున్న స్త్రీలను పంజరంలోని పిట్టను ఎగరేసి, గురి చూసి కాల్చినట్టు వేటాడుతున్నది.

ఇటీవల సైదాబాద్ సింగరేణి కాలనీలో భవన నిర్మాణ కార్మికుడు రాజు అనే వ్యక్తి సెప్టెంబర్ 9న ఆరేళ్ల చిన్నారిపై ఒడి గట్టిన దారుణానికి నాలుగు రోజులు అటు ఇటుగా జగిత్యాలలో ఇద్దరు బాలికలు, హైదరాబాద్ హాబీబ్‌నగర్ లో ఒక చిన్నారి అత్యాచారానికి గురి కాగా, రంగారెడ్డి జిల్లా శివారులో ఒక పారిశుధ్య కార్మికురాలు, జవహర్ నగర్‌లో వ్యవసాయ కూలీ పనికి వెళ్లిన మరో మహిళా అత్యాచారాలకు, హత్యలకు గురయ్యారు. మాది స్త్రీని దేవతగా పూజించే సంస్కృతి అని చెప్పుకునే హిందూ మతోన్మాద, భూస్వామ్య వర్గాల ప్రతినిధులు ఉత్తరాది రాష్ట్రాల్లో బలహీన వర్గాల స్త్రీలపై విచ్చలవిడి అత్యాచారాలకు తెగబడుతున్నారు.

లైంగిక చర్యల దృశ్యాల్ని వీడియో తీయడం, వాటితో తిరిగి బ్లాక్ మెయిల్ చేయటం ఈ రోజు స్త్రీలపై ఒక కొత్త ఆయుధం. మహారాష్ట్రలోని థానే జిల్లాలో ప్రేమ పేరుతో ఒకడు 15 ఏళ్ల అమ్మాయిని మోసగించి లైంగికంగా లోబరుచుకుని వీడియో తీశాడు. ఆ వీడియోతో బ్లాక్ మెయిల్ చేస్తూ వాడితో పాటు వాడి స్నేహితులైన 33 మంది వ్యక్తులు గత జనవరి నుండి సెప్టెంబర్ వరకు ఆ అమ్మాయి పై వివిధ స్థలాల్లో పలుమార్లు అత్యాచారం జరిపారు. సమాజంలో నైతిక విలువల పతనం, ఆడపిల్లల దుస్థితి ఈ స్థాయికి పతనమైంది. 'నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో' నివేదిక ప్రకారం కూడా దేశ వ్యాప్తంగా, అలాగే తెలంగాణలో కూడా చిన్నపిల్లలపై, మహిళలపై లైంగిక వేధింపులు, అత్యాచారాలు, హత్యలు పెరిగాయి.

నిజానికి, లైంగిక నేరాలు ఫిర్యాదులుగా, ఫిర్యాదులు కేసులుగా మారితేనే మీడియాలో వస్తాయి. అలా బయట ప్రపంచం వరకు రాలేనివి ఇంతకు కనీసం కొన్ని పదుల రెట్లు ఎక్కువ ఉంటాయి. ప్రతిరోజు ఎన్నో సంఘటనలు జరుగుతున్నప్పటికీ సెన్సేషనల్‌గా మారిన, మరీ క్రూరంగా, భరించలేని విధంగా ఉన్న అత్యాచార కేసుల్లో మాత్రం ప్రజలు కొన్నిసార్లు ఆవేదనతో నిరసన తెలుపుతున్నారు. తిరిగి ఇలాంటి సంఘటనలు జరగకుండా ఉండాలంటే నేరాలకు పూనుకునేవారు భయపడే విధంగా మరింత కఠినమైన చట్టాలను రూపొందించాలని, సత్వర విచారణతో కఠినమైన శిక్షలు వేయాలని డిమాండ్ చేస్తున్నారు. పట్టుకుని ప్రజల ముందు ఉరితీయాలని, నపుంసకులుగా మార్చాలని, 'ఎన్‌కౌంటర్' చేయాలని కూడా డిమాండ్ చేస్తున్నారు.

బాధితుల బంధువులు, సానుభూతిపరులు తమకు తక్షణ న్యాయం జరగాలని ఇటువంటివి కోరటాన్ని సానుభూతితో అర్థం చేసుకోవచ్చు. కానీ సమస్య మూలాలు తెలిసి ఉండాల్సిన రాజకీయ నాయకులు, రాజ్యాంగంపై ప్రమాణం చేసిన వారు కూడా అవే డిమాండ్లు చేస్తూ అవే విధానాలు ప్రకటిస్తున్నారు. ఇటువంటి రాజకీయ నాయకులు పూర్తిగా బుద్ధి హీనులు లేదా ప్రజల్ని గొర్రెలుగా భావించే మోసకారులు. నిజమైన ప్రజాస్వామ్య వ్యవస్థ అయితే వాస్తవంగా ఇటువంటి వారిని రాజకీయాల నుండి తొలగిస్తుంది. కానీ మన దగ్గర ప్రధాన స్రవంతి రాజకీయ నాయకుల్లో మెజారిటీ ఇదే బాపతు ఉన్నారు.

నేరాలూ, వాటికి శిక్షల గురించి మాట్లాడితే అత్యాచారాలు, హత్యలకే కాదు ఏ నేరాలకైనా తగిన విధంగా శిక్షలుండాల్సిందే. కొన్ని నేరాలకు కఠినమైన శిక్షలు కూడా ఉండాల్సిందే. నేరంలో ఒక వ్యక్తి పాత్రతో పాటు సమాజంలో ఆ వ్యక్తిని ఆ నేరానికి ప్రేరేపించిన కారకాల పాత్ర కూడా ఉంటుంది. కారకాలను వదిలేసి వ్యక్తిని మాత్రమే శిక్షిస్తే సగం నేరస్థున్ని వదిలేసినట్టే అవుతుంది. అలాగే వ్యక్తులను కూడా కఠినమైన చట్టాలతో, అంతకంటే కఠినమైన శిక్షలతో లేదా అప్పుడప్పుడూ కొంతమందిని చంపేయటంతో మనుషుల ఆలోచనలు, ఆచరణలు మారి సమాజంలో ఇక నేరాలు జరగకుండా

ఆగిపోతాయా? ఆగిపోవటం కాదు, కనీసం నేరాలు తగ్గిన దాఖలాలు కూడా మన దగ్గర లేవు. అత్యాచారాలు, హత్యలతో బాటు తీవ్రమవుతున్న సకల సామాజిక సమస్యలకు మూల కారణాలు ఏమిటన్న విషయాన్ని శాస్త్రీయంగా పరిశీలించాలి.

వరిపాలకులే పెట్టుబడిదారులుగా, పెట్టుబడిదారులే పరిపాలకులుగా దేశంలో రాజకీయాలు నడుస్తున్నాయి. అవినీతే వారి నీతి. ఆస్తులు, డబ్బు సంపాదన, అధికారం, ఆధిపత్యమే వారి పరమావధి. వారు అమలు చేస్తున్న సామ్రాజ్యవాద, ప్రపంచీకరణ విధానాల వల్ల దేశంలో సాపేక్ష పేదరికం, అభద్రతా, అశాంతీ, ఆత్మహత్యలూ పెరుగుతున్నాయి. స్త్రీలపై లైంగిక దాడులు, అత్యాచారాలు తీవ్రతరమవుతున్నాయి. ఇవి గత కాలపు భూస్వామ్య, పురుషాహంకార సంస్కృతి నేపథ్యంలో స్త్రీలపై జరిగే గృహ, సామాజిక హింసలకు అదనం.

సామ్రాజ్యవాద ఆర్థిక వ్యవస్థ పెంచుతున్న వస్తు వ్యామోహం మనుషులను ముఖ్యంగా యువతీ యువకులను విచక్షణకు లోబడి ఉండనీయడం లేదు. మారుతున్న ట్రెండుకు తగినట్లు తమ కోరికలు తీర్చుకునేందుకు గౌరవప్రదమైన పనుల నుండి వచ్చే వేతనాలు వారికి సరిపోవటం లేదు. కొంతమంది యువతీ యువకులు రకరకాల షార్ట్ కట్ సంపాదనలకు, అనైతిక పనులకు, కొన్నిసార్లు దొంగతనాలకు కూడా దిగుతున్నారు.

చాలా మంది యువకులు మద్యానికి, మాదకద్రవ్యాలకు బానిసలవుతూ విచక్షణ, మానవత్వం కోల్పోయి తాము ఏం చేస్తున్నారో తమకు తెలియని స్థితికి చేరుతున్నారు. ఈ పరిస్థితులన్నీ ముఖ్యంగా యువకులను క్రమశిక్షణ లేని అరాచకపు మూక (లంపెన్ గ్రూపు) గా మారుస్తున్నాయి. వీరు ఎటువంటి నేరమైనా చేయటానికి సిద్ధంగా ఉంటున్నారు. వీరంతా తల్లిదండ్రులకు, సమాజానికి తలనొప్పిగా తయారవుతుండగా కొందరు రాజకీయ నాయకుల చేతి కిందకు, మరికొందరు రౌడీల, గూండాల చేతి కిందకు చేరుతున్నారు. ఈ పరిణామాలన్నీ సమాజంలో బలహీనులపై ముఖ్యంగా స్త్రీలపై అఘాయిత్యాలు పెరగటానికి దోహదం చేస్తున్నాయి.

ఇక సినిమాల్లో విచ్చలవిడి ముద్దులు, అర్ధనగ్న, అంగాంగ ప్రదర్శనలు, రేప్ సీన్లు, తదితర అశ్లీల దృశ్యాలు 'అత్యాచార' నేరాలను సాధారణ విషయాలుగా మారుస్తున్నాయి. అన్నిటికన్నా ప్రమాదకరమైనది నీలి చిత్రాల అందుబాటు. స్మార్ట్ ఫోన్ల పుణ్యమా అని అవి ప్రతి మనిషికీ ఒక క్లిక్ దూరంలోకే వచ్చేశాయి. వ్యాపార ప్రకటనల్లో ఎప్పటిలాగే మహిళల సౌందర్యాన్ని, శరీరాన్ని పూర్తిగా లైంగిక కోణంలోనే చూపిస్తున్నారు.

సామ్రాజ్యవాద విష సంస్కృతిలో భాగమైన సినిమాలు, టీవీ ఛానల్లు, ఇంటర్నెట్లు, స్మార్ట్ ఫోన్లు, క్లబ్బులు, పబ్బులు, రేవ్ పార్టీలు, బ్రోతల్ హౌస్‌లు, బ్రాందీ షాపులు, బార్లు,బెల్టుషాపులు అన్నీ ప్రజలను ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా పతనం చేస్తున్నాయి. పీకలదాకా తాగి, బైక్‌లు, కార్లలో అతి వేగంగా దూసుకుపోతూ ఆక్సిడెంట్లలో చావటమో, చంపటమో సాధారణమైపోయింది. మద్యం, మాదక ద్రవ్యాలు సేవిస్తూ యువతీ యువకులు ఊగిపోతూ మానసిక శారీరక వాంఛ తీర్చుకోవడం ఫ్యాషన్‌గా భావిస్తున్నారు.

చిటికెడంత చిన్న పరిమాణాల్లో సేవించే మాదకద్రవ్యాలు కిలోల లెక్కన పట్టుబడటం దాటిపోయి ఓడరేవుల్లో భారీ కంటెయినర్ల లెక్కన దొరుకుతున్నాయి. ఒకేసారి ఇరవై ఒక్క వేల కోట్ల విలువైన మూడు వేల కిలోల హెరాయిన్ ఇటీవల గుజరాత్‌లోని ఒక ఓడ రేవులో బయటపడిందంటే మాదక ద్రవ్యాల సరఫరా ఏ స్థాయిలో జరుగుతుందో అర్థం చేసుకోవచ్చు. ఇవన్నీ ప్రభుత్వాలకు తెలియకుండా జరగటం లేదు. ఓడరేవులు, ఎయిర్‌పోర్టులు, విమానాలు మొదలగు ట్రాన్స్‌పోర్ట్ వ్యవస్థ అంతా ప్రైవేటు పరమైపోతూ ఉంటే మాదకద్రవ్యాల రవాణా మరింత సులభం కాగలదు. గంజాయి వంటి మాదక ద్రవ్యాలు ధనవంతుల వాడలు దాటి పేదోల్ల బస్తీలు, విద్యాసంస్థలు, పాన్ టేలాలు, కిరాణా షాపులలో సైతం దొరికే నిత్యావసర సరుకులుగా మారాయి. వీటి పరిణామాలు భవిష్యత్తులో మరింత భయంకరంగా ఉండగలవు.

చదువుకున్న యువతీ యువకులకు భద్రతతో కూడిన ఉద్యోగావకాశాలు పూర్తిగా మూసుకుపోతున్నాయి. అటువంటి ఉద్యోగాల్లో ఉన్నవారే లక్షలాదిగా రోడ్డున పడుతున్నారు. ఇక గ్రామీణ ప్రజలకు పాత ఉపాధులు పోయాయి. స్థానికంగా కొత్త ఉపాధి అవకాశాల కల్పన జరగలేదు.

జీవనోపాధి కోసం కూలి పనులు వెతుక్కుంటూ గ్రామీణ యువతీ యువకులు, పసి పిల్లల్ని పట్టుకుని కుటుంబాలకు కుటుంబాలు ఇళ్లను, పల్లెలను, జిల్లాలను, రాష్ట్రాలను వదిలిపెట్టి పట్టణాలు, నగరాలకు వలసలు వెళ్తున్నారు. అందరూ నూతన ఆర్థిక విధానాల వల్ల ఉపాధి కోల్పోయిన మైదాన, గిరిజన ప్రాంత పేదలు. వీరంతా తమకు తెలియని కొత్త ప్రదేశంలో అన్నిరంగాలకూ చవకగా దొరికే అడ్డా కూలీలుగా, కాంట్రాక్టు కార్మికులుగా మారిపోతున్నారు. వీరు పని చేసే అన్ని స్థలాలూ అసౌకర్యాలు, శ్రమ దోపిడీ, అణచివేతలకు ఒక్కోసారి హత్యలకు కూడా నిలయాలు. ఇవే పని స్థలాల్లో స్త్రీల పరిస్థితి ఊహించు కోవాల్సిందే. లైంగిక దోపిడీ, అత్యాచారాలు ఇక్కడ నిత్యకృత్యాలు. ఉపాధి కల్పించే పేర కూడా యువతులను ట్రాప్ చేసి వ్యభిచారంలోకి దింపటం, అక్రమ రవాణాకు గురిచేయటం కూడా జరుగుతున్నది.

ఇవన్నీ ఇటీవలికాలంలో మారిన నూతన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విధానాల ఫలితాలు. దాంతో మనుషులు తమ నాగరికత పరిణామ క్రమంలో పెంచుకున్న సహకార సంస్కృతి, సమిష్టి ప్రయోజనాల పరరక్షణ, నైతిక ఆచరణ, సహానుభూతి వంటి పురోగామి మానవీయ విలువలన్నీ క్రమంగా తమ ఉనికిని కోల్పోతున్నాయి. ఫలితంగా సామాజిక సంబంధాలన్నీ నేరమయంగా, రక్తం కనిపించని హింసామయంగా మారుతున్నాయి. సహజంగానే సామాజికంగా, సాంస్కృతికంగా, శారీరకంగా, ప్రభుత్వ మద్దతు పరంగా బలహీనుల్లో కెల్లా బలహీనులైన స్త్రీలు ఈ హింసను అనుభవించే వారిలో మొదటి వరుసలో ఉంటున్నారు.

ఈ మూల కారణాలన్నీ వదిలేసి మన ప్రతాపాన్నంతా బలహీన వర్గాలకు చెందిన కొంతమంది నేరస్తులపై చూపించి సంతృప్తి చెందితే మనం పాలక వర్గాల బుట్టలో పడ్డట్టే అవుతుంది. మనుషులను

# చైనా కమ్యూనిస్టు పార్టీ సమీక్ష-మంత్లీరివ్యూ పునరాలోచన

**- ఎం. సజయ**

'వాస్తవాల ఆధారంగా సత్యాన్వేషణ మార్క్సిజంలో కీలకాంశం' అన్నారు మావో. దానికి పూర్తి విరుద్ధమైన పద్ధతిలో విశ్లేషణలు చేయడం మన పెద్దలకు అలవాటైంది. దానికి తాజా ఉదాహరణ 'కమ్యూనిస్టు సారంలేని చైనా కమ్యూనిస్టు పార్టీ' అంటూ సివిఎస్ఆర్ ప్రసాద్ ఆ పార్టీ శతాబ్ది ఉత్సవాల సందర్భంగా రాసిన వ్యాసం (వీక్షణం సెప్టెంబర్ 2021). బహుళ ప్రచారంలో ఉన్న పాత వాదనే. అది వారి దృక్పథం, వారిష్టం. అయితే దీనికి పాత అవాస్తవాలు, పాత వక్రీకరణలనే ఆధారంగా చూపెట్టారు. ఆయా అంశాలను 'వీక్షణం'లోనే లోగడ (2018 జూన్ అక్టోబర్ డిసెంబర్, 2019 ఫిబ్రవరి మొదలగు) పలువురు చేసిన విమర్శలలో ఎత్తిచూపటమైనది. అలాంటి వాస్తవాలను పరిగణనలోకి తీసుకొని తమ వాదన వినిపిస్తే సబబుగా ఉంటుంది. అది పద్ధతి కూడా. ప్రసాద్ వంటి సీనియర్లు, రాజకీయ తరగతులు చెప్పేవారు, అంతకన్నా ముఖ్యంగా సీరియస్ పాఠకులు ఈ విషయాలను జాగ్రత్తగా, ఓపిగ్గా తిరిగి పరిశీలించడం అవసరం. ఇది ప్రసాద్ గారి వ్యాసంపై చర్చే కాదు. చైనా ప్రబల శక్తిగా ఉన్న నేటి ప్రపంచంలో పెను మార్పుల అధ్యయనానికి పురికొల్పటానికి కొన్ని అంశాలకే పరిమితం ఈ వ్యాఖ్య:

**'మంత్లీరివ్యూ' పత్రిక పునరాలోచన**

చైనా కమ్యూనిస్టు పార్టీ శతాబ్ది సమీక్షలు కొందరు చేస్తుంటే, దానికి 'నూరేళ్లు నిండాయని' కొందరంటున్నారు. ఇండియన్ పార్టీకి శతాబ్ది, నక్సల్బరీకి అర శతాబ్ది పూర్తయినా మనమెక్కడున్నామో ఆలోచించకుండా, వారి గురించి తుది తీర్పులు చెప్తున్నారు కొందరు - గురివింద తీరులో.

'భూమి మీద వ్యక్తిగత ఆస్తి హక్కు... రైతులకు సొంత భూ యాజమాన్యాన్ని కలిగిస్తూ చట్టాలు' అంటూ ప్రసాద్ రాశారు. సోషలిజానికి సంబంధించిన ఒక మౌలిక సమస్య ఇది. కాగా 'చైనాలో భూమి ప్రైవేట్ ఆస్తిగా లేదు, యావత్ దేశానికి చెందిన ప్రభుత్వ ఆస్తిగా ఉన్నది. ఇది చైనా నిర్దిష్ట లక్షణం. అందువల్ల సమకాలీన చైనాను మనం పెట్టుబడిదారీ అని సూత్రీకరించజాలము'- అని నొక్కి చెప్పారు ప్రసిద్ధ మార్క్సిస్టు సమీర్ అమీన్ (వీక్షణం అక్టోబర్ 2018). చైనా-2013 శీర్షికతో ఉన్న అదే ప్రతిపాదనను ప్రస్తావించి, అది చాలా మౌలికమైనదని, చైనా పార్టీని ఖండిస్తూ తాము ప్రచురించిన అనేకుల సిద్ధాంతాలను మళ్లీ సమీక్షించుకోవాల్సి వచ్చిందని మంత్లీరివ్యూ పేర్కొంది. జులై 2021లో వెలువరించిన ప్రత్యేక సంచికలో- చైనా పార్టీ వందేళ్ల సందర్భంగానే - ఈ విషయాలను చర్చించారు. ఇప్పటికీ ప్రశ్నలు చాలానే ఉన్నాయి కానీ, చైనా పార్టీని ఖండిస్తూ ఎవరైనా తుది తీర్పులు చెప్పడం భావ్యం కాదని వారు నొక్కి చెప్పారు.

ప్రసాద్ గారి వ్యాసం గురించే కాక, స్వయంగా మంత్లీరివ్యూ పునరాలోచనే గమనార్హమైన ఒక ముఖ్య విషయం. ఆ పత్రికదే ప్రమాణం కాదు కానీ-చాలా మంది విమర్శకులు అలాటి వాదనల ఆధారంగానే రాస్తూ వచ్చారు కనుక 'వీక్షణం' రచయితలు, పాఠకులు ఈ ప్రత్యేక సంచికను పరిశీలించడం అవసరం, భావ్యం.

చైనా పార్టీలో 'కమ్యూనిజం ఎంతమాత్రమూ లేదు' వంటి తుది తీర్పులు చెప్పారు ప్రసాద్. అక్కడ కమ్యూనిజం ఉందని ఎవరు చెప్పారు? ఆ పార్టీ కూడా చెప్పుకోలేదే. శాస్త్రీయ సోషలిజం కాక, ఊహాజనిత (ఉటోపియన్) సోషలిజం దృష్టితోనూ, పిడివాద దృక్కోణం నుంచీ చేసినది ప్రసాద్ విమర్శ అనడానికి ఇదొక్కటి చాలు. అంతేకాక అవాస్తవాల, వక్రీకరణల ఆధారంగా చేసిన విమర్శ కూడా. తమది 'ప్రాథమిక స్థాయిలోని సోషలిజమే'నని, 2050 నాటికి ఒక స్థాయికి చేరుకుంటామని వారే పదేపదే చెప్తున్నారు. వీటిని పరిశీలించే ముందు 'మంత్లీరివ్యూ' పునరాలోచననే కొంత చూద్దాం. ప్రస్తుత చర్చకది తోడ్పడుతుంది కాబట్టి.

మావో అనంతర చైనా పార్టీ గురించిన తమ విశ్లేషణల్లో మార్పుల

---

విస్థాపితులుగా, నిరుద్యోగులుగా తాగుబోతులుగా, లంపెయిండ్లుగా, సెక్స్ ఉన్మాదులుగా మార్చి, నేరాలు చేయగలిగే పరిస్థితులు సృష్టిస్తూ మీరు నేరాలు చేశారని కొందరిని శిక్షించడం కాదు ప్రభుత్వాలు చేయాల్సింది. ప్రజలుగా మనం కోరేది కూడా అది కాదు. దోపిడీ, పీడన, అసమానతలు, అత్యాచారాలు, హత్యలు లేని ఆరోగ్యకరమైన ప్రజాస్వామికమైన మానవ సమాజం ప్రజలకే కాదు పాలకులకు కూడా లక్ష్యంగా ఉండాలి. కానీ అందుకు పూర్తి విరుద్ధమైన మార్గంలో సమాజం ఉన్నది. మనం మన ప్రయాణాన్ని సరైన దిశకు మార్చుకోవాలి. సమస్యలతో తల్లడిల్లుతున్న ప్రజలకు సమస్యల మూలకారణాలను, పరిష్కారాలను వివరిస్తూ, సామాజిక చైతన్యాన్ని కల్పిస్తూ పాలకుల విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమాలు సాగించే కార్యక్రమాలు ప్రజాసంఘాలకు ఉండాలి. అలా కవులు, రచయితలు, కళాకారులు, మేధావులు, ప్రజాస్వామిక వాదులు తమ కలాలను, గలాలను ఎక్కుపెట్టాలి. బలమైన ప్రజా ఉద్యమాలను నిర్మించాలి. ప్రజలు కూడా, తమ భవిష్యత్తును స్వార్థపరులకు అప్పగించి అప్పుడప్పుడు మాత్రం ఆవేశపడి సరి పెట్టుకోకుండా, ఉత్తమ సమాజం కోసం ప్రజా ఉద్యమాల్లో నిరంతరం భాగస్వాములు కావాలి. అలా ప్రజలు తమ భవిష్యత్తుకు తామే దిశా నిర్దేశం చేసుకునే సమాజంలోనే మహిళలే కాదు బలహీనులందరూ సురక్షితంగా ఉండగలరు.

*(రచయిత ప్రజాస్వామిక వాది)*

గురించి చెప్తూ, 'వాస్తవాలు మారినప్పుడు నా అభిప్రాయాన్నీ మార్చుకుంటాను. ఏమి చేయమంటారు సార్' అన్న కీన్స్ కొటేషన్‌తో తమ సంపాదకీయాన్ని మొదలు పెట్టారు. మారుతున్న పరిస్థితులు, చైనాలో ఇకలాజికల్ మార్క్సిజం, స్వయంగా గ్లోబల్ వేల్యూ చైన్ పై తమ రిసెర్చి, అన్నిటికన్నా పైన పేర్కొన్న సమీర్ అమీన్ 'చైనా-2013' వ్యాసం – ఇవన్నీ చైనా పట్ల మా (నెగెటివ్) అభిప్రాయాలను మళ్లీ సమీక్షించుకోవాల్సిన స్థితిని కల్పిస్తున్నాయి – అని ఆ సంపాదకీయంలో రాశారు. చైనా సామ్రాజ్యవాద దేశంగా మారింది అని చెప్పే వాదనలను ప్రచురించిన మన్త్లీరివ్యూ ఆ విషయాన్ని కూడా మళ్లీ పరిశీలించాలని ఈ సంచికలో నొక్కిచెప్పారని గమనించాలి.

చైనా పార్టీ 'మార్క్సిస్టు మౌలిక సూత్రాలనే', 'సామ్రాజ్యవాదం అనే పదాన్నే తమ అవగాహన నుంచి వదిలేసిందం'టూ ప్రసాద్ విచిత్రంగా ఆరోపించారు! ఇది పూర్తి వాస్తవ విరుద్ధం. తగదుకాక తగదు. 2014లో సవరించిన తాజా రాజ్యాంగంలో సైతం 'సామ్రాజ్యవాదాన్ని', దానికి వ్యతిరేకంగా నిరంతర పోరాటాన్ని ప్రస్తావించారు. చైనా పార్టీ 'అంతర్జాతీయ సంబంధాల లక్ష్యం' అన్న డాక్యుమెంటు (2007)లోనూ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలకు దోహదం చేయడమే లక్ష్యం అని వివరించారు. నిజానికిది పదం సమస్య కాదు. తాము మార్క్సిజం-లెనినిజానికి కట్టుబడి ఉన్నామని పదేపదే చెప్తూనే ఉన్నారు. సామ్రాజ్యవాదం అన్న మౌలిక అవగాహన లేకుండా మా.లె. సిద్ధాంతం లేదు.

ఈ నూరేళ్లలో – ముఖ్యంగా ఇటీవలి దశాబ్దాల్లో – చాలా మార్పులు జరిగాయి. సామ్రాజ్యవాదం మరణశయ్యపై ఉన్నదని లెనిన్ నూరేళ్ల క్రితం చెప్పారు. కానీ నేటికీ సామ్రాజ్యవాదం చాలా బలీయమైన శక్తిగా, చైనా నాశనాన్ని కోరుకొనేదిగా ఉన్నది. దానిని కూడా గ్రహించలేని స్థితిలో చైనా పార్టీ ఉందనుకోవడం అవివేకం!

1974లో మావో మూడు ప్రపంచాల సిద్ధాంతం ప్రతిపాదించారు. (ఆయన ప్రతిపాదించలేదని నిరాధారంగా వాదించేవారూ ఉన్నారు. అది అప్రస్తుతం.) అందులో అగ్రరాజ్యాల ఆధిపత్యవాదాన్ని ఒంటరి చేయడం, మూడవ ప్రపంచ దేశాలు ప్రధాన శక్తిగా ఐక్యసంఘటన నిర్మించడం, దానికి తోడుగా సామ్రాజ్యవాద శిబిరంలోనే ఉన్న రెండో ప్రపంచ దేశాలను తటస్థం చేయడం, కలుపుకురావడమూ అన్న వ్యూహాన్ని ప్రతిపాదించారు. రాజ్యాల మధ్య సంబంధాల సమస్య కూడా ఉన్నది. అందువల్ల ఆధిపత్యవాదం అన్నపదం ఎక్కువగా వాడుతున్నారు.

ప్రసాద్ గారికి పూర్తి విరుద్ధంగా – 'చైనా నాయకత్వం అనుసరిస్తున్న 'సామ్రాజ్యవాద వ్యతిరేక సావరీన్ ప్రాజెక్టు', సోషలిజంతో వ్యవస్థాత్మక సంబంధం కొనసాగుతూండడం – ముఖ్యంగా వీటితో మన్త్లీరివ్యూ ఇటీవలి దృక్పథం మారుతూ వస్తున్నది' అని రాశారు సంపాదకీయంలో. సంపాదకుడు జాన్ బెల్లామీ ఫాస్టర్ అమెరికా సాగిస్తున్న 'చైనా వ్యతిరేక న్యూ కోల్డ్ వార్' గురించి సుదీర్ఘ వ్యాసంలో కూడా పునరాలోచన చేశారు. 'చైనా అభివృద్ధి పంథా మొత్తం సామ్రాజ్యవాద వ్యతిరేకతతో ముడిపడి ఉన్నది' – విదేశాంగ ఆర్థిక, రాజకీయ విధానాలతో సహా – అని విశ్లేషించారు. 'అమెరికా నేతృత్వంలోని ప్రపంచ ప్రతీఘాత విప్లవం – చైనా మూడవ విప్లవం' అన్న ఉపశీర్షికతో చర్చించారు.

నెగెటివ్ లక్షణాలను ఎదుర్కొని – ముఖ్యంగా జిన్పింగ్ హయాంలో – చైనాలో సోషలిస్టు లక్ష్యం వైపుగా 'షిఫ్టు' ఉన్నదని, 'మరింత ఆర్థిక సమానత్వ, స్వయం సమృద్ధి, ఈకలాజికల్ సివిలిజేషన్, గ్రామీణ పునరుజ్జీవనం, సాంస్కృతిక అభివృద్ధి, విదేశీ మార్కెట్లపై – టెక్నాలజీపై ఆధారపడడాన్ని తగ్గించే 'డ్యూయల్ సర్క్యులేషన్' మోడెల్ – ఇవన్నీ కీలకమైనవని, చైనా ఆధునిక సోషలిస్టు సమాజంగా వికసించడానికి దోహదం చేస్తున్నాయని' – రాశారు. వివిధ రూపాల్లో ఉండే 'అసమాన అభివృద్ధిని పరిష్కరించడమే ప్రధాన వైరుధ్యంగా గుర్తించారని, అంత తేలికేమీ కాదు కానీ ఈ 'మూడవ విప్లవం' సమాజంలోని అన్ని స్థాయిలలోనూ సాగుతున్న విస్తృత పోరాటాల్లో' కనిపిస్తున్నదని రాశారు. ఈ 'విప్లవాన్ని' నమ్మలేక, అమెరికా మొదలైన సామ్రాజ్యవాదులు 'షాక్‌తో, క్రోధంతో రగిలిపోతున్నారని' పేర్కొన్నారు. వారికున్న కోల్డ్ వార్ ధోరణిని, అణ్వాయుధాలను ప్రస్తావిస్తూ ప్రపంచ జనాభా 'ఇంతకు ముందెన్నడూ లేని ప్రమాదాన్ని' ఎదుర్కొంటున్నారని 87 రిఫరెన్సులతో, వాస్తవాల ఆధారంగా సుదీర్ఘ సమీక్ష రాశారు.

'వ్యక్తిగత ఆస్తిగా భూమి' వల్ల చైనాలో – ముఖ్యంగా గ్రామాల్లో – 'నిరుద్యోగుల రిజర్వు సైన్యం తయారైంది' అని, 'ప్రభుత్వం వారందరినీ పెద్ద ఎత్తున పట్టణాలకు తరలించింది' అని 'సిద్ధాంతం' రాశారు ప్రసాద్ – వాస్తవాలను(సమీర్ అమీన్ని) విస్మరించి! సామ్రాజ్యవాదమూ, వారి టెక్నాలజీల ప్రాబల్యంలో ఉన్న నేటి ప్రపంచంలో నిరుద్యోగం విశ్వవ్యాప్తమైన తీవ్ర సమస్య. అయినా సాపేక్షికంగా చైనాలో బాగానే పరిష్కరిస్తున్న సమస్య ఇది. ప్రసాద్ గారిది వాస్తవ విరుద్ధమైన, చెల్లని వాదన. 'ఇండియాలో 2008లో మొత్తం పబ్లిక్ రంగ ఉపాధి 173 లక్షలు మాత్రమే, 'ప్రైవేట్ రంగాన్ని కలిపినా మొత్తం నిర్మాణ, ఇతర రంగాల ఉపాధి 275 లక్షలు, కాగా ఐఎల్ఓ ప్రకారం 2007లో చైనాలో ఉపాధి పొందిన వికలాంగుల సంఖ్య 213 లక్షలకు చేరింది (గ్రామీణ 170, పట్టణ 43). చైనాలో వికలాంగుల ఉపాధి స్థాయితో పోటీపడే దేశంలో ఉంటూ ఇలాంటి విమర్శలు చేయడం సబబా? ప్రపంచంలోని ఏ ఇతర దేశంతో పోల్చినా చైనాలో నిరుద్యోగ సమస్యను సమర్థవంతంగా ఎదుర్కొంటున్నారు.

గ్రామీణ నిరుద్యోగులను పెద్ద ఎత్తున పట్టణాలకు తరలించారని, కొత్తగా వచ్చిన వీరితో పాత కార్మికులకు ఇబ్బంది, దానివల్ల 'కొత్త వైరుధ్యం తలెత్తింది', దీని ఆసరాగా శ్రమ దోపిడీ ఇతోధికమైంది అని రాశారు. ఇది వాస్తవ విరుద్ధమే కాక, సిద్ధాంత పరంగా కూడా చెల్లని వాదన. పట్టణాల్లో ఉపాధిలో కూడా చైనా ఇతర దేశాలన్నింటికన్నా చాలా మెరుగ్గా ఉంది. ఆధునిక యుగంలో టెక్నాలజీ అభివృద్ధి, దానితో పాటు జనాభా పెరిగినా కొద్దీ – గ్రామీణ, వ్యవసాయ రంగాల నుంచి పట్టణ – పారిశ్రామిక రంగాల్లోకి జనాలను తరలించడం అవసరం, అనివార్యం అన్నది 'పొలిటికల్ ఎకానమీ'లో ఒక మౌలికాంశం. పెట్టుబడిదారీ పద్ధతిలో ఇది దారుణంగా, నిర్దాక్షిణ్యంగా, దుఃఖపూరితంగా ఉంటుంది. ఈ తరలింపుని వీలైనంత

ప్రణాళికాబద్ధంగా ప్రజల్ని బాధించకుండా చేపట్టడమే సోషలిజం విశిష్టత అని మార్క్స్, లెనిన్ వివరించారు. ఆ పనే చైనాలో చేస్తున్నారు. మోసపూరితమైన పద్ధతులలో శాతాలు, పెరుగుదల రేట్లతో ఉపాధి లెక్కలని చూపెట్టే బూటకపు గణాంకాల పద్ధతి ఒకటుంది. అలాకాక వాస్తవ వివరాల ఆధారంగా సాపేక్షికంగా పోల్చి చూస్తే సత్యం బోధపడ్తుంది.

చైనాలో నగరాల నుంచి గ్రామాలకు 'రివర్స్ మైగ్రేషన్' ఒక ధోరణిగా 2015 నాటికే ప్రారంభమైందని అధికారిక గణాంకాలను ఉటంకిస్తూ బిజినెస్ ఇన్సైడర్ ఇండియా (2016 మే 4) రిపోర్ట్ చేసింది. పెద్ద నగరాల్లో జనాన్ని, గ్రామీణ - పట్టణ ఆదాయాల మధ్య అంతరాన్ని తగ్గించడానికిది తోడ్పడుతుందని బ్లూమ్ బెర్గ్ వ్యాఖ్యానించింది. గ్రామీణ పునరుజ్జీవనానికై చైనా పార్టీ 19వ మహాసభ (2017) పిలుపు, మార్గదర్శకాలు, 'కొత్త అభివృద్ధి నమూనా'లతో ఈ 'ధోరణి' స్థిరపడిందని, 70 లక్షల మంది శ్రామికులు గ్రామాలకు తిరిగి వచ్చారని, అందులో 70 శాతం లోగడ నగరాలకు తరలివెళ్లిన వారేనని చైనా డైలీ (2018 డిసెంబరు 28) పేర్కొన్నది.

గ్రామాల్లో ఉపాధికి ప్రాధాన్యతనిచ్చే ఫైనాన్సింగ్, ట్రెయినింగ్, వ్యవసాయ అనుబంధ (పశుపోషణ, ప్రాసెసింగు), సైన్స్ - కల్చర్ - ఎకో టూరిజం మొదలైన విధానాలను ప్రస్తావించింది. ఈ ధోరణి రాగల సంవత్సరాల్లో పెరుగుతుందని ఆర్థిక వేత్తలు చెప్తున్నారని అధికారిక గణాంకాలతో తాజా విశ్లేషణలు పాశ్చాత్య మీడియాలో (వాల్ స్ట్రీట్ జర్నల్ 17.11.2020, సిఎన్‌బిసి 28.6.2021) వెలువడినాయి. గ్రామాల్లో మౌలిక వసతుల (ఇన్ఫ్రాస్ట్రక్చర్) పెంపు, పేదరికం నిర్మూలనకై చర్యలు ఈ ధోరణితో ముడిపడిన తీరుని విశ్లేషించారు. గత ఆరేళ్లుగా స్థిరపడిన ఈధోరణికి కొవిడ్, ఈ-కామర్స్ ఇంకా దోహదం చేశాయి. ఇవన్నీ సోషలిజాన్ని బలపరిచే చర్యలన్నది విదితమే.

**గ్లోబలైజేషన్ - టెక్నలాజికల్ రివల్యూషన్ చైనా వ్యూహమూ-ఎత్తుగడలు**

గ్లోబలైజేషన్ పరిణామం ప్రపంచ ఆర్థికాన్ని, సామ్రాజ్యవాద స్వరూప స్వభావాలను, సంబంధిత రాజకీయాల్ని ప్రగాఢమైన మార్పుకి లోనుచేసింది, చేస్తున్నది. వివిధ సామ్రాజ్యవాద దేశాల పెట్టుబడుల సంలీనవిలీనాలు మొదలయినవి, 'ఇది ఫలానా సామ్రాజ్యవాద దేశపు బహుళజాతి కంపెనీ' అని చెప్పడానికి వీలులేని రీతిలో విలీనాలు, స్థానిక దళారీ పెట్టుబడులతో విడదీయరాని రీతిలో విలీనాలు మొదలగువి జరుగుతున్నాయి. బ్రూక్ బాండ్ ఇండియా, వాల్ స్ట్రీట్ చైనా వంటి పేర్లతో సంస్థలూ, వాటిలో మరొక దేశ షేర్లు ఇలా నానాటికీ సంక్లిష్ట రూపం దాల్చుతూ పెరుగుతున్నాయి. భారీ రక్షణరంగ ఎంఎన్‌సిల్లో కూడా ఇది కనపడుతున్నది.

1970-1980-90లలో మూడవ ప్రపంచ యుద్ధం సంభవిస్తుందా అన్న చర్చ విస్తృతంగా సాగింది. దానికి సంసిద్ధమవుతూనే యుద్ధాన్ని నివారించడానికి, ప్రపంచ శాంతికి కృషి చేసే లక్ష్యం (చైనా) ముందుకు వచ్చింది. ప్రపంచ యుద్ధం రాకపోయినా, పరోక్ష, ప్రాంతీయ యుద్ధాలు, 1990లలో -గల్ఫ్ యుద్ధాలు, యుగోస్లావియా విచ్ఛిన్నం, ఇరాఖ్ వంటి పరిణామాల తర్వాత సామ్రాజ్యవాద ఆధిపత్యవాదాన్ని వ్యతిరేకించే ప్రధాన కర్తవ్యం ముఖ్యంగా ముందుకు వచ్చింది. అదే కాలంలో ముందే రోగగ్రస్తమై, 1991లో పూర్తయిన సోవియట్ పతనం ప్రపంచంలోనే ఒక పెనుమార్పు. అక్కడా, తూర్పు యూరపులోనూ అధికార కమ్యూనిస్టు పార్టీలను రద్దు చేసుకున్నారు.

1989 విద్యార్థి తిరుగుబాటు ద్వారా అదే పరిణామం చైనాలోనూ జరుగుతుందని సామ్రాజ్యవాదులు ఆశించారు, దానికై ప్రయత్నాలు చేశారు, చేస్తున్నారు. దాన్ని 30 ఏళ్లుగా నివారించి నిలబడింది చైనా. ఒకవైపు గ్లోబలైజేషన్, మరోవైపు ఆధిపత్య జోక్యందారీ రెజీం చేంజి, యుద్ధ విధానాలు - వీటన్నిటికీ తగిన రీతిలో వ్యూహం - ఎత్తుగడలు రూపొందించుకుంటూ వస్తున్నది చైనా. పై పూర్వ రంగంలో చైనాలో విదేశీ పెట్టుబడిని ఆహ్వానించే, అనుమతించే విధానాలు (మావో దానికి బద్ధ వ్యతిరేకి కాదు, make foreign things serve China అని చెప్పారు. లెనిన్, స్టాలిన్ కూడా అమెరికా పెట్టుబడిని, 'కన్సెషన్లను' అనుమతించారు), కీలక పబ్లిక్ రంగ ప్రాబల్యంతో కూడిన సహకార - సమిష్టి రంగ, వ్యక్తిగత పరిశ్రమలతో సహా బహుళరంగ ఆర్థికాన్ని ప్రోత్సహించడం, ఈ విధంగా బహుముఖమైన open policy & reform ని ఒక సుదీర్ఘ వ్యూహంగా రూపొందించి, దానిలో ప్రయోగాత్మకంగా మార్పులు చేసుకుంటూ అనుమతిస్తున్నారు. దీనితో పాటు ఇదే కాలంలో హాంకాంగ్, మకావోలను - అవి శతాబ్దికాలం పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉన్న తర్వాత - మళ్లీ చైనాకు బదిలీ, ఆ సందర్భంగా యుద్ధాన్ని నివారించి, ఒక్క గుండు కూడా పేల్చకుండా స్వాధీనం చేసుకొని, 'గరళకంఠుడి' వంటి 'ఒకే దేశం - రెండు వ్యవస్థలు' అన్న అపూర్వ విధానాన్ని, పెట్టుబడిదారీ పాలనా విధానాన్ని సైతం అనుమతించడాన్ని చేశారు.

స్టాలిన్ - మావోల 1930-80ల కాలంతోను, ఐరన్- బ్యాంబూ కర్టెన్‌ల కాలంతోను పోలిస్తే, గ్లోబలైజేషన్, టెక్నలాజికల్, ఐటి-నెట్-ఏఐ విప్లవాల తర్వాత మహా వరదలా వచ్చిన, వస్తున్న మార్పులు అపూర్వం, అనూహ్యం, టెక్స్ట్ పుస్తకాలకు అతీతమైనవి. డెంగు, తర్వాతి మూడు తరాల నాయకత్వాలు వీటన్నిటినీ తట్టుకోవడమేకాక, ముందు వరసకు దూసుకు రావడం చైనా విజయమే కాదు, 'సోషలిజం - ప్రాథమిక పాఠాల' యుగం దాటి, సోషలిస్టు ప్రపంచ వ్యూహంలోనే కొత్త అనుభవాలు, కొత్త ప్రయోగాలు ఇవన్నీ. మళ్లీరివ్యూ వీటినే చైనాలో 'మూడవ విప్లవం'గా అభివర్ణించింది.

వియత్నాం, క్యూబా, ఉత్తర కొరియాలు చైనా సంస్కరణల నుంచి, వ్యూహాల నుంచి నేర్చుకున్నాయి. మార్చుకున్నాయి. ఆ మాటను తమ డాక్యుమెంట్లలో చెప్పి, రష్యా తూర్పు యూరపులవలె పతనం కాకుండా పెను మార్పుల మధ్య నిలదొక్కుకున్నాయి. 'దేశ - కాల నిర్దిష్ట పరిస్థితులకు అన్వయం' అనే వల్లింపులతో అయ్యేపని కాదు ఇదంతా. ఆచరణలో అన్వయించుకోవడమంటే ఇదే. ఇది వల్లించినంత తేలికైన పని కాదు. సంక్లిష్టమైన, అతి వేగంతో సాగుతున్న పెను పరిణామాల మధ్య చేపట్టిన ఈ క్రమంలో అనేక ప్రయోగాలు, పాఠాలు, సాఫల్య వైఫల్యాలు ఉన్నాయి. వాటితో అంగీకరించకపోయినా, శాపనార్థాలకు

బదులు వాటిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నం జరగాలి. మత్లీరివ్యూ అలా పునఃసమీక్ష చేసుకుంటున్నది. ఇక్కడా ఓపెన్ మైండ్‌తో వీటిని పరిశీలించి అర్థం చేసుకోవాలి. దానికి పిడివాదాన్ని వదులుకోవాలి. మార్క్సిజం అనుల్లంఘనీయమైనది కాదు, కార్యాచరణకు మార్గదర్శి అన్నారు లెనిన్.

### 'చైనా తరహా సోషలిజం' ఎందుకు? అందులో డెంగ్ పాత్ర

మావో కాలం నాటి నుండీ చైనా తనదైన నమూనానే - తనదైన విప్లవ పంథాను, సోషలిస్టు నిర్మాణ పంథాను - కలిగి ఉంటూ వచ్చింది. అదే ఈనాటికి కూడా కొనసాగుతూ ఉంది. దీనిని ఎలా అమలు చేయాలి అనే విషయంలో కూడా విభేదాలు ఎప్పుడూ ఉన్నాయి. వాటిని పరిష్కరించుకుంటూ వచ్చారు కూడా.

చైనాలో మొదటి నుంచీ రెండు పంథాల మధ్య పోరాటం ఉన్నది, అందువల్ల చైనా పార్టీ చీలికలకు గురికాకుండా ఉన్నది అని ప్రసాద్ చెప్పింది నిజమే. ఇందులో గమనించాల్సిందేమంటే పార్టీ మొదలైన దాదాపు 15 ఏళ్లు, 1950లలో కొంతకాలం, సాంస్కృతిక విప్లవం విషయంలో అప్పుడూ, ఆ తర్వాతా, సోషలిస్టు నిర్మాణం గురించిన అనేక అంశాల్లో మావో మైనారిటీలో ఉన్నారు. అలాగే డెంగ్ కూడా మైనారిటీలో ఉన్నారు. కేంద్రీకృత ప్రజాస్వామ్యం, సమిష్టి నాయకత్వ పద్ధతులు, ప్రజల నుంచి నేర్చుకోవడం - నేర్పడం ద్వారా చీలికలను నివారించి, నిర్ణయాలు తీసుకొని ముందుకు సాగారు. నేటికీ ఆ పద్ధతులనే అనుసరిస్తున్నారు. ఆ క్రమంలోనే డెంగ్, ఆయన మార్గమూ ముందుకొచ్చి, పార్టీలో నాయకత్వ స్థాయికి వచ్చాయి. మూడు తరాలుగా కొనసాగుతున్నాయి. దీన్ని గుర్తించే బదులు (ఒక దశలో మావోయే వద్దని వాదించిన) ముద్రలు వేసే పద్ధతిని అనుసరిస్తున్నారు విమర్శకులు.

కాగా మావో 'ఎక్కడా ఎప్పుడూ అప్రజాస్వామికంగా వ్యవహరించ లేదు' అన్నది కట్టెదుట వాస్తవాలను కాదనే తప్పుడు పద్ధతి. సాంస్కృతికం విప్లవం సందర్భంగా ఘోరాలు జరిగాయి. దానివల్ల వందలాదిగా చనిపోయారు. డెంగ్, జిన్ పింగ్ తండ్రి కూడా అందులో శిక్షలు అనుభవించారు. డెంగ్ 'కఠిన శ్రమ శిక్షను' కొన్నేళ్ల పాటు అమలు చేసి మళ్లీ వచ్చారు.

'మనకి' మావో వేదం, డెంగ్ విషం. విషమూ మందే. 1970లలో డెంగ్‌ని ఆహ్వానించి మావో స్వయంగా అభివృద్ధి పగ్గాలు అప్పచెప్పారని చాలా మందికి తెలియదు. ముద్రలు వేయడం తగదు అన్నారు మావో. కానీ అదే పనిచేస్తూ, డెంగ్, ఆ తర్వాతివారు ఏమి చెప్పారో కనీసం తెలుసుకోకుండా బల్లగుద్దడం అలవాటు 'మనకి'. అటు అమెరికన్ పాలకులూ, ఇటు మత్లీరివ్యూ వారూ ఆ తెలుసుకొనేపని చేస్తున్నారు. చైనాలో కూడా వేలాది మార్క్సిస్టులు అధ్యయనాలు చేస్తున్నారని గుర్తుంచుకోవాలి. తమని విమర్శించే, ఖండించే అనేక రచనలను పార్టీ వెబ్ సైట్‌లో సైతం అందుబాటులో ఉంచారు.

పై వ్యూహాలు, ఎత్తుగడలు చైనాలో మరింత అనివార్యమైనాయి. సిద్ధాంతాల్ని 'నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించుకోవాలి' అని వల్లె వేయడంతో వారి సమస్య తీరదు. అలా అన్వయించుకోవడంలో భాగంగానే 'చైనా తరహా సోషలిజం' అవసరమైంది. ఆ నిర్దిష్టతల్లో మౌలికమైనది ఇదీ: ప్రపంచంలో వ్యవసాయ భూమిలో 7 శాతం మాత్రమే ఉన్న చైనా ప్రపంచ జనాభాలో దాదాపు 25 శాతం మందికి ఆహారం, వసతులు, ఉపాధి కల్పించాల్సి వస్తున్నది. ప్రపంచంలోని 187 కోట్ల హెక్టార్ల సాగు భూములలో చైనాది 16.52 శాతం, అమెరికాది 16.78 శాతం, ఇండియాది 17.98 శాతం. చైనా జనాభాలో నాలుగో వంతులేని అమెరికాకి అంత భూమి ఉన్నది! ఇండియాది సమశీతోష్ణస్థితి ఐతే, చాలా విపరీత వాతావరణం కలవి చైనా భూభాగాలు. అమెరికా యూరపుల్లో 1 నుంచి 5 శాతం జనాభా మాత్రమే వ్యవసాయంలో ఉన్నారు.

ఈ విషయంలో ఇండియా చైనాలకు బాగా పోలికుంది. 1980 వరకు జనాభాలో 70 శాతం దాకా గ్రామీణ - వ్యవసాయ రంగాలపై ఆధారపడినవారే. సంస్కరణల ద్వారా చైనావారు తమకున్న కొద్ది భూమితోనే ఆ జనాభాని పోషించుకునే స్థితికి చేరుకున్నారు. వ్యవసాయంపై ఆధారపడిన జనాభాను ప్రణాళికాబద్ధంగా 50 శాతానికి తగ్గించుకున్నారు. వ్యవసాయ రంగంలోని ఆ ముఖ్యమైన పరిణామం పునాదితోనే పారిశ్రామిక, టెక్నికల్ అభివృద్ధి!

పొరుగున అమెరికా సహాయ సహకారాలతో ముఖ్యంగా 1980ల తర్వాత తైవాన్, కొరియా, హాంకాంగ్‌లలో (జపాన్‌కి తోడు) బాగా పారిశ్రామిక, టెక్నికల్ అభివృద్ధిని సాధించి, సోషలిజంకన్న పెట్టుబడిదారీ పద్ధతే మెరుగైన జీవితాన్నిస్తుందనే పోటీ ఏర్పడింది. ఈ క్రమంలోనే సోవియట్ పతనం వగైరా జరిగాయి. ఈ పరిస్థితులు, పరిణామాల మధ్యనే 'చైనా తరహా సోషలిజం' అనివార్యం, అత్యవసరం అయింది.

చైనాలో శ్రమ దోపిడీ అధికం అంటూ చైనా వ్యతిరేక నిపుణుల ప్రచారమే మీడియాలో కనిపిస్తుంది. గూగుల్‌లో 90 శాతం చైనా వ్యతిరేక వర్గాల సమాచారమే లభిస్తుంది. ఇంగ్లిష్‌లో అందుబాటులో ఉన్న మీడియా 90 శాతం పనికట్టుకొని చైనా వ్యతిరేక ప్రచారం సాగిస్తుంది. చైనా మీడియాని నమ్మం, సామ్రాజ్యవాద మీడియా తప్పదు ఇదీ మన పరిశీలకుల జ్ఞాన ప్రపంచం! చైనా వేతనాల రేటు ఎలా పెరిగిందో, అక్కడికన్నా ఇండియా, బంగ్లాదేశ్, దక్షిణ, ఆగ్నేయాసియాలలో విద్యా నైపుణ్యాలు కల లేబర్ చౌకగా ఎలా దొరుకుతున్నదో సామ్రాజ్యవాదులకు, పాలక వర్గాలకు బాగా తెలుసు. ఎంత అభివృద్ధి జరిగినా చైనా నేటికీ మూడవ ప్రపంచ దేశమే అని వారు నొక్కిచెప్తున్నారు. జి-8తో పాటు, జపాన్, గల్ఫ్ దేశాలకన్నా తలసరి ఆదాయం చాలా తక్కువ ఉన్న దేశం చైనా. అయినా చైనాలో లేబర్ రేట్లు ఇండియాలో కన్నా చాలా ఎక్కువ: నిపుణుడైన కార్మికుడి ఆదాయం షాంఘైలో ఏడాదికి 9,200, ఢిల్లీలో 3,100. డాలర్లు, షాంఘైలో ఏడాదికి 1,967 పని గంటలు, ముంబైలో 2,251 గంటలు. షాంఘైలో నెట్ పే గంటకు 5.4, ఢిల్లీలో 2.3 డాలర్లు. (వీక్షణం, జనవరి 2018, 2016 లెక్కలు). చైనాలో ఈ నాలుగైదేళ్లలో వేతనాల రేటు పెరిగిందే కాని తగ్గలేదు.

చైనా గ్రామాల్లో 'మౌలిక సదుపాయాల కల్పనపై వ్యయమూ',

విద్య, వైద్యం, గృహవసతి మొదలైన 'అవకాశాలు సన్నగిల్లిపోయాయి' అని, విద్యారంగం బాగోలేదని 'సిద్ధాంతం' చెప్తున్నారేకాని, వాస్తవ పరిస్థితి అధ్యయనం చేసికాదు. చైనా టిబెట్టులో, వెనుకబడిన ప్రాంతాల్లో కూడా గత 30 ఏళ్లలో ఈ వసతులన్నీ అనేకరెట్లు పెరిగాయి. గణాంకాలూ, పర్యాటకుల (ఉదాహరణకు చుక్కారామయ్య, డాక్టర్లు, సైంటిస్టులు, పారిశ్రామి కవేత్తలు మొదలగు) పరిశీలనలూ రెండూ దీన్ని నిర్ధారిస్తున్నాయి. మనదేశంలో అత్యంత అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో కన్నా చైనాలో వెనుకబడ్డ ప్రాంతాల్లో అభివృద్ధి హెచ్చుగా ఉంది. కావాలంటే 'చైనాలో సోషలిజం లేదు' అన్న సిద్ధాంతాన్ని అట్టిపెట్టుకోండి కానీ, వాస్తవాల ఆధారంగా పరిశీలన చేయండి, ముఖ్యంగా రచయితలు, ఉపన్యాసకులు అయిన మేధావులు పాటించాల్సిన విషయం ఇది.

మోసపూరితమైన పద్ధతులలో శాతాల్ని, పెరుగుదల రేట్లను చూపెట్టే బూటకపు గణాంకాల పద్ధతి ఒకటుంది. అలాకాక వాస్తవ వివరాల ఆధారంగా సాపేక్షికంగా పోల్చిచూస్తే సత్యం బోధపడ్తుంది. ఉదాహరణకి 100 నుంచి 110 ఐతే పది శాతం పెరిగిందంటారు. 500 నుంచి 530 ఐతే ఆరు శాతమే. అలాగే జిడిపితో పోల్చి చెప్పే అనేక గణాంకాలకీ వర్తిస్తుంది. ఉదాహరణకి చైనా జిడిపి 14.9 లక్షల కోట్ల డాలర్లు, ఇండియాది 2.6. ఈ వ్యత్యాసాన్ని విస్మరించి, దాచిపెట్టి (ఉదాహరణకి వ్యవసాయ మౌలిక వసతులకు) కేటాయింపులను, ఆయా వృద్ధిరేట్లను శాతాల్లో చూపెడుతుంటారు మీడియాలో. ఆ లెక్కలు తప్పుదారి పట్టించేవిగా ఉంటాయి, ఉన్నాయి. వాటిని కోట్ చేసేప్పుడు జాగ్రత్తగా ఉండాలి.

'శ్రామికులకుండే బేరసారాలాడే శక్తి కుదించుకుపోయింది' అన్నదీ ఇలా 'వల్లించే సిద్ధాంతమే'. వాస్తవంలో అక్కడ దాదాపు అన్ని ఎంఎన్‌సిలలో యూనియన్లే కాదు, పార్టీ యూనిట్లనూ అనుమతించాలన్న నిబంధనలు 'అమల్లో' ఉన్నాయి. షాంఘై వాల్ట్ డిస్నీలో 300 మంది సభ్యులున్నారు. దీనిగూర్చి సామ్రాజ్యవాద వాణి వాల్ స్ట్రీట్ జర్నల్ (2017 అక్టోబర్ 29) ప్రత్యేక కథనం చూడదగినది.

2016 నాటికి (పూర్తిగా లేదా పాక్షికంగా) విదేశీవైన మొత్తం 74 వేల కంపెనీల్లో (మొత్తంలో 70 శాతంలో) పార్టీ శాఖలు ఏర్పడి ఉన్నాయి. అక్కడ ప్రజాస్వామ్యం లేదని చెప్పే పాశ్చాత్య మీడియాయే - చైనాలో ఏటా 40 నుంచి 70 వేల దాకా కార్మిక తదితర నిరసన ప్రదర్శనలు జరుగుతున్నాయనీ - చెప్తుంటుంది. 'దీని భావమేమి తిరుమలేశ' అని మనని మనం ప్రశ్నించుకోకుండా విశ్లేషణలు చేస్తున్నారు. ఎవరైనా చూడనంత మాత్రాన పరిణామాలు ఆగిపోవు కదా!

మానవాళి చరిత్రలోనే అపూర్వంగా చైనాలో పేదరికాన్ని పరిష్కరించారని పాశ్చాత్య మేధావులూ, సిఐఎ, వరల్డ్ బ్యాంకు, ఎఫ్ఎ అంతా లెక్కలతో సహా వివరిస్తున్నారు. చైనా విప్లవం - ముఖ్యంగా గత 40 ఏళ్లలో - 80 కోట్ల మందిని పేదరికం నుండి విముక్తి చేసిందని, ప్రపంచ పేదరికంని తగ్గించే కృషిలో చైనా వంతే 70 శాతమని ప్రకటించారు. సోషలిజం మహదాశయాలలో ఇది ఒకటి కాదా!

అయినా తలసరి జిడిపి, ఆదాయం లెక్కల్లో చైనా నేటికీ మూడో ప్రపంచ దేశమేనని నొక్కిచెప్తూ, 2050ని టార్గెట్ తేదీగా ప్రకటించారు. (ఉదా: 2017లో తలసరి జిడిపి డాలర్లలో: చైనా 8,612, ఇండియా 1,980, ఖతర్ 61,264, అమెరికా 59,939, సౌదీ 20,747, దక్షిణ కొరియా 29,958, హాంకాంగ్ 46,733). వ్యత్యాసాలు, బిలియనీర్లు పెరిగినమాటని ఇతరులకన్నా హెచ్చుగా చైనా నాయకత్వమూ, అక్కడి మీడియా చెప్తున్నాయి. ఒకదేశం - రెండు వ్యవస్థలు, హాంకాంగ్, మకావో, తైవాన్‌లతో సంబంధాలు, ఓపెన్ పాలసీ వీటివల్ల బిలియనీర్లు మెండుగా ఉన్నారు, అనుమతిస్తున్నారు కూడా. అయితే బాలెన్సు లేని అభివృద్ధి, అసమానతలను ప్రధాన సమస్యలుగా దాదాపు ఒక దశాబ్దంగా గుర్తిస్తున్నారు. దీనిని డెంగ్ అంతకు ముందే 1980ల లోనే ఊహించారు. 2017లో దానినే 'ప్రధాన వైరుధ్యం'గా ప్రకటించి, పరిష్కారానికి విధానాలను రూపొందించి అమలు చేస్తున్నారు. మత్లీరివ్యూ (జూలై 2021) సంపాదకులూ దీన్ని ఎత్తి చూపారు.

ముద్రలు వేసారే కానీ డెంగ్ నేతృత్వంలో ఏం సాధించారో చూడట్లేదు. (మావో పోయాక కూడా) వెనుకబడిన తూర్పు దేశమైన చైనాలో అపూర్వ పరిణామాల్ని తెచ్చారు. యూరప్‌లో కన్నా రష్యా అపూర్వ వేగంతో పారిశ్రామిక ప్రగతి సాధించింది. అంతకు మించిన వేగంతో సాగుతున్నది చైనా.

ఎన్ని సంస్కరణలు చేసినా 'నాలుగు మౌలిక సూత్రాల'కు లోబడే చేయాలన్న నియమాన్ని డెంగ్ ఆధ్వర్యంలో తెచ్చారు, అమలు చేస్తున్నారు. ఆ సూత్రాలు: సోషలిస్టు మార్గం, జనతా ప్రజాతంత్ర నియంతృత్వం, మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం, పార్టీ నాయకత్వం ఈ సూత్రాలకు లోబడే ఏ సంస్కరణలైనా ఉండాలని డెంగ్ పలుమార్లు సూత్రీకరించారు (1987 జనవరి 20). వాటిని ఉల్లంఘించిన వారిపై చర్యలు తీసుకున్నారు, ఆ కారణంతో ఇద్దరు ప్రధాన కార్యదర్శులనే డెంగ్ ఎంపిక చేసిన వారయిన హుయావోబాంగ్ (1987లో), జావో జియాంగులను (1989లో) తొలగించారు.

1985 నుంచే బూర్జువా లిబరలైజేషన్‌కి వ్యతిరేకంగా 'దిద్దుబాటు' ఉద్యమం వంటి క్యాంపెన్ నిర్వహించారు. లిబరలైజేషన్ అంటేనే పెట్టుబడిదారీ పద్ధతి, 'సోషలిస్టు లేదా కార్మికవర్గ లిబరలైజేషన్' అంటూ ఏమీ ఉండదు (1986 జూన్ 28) అని డెంగ్ 1980ల లోనే నొక్కి చెప్పారు. వీటన్నిటి ఫలితంగానే 9 కోట్ల సభ్యులతో ఒక కమ్యూనిస్టు పార్టీ అక్కడ 70 ఏళ్లుగా అధికారంలో నిలదొక్కుకో గలిగింది. విద్యారంగం (సాంస్కృతిక విప్లవ కాలపు సంస్కరణలన్నిటినీ తిరగదోడారు, ఎంట్రెన్స్ పరీక్షలు, కోచింగ్ సెంటర్‌లు మొదలగునవి) గురించి పాక్షిక సత్యాలతో విమర్శలు చేశారు. నేటికీ విద్యార్థులు కొద్దినెలలు గ్రామాల్లో ప్రజలలో పనిచేయటం వంటి పద్ధతులు అమల్లో ఉన్నాయి. విద్య, నాణ్యమైన పరిశోధనా పత్రాలు, సైన్సు - టెక్నాలజీలు, నైపుణ్యాలు, ఇన్నొవేషన్స్ - ఇలా నేడు చైనా టాప్ 5లో ఉందన్నది గుర్తించబడిన వాస్తవం. ఎవరికైనా వాస్తవాలతో సంబంధంలేని పరిశీలనలు మంచిది కాదు.

'సాంస్కృతిక విప్లవానంతర కాలంలో ప్రభుత్వం నాలుగు

మతాలను గుర్తించింది' అన్న 'నాస్తిక సూత్రీకరణ' మరో అర్ధసత్యం. నాస్తికులు అత్యధికంగా ఉన్న దేశం చైనాయే నేటికీ. మేం ఫలానా మతాన్ని నమ్ముతాం అనిచెప్పేది పది శాతంలోపే. అందులోనే ఆ నాలుగు మతాలూ! (గేలప్ పోల్ 2015) సాంస్కృతిక విప్లవ కాలంలో తప్ప మత స్వేచ్ఛని ఎప్పుడూ గుర్తిస్తూనే ఉన్నారు. మావో దలైలామాల ఒప్పందమే దానికొక ఉదాహరణ. మతాల్ని అణచివేస్తున్నారని, అది మానవ హక్కుల ఉల్లంఘన అని సామ్రాజ్యవాదులు తమ 'కోల్డ్ వార్'ని ముమ్మరం చేస్తున్నారు, అధికారం ఉందికదా అని పార్టీ తన సిద్ధాంతాలని 'రుద్దడం'కాక, 'మాస్ లైన్'ని అనుసరించి ప్రజలలో వైజ్ఞానిక దృష్టిని పెంచాల్సి వస్తుంది. 'సోషలిస్టు చింతనాత్మక నాగరికత' అన్న సోషలిస్టు స్పిరిట్యులైజేషన్ని ప్రోత్సహిస్తున్నారు, ప్రత్యామ్నాయ మార్గం చూపెడుతున్నారు.

నాయకత్వం ఎన్నిసార్లయినా ఎన్నిక అవవచ్చు అని సవరణ, 'సోషలిస్టు మార్కెట్ వ్యవస్థ' గురించి ఈ విమర్శలు పాతవే. వర్గాలూ, వర్గపోరాటం సమస్య గురించీ అంతే. ప్రసాద్ తప్పుడు సమాచారం ఇచ్చి, వక్రీకరణ చేస్తున్నారు. ఇది పిడివాదంలో భాగం. పెట్టుబడిదారీ పద్ధతిలో ప్రణాళికలుండవు, సోషలిజంలో మార్కెట్లు ఉండవు అన్న మూస భావనలు వాస్తవ విరుద్ధాలే కాక, అచారిత్రకం కూడా. వీటి అన్నిటి గురించి వీక్షణంలోనూ (ఉదా: జూన్ 2018, ఫిబ్రవరి 2019) కొంత వివరమైన చర్చే సాగింది. దాన్ని మరోసారి అధ్యయనం చేస్తే ఉపయోగకరం. ఇది కూడా ఒక నేల విడిచిన సిద్ధాంతమే. చైనాలో కూడా - చాలాకాలం సాగించిన సిద్ధాంత పోరాటం తర్వాతనే - ఈ పడికట్టు వాదనలని వదులుకున్నారు.'భావనా రంగంలో బంధనా విముక్తికై, పిడివాదానికి వ్యతిరేకంగా వారూ చాలా కృషి చేయాల్సి వచ్చింది. పిడివాదం, శాస్త్రీయ సోషలిజం బదులు ఫ్యూడల్ సోషలిజం, వూహాజనిత సోషలిజం, సర్వ సమత్వ భావం (ఈ గాలిటేరియనిజం) మనదేశంలో చాలా లోతైన వేళ్లు కలిగి ఉన్నాయి.

వాస్తవాలు ఎంత 'దరిద్రం'గా ఉన్నా బుద్ధుడు, రామానుజుడు, భక్తికవులు, అంబేద్కర్, గాంధీ, నెహ్రూ అందరిదీ సోషలిజమే అని నమ్మించే ఆదర్శవాద, ఊహాజనిత ఫ్యూడల్, బూర్జువా సోషలిస్టు భావనలు చెలామణీలో ఉన్న దేశం మనది. శాస్త్రీయ సోషలిజం అన్న భావనే మనకు 'పరాయిది'! ఇండియాలో మార్క్సిజం కూడా వీటి నుంచే పుంజుకున్నది.

'ప్రధాన వైరుధ్యం': 'అసమతుల్యమైన అభివృద్ధి', వివిధ వ్యత్యాసాలు, పరిసరాల (ఇకలాజికల్) సమస్యలు ఈ దశలో ముఖ్యమైనవని, నేటి 'ప్రధాన వైరుధ్యాన్ని'(2017 అక్టోబరు) పార్టీ 19వ మహా సభలో జిన్‌పింగ్ వివరించారు. ఇప్పుడు చైనాలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధి బాగానే ఉంది. ఆయా దశల్లో ప్రధాన వైరుధ్యం మారుతూ వస్తుంది. 'అసమతుల్యమైన అభివృద్ధి', 'చాలినంత అభివృద్ధి లేకపోవడమూ' - మనం నేడు ఎదుర్కొంటున్న ఈ రెండు సమస్యలకూ పెరుగుతున్న ప్రజల అవసరాలకూ మధ్య గలది ప్రధాన వైరుధ్యం. ఈ అసమతుల్యతలను, పరిసరాల (ఈకలాజికల్) సమస్యలను విస్మరించి, అభివృద్ధి - జిడిని పెరుగుదలలనే కోరుకోబోము అని వివరించారు . చైనాలో వర్గాలూ, వర్గ పోరాటం సమస్య నేటి దశలో ఈ రూపంలో ఉంటుంది.

చైనా రాజ్యాంగంలో 'వ్యక్తిగత ఆస్తి హక్కు అనుల్లంఘనీయమైనది' అని సవరణ చేశారంటూ ఒక వాదన చేశారు ప్రసాద్. ఆ సమస్య లోతుల్లోకి వెళ్లకుండా ('చైనాలో భూమి ప్రైవేట్ ఆస్తిగా లేదు). 'ప్రాథమిక దశలో' సోషలిజం అన్న విషయాన్నీ, సిద్ధాంత దృష్టినీ కూడా పరిశీలించాలి. 'వ్యక్తిగత ఆస్తి రద్దు' గురించి 1940ల నుంచీ బహుళ ప్రచారంలో ఉన్న ఇండియన్ (ముఖ్యంగా తెలుగు) కమ్యూనిస్టులకు 'ఉత్పత్తి సాధనాలపై సమిష్టి/ప్రభుత్వ యాజమాన్యం'కీ దానికీ ఉన్న వ్యత్యాసం ఏమిటో బోధపడదు. శాస్త్రీయ సోషలిజం కన్నా సిద్ధాంత రీత్యా ఆదర్శవాద సర్వసమతా భావమే మనకు ఎక్కువ.

మన పొరుగు, పెద్ద దేశం, ప్రపంచంలో ప్రబల శక్తిగా ముందుకొచ్చిన దేశం చైనా. అయినా ఆ దేశపు ఇటీవలి పరిణామాల గురించి పట్టుమని పది మందైనా సీరియస్‌గా అధ్యయనం చేయడం లేదు, అమెరికా గురించి మాత్రం చాలా చెప్పగలరు మనవాళ్లు అన్నారు విజయ్ గోఖలే. (స్క్రోల్ ఇంటర్వ్యూ 14-8-2021). 1989లో విద్యార్థి తిరుగుబాటు, మానవ హక్కుల అణచివేత అంటూ మన దేశంలోనూ, మన అతివాదుల నుంచీ అనేక కథనాలు వెలువడ్డాయి. మనదేశంలో అంతా పాశ్చాత్య దేశాల విశ్లేషణల పైననే ఆధారపడుతున్నాం.

విద్యార్థి తిరుగుబాటు (1989 తియనన్మెన్) గురించి కూడా వారి కట్టుకథలనే నమ్మాం అంటూ ఒక పుస్తకం ప్రచురించారాయన 2021 మేలో. ఆ తర్వాత చైనా గురించే మరో పుస్తకం వెలువరించారు. తియనన్మెన్ రోజుల్లో చైనా రాయబారిగా, చైనా నిపుణుడిగా, భారత విదేశాంగ కార్యదర్శిగా పనిచేసి, రిటైర్ అయిన అధికారి ఆయన.

మన దేశ ప్రయోజనాల గురించి - పాలకవర్గాల దృష్టి నుంచే అయినా - ఈ రచనలు చేస్తున్నాను అన్నారాయన. మనదేశంలో డజన్ల కొద్దీ కమ్యూనిస్టు గ్రూపులున్నాయి, వామపక్ష మేధావులూ ఉన్నారు. ఆయన మాటలు వారికీ వర్తిస్తాయి. ప్రజల ప్రయోజనాలరీత్యా ఇది అవసరం. కానీ వ్యతిరేకత, మౌనమే ఎక్కువ. ఎవరైనా కొద్దిగా చైనాకు అనుకూలంగా వాస్తవాలు చెపితే దేశద్రోహులంటున్నారు పాలకులు, వారి మీడియా. 'రివిజనిస్టులు' అని ముద్రలు వేస్తున్నారు కొందరు.

నేటి చైనా అంటే ఇష్టం ఉన్నా లేకున్నా వాస్తవాల ఆధారంగా, శాస్త్రీయ దృష్టితో అధ్యయనమూ, చర్చా అవసరం. 'మన్థ్లీరివ్యూ' పత్రిక పునరాలోచన ఆ దిశలో ఉన్నది. ఆ అవసరాన్ని నొక్కిచెప్పడానికే ఈ వ్యాఖ్య. ఈ విషయంలో చర్చకు వీలు కల్పిస్తూ వచ్చిన 'వీక్షణం'కు అభినందనలు.

*(రచయిత జర్నలిస్టు)* వీ

*అనివార్య సాంకేతిక కారణాల వల్ల యు.ఎ. ఖారిన్ తత్వశాస్త్ర అనువాదం ఈ సంచికలో ప్రచురించలేకపోతున్నాం. వచ్చే సంచిక నుంచి యథాతథంగా కొనసాగుతుంది. - సం*

# అస్తిత్వ రాజకీయాలు - బెంగాల్ వామపక్ష సంఘటన

***1990ల తర్వాత వచ్చిన అస్తిత్వ ఉద్యమాల ప్రభావం, పార్లమెంటరీ రాజకీయాల్లో వాటి పాత్ర పెరగడం, బూర్జువా సంస్కరణలు కలిసి బెంగాల్ వామపక్ష సంఘటన ఓటమికి దారితీశాయని అంటున్నారు కొండూరి వీరయ్య***

బెంగాల్‌లో వామపక్ష సంఘటన ఓటమికి దోహదం చేసిన మరో అంశం అస్తిత్వ రాజకీయాలు అని నిర్ధారిస్తే కొంత అభ్యంతరం వ్యక్తం కావచ్చు. కానీ ఇది వాస్తవం అని చెప్పక తప్పదు. ఈ విషయాన్ని మరింత లోతుగా చర్చించబోయే ముందు అస్తిత్వం గురించి కొన్ని అంశాలు చర్చకు పెట్టాల్సిన అవసరం ఉంది.

మూడున్నర దశాబ్దాల నిరవధిక పాలన తర్వాత కూడా బెంగాల్‌లో కుల నిర్మూలన దిశగా అడుగులు వేయలేదని, కనీసం జనగణనలోనో, పాఠశాల స్థాయిలోనో వివరాలు నమోదు చేసేటప్పుడు కులం చెప్ప నిరాకరించిన వారికోసం ప్రత్యేక కాలం కేటాయించే ప్రయత్నం చేయలేదన్న విమర్శ తరచూ వినిపిస్తుంది. ఈ ప్రతిపాదనలు ముందుకు తెచ్చేవాళ్లు తామే క్షేత్రస్థాయిలో పనిచేసే వామపక్ష శ్రేణుల కంటే మెరుగ్గా ఆలోచిస్తున్నామని తమకు తాము సంతృప్తిపడటం కూడా తరచూ కనిపించే అంశం. ఈ వాదన ముందుకు తేవటం ద్వారా ఈ విమర్శకులు వామపక్షం ప్రత్యామ్నాయం అన్న భావనకు నష్టం చేస్తున్నారే తప్ప, సానుకూల పాత్ర పోషంచటం లేదన్న వాస్తవాన్ని గుర్తెరగాలి.

భారతదేశంలో అద్వైతం రూపంలో పాలకవర్గ భావజాలం సమకాలీన భౌతికవాదంపై సాధించిన విజయం కుల వ్యవస్థ నిర్మాణాన్ని, రూపురేఖలను, సామాజిక, ఆర్థిక జీవితంలో దాని పాత్రను సమూలంగా మార్చేసింది. ఈ వాస్తవం సమగ్రంగా పరిశోధించాల్సిన అంశం. సమాజ మార్పు గురించిన అవగాహనకు మరింత పదును పెట్టే అంశం. రంగు, రూపం మార్చుకున్న కుల వ్యవస్థ బ్రాహ్మణ భావజాల ఆధిపత్యం నీడన హిందూ మతంలో రెక్కలు విచ్చుకుంటున్న పురోగామి ధోరణులకు అడ్డుకట్ట వేసింది.

సామాజిక, ఆర్థిక వాస్తవంగా ఉన్న కుల వ్యవస్థ నిర్మాణం దైవ స్వరూపమన్న వాదన వేళ్లూనుకుంది. ఓ నూతన తరహా పౌరసమాజ ఆధిపత్య భావనగా శతాబ్దాలపాటు స్థిరపడిపోయింది. కుల వ్యవస్థ నిర్మాణం, పరిణామం, పర్యవ సానంలో ఉన్న ఈ లోతుపాతులను సమగ్రంగా శాస్త్రీయంగా, గతితార్కికంగా విశ్లేషించటానికి ప్రయత్నం చేయాల్సిన అవసరం ఉంది. దీనికి బదులు తాత్కాలిక చిట్కాలతోనో, రెండు దశాబ్దాల పాలనలోనే కుల వ్యవస్థకు ప్రత్యామ్నాయం చూపగలమని ఆశించటం, చూపాలని వాదించటం విజ్ఞత అనిపించుకోదు.

ఇక బెంగాల్‌లో వామపక్ష సంఘటన ప్రజాదరణ కోల్పోవటానికి, రాష్ట్రంలో అస్తిత్వ సమీకరణలు అస్తిత్వ రాజకీయాల స్థాయికి చేరటానికి, రాజ్యాంగ ఆధారిత రాజ్య వ్యవస్థ నిర్మాణానికి నయా వలసవాదం తూట్లు పొడిచిన పరిణామానికీ మధ్య విడదీయరాని సంబంధం గురించి అర్థం చేసుకోవటానికి చేసిన ప్రయత్నమే ఈ వ్యాసం. దాదాపు రెండు శతాబ్దాలు బెంగాలీ పౌర జీవనంపై ప్రభావం చూపిన సాంస్కృతిక పునరుజ్జీవనం, మూడున్నర దశాబ్దాల వామపక్ష ప్రభుత్వం అధికారంలో ఉన్న తర్వాత కూడా ప్రజలు అస్తిత్వాల వైపు ఎందుకు ఆకర్షితులవుతున్నారు అన్న ప్రశ్న తలెత్తుతుంది. ఈ ప్రశ్నకు సమాధానం బెంగాల్ సంస్కరణోద్యమాల్లోనూ ఆ మాటకొస్తే దేశవ్యాప్తంగా సాగిన సంస్కరణోద్యమాల్లోనూ ఉన్న పరిమితుల్లోనే ఉంది. ప్రస్తుతానికి బెంగాల్ సంస్కరణోద్యమానికున్న పరిమితులను ప్రస్తావించుకుందాం.

బెంగాల్‌లో సంస్కరణోద్యమం, రైతాంగ ఉద్యమం ఏకకాలంలో తెరమీదకు వచ్చాయి. భారత స్వాతంత్ర్యోద్యమంలో ఈ రెండు స్రవంతులు కీలక భూమిక పోషించాయి. ప్రత్యేకించి రైతాంగ పోరాటాలు మెరుగైన ప్రజాస్వామ్యం, ఆధునిక సమాజం లక్ష్యాలుగా సాగాయి. ఫలితంగా ఈ కాలంలో కులం అస్తిత్వ సాధనంగా, మార్గంగా తన ప్రభావాన్ని చూపలేక పోయింది. అదే సమయంలో సామాజిక జీవితంలో దాని ప్రభావం మాత్రం కొనసాగుతూనే ఉంది.

స్వాతంత్రోద్యమంలో అంతర్భాగంగా సాగుతున్న వర్గ పోరాటాల్లో అప్పుడే వలసవాద ఆధునికత ప్రభావంతో ఎదిగి వస్తున్న మధ్యతరగతి భాగస్వామి కాలేకపోయింది. చారిత్రాత్మక నీలిమందు రైతుల పోరాటాన్ని అటు రాజా రామ్మోహనరాయ్ కానీ, ఇటు ద్వారకానాథ్ ఠాగూర్ కానీ సమర్ధించకపోవటాన్ని దీనికి తిరుగులేని ఉదాహరణగా చెప్పుకోవచ్చు. బంకిమ్ చంద్ర ఛటర్జీ కూడా సమకాలీన రైతాంగ పోరాటాలను సమర్ధించేందుకు ముందుకు రాలేదు. ఈ ఉదాహరణలు మనకు ఓ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

తొలుత బెంగాల్‌లో, తర్వాత దేశంలో కనిపించిన సంస్కరణోద్యమం యూరప్ తరహాలో మతాన్ని ధిక్కరించే ఉద్యమంగా ఎదగలేదు. మతాన్ని సమకాలీన రాజకీయ పాలకవర్గ అవసరాలకు తగ్గట్లు సవరించుకునేందుకు పరిమితమయ్యాయి. అందువల్లనే ఈ సంస్కరణోద్యమాలు సమకాలీన రాజకీయ అంశాలు, ఉద్యమాలు, ప్రజాకాంక్షల విషయంలో దూరాన్ని పాటించాయి. వలసవాద ఆధునికత కల్పించిన పరిమితులే ఇవి. వలసవాద కాలం నాటి మేధో వర్గం ఈ పరిమితులు అధిగ మించటంలో విఫలమైన కారణంగానే

ఈ దేశంలో సామాజిక సమస్యల పరిష్కారానికి విప్లవాత్మక అవగాహన, చైతన్యం పెంపొందించటం సాధ్యం కాలేదు.

ఈ పరిస్థితుల్లో తెరమీదకు వచ్చిన కమ్యూనిస్టు ఉద్యమం ఇటువంటి విస్తృత సమస్యలకు నిర్దిష్ట పరిష్కారాలు చూపించేందుకు ప్రయత్నం చేసింది. ఇందులో భాగంగానే సమాజంలో ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక దోపిడీకి గురవుతున్న అట్టడుగు వర్గాల సమస్యలే జాతీయ సమస్యలుగా జాతీయోద్యమం ఎజెండాలోకి తేవటంలో ఓ మేరకు సఫలమైంది. జాతీయోద్యమ స్పృహతో పాటు వర్గ స్పృహనూ పెంపొందించింది. ఈ జమిలి స్పృహతో కమ్యూనిస్టు ఉద్యమం దేశంలో వర్గ సమీకరణ ఆధారిత రాజకీయాలకు తెరతీసింది.

కమ్యూనిస్టు రాజకీయాలకు పునాది వర్గ ఆధారిత సమీకరణలు. వలసపాలన అందించిన ఆధునికత, బెంగాల్ సామాజిక, రాజకీయ ప్రత్యేకతలకు పునాదులు వేసింది. ఈ పునాదులపై నిర్మించబడిన ఉద్యమాలు మిగిలిన రాష్ట్రాల్లో రాజకీయ సమీకరణలకంటే భిన్నమైన రాజకీయ సమీకరణలకు తెరతీశాయి. వీటన్నిటి ఫలితమే దేశమంతటా ఉన్నట్లే సామాజిక జీవనంలో కులాధిపత్యం, కులం కట్టుబాట్లు ఉన్నప్పటికీ కులం రాజకీయ సమీకరణ సాధనంగా మారలేక పోయింది. స్థూలంగా బెంగాల్ సామాజిక జీవితంలో స్వాతంత్ర్య సాధన నాటికి అగ్రకులాలు సాగుచేయని జమీందార్లుగానూ, నిమ్నకులాలు, ముస్లింలు సాగుదార్లుగానూ చీలి ఉన్నారు. నాటి తూర్పు బెంగాల్, నేటి బంగ్లాదేశ్‌లో ఈ విభజన మరింత కొట్టొచ్చినట్లు వ్యక్తమయ్యేది.

ఈ పరిస్థితులకు తోడు దాదాపు 1935 నుండీ 1975 వరకూ బెంగాల్ రాజకీయాలు వర్గ సమీకరణల చుట్టూ తిరిగాయి. వర్గం సమీకరణ సాధనంగా మారింది. స్వాతంత్ర్యానంతరం 1990 దశకం వరకూ అధికారంలో ఉన్న ప్రభుత్వాలు వర్గ పోరాటాలకు – కార్మికులు, రైతాంగం, వ్యవసాయ కూలీలు స్వతంత్రంగానూ, ఉమ్మడిగానూ సాగించిన పోరాటాలకు అంతో ఇంతో స్పందించేవి. కనీస వేతనాల చట్టం, పారిశ్రామిక వివాదాల చట్టం మొదలు భూసంస్కరణల చట్టాలు వరకూ ప్రభుత్వాలు ఇటువంటి వర్గ పోరాటాలకు స్పందించిన పర్యవసానాలే. స్వాతంత్ర్యోద్యమ కాలంలో కమ్యూనిస్టు పార్టీపై దీర్ఘకాలం నిషేధాలు అమల్లో ఉండటంతో నాటికి ప్రధాన సంఘమైన అఖిల భారత కిసాన్ సభ ద్వారానే కమ్యూనిస్టు కార్యాచరణ సాగుతూ ఉండేది. కిసాన్ సభ తొలినాళ్ల చరిత్రను లోతుగా పరిశీలిస్తే కనిపించే అంశం ఇది. నాటి నుండీ 1970 దశకం వరకూ సాగిన రైతాంగ పోరాటాలు దేశవ్యాప్తంగా వర్గ స్పృహను పెంపొందించాయి. ఈ స్పృహకు తోడు నిర్మాణం, సామాజిక జీవనంలో కమ్యూనిస్టు భావజాలం పోషించిన పాత్ర నేపథ్యంలో బెంగాల్‌లో వామపక్ష సంఘటన అధికారానికి వచ్చింది. పునరుక్తిగా అనిపించినప్పటికీ ఈ విషయాలు బెంగాల్‌లో అస్తిత్వ రాజకీయాల పాత్ర గురించి అర్థం చేసుకోవటానికి అవసరం కావటంతో పునరుక్తి చేయక తప్పటం లేదు.

అక్టోబర్ సంచికలో వివరించిన విధంగా నయా ఉదారవాద సంస్కరణలు నిర్దిష్ట రూపం తీసుకుంటున్న తరుణంలో దేశవ్యాప్తంగా విస్తరిస్తున్న సామాజిక రాజకీయ ఆర్థిక సంక్షోభం బెంగాల్‌నూ కుదిపింది. కమ్యూనిస్టు నిర్మాణం, రాజకీయాలు గ్రామాల్లో రైతు, భూమి కేంద్రంగా సాగేవి. జాతీయార్థికాభివృద్ధిలో వ్యవసాయం పాత్ర, ప్రాధాన్యత కుదించుకుపోవటం, లాభార్జనే ధ్యేయంగా తెరమీదకు వచ్చిన సంస్కరణలు ప్రజానుకూల ప్రభుత్వాల సామర్థ్యాన్ని, ప్రత్యామ్నాయ ప్రభుత్వాల సామర్థ్యాన్ని (ఎంత పరిమిత స్థాయి ప్రత్యామ్నాయాలైనా) నియంత్రిస్తున్నాయి. తామెంచుకున్న మార్గంలో ప్రజా అవసరాలు తీర్చే విధానపరమైన వెసులుబాటు లేకపోవటంతో పార్టీలకు, ప్రజలకు మధ్య ఉన్న రాజకీయ సంబంధాలు బలహీనపడటం మొదలైంది. గ్రామీణ జీవితం సార్వత్రిక సంక్షోభానికి గురైంది. బెంగాల్‌లో వామపక్షాలకు గ్రామాలే ఆయువుపట్టు అన్నది పలువురి పరిశోధనల సారాంశం. పైన వివరించిన పరిణామాల నేపథ్యంలో ఆ ఆయువుపట్టు బలహీనపడటంతో వచ్చే రాజకీయ పర్యవసానాల గురించి అంచనా వేయటం పెద్ద కష్టమేమీ కాదు. నయా ఉదారవాద ఆర్థిక విధానాలతో పాటు సంస్థాగత, సమీకరణ రాజకీయాలకు, ఉమ్మడి సంక్షేమం, శ్రేయస్సు దిశగా సాగే ఉద్యమ రాజకీయాలకు అవరోధాలు ఏర్పడ్డాయి. ఉమ్మడి శ్రేయస్సు, ప్రయోజనం స్థానంలో వ్యక్తిగత లాభ ప్రలోభాలు ప్రాతిపదికన సమీకరణలకు తెరలేచింది. ఇది ప్రపంచ వ్యాప్తంగా నయా ఉదారవాద విధానాలు అమలు జరిగిన అన్ని దేశాల రాజకీయ ఉద్యమాలకూ ఎదురైన అనుభవమే.

1990 దశకం దేశంలో అనేక కీలకమైన మార్పులు చూసింది. 1984 నుండే దేశ ఆర్థిక విధానాల దిశ మళ్లించటానికి నాటి కాంగ్రెస్ ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు రాష్ట్రాల హక్కులను హరించే దిశగా ప్రభావం చూపటం మొదలు పెట్టాయి. ఈ పరిస్థితుల్లో పరిమిత వనరులు కలిగిన బెంగాల్ ప్రభుత్వం శక్తి సామర్థ్యాలు కూడా ఉడిగిపోసాగాయి. స్థూలంగా బెంగాల్‌లో వామపక్ష సంఘటనకు రెండు కళ్లు లాంటి గ్రామీణ ప్రాంతాల్లో పేద రైతాంగం, పట్టణ ప్రాంతాల్లో కార్మిక, ఉద్యోగవర్గం తమ దైనందిన ప్రయోజనాలు తీర్చటంలో ఎదురవుతున్న సమస్యల నేపథ్యంలో వామపక్ష సంఘటనతో రాజకీయంగా దూరమవటం మొదలైంది. ఇది కీలక ఘట్టం. అప్పటికే రాష్ట్ర ప్రభుత్వం పరిధిలో శక్తికి మించి భూసంస్కరణలు, పంచాయితీ సంస్కరణలు అమలు జరిగి ఉన్నాయి. అదనంగా విధానపరమైన సృజనాత్మకతకు తెరతీయటానికి రాజ్యాంగం విధించిన పరిమితులు అడ్డు పడ్డాయన్నది వస్తుగత వాస్తవం. ఆయా సందర్భాల్లో సంఘటనకు నాయకత్వం వహించిన వారి స్వీయమానసిక ధోరణులు కూడా ఈ బలహీనతకు తోడయ్యాయన్నది కాదనలేని వాస్తవం.

స్థూలంగా వర్గపోరాటాలు సాగించేందుకు రాజకీయ వాతావరణం అనువుగా లేదన్నది 1990 దశకం నాటికి స్పష్టమైంది. ఇటువంటి ప్రత్యేక పరిస్థితుల్లో వామపక్ష ప్రత్యామ్నాయ శక్తులు తమ ప్రాసంగికతను నిలిపి ఉంచుకోవటానికి ఏమి చేయాలన్నది సైద్ధాంతిక నిర్మాణ రంగాల్లో కృషి చేసే నాయకత్వం ముందున్న ప్రశ్న. సామాజిక, ఆర్థిక జీవితంలో సంస్థాగత రాజకీయాల పలుకుబడి తగ్గటంతో ప్రజలు ప్రత్యామ్నాయ సమీకరణల వైపు మొగ్గు చూపారు. ఈ

కాలంలోనే వామపక్ష పార్టీల ప్రేరణతో నడిచే ప్రజా సంఘాలు నిర్మాణ పరంగానూ, ప్రభుత్వాలపై ఒత్తిడి తెచ్చే ప్రెజర్ గ్రూప్స్‌గానూ బలహీనపడ్డాయి.

ఈ రెండు ధోరణుల మధ్య ఉన్న విలోమ సంబంధాన్ని మనం అర్థం చేసుకోవాలి. ఇటువంటి వారికి కులం, ఉపకులం సమీకరణ సాధనంగా కనిపించింది. రాజకీయ, సామాజిక, ఆర్థిక సమానత్వం, సమన్యాయ సాధనంగా ప్రభుత్వం పాత్ర కుదించుకపోవటంతో ప్రభుత్వాల స్థానాన్ని మార్కెట్ శక్తులు ఆక్రమిస్తూ వచ్చాయి. ఈ మార్కెట్ శక్తుల సాలెగూడులో ఎవరి స్థానం, ఎవరి అవకాశాలు కాపాడుకోవటం వారికి ప్రాధాన్యత గల లక్ష్యాలుగా మారాయి. ఈ నేపథ్యంలోనే 1990 దశకం తర్వాత తెరమీదకు వచ్చిన సంఘాలు, సంస్థలు ప్రధానంగా సమానత్వం, భాగస్వామ్యం, మానవ హక్కులు, ప్రాతినిధ్యం వంటి ఎజెండాలను ప్రజల ముందుకు తేవడాన్ని గమనించాలి. ఈ పరిణామాలు బెంగాల్‌లో కొన్ని పర్యవసానాలకు దారితీశాయి. మొదటిది, రాజ్యాంగ నిర్దేశిత ప్రయోజనాలు అమలు చేసే సాధనంగా రాష్ట్ర ప్రభుత్వాల శక్తి సామర్థ్యాలు బలహీనపడ్డాయి. రెండోది, రాజ్యాంగ హక్కులు కాపాడుకోవటానికి వర్గ పోరాటాలు సాధనమన్న అభిప్రాయం నుండి ప్రజలు ప్రధానంగా పీడితులు క్రమంగా దూరమవుతూ వచ్చారు. వర్గానికి, సామాజిక తరగతికి మధ్య ఉన్న తాత్విక వైరుధ్యం నేపథ్యంలో వర్గపోరాట స్ఫూర్తి కొరవడిన చోట వర్గ సమీకరణల స్థానంలో సామాజిక సమీకరణలుగా రూపాంతరం చెందుతాయి. బెంగాల్ సమాజానికి, వామపక్ష పార్టీలకు మధ్య అనుసంధానం చేసే పార్టీ వ్యవస్థ బీటలు వారటం మూడో పరిణామం.

ఈ మూడు పరిణామాలతో బెంగాల్‌లో వామపక్ష రాజకీయాలు ప్రజామోదం పొందటంలో విఫలమవటం మొదలైంది. బెంగాల్‌లో దాదాపు ఆరు దశాబ్దాల పాటు తమ స్వతంత్ర అస్తిత్వాన్ని ధృవీకరించుకోలేక అస్తిత్వ రాజకీయాలకు ఈ పరిస్థితులు పెద్ద అవకాశాన్ని అందించాయి. అంటే ప్రత్యామ్నాయ పార్టీ వ్యవస్థలు బలహీనపడటం, వ్యక్తి కేంద్రంగా మార్కెట్ ఛాందస సాంస్కృతిక వ్యవస్థ వేళ్లూనుకోవటంతో వర్గ వ్యత్యాసాలు వర్గ వైరుధ్యాల స్థాయికి చేరకుండా అవరోధం కల్పించాయి. అయితే వర్గ ఆధారిత సమీకరణలు విఫలం కావటం అంతిమంగా పీడిత వర్గాల ప్రయోజనాలకు భంగం వాటిల్లచేసే పరిణామం అన్న వాస్తవాన్ని ప్రజలు అర్థం చేసుకోనీయకుండా మార్కెట్ సాంస్కృతిక వ్యవస్థ, ప్రసార సాధనాలు ఇతోధిక కృషి చేశాయి.

ఈ పర్యవసానాల నేపథ్యంలో గత రెండు దశాబ్దాల కాలంలో బెంగాల్ అనేక అస్తిత్వ రాజకీయాలకు వేదికగా మారింది. దేశంలో నయా ఉదారవాద ఆర్థిక విధానాలతో పాటే రాజ్యం స్వభావం, సామర్థ్యంలో వచ్చిన మార్పులు ముందే చర్చించుకున్నాము. మారుతున్న రాజ్యం సామర్థ్యంతో పాటు వివిధ సామాజిక ఆర్థిక తరగతులు, వర్గాల అవసరాలు కూడా పెరుగుతూ వచ్చాయి. వీటిని తీర్చుకోవటానికి పెట్టుబడిదారీ ఉదారవాదం అస్తిత్వ ఆధారిత సమీకరణాల రూపంలో ప్రజలకు ప్రత్యామ్నాయాన్ని చూపించింది.

ఈ క్రమంలోనే సంక్షేమ విధానాల సారం మారింది. కమ్యూనిటీ అభివృద్ధి లక్ష్యంగా జరిగే ఆర్థిక వనరులు, కేటాయింపులు, ప్రభుత్వ వ్యయం వ్యక్తి కేంద్రంగా అమలు కానారంభించాయి. ప్రభుత్వ పథకాలకు, ప్రజలకు మధ్య మధ్యవర్తిత్వం వహించాల్సిన సామాజిక రాజకీయ ఉద్యమాల స్థానంలో సాంకేతిక పరిజ్ఞానం, సర్వీస్ ప్రొవైడర్లు మధ్యవర్తిత్వం వహిస్తున్నాయి. ఇదిలా ఉంచితే ఈ కాలంలో బెంగాల్‌లో ముందుకొచ్చిన అస్తిత్వాలు, మారుతున్న ఆయా అస్తిత్వాల రాజకీయ ప్రాధాన్యతల గురించి కూడా పరిశీలిద్దాం.

నామశూద్ర అస్తిత్వం. రాజ్‌బన్షీల తర్వాత దళితుల్లో సంఖ్య రీత్యా రెండో పెద్ద తరగతి. వీరి అస్తిత్వం దేశ విభజనతో ముడిపడి ఉంది. గతంలో నామశూద్రలను చండాలురు అని పిలిచేవాళ్లు. ఈ తరగతి ఎదుర్కొనే వివక్షను అర్థం చేసుకోవటానికి ఈ పేరు చాలు. తమ జీవితాలు మెరుగుపర్చుకునేందుకు 19వ శతాబ్దిలోనే ఉద్యమించటం ప్రారంభించారు. 1872లో మొదలైన ఈ ఉద్యమం క్రమంగా వైష్ణవ సాంప్రదాయాన్ని స్వీకరించింది. ఈ సాంప్రదాయం కులాధిపత్యాన్ని నిర్ద్వంద్వంగా వ్యతిరేకించింది. ఈ ఉద్యమం ఫలితంగా 1911లో జనగణ సందర్భంగా ఈ కులాన్ని చండాలురు అని పిలవటానికి బదులు నామశూద్రులు అని నమోదు చేశారు. ఈ కాలంలోనే బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమంలో నామశూద్రులు భాగస్వాములు కాలేదు. ఈ క్రమంలోనే దళిత ముస్లిం ఐక్యత 1945 నాటికి నిర్దిష్ట రూపం తీసుకుంది. జన సంఖ్య రీత్యా ముస్లింలు ఆధిపత్య తరగతిగా ఉండటంతో నాటి నెహ్రూ మంత్రివర్గంలో భాగస్వామి అయిన శ్యామ ప్రసాద్ ముఖర్జీ పాకిస్తాన్ ఏర్పడినా ఏర్పడకపోయినా తూర్పు బెంగాల్‌ను మాత్రం దేశం నుండి విడదీయాలని పట్టుబట్టాడు.

దేశ విభజన నేపథ్యంలో తూర్పు పాకిస్తాన్ నుండి బెంగాల్‌కు తరలివచ్చిన శరణార్థులతో నామశూద్ర అస్తిత్వంలో కొత్త సమస్యలు ముందుకొచ్చాయి. 1950-60 దశకంలో శరణార్థుల హక్కుల కోసం జరిగిన ఉద్యమాలు ఉధృతంగా సాగటంతో కుల అస్తిత్వ సమస్యలు వెనకంజ వేశాయి. శరణార్థుల సమస్యలు నామశూద్రుల్లో ఐక్యత భావాన్ని పెంపొందించాయి. సహజంగానే కమ్యూనిస్టు పార్టీ శరణార్థుల సమస్యలపై ఆందోళన చేసింది. కమ్యూనిస్టు పార్టీ శరణార్థుల సమస్యలను భూస్వామ్య వ్యవస్థ రద్దుతో మిళితం చేయగలిగింది. దాంతో 1977 వరకూ కాంగ్రెస్‌తో ఉన్న శరణార్థులు 1977 తర్వాత కమ్యూనిస్టు రాజకీయాల ప్రభావంలోకి వచ్చారు. ఈ క్రమంలో అస్తిత్వ రాజకీయాలు, కులాధారిత రాజకీయాలు వెనకపట్టు పట్టాయి. బెంగాల్‌కున్న అంతర్జాతీయ సరిహద్దు నేపథ్యంలో నామశూద్ర దళితుల సమస్య మరింత విస్తృత స్వభావం సంతరించుకుంది. శరణార్థుల విషయంలో తుది నిర్ణయాధికారం కేంద్ర ప్రభుత్వానిదే. చట్టాలు రూపొందించే అధికారం కూడా కేంద్రానిదే. రాష్ట్రం ఆ చట్టాలను అమలు చేయటం తప్ప మరో ప్రత్యామ్నాయం లేకపోయింది. అప్పటికే బంగ్లాదేశ్ నుండి బెంగాల్‌లోకి వచ్చే వలసలతో సరికొత్త సమస్యలు తలెత్తాయి. ఈ సమస్యల పరిష్కారానికి కేంద్ర ప్రభుత్వ మార్గదర్శకాలు అమలు చేసే క్రమంలో నామశూద్రులకు వామపక్ష సంఘటన ప్రభుత్వం పట్ల ప్రత్యేకించి సిపిఎం పట్ల వ్యతిరేకత

గూడుకట్టుకోనారంభించింది.

ఈ నేపథ్యంలోనే నామశూద్ర అస్తిత్వ రాజకీయాలు 2009 నాటికి కీలకమైన మలుపు తిరిగాయి. 2009 నాటికి జాతీయ రాజకీయాల్లో వచ్చిన మార్పులు, అణు ఒప్పందం విషయంలో సిపిఎం తీసుకున్న వైఖరి కారణంగా బెంగాల్ రాజకీయాలూ ప్రభావితమయ్యాయి. అప్పటి వరకూ వేర్వేరు కూటములుగా ఉన్న కాంగ్రెస్, తృణమూల్ కాంగ్రెస్‌లు ఏకమయ్యాయి. నయా ఉదారవాద విధానాల నేపథ్యంలో ప్రజానుకూల చర్యలు అమలు చేసే ప్రభుత్వాల సామర్ధ్యం కుదించుకుపోయిన విషయాన్ని ప్రస్తావించుకున్నాము.

నామశూద్రుల్లో ఒకటైన మటువా ఉపకులం దళితుల్లో ప్రాబల్యం కలిగిన జిల్లాల్లో జరిగిన స్థానిక ఎన్నికల్లోనూ, లోక్‌సభ ఎన్నికల్లోనూ వామపక్ష అభ్యర్థులు ఓడిపోయారు. వీరి ప్రాబల్యం 49 శాసనసభ నియోజకవర్గాల్లో విస్తరించి ఉంటే అందులో కేవలం వామపక్షాలు ఆరు స్థానాలకు మాత్రమే పరిమితం అయ్యాయి. ఈ విధంగా నామశూద్రులు వామపక్ష రాజకీయ ప్రాబల్యం నుండి తృణమూల్ ప్రాబల్యం కిందకు మళ్లటానికి కేంద్ర ప్రభుత్వంలో భాగస్వామిగా మమతా బెనర్జీ తీసుకున్న అనేక నిర్ణయాలు, రైల్వే మంత్రిగా ఈ ప్రాంతాలకు ప్రత్యేక పథకాలు, ప్రాజెక్టులు ప్రకటించింది. ఇలాంటి పరిణామాలతో ప్రజల్లో వామపక్ష ప్రభుత్వం అనుసరించే సమీకరణ రాజకీయాల కంటే బూర్జువా పార్టీలు ముందుకు తెచ్చే సంక్షేమ రాజకీయాలే మెరుగైన ప్రత్యామ్నాయమని భావించే పరిస్థితి వచ్చింది. దాంతో సంక్షేమంలో ఎవరికి వాళ్లు ఎక్కువ వాటా పొందే ప్రయత్నంలో నిద్రాణంగా ఉన్న కుల సమీకరణలకు తెరతీశారు.

2009లో వచ్చిన ఫలితాలు, అనంతరం వేగంగా మారుతున్న రాజకీయ పరిణామాల నేపథ్యంలో మమతా బెనర్జీ నామశూద్రుల్లో సిపిఎం పట్ల పెరుగుతున్న వ్యతిరేకతను సొమ్ము చేసుకోవటానికి అన్ని ప్రయత్నాలూ చేసింది. 2009లో మటువా మహాసంఘులో సభ్యత్వం తీసుకోవటమే కాక 2010లో ఈ సంస్థకు ఛీఫ్ పాట్రన్‌గా ఎన్నికైంది. మండల కమిషన్ ముందు నాటి బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసు "బెంగాల్‌లో రెండే కులాలున్నాయి. ధనికులు, పేదలు" అని మాట్లాడిన విషయాలను బయటికి తీసి నిమ్న కులాలకు సిపిఎం వ్యతిరేకం అన్న భావన కలిగించటానికి శతవిధాలా ప్రయత్నం చేసింది. వీటన్నిటి ఫలితంగా 2009లో నామశూద్రుల్లో 42.6 శాతం ఓట్లు వామపక్ష సంఘటనకు దక్కితే 2016 నాటికి ఈ ఓటు శాతం 31.6 శాతానికి పడిపోయింది. 2009లో తృణమూల్ కాంగ్రెస్‌కు 22 శాతం ఓట్లు వస్తే 2016 నాటికి 43.4 శాతానికి పెరిగింది. మారుతున్న అస్తిత్వ సమీకరణలు, బెంగాల్ వామపక్ష సంఘటనపై చూపిస్తున్న ప్రభావం అర్థం చేసుకోవటానికి ఈ వివరాలు దోహదం చేస్తాయి.

1990 తర్వాత రాజకీయాల్లో వచ్చిన మార్పులు ప్రత్యేకించి నిమ్న కులాలు పార్లమెంటరీ రాజకీయాల్లో క్రియాశీల పాత్ర పెరగటం, ఈ క్రమంలో అగ్రకులాలకు వ్యతిరేకంగా ఏకం కావాలన్న స్పృహ నిమ్నకులాల్లో అణగారిన అస్తిత్వాలకు ఊపిరి పోసింది.

ఒక్క బెంగాల్‌లోనే నామశూద్ర కులంలో ఉపకులమైన మటువా కులం అభ్యర్థులు ఎన్నికల్లో పోటీ చేయటం, ప్రత్యేకించి తృణమూల్ టిక్కెట్లపై పోటీ చేయటం ఈ అభిప్రాయాన్ని ధృవీకరించే పరిణామం. చిన్న కమతాల వ్యవసాయం సంక్షుభితం కావటంతో గ్రామీణ ప్రాంతం నుండి జీవనోపాధి కోసం పట్టణ ప్రాంతాలకు వలస వెళ్లటం కూడా ఈ కాలంలోనే పెరిగింది. నామశూద్రుల్లో 31 శాతం పట్టణ ప్రాంతాలకు వలస వెళ్తే మిగిలిన ఎస్‌సి కులాలు రాజ్‌బంశీ, బాగ్దిల్లో ఇది 12, 10 శాతం మాత్రమే ఉంది. గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధి కోల్పోతున్న నిమ్నకులాలు పట్టణ ప్రాంతాలకు వెళ్లాక కార్మికవర్గ లక్షణాలు పెంపొందించుకోవటానికి ముందే అస్తిత్వ చైతన్యాన్ని పెంపొందించుకుంటున్నారు.

ఈ వివరాలు పరిశీలిస్తే మనం కొన్ని నిర్ధారణలకు రావచ్చు. ఆర్థిక పోరాటాలు, సామాజిక న్యాయ సాధన లక్ష్యాలను తమతో ఇముడ్చుకోగలిగినంత కాలం, ప్రభుత్వాలు వర్గ సమీకరణ రాజకీయాలు ముందుకు తెచ్చే డిమాండ్లకు స్పందించినంత కాలం అస్తిత్వ చైతన్యం మరుగున పడుతుంది. అయితే నయా ఉదారవాద ఆర్థిక చట్రం ప్రజా ఉద్యమాలకు స్పందించే ప్రభుత్వాల సామర్ధ్యాన్ని నియంత్రిస్తుంది. దీంతో ప్రజా సేవలు, సంక్షేమం హక్కు అన్న భావన నుండి పాలకవర్గం దయతో అందించే ప్రయోజనం అన్న అభిప్రాయాన్ని సార్వత్రికమవుతుంది. ఈ భావనను సార్వత్రికం చేయటానికి అస్తిత్వ రాజకీయాలు అవసరం. అనివార్యం. అస్తిత్వ చైతన్యం తెరమీదకు రావటంతో బెంగాల్ రాజకీయాలు కొత్త మలుపు తీసుకున్నాయి. వీటిని అధిగమించటానికి వామపక్షం తనను తాను పునరావిష్కరించుకోవాల్సిన అవసరం ఉంది.

*(వచ్చే సంచికలో బెంగాల్‌లో బిజెపి పునరుత్థానం)*

*(రచయిత జర్నలిస్టు)*

*మత వేదన వాస్తవ వేదనకు వ్యక్తీకరణే. అదే సమయంలో అది వాస్తవ వేదన పట్ల నిరసన కూడా. మతం అణచబడ్డ జీవి నిట్టూర్పు. హృదయంలేని ప్రపంచపు హృదయం. ఉత్సాహంలేని పరిస్థితుల ఉత్సాహం. అది ప్రజలకు మత్తు మందు. ప్రజల భ్రమాజనిత ఆనందంగా ఉన్న మతాన్ని రద్దుచేయడమంటే ప్రజల వాస్తవమైన ఆనందాన్ని ఆకాంక్షించడమే. ప్రస్తుత స్థితిపట్ల భ్రమల్ని వదిలేయమని కోరడమంటే, భ్రమలు అవసరమయ్యే పరిస్థితుల్ని వదిలేయమని కోరడమే. అందుకే మతం మీద విమర్శ ఏ కన్నీటి ప్రవాహాల వెలుగు మతమో, ఆ కన్నీటి ప్రవాహాల మీద విమర్శకు బీజరూపమే.*

*- కార్ల్ మార్క్స్*

### తెలుగు రాష్ట్రాల్లో నిరసన ర్యాలీలు, రాస్తారోకోలు

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాలకు నిరసనగా, నూతన వ్యవసాయ చట్టాలను వ్యతిరేకిస్తూ జాతీయ స్థాయి రైతు సంఘాల సమన్వయ సమితి, బిజెపి యేతర, టిఆర్ఎస్ యేతర అఖిలపక్షం పిలుపు మేరకు సెప్టెంబర్ 27న తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో భారత్ బంద్ జరిగింది. పలు చోట్ల వ్యాపార, వాణిజ్య సంస్థలను స్వచ్ఛందంగా మూసివేశారు. అఖిలపక్ష నేతలు రహదారులపై బైఠాయించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా నినాదాలు చేశారు. హైదరాబాద్‌లోని నారాయణగూడ నుంచి సికింద్రాబాద్ రైల్వేస్టేషన్ వరకు రైతు, కార్మిక, ప్రజా సంఘాల ఆధ్వర్యంలో ప్రదర్శన నిర్వహించారు. పెట్రోల్, డీజిల్, గ్యాస్, నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించాలని, ప్రభుత్వ రంగ సంస్థల ప్రైవేటీకరణ నిలిపివేత, కేంద్రం తెచ్చిన మూడు వ్యవసాయ చట్టాలను రద్దుచేయాలనే తదితర డిమాండ్‌లతో అఖిలపక్షం నేతలు బంద్ నిర్వహించారు.

### విద్యార్థి, నిరుద్యోగుల నిరసన

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో అమరుడైన శ్రీకాంతాచారి విగ్రహం నుంచి కాంగ్రెస్ అక్టోబర్ 2న తలపెట్టిన విద్యార్థి, నిరుద్యోగ జంగ్‌సైరన్ ఉద్రిక్తంగా మారింది. కార్యక్రమంలో పాల్గొనకుండా నేతలను, కార్యకర్తలను పోలీసులు ఎక్కడికక్కడ అరెస్టు చేశారు. పోలీసులను తప్పించుకొని పలువురు నేతలు, కార్యకర్తలు ఎల్‌బి నగర్‌లోని శ్రీకాంతాచారి విగ్రహం వద్దకు చేరుకొని నివాళులర్పించారు. పరిస్థితి అదుపుతప్పడంతో పోలీసులు లాఠీచార్జి చేశారు. కాంగ్రెస్ ర్యాలీ ప్రారంభించాలనుకున్న దిల్‌సుఖ్‌నగర్ వద్దకు చేరిన నాయకులను, కార్యకర్తలను పోలీసులు అరెస్టు చేయడంతో పాటు వేదికను తొలగించారు.

### పోడు భూములకు పట్టాలివ్వాలని ఆందోళన

అటవీ హక్కుల చట్టం-2006ను అమలు చేయాలని డిమాండ్ చేస్తూ అఖిలపక్షం ఆధ్వర్యంలో అక్టోబర్ 5న ఏజెన్సీ ప్రాంతంలోని అన్ని జిల్లాల్లో ఆందోళనలు నిర్వహించారు. మహాధర్నా, రాస్తారోకోలు చేపట్టి ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. రాజకీయ పార్టీలు, గిరిజన సంఘాల ఆధ్వర్యంలో రహదారులను దిగ్బంధించడంతో గంటలకొద్దీ వాహనాలు నిలిచిపోయాయి. దీంతో పలుచోట్ల ఆందోళనకారులను పోలీసులు అరెస్టు చేశారు. సేద్యం చేసుకుంటున్న పోడు భూములకు పట్టాలివ్వాలని అఖిలపక్షం మహబూబాబాద్‌లోని కంబాలపల్లి వద్ద రోడ్డుపై ఆందోళన వ్యక్తం చేసింది.

### నదీ జలాల గెజిట్ పై నిరసన సభ

కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిన గెజిట్ నోటిఫికేషన్‌ను వ్యతిరేకిస్తూ పాలమూరు అధ్యయన వేదిక ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని సోమాజిగూడ ప్రెస్‌క్లబ్‌లో అక్టోబర్ 9న సమావేశం జరిగింది. రాష్ట్రాల మీద నీటి విషయంలో కేంద్ర అధికారం నీటి పంపిణీకి మాత్రమే పరిమితం కావాలని నదుల ప్రాజెక్టుల నిర్వహణకు కాదని వక్తలు అభిప్రాయపడ్డారు. నదీ జలాల మీద కేంద్రం పెత్తనం చేయబోతున్నదని ఈ సమావేశం కేంద్రం జోక్యాన్ని లోతుగా చర్చించాలని కోరారు. ఈ సమావేశానికి ప్రొ. మాడభూషి శ్రీధర్ ప్రారంభ ఉపన్యాసం చేశారు. తెలంగాణ ఉద్యమ సందర్భాన్ని గుర్తుచేస్తూ తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు రాజ్యాంగ అవసరం అని, తెలంగాణ తన వాటా నీరు సాధించుకోవాలంటే తెలంగాణకు రాష్ట్ర ప్రతిపత్తి అవసరం అని శ్రీ కృష్ణ కమిటీ తెలిపినట్లు చెపుతూ ఏర్పడిన రాష్ట్రంపై కేంద్రం ఇలా పెత్తనం చేయడం ఏమిటి అని ఇది రాజ్యాంగ వ్యతిరేక ఉత్తర్వు అని దీన్ని వ్యతిరేకించాలన్నారు.

### గ్రేటర్‌లో కార్మికుల సమ్మె

తెలంగాణ రాష్ట్రంలోని 73 షెడ్యూల్డ్ పరిశ్రమలలో కనీస వేతనాల జిఓలు వెంటనే సవరించాలనీ, కనీస వేతనం 21 వేలుగా నిర్ణయించాలనీ, కార్మికులను బానిసలుగా మార్చే 4 లేబర్ కోడ్‌లను రద్దుచేయాలని డిమాండ్ చేస్తూ అక్టోబర్ 8న సిఐటియు ఆధ్వర్యంలో తెలంగాణ రాష్ట్రవ్యాప్త సమ్మెకు పిలుపునిచ్చింది. అందులో భాగంగా హైదరాబాద్ జిల్లాలోని జిహెచ్ఎంసి జోనల్, సర్కిల్ పరిధిలోని మున్సిపల్ కార్మికులు, చర్లపల్లి పారిశ్రామిక ప్రాంతం, కార్మిక శాఖ కార్యాలయం, బాలనగర్ పారిశ్రామిక ప్రాంతంతో పాటు జిల్లాల్లోని పారిశ్రామిక ప్రాంతాల్లోని కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు.

### రాష్ట్రమంతా దళిత బంధు అమలుచేయాలి

దళిత బంధు పథకాన్ని రాష్ట్రమంతా అమలు చేయాలనీ, అర్హులైన వారందరికీ ఎస్‌సి, ఎస్‌టి కార్పొరేషన్ల రుణాలు మంజూరు చేయాలని శాసన మండలి సభ్యులు అలుగుబెల్లి నర్సిరెడ్డి ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రం వద్ద అక్టోబర్ 9న కుల వివక్ష పోరాట సమితి ఆధ్వర్యంలో దళితులకు ఇచ్చిన వాగ్దానాల అమలును డిమాండ్ చేస్తూ మహాధర్నా చేపట్టారు.

### టిడిపి ఆఫీసుపై వైసిపి కార్యకర్తల దాడి

టిడిపి అధికార ప్రతినిధి చేసిన వ్యాఖ్యలపై మంగళగిరిలోని ఆ పార్టీ జాతీయ కార్యాలయంపై వందలాది మంది వైసిపి కార్యకర్తలు రాళ్లు, కర్రలు, బీరు బాటిల్స్‌తో దాడిచేశారు. డ్రగ్స్ మాఫియా, హెరాయిన్‌కు రాష్ట్రం కేరాఫ్‌గా మారిందంటూ టిడిపి అధికార ప్రతినిధి కొమ్మారెడ్డి పట్టాబి మీడియా సమావేశంలో విమర్శించారు. దీనిపై స్పందనగా అక్టోబర్ 19న వైసిపి కార్యకర్తలు దాడిచేశారు. ఈ దాడిలో ఇద్దరికి తీవ్ర గాయాలయ్యాయి. విజయవాడలోని పట్టాభి ఇంట్లోకి వెళ్లిన వైసిపి కార్యకర్తలు కుర్చీలను, టివిలను, కార్లను పగులగొట్టారు. దాడి విషయం తెలిసిన చంద్రబాబు నాయుడు దాడిని ఖండిస్తూ అక్టోబర్ 20న రాష్ట్ర వ్యాప్త బంద్‌కు పిలుపునిచ్చారు.

### ఆర్‌కె సంస్మరణ సభ

అనారోగ్యంతో ఇటీవల మృతిచెందిన మావోయిస్టు నాయకుడు రామకృష్ణ, మున్నా సంస్మరణ సభను వారి స్వగ్రామమైన ప్రకాశం జిల్లా ఆలకూరపాడు గ్రామంలో అక్టోబర్ 24న నిర్వహించారు. ఆర్‌కె కూమారుడు పృథ్వీ అలియాస్ మున్నా ఐదో వర్ధంతి రోజే ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. బంధుమిత్రులు, ప్రజా సంఘాల నాయకులు హాజరై జోహార్లు తెలిపారు. మావోయిస్టు ఉద్యమంలో మరణించిన ఇదే గ్రామానికి చెందిన దత్తాత్రేయ, జయకుమార్‌కు కూడా నివాళులర్పించారు. సంస్మరణ సభలో ఆర్‌కె తమ్ముడు సుబ్బారావు మాట్లాడుతూ ఉద్యమాల పట్ల ఆకర్షితుడై ప్రజలకు మంచి చేయాలనే సంకల్పంతో పోరాట పంథాను ఎంచుకుని అమరుడయ్యాడన్నారు. అడవి మీద హక్కు ఆదివాసీలకే తప్ప దోచుకునేవాళ్లకు కాదంటూ ఆదివాసీల హక్కుల కోసం తుదికంటా పోరాడిన వ్యక్తి ఆర్ అన్నారు. ఆర్ సంస్మరణ సభ సందర్భంగా ఆలకూరపాడును పోలీసులు దిగ్బంధించారు.

### నామమాత్రం కానున్న సమాచార హక్కు చట్టం

ప్రజల పోరాట ఫలితంగా 2005లో సమాచార హక్కు చట్టం అమల్లోకి వచ్చింది. ఈ చట్టం సహాయంతో ఆర్‌టిఐ కార్యకర్తలు, ప్రజలు అనేక అవినీతి కుంభకోణాలను బయటపెట్టారు. రెండేళ్ల క్రితం ఈ చట్టాన్ని బలహీన పరిచేలా కేంద్ర ప్రభుత్వం పార్లమెంట్‌లో సవరణలు చేసింది. ఇప్పుడు తెలంగాణ ప్రభుత్వం ఈ చట్టాన్ని నిర్వీర్యం చేసే ఉత్తర్వులను విడుదల చేసింది. రాష్ట్ర స్థాయి అధికారుల నుంచి ముందుగా అనుమతి తీసుకోకుండా ఆర్‌టిఐ దరఖాస్తులకు సమాచారం ఇవ్వడానికి వీల్లేదంటూ ఇటీవలే జీఓ తెచ్చింది. దీని ప్రకారం గ్రామ స్థాయిలో ఏ చిన్న సమాచారం కోసం ఆర్‌టిఐ కింద దరఖాస్తు చేసినా.. రాష్ట్రస్థాయి అధికారుల అనుమతి లేకుండా సమాచారం ఇవ్వడానికి వీల్లేదు. దీని ప్రకారం రాష్ట్ర ప్రభుత్వ ఉత్తర్వులు పౌరుల ప్రాథమిక హక్కునూ హరించేలా ఉన్నాయని న్యాయ నిపుణులు పేర్కొన్నారు. వీ

### నూతన సాగు చట్టాలను వ్యతిరేకిస్తూ భారత్ బంద్

మోడీ ప్రభుత్వం తీసుకొచ్చిన కొత్త సాగు చట్టాలను వ్యతిరేకిస్తూ సంయుక్త కిసాన్ మోర్చా (ఎస్‌కెఎం) సెప్టెంబర్ 27 నిర్వహించిన 'భారత్ బంద్' ఉత్తరాదిన కొన్ని రాష్ట్రాల్లో రహదారుల దిగ్బంధం, రైలు రోకోలు నిర్వహించారు. దాదాపుగా 25 రైళ్ల రాకపోకలకు అంతరాయం కలిగింది. ఢిల్లీ, హరియానా, పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లో బంద్ ప్రభావం తీవ్రంగా ఉంది. ఢిల్లీ-గుర్గావ్ ప్రాంతంలో వేలాది కార్లు, ఇతర వాహనాలు నిలిచిపోయాయి. కేరళ, బీహార్, ఝార్ఖండ్, పశ్చిమబెంగాల్, ఒడిశా రాష్ట్రాల్లోని పలు ప్రాంతాల్లో సాగు చట్టాలను వ్యతిరేకిస్తూ నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. బంద్‌కు దేశంలోని 23కు పైగా రాష్ట్రాల నుంచి స్పందన వచ్చిందని సాగు చట్టాలు ఆమోదించి సెప్టెంబర్ 27కి సంవత్సరం అవుతుంది. ఈ నేపథ్యంలోనే ఎస్‌కెఎం ఈ బంద్‌కు పిలుపునిచ్చింది. ఈ సమస్య చర్చల ద్వారా పరిష్కారమవుతుంది తప్ప కోర్టుల ద్వారా కాదని అన్నారు.

### ఉత్తరాఖండ్‌లో చర్చ్‌పై దాడి చేసిన హిందూ సంస్థలు

బీజెపి ప్రభుత్వ పాలనలో ఉన్న ఉత్తరాఖండ్‌లోని రూర్కీ పట్టణంలోఒక చర్చ్‌పై అక్టోబర్ 4న ప్రార్థనలు జరుగుతున్న సమయంలో విశ్వహిందుపరిషత్, భజరంగ్‌దళ్, బిజెపి యువజన విభాగానికి చెందిన 200కు పైగా స్త్రీ, పురుషులు ఐరన్ రాడ్లతో విధ్వంసానికి పాల్పడ్డారు. ప్రార్థనలు చేసుకుంటున్న వారిపై దాడి చేయడంతో పాటు చర్చిలోని సామాగ్రిని ధ్వంసం చేశారు. ఈ దాడిలో అనేక మంది గాయపడగా, చర్చి వాలంటీర్ ఒకరు ప్రాణాపాయ స్థితిలో ఉన్నారు. హిందుత్వ శక్తుల దాడిలో కుర్చీలు, టేబుళ్లు తదితర పరికరాలు ధ్వంసమయ్యాయి.

### పోలీసులపై ఆగ్రహం వ్యక్తంచేసిన సుప్రీం కోర్టు

ప్రభుత్వ అధికారుల, పోలీసుల నడవడికపై న్యాయ వ్యవస్థ ఇటీవలికాలంలో తీవ్రమైన వ్యాఖ్యలు చేస్తోంది. ప్రభుత్వాధికారులు, పోలీసులు అధికారంలో ఉన్న రాజకీయ పార్టీ అడుగులకు మడుగులొత్తడానికి అలవాటు పడ్డాయని కూడా విమర్శించింది. అధికారంలో ఉన్న పక్షానికి వత్తాసు పలికితే ఆ తరవాత మరో ప్రభుత్వం ఏర్పడినప్పుడు పోలీసు అధికారులు వడ్డీతో సహా మూల్యం చెల్లించవలసి వస్తుందని కూడా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఎన్.వి. రమణ హెచ్చరించారు. ధన్‌బాద్ అడిషనల్ సెషన్స్ జడ్జి ఉత్తం ఆనంద్ మృతి కేసును విచారిస్తున్న సందర్భంలోనైతే సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఎన్.వి.రమణ పోలీసులు, సిబిఐ న్యాయస్థానాల ఆదేశాలను ఖాతరు చేయడం లేదని అక్టోబర్ 3న ఆగ్రహం వ్యక్తం చేశారు.

### ఉత్తరాఖండ్‌ను ముంచెత్తిన వరదలు

ఉత్తరాఖండ్ వరదల్లో మృతిచెందిన వారి సంఖ్య అక్టోబర్ 20 నాటికి 52 కాగా మరో ఐదుగురు గల్లంతయ్యారు. ఖైరానా, గరమ్‌పానీ ప్రాంతాల్లో కొండచరియలు రోడ్డుకు అడ్డంగా విరిగిపడడంతో రాణిఖేత్, అల్మోరా నగరాలకు బయటి ప్రపంచంతో సంబంధాలు తెగిపోయాయి. ఉత్తరాఖండ్ హర్సిల్ మీదుగా హిమాచల్‌ప్రదేశ్‌లోని చిట్కుల్‌కు అక్టోబర్ 11న ట్రెక్కింగ్‌కు వెళ్లిన 11 మంది సభ్యుల బృందం ఆచూకి గల్లంతైనట్టు అధికారులు తెలిపారు. అక్టోబర్ 20న ముఖ్యమంత్రి పిఎస్ దామి కుమావు ప్రాంతంలో పర్యటించి పరిస్థితులను సమీక్షించారు.

### దేశాన్ని ముంచెత్తుతున్న మత్తు పదార్థాలు

గుజరాత్‌లోని ముంద్రా పోర్టులో సెప్టెంబర్ 16న తనిఖీలు నిర్వహిస్తుండగా అక్రమంగా రవాణా చేస్తున్న మూడు టన్నుల అతి ప్రమాదకరమైన హెరాయిన్ పట్టుబడింది. సీజ్ చేసిన హెరాయిన్ విలువ రు. 21 వేల కోట్లు. అఫ్ఘానిస్థాన్ నుంచి ఇరాన్ ద్వారా విజయవాడలోని ఆషీ ట్రేడింగ్ కంపెనీకి రవాణా చేయడానికి ముంద్రా పోర్టుకు హెరాయిన్ వచ్చిందని డిఆర్ఐ తేల్చింది. ముంద్రా పోర్టును నిర్వహించే అదానీ గ్రూపును కనీసం విచారించలేదు. నార్కొటిక్స్ స్పెషల్ కోర్టు ముంద్రా యాజమాన్యాన్ని ప్రశ్నించాలన్న ఆదేశాలకు విలువలేదు. పోర్టు నిర్వహణ మినహా పోలీసింగ్ తమ బాధ్యత కాదని అదానీ తేల్చేశారు. గోవా వెలుతున్న ఓడలో డ్రగ్స్ విక్రయానికి, వినియోగానికి సంబంధించిన చాలా ఆధారాలు దొరికాయనీ దాడుల నుంచి దర్యాప్తు వరకూ అంతా చట్టప్రకారమే జరుగుతున్నదంటూ ఎన్‌సిబి అక్టోబర్ 6న విలేకరుల తెలిపారు. ముంబై సాగర తీరంలో పట్టుబడిన మత్తుపదార్థాలతో ఆర్యన్‌ఖాన్‌కు సబంధముందని అరెస్టుచేశారు. ఈ ఘటన తరువాత దేశంలోని చాలా ప్రాంతాల్లో కోట్ల విలువైన డ్రగ్స్ దొరికాయి. డ్రగ్స్ ప్రభావంతో హత్యలు, ఆత్మహత్యలు పెరుగుతున్నాయి.

### ఆహార భద్రత సూచీలో 71వ స్థానంలో భారత్

2019 తరువాత ధరల్లో పెరుగుదల ఫలితంగా ఆహార భద్రత విషయంలో మొత్తం 70 దేశాల ర్యాంకులు దిగజారినట్లు ప్రపంచ ఆహార భద్రత సూచీ (జిఎఫ్ఎస్ ఇండెక్స్-2021) వెల్లడించింది. ఆహార భద్రత సూచీలో భారత్ 71వ ర్యాంకు సాధించింది. ఈ విషయంలో పక్క దేశాలైన పాకిస్తాన్, శ్రీలంక, నేపాల్, బంగ్లాదేశ్ కంటే మెరుగ్గా ఉంది. అధిక జనాబా కలిగిన చైనా 34వ స్థానంలో ఉండి భారత్ కంటే మెరుగ్గా ఉంది. ఆహార భద్రత, సహజ వనరులు, ఆర్థిక అసమానతలు, ఆహారానికయ్యే ఖర్చుతో పాటు మొత్తం 58 అంశాల ఆధారంగా ఈ సూచీని తయారు చేశారు. ఆహార భద్రత విషయంలో భారత్ పనితీరు సరిగా లేదని నివేదిక వెల్లడించింది. 2012 నుంచి 2021 మధ్య కాలంలో భారత్ కేవలం 2.7 పాయింట్లు మాత్రమే పెంచుకోగలిగింది. ఇదే కాలంలో పాకిస్తాన్ 9, నేపాల్ 7, బంగ్లాదేశ్ 4.7, చైనా 9.6 పెంచుకోగలిగాయని నివేదిక వెల్లడించింది.

### భారతదేశంలో తీవ్రమవుతున్న అసమానతలు

దేశంలో ఆర్థిక అసమానతలు అంతకంతకు పెరిగిపోతున్నాయి. ఒకవైపు బీహార్, యుపి వంటి రాష్ట్రాల్లో మట్టి పెళ్లలు, పచ్చగడ్డితో బతుకులీడుస్తున్న పేదల గాథలు... మరోవైపు రోజురోజుకు శతకోటీశ్వరుల సంపద ఎలా పెరిగిందో నివేదికలు వెల్లడిస్తున్నాయి. ఈ నివేదికలు దేశంలో ఆర్థిక, సామాజిక అసమానతలు ఎంతగా ఉన్నాయో తెలుపుతున్నాయి. వీటిలో ఒకటి శత కోటీశ్వరుల జాబితా, మరోటి నీతి అయోగ్ 'పోషకాహార' నివేదిక. తెలంగాణాలో 63 శాతం మంది చిన్నారులు రక్త హీనతతో బాధపడుతున్నారు. ప్రముఖ కార్పొరేట్లు గౌతమ్ అదానీ, ముఖేశ్ అంబానీ సంపదలు అమాంతంగా పెరిగిపోయాయి. అదానీ, ఆయన కుటుంబ సభ్యుల మొత్తం సంపద ఒక్క ఏడాదిలోనే నాలుగు రెట్లు పెరిగింది.

### ఎన్‌కౌంటర్‌లో మావోయిస్టుల మృతి

తెలంగాణ-ఛత్తీస్‌గఢ్ సరిహద్దుల్లో నక్సలైట్లు, పోలీసులకు మధ్య జరిగిన ఎదురుకాల్పుల్లో ముగ్గురు మావోయిస్టులు మృతిచెందారు. తెలంగాణ సరిహద్దు గ్రామాల్లో గ్రేహౌండ్స్, ములుగు జిల్లా పోలీసులు, ఛత్తీస్‌గఢ్ బలగాలు సంయుక్తంగా కూంబింగ్ నిర్వహిస్తున్నట్లు పోలీసులు తెలిపారు. అక్టోబర్ 25న ఛత్తీస్‌గఢ్‌లోని బీజాపూర్ జిల్లా ఎల్మిడి పోలీసుస్టేషన్ పరిధిలోని అటవీ ప్రాంతంలో కూంబింగ్ బలగాలకు మావోయిస్టులు తారసపడడంతో ఇరువర్గాల మధ్య ఎదురుకాల్పులు జరిగాయని కాల్పుల అనంతరం ఆ ప్రదేశంలో ముగ్గురు మావోయిస్టుల మృతదేహాలు లభ్యమైనట్లు ములుగు ఎస్‌పి సంగ్రామ్ సింగ్ పాటిల్ తెలిపారు. వీ

## యెమెన్‌లో తిరుగుబాటుదారుల కాల్పులు

యెమెన్ దేశంలోని మిరాబ్ నగరంపై పట్టుకోసం ప్రభుత్వ అనుకూల సేనలు, తిరుగుబాటుదారుల మధ్య జరిగిన కాల్పుల్లో 100 మంది మృతి చెందారు. యెమెన్ ఉత్తర ప్రాంతంలో ప్రభుత్వ ఆధీనంలోని చిట్టచివరి నగరం మిరాబ్. ఈ నగరాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకునేందుకు ఇరాన్ మద్దతున్న హుతీ తిరుగుబాటుదారులు దాడులు చేశారు. దీంతో సౌదీ నేతృత్వంలోని సంకీర్ణ సేనలు వారిపై వైమానిక దాడులు నిర్వహించాయి. ఈ పోరాటంలో 68 మంది హుతీ తిరుగుబాటుదారులు, 32 మంది ప్రభుత్వ అనుకూల సైనికులు చనిపోయినట్టు మిలటరీ వర్గాలు సెప్టెంబర్ 29న ప్రకటించాయి.

## తాలిబన్ సంస్థపై ఆంక్షలు విధిస్తూ తీర్మానం

అఫ్ఘానిస్తాన్‌లోని తాలిబాన్‌లకు సహాయం చేసే దేశాల ప్రభుత్వాలపై ఆంక్షలు విధించేందుకు అమెరికా సెనేట్‌లో 22 మంది రిపబ్లికన్ సెనేటర్లు ఓ తీర్మానం చేశారు. 'అఫ్ఘానిస్థాన్‌లో ఉగ్రవాద నిరోధం, పర్యవేక్షణ, జవాబుదారీతనం చట్టం' పేరిట రూపొందించిన ఈ తీర్మానాన్ని సెప్టెంబర్ 29న సెనేటర్ జిమ్ రిచ్ ప్రవేశపెట్టారు. 2001-2020 మధ్య అఫ్ఘానిస్థాన్‌లోని తాలిబాన్‌లకు పాకిస్థాన్ చేసిన సహాయం వివరాలను అమెరికా విదేశాంగ మంత్రి తెలపాలని ఆ తీర్మానంలో కోరారు. చైనా, రష్యా, తాలిబాన్ల నుంచి తలెత్తే ఆర్థిక, భద్రతాపరమైన సవాళ్లను ఎదుర్కోవడానికి భారత్‌తో అమెరికా దౌత్యపర, ఆర్థిక, రక్షణ రంగాల్లో ఏ విధంగా ముందుకు వెళ్తుందన్న విషయాలనూ తెలపాలని బైడెన్ సర్కార్‌ను రిపబ్లికన్లు డిమాండ్ చేశారు.

## ఈక్వెడార్ జైలులో అల్లర్లు

ఈక్వెడార్‌లోని గ్వయాక్విల్ జైలులో సెప్టెంబర్ 27న జరిగిన ఘర్షణల్లో 116 మంది ఖీదీలు మరణించడంతో దేశంలో జైళ్ల అత్యవసర పరిస్థితి విధిస్తున్నట్లు అధ్యక్షులు గౌల్లెర్మో లాస్సో ప్రకటించారు. ఈ అత్యవసర పరిస్థితిలో జైళ్లలో పోలీసులను, సైనికులను నియమించే అధికారం ప్రభుత్వానికి ఉంటుంది. ఈ ఘటనలో తుపాకులు, బాంబులతో ఖైదీలు ఘర్షణలకు దిగినట్లు అధికారులు తెలిపారు. ఈ సంఘటనలో 80 మంది వరకూ గాయపడ్డారు. మృతిచెందిన వారిలో ఏడుగురి తలలు నరికివేయబడి ఉన్నట్లు అధికారులు గుర్తించారు.

## సరిహద్దులో శరణార్థుల మృత్యుఘోష

ఆఫ్రికా నుండి స్పెయిన్‌లోని కేనరీ దీవులకు వెళుతూ ఈ ఏడాది ఇప్పటివరకు 2వేల మందికి పైగా శరణార్థులు మరణించారు. మానవతావాదంతో కూడిన వలస విధానం గురించి యురోపియన్ యూనియన్ గొప్పగా చెబుతుంది. ఆచరణలో అందుకు భిన్నంగా వ్యవహరిస్తూ ఈ దీవులను హంతక ముఠాల ఇష్టారాజ్యంగా మార్చింది. బార్బడోస్లో సరుకు రవాణా నౌక ఆగస్టు 19న బయలుదేరింది. స్పెయిన్లోని కేనరీ దీవులకు 150 మైళ్ల దూరంలో సగం మునిగిన ప్లాస్టిక్ మోటార్‌బోట్ కనిపించింది. లోపల ఐవరీ కోస్ట్‌కి చెందిన 30 ఏళ్ల మహిళను కనుగొన్నారు. అంతకు వారం రోజుల ముందు దక్షిణ మొరాకో సరిహద్దు నుండి బయలుదేరిన ఈ బోటు మునిగిపోయింది. అందులో ఉన్న 53 మంది మరణించారు.

## అవిశ్వాస ఓటుతో రద్దయిన రుమేనియా ప్రభుత్వం

రుమేనియాలో లిబరల్ ప్రధాని ఫ్లోరిన్ సిటు నేతృత్వంలోని ప్రభుత్వం కుప్పకూలింది. అక్టోబర్ 5న పార్లమెంట్‌లో ప్రతిపక్షాలు ప్రవేశపెట్టిన అవిశ్వాస తీర్మానం నెగ్గడంతో సిటు ప్రభుత్వం రాజీనామా చేసింది. దీంతో రుమేనియా మరోసారి రాజకీయ అనిశ్చితిలోకి వెళ్లింది. ప్రధాన ప్రతిపక్షమైన సోషల్ డెమోక్రటిక్ పార్టీ అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టగా, 467 స్థానాలున్న పార్లమెంట్‌లో 281 మంది అనుకూలంగా ఓటు వేశారు. అధికార పార్టీ ఓటింగ్‌ను బహిష్కరించింది.

## అమెరికాలో కార్మికుల సమ్మె

అమెరికాలో వేలాది మంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు. కొవిడ్ ప్రభావం నుండి కోలుకోవడానికి ప్రయత్నిస్తున్న లేబర్ మార్కెట్‌లో మరింత మెరుగైన పరిస్థితులు కల్పించాలని, అధిక వేతనాలు ఇవ్వాలని కోరుతూ కార్మికులు సమ్మెకు దిగారు. గత కొద్ది రోజులుగా వ్యవసాయ యంత్రాల ఆపరేటర్లు 10 వేల మందికి పైగా సమ్మెలో పాల్గొన్నారు. హెల్త్‌కేర్ గ్రూప్ కైసర్ పెర్మెంటెకి చెందిన 31 వేల మందికి ప్రాతినిధ్యం వహిస్తున్న యూనియన్లు కూడా సమ్మెకు దిగాయి. న్యూయార్క్‌లోని మెర్సి ఆసుపత్రికి చెందిన 2 వేలకు పైగా సిబ్బంది, కెలోగ్ సెరెల్ కంపెనీకి చెందిన 1400 మంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు. బొగ్గుగని కార్మికులు, నర్సులు విధులను బహిష్కరించారు.

## క్వాడ్-2

పశ్చిమాసియాలో భౌగోళిక రాజకీయాలు భారీ పరివర్తనకు లోనవుతున్నాయి. ఇజ్రాయిల్లో కొద్ది కాలం కిందట అరబ్బు దేశాలైన యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ (యుఎఇ), బహ్రెయిన్ దౌత్య సంబంధాలను నెలకొల్పుకున్నాయి. తాజాగా యుఎఇ, ఇజ్రాయిల్, అమెరికాలతో భారత్ చతుర్భుజ కూటమిగా ఏర్పడటం ప్రాధాన్యాన్ని సంతరించుకున్నది. ఇప్పటికే ఇండో-పసిఫిక్ ప్రాంతంలో అమెరికా, ఆస్ట్రేలియా, భారత్, జపాన్ దేశాలతో చతుర్భుజ కూటమి (క్వాడ్) ఏర్పడింది. ఇప్పుడు పశ్చిమాసియాలో ఏర్పాటైన కూటమిని క్వాడ్-2గా పేర్కొంటున్నారు. క్వాడ్-1 కూటమిని చైనాకు వ్యతిరేకంగా అమెరికా ఏర్పాటు చేసిందనేది స్పష్టం. ఇప్పుడు క్వాడ్-2 కూడా అమెరికా వ్యూహంలో భాగమే.

## ఫ్రాన్స్ మాజీ అధ్యక్షుడికి ఏడాది జైలు శిక్ష

ఫ్రాన్స్ మాజీ అధ్యక్షుడు నికోలస్ సర్కోజీకి స్థానిక కోర్టు ఏడాది జైలు శిక్ష విధించింది. 2012 ఎన్నికల ప్రచారానికి సంబంధించి అక్రమ ఫైనాన్సింగ్ ఆరోపణలపై దాఖలైన కేసులో ఆయన దోషిగా తేలారు. ఇంటిలోనే ఏడాదిపాటు జైలు శిక్ష అనుభవించాలని కోర్టు ఆదేశించింది. నికోలస్ సర్కోజీ 2007 నుంచి 2012 వరకు ఫ్రాన్స్ అధ్యక్షుడుగా ఉన్నారు. ఈ తీర్పును వ్యతిరేకిస్తూ అప్పీల్ చేసుకునే చట్టపరమైన అవకాశం మాజీ అధ్యక్షుడికి ఉంది.

## అఫ్ఘానిస్థాన్‌లో ఆత్మహుతి దాడి

అఫ్ఘానిస్థాన్ మరోసారి బాంబు పేలుడుతో దద్దరిల్లింది. మసీదులో ప్రార్థనలకు హాజరైన షియా ముస్లింలే లక్ష్యంగా జరిగిన ఆత్మాహుతి దాడిలో 55 మంది ప్రాణాలు కోల్పోగా 140 మంది గాయపడ్డారు. అక్టోబర్ 8న ఉత్తర అఫ్ఘానిస్థాన్‌లోని కుందుజ్ నగరం ఖానాబాద్ బందర్‌లో ఈ ఘటన జరిగింది. ఈ ఘటనకు బాధ్యులము మేమేనని ఇస్లామిక్ స్టేట్ (ఐఎస్) ప్రకటించింది. అఫ్ఘానిస్థాన్‌లో మైనారిటీలైన షియా ముస్లింలపై ఈ సంస్థ వరుసగా దాడులు చేస్తోంది. ఖానాబాద్ బందర్ ప్రాంతంలోని గొజార్-ఎ-సయద్ అబాద్ మసీదులో ప్రార్థనలకు హాజరైన వారిలో కలిసిపోయిన ఓ వ్యక్తి తనను తాను పేల్చుకున్నాడు. ఆ సమయంలో మసీదులో 300 మంది ఉన్నారు. పేలుడు వల్ల పదుల సంఖ్యలో చనిపోయారు. గత ఆరు రోజుల్లో దేశంలో మూడు బాంబు పేలుళ్లు జరిగాయి.

## బంగ్లాదేశ్‌లో హిందువుల పై దాడి

బంగ్లాదేశ్‌లో హిందువుల పై దాడులు కొనసాగుతున్నాయి. అక్టోబర్ 16న పలు హిందూ ఆలయాలపై అల్లరి మూకలు దాడికి దిగాయి. దసరా ఉత్సవాల్లో భాగంగా స్థానిక మైనారిటీ హిందువులు ఏర్పాటుచేసిన ఓ మంటపంలో ఖురాన్‌ను అవమానించారని ముస్లింలు వారిపై దాడులకు దిగి మంటపాలను ధ్వంసం చేశారు. ఈ సందర్భంగా పోలీసులు జరిపిన కాల్పుల్లో నలుగురు ఆందోళనాకారులు మరణించారు. అక్టోబర్ 15న బేగంగంజ్ పట్టణంలోని దుర్గామాత మంటపంలోకి చొరబడిన ముస్లింలు ఆలయ కమిటీ ఎగ్జిక్యూటివ్ సభ్యున్ని కత్తులతో పొడిచి చంపారు. వీ

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 240 - November 2021 • ISSN 2231-6892
• ... No.APTEL/2003/11482 • Published on 27/10/2021 • Postal Regn. No. HD/1100/2020-22

Date of Posting : 29th, 30th

# 'Save Veekshanam' Campaign

## వీక్షణంకు చేయూతనివ్వండి!

తెలుగు సమాజంలో రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణలో రెండు దశాబ్దాలుగా అసాధారణమైన కృషి చేస్తున్న మాసపత్రిక వీక్షణం ఆర్థిక పరిస్థితి ప్రమాదకరమైన స్థితికి చేరుకున్నది. కొవిడ్ లాక్ డౌన్ కు ముందు చందాల ద్వారా, పుస్తకాల అమ్మకాల ద్వారా, ప్రకటనల ద్వారా వచ్చిన ఆదాయానికి దాతల విరాళాలు జత కలిసి పత్రిక నడుస్తుండేది. ఏడాదిన్నరగా కొవిడ్‌తో జనజీవితమే సంక్షోభమయంగా ఉన్నందువల్ల చందాలు తగ్గిపోయాయి, పుస్తకాల అమ్మకాలు పూర్తిగా ఆగిపోయాయి, ప్రకటనలు రావడం లేదు. కేవలం దాతల విరాళాల మీదనే పత్రిక ఆధారపడవలసిన స్థితి వచ్చింది. ఏడాదిన్నరగా నెలకు యాభై వేల రూపాయల లోటుతో, అప్పులతో పత్రిక నడుస్తున్నది. ఇటువంటి స్థితిలో పత్రిక నడపలేమని నిర్వాహకులు భావిస్తున్నప్పటికీ, తెలుగు సమాజానికి ఇటువంటి ఆలోచనాస్ఫోరక పత్రిక చాల అవసరమని, ప్రస్తుత సంక్షోభ స్థితిలో ఆ అవసరం మరింత పెరుగుతున్నదని, పత్రికను ఎట్టి పరిస్థితిలోనూ ఆపగూడదని పాఠకులు, మిత్రులు, అభిమానులు కోరుతున్నారు. పందొమ్మిది సంవత్సరాలలో, 237 సంచికలలో, నాలుగున్నర వేల వ్యాసాలతో వీక్షణం ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ పరిణామాలెన్నిటినో విశ్లేషించి పాఠకుల అవగాహనలు పెరగడానికి తోడ్పడింది. ఆ మహత్తర కృషి ఆగిపోగూడదని మిత్రులు కోరుతున్నారు.

ఈ గడ్డు కాలాన్ని అధిగమించడానికి మరొకసారి మీదగ్గరికి రాక తప్పడం లేదు. మీరు ఇవ్వగలిగిన విరాళం ఎంతైనా సరే, వీక్షణం మనుగడకు అది ఉపయోగపడుతుంది. తెలుగు సమాజంలో ఒక అత్యవసరమైన ప్రయత్నానికి మీ వంతు చేయూత ఇవ్వండి. మీ వీలును బట్టి, మీ శక్తిని బట్టి మీ విరాళం ఎంత స్వల్పమైనా, ఎంత భూరి విరాళమైనా సరే. వీక్షణం మనుగడకు మీ చేయూతనివ్వండి. వీక్షణం చిరకాలం జీవించేందుకు తోడ్పడండి.

### విరాళాలు పంపడానికి వివరాలు

వీక్షణం

చెక్/డిడి ద్వారా: వీక్షణం, జి1, మైత్రీ రెసిడెన్సీ,
3-6-394, స్ట్రీట్ నం. 3, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500029,
ఫోన్ : 73307 95849, ఇమెయిల్ : veekshanam2003@gmail.com,
www.veekshanam.wordpress.com

ఎలక్ట్రానిక్ ట్రాన్స్ ఫర్ ద్వారా:

*Veekshanam,*
*Account No. 013911011002175,*
*Union Bank of India, Gagan Mahal Brach, Hyderabad.*
*IFSC Code: UBIN0801399*

**ఈ అకౌంట్ నంబర్‌తో ఎలక్ట్రానిక్ ట్రాన్స్‌ఫర్‌తో పాటు**
**గూగుల్ పే, ఫోన్ పే, పేటీఎంల ద్వారా కూడా చెల్లించవచ్చు.**

If undelivered please return to:

**VEEKSHANAM**
Mytri Residency, 3-6-394, St. No. 3,
Himayatnagar, Hyderabad - 500 029.
Phone: 73307 95849

To:
Mr./Mrs.________________________

________________________

________________________

________________________

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at NAVYA PRINTERS, 2-3-655/C/16/B, Durga Nagar, Amberpet, Hyderabad -500013 (New Declaration filed) for Charitha Impressions (as per RNI records) and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KRSA102M269 |
|---|---|
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |